# గీతామృతము

## (తెలుగు అనువాదం)




ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

మోహన్ పబ్లికేషన్స్

కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,

రాజమహేంద్రవరం - 533101.

ఓం

# గీతామృతము

( శ్రీమద్భగవద్గీతకు తెలుగు అనువాదము )

ఇందు ప్రతి శ్లోకమునకు పద్యము, తాత్పర్యము,
ప్రతి అధ్యాయమునకు వేఱుగ సారాంశము,
భగవద్గీత—సాంఘిక జీవనము అను ప్రత్యేక వ్యాసము కలవు.

శ్లో॥ సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాల నన్దనః
పార్థోవత్సః సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్

గీ॥ చక్కనైన గోవు లుపనిషత్తు లన్ని, క్షీరమును దీయువాడు శ్రీకృష్ణమూర్తి,
అర్జునుడు దూడ, మహిత గీతామృత మను పాలు గ్రోలుచున్నారు ధీశాలురెల్ల.

రచయిత

కవిశేఖర కొండేపూడి సుబ్బారావు

# విషయ సూచిక





## అధ్యాయములు

# వి న్న ప ము

ప్రపంచ వాఙ్మయమున ప్రఖ్యాతి గాంచిన ధర్మగ్రంథములలో శ్రీమద్భగవద్గీత అగ్రగణ్యము. ఇది సాక్షాత్ శ్రీకృష్ణభగవానుని ప్రబోధ మగుటయే ఈ విశిష్టతకు కారణము. శ్రీమద్భగవద్గీతకు భారతదేశభాష లందే కాక అనేక విదేశభాషలందును అసంఖ్యాకములైన అనువాదము లున్నవి. ఇంకను వచ్చుచున్నవి. అయినను గీతామృతము అను పేర మఱియొకదాని నిపుడు తెనుగున వ్రాయుటలో నాకుగల ఆశయములు రెండు.

ఒకటి. భాషాజ్ఞానమంతగా లేనివారికిగూడ గీతాశ్లోకముల అర్థ మును సులభగ్రాహ్యముగ ఉండునట్లు వ్రాయుటయేకాక, గీతాస్వరూపమును మూలవిధేయముగ చూపుట. గీతనుగూర్చి యెంతచెప్పినను చెప్పవచ్చును, ఎంతవ్రాసినను వ్రాయవచ్చును. విశేషముగ వ్యాఖ్యానముల జేర్చుకొలదిని అసలువిషయము మఱుగువడి తేటతెల్లముకాదు. ఈకారణముచే ప్రతి శ్లోకమునకు వ్రాసిన పద్యతాత్పర్యములను ప్రతిఅధ్యాయమునకు వ్రాసిన సారాంశమును తేలికగ బోధపడు మాటలలోనే వ్రాసితిని. మూలము నందున్న భావములను నాశక్తికొలది యథాతథముగ ననువదించితిని.

రెండు. గీతాప్రబోధము ప్రజలదైనందిన జీవితమునందెట్లు మార్గ దర్శకమై, వారి ఐహికాముష్మికసాధనలు రెంటికిని ఎట్లు తోడ్పడగలదో చూపుట.

కేవలము వైరాగ్యమార్గమగు సన్యాసమునకు దారితీయు జ్ఞాన ప్రబోధముగనే వ్యాఖ్యానించి ప్రచారముచేయుటలో గీతను సామాన్యప్రజల నుండి దూరము చేయుచుంటి మని తోచుచున్నది. వేలాదిజనులలో ఏ ఒకరిద్దరో ఆత్మజ్ఞానమెఱిగిన ధీరాగ్రుల్లుగా నుందురు గాని ప్రజలందఱు

లోకవర్తనమందుండువారే. లోకవర్తనమందే మెలగుచున్న వారి నైతిక ఆధ్యాత్మిక అభ్యుదయమునకు కర్మయోగమే యెక్కువగ తోడ్పడునన్న విషయము నిర్వివాదాంశము. అర్జునున కొసగిన యుపదేశములో స్వధర్మాచరణరూపమగు కర్మయోగమునకే గీతాకారుడు ఎక్కువ ప్రాధాన్య మొసగినాడు. ఈవిషయమును సహేతుకముగ ఉదాహరణములతో తెలియపఱచిన యెడల గీతాసందేశ ప్రశస్తిని ప్రజలు గ్రహించి సమాజమున సార్థకజీవులగుటకు అవకాశమున్నది. ప్రజలలో ఇట్టిప్రచారమునకు నేడెంతియో ఆవశ్యకత కలదు. ఈవిషయమును దృష్టియందుంచుకొని గీతాతత్త్వమును విశదపఱచుచు వ్రాసిన భగవద్గీత—సాంఘికజీవనము అను ప్రత్యేక వ్యాసమునుకూడ ఇందుజేర్చితిని.

ఈ పై ఉద్దేశములతో విరచితమైన ఈ గీతామృతకావ్యమును లోక మాహేశ్వరుడగు శ్రీకృష్ణపరమాత్మకే భక్తిపూర్వకముగ సమర్పించితిని. కృతి సమర్పణమును గూర్చిన పద్యములతోబాటు, ప్రతిఅధ్యాయముయొక్క కేంద్రభావమును తెలుపుచు వ్రాసిన గీతోపదేశము అను పద్యశీర్షికయు ఇందుకలదు. ఈ రచన ప్రజల కేమాత్ర ముపయుక్తముగ నున్నను నేను కృతకృత్యుడ ననియే తలంతును.

మఱియొకమాట. గీతానువాదమందొక క్రొత్తమార్గ మవలంబించిన ఈగ్రంథము పాఠకులకు ఎక్కువ ఉపయోగకారిగ నుండగలదని ఈగ్రంథ ముద్రణకై నన్ను ప్రోత్సహించిన మిత్రులలో ముఖ్యులు: బ్రాహ్మభూషణ, పండితరత్న, విద్వత్కవిశేఖర, ఇత్యాది బిరుదాంచితులు ప్రసిద్ధ పౌరాణికులునైన శ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రిగారు—సాహితీసంపన్నులు, ఆధునిక విజ్ఞానశాస్త్రవేత్తలు, గీతాశాస్త్రపండితులునైన శ్రీ వసంతరావు వేంకటరావుగారును. వారి వారి రంగములలో వారు బహుళగ్రంథకర్తలు. వారీ గీతామృతము నాద్యంతము చదివి అచ్చటచ్చట వారి అమూల్యములగు సూచనలగూడ నొసగిరి. ఈగ్రంథమునకు భూమికగా శ్రీ లక్ష్మీనారాయణ శాస్త్రిగారు వ్రాసి యిచ్చిన "అభినందనము" కూడ ఇందున్నది. వారిరువురి

కీని, ఈ నా రచనను అప్పుడప్పుడు వినుచు ఆదరమును చూపిన బంధుమిత్రులకును, ఈగ్రంథముద్రణమునకు తక్కువధరలో కాగితము నందజేసిన ప్రభుత్వమువారికిని నా అశేషకృతజ్ఞతలు.

తరువాతివారికి చారిత్రకముగ యథార్థవిషయములు తెలియగలవను ఆసతో "స్వవిషయము" [redacted] అను శీర్షికక్రింద మాకుటుంబచరిత్రను సంగ్రహముగ నిందు వ్రాసియుంచితిని.

కొండేపూడి సుబ్బారావు

గ్రంథకర్త

విశాఖపట్టణము
28 — 2 — 1977

# గీతోపదేశము

(భగవద్గీతయందు గల పదునెన్మిది అధ్యాయములకును ప్రతి **అధ్యాయమ**ందున్న కేంద్రభావమునకు ఒకటి, రెండు పద్యముల చొప్పున వ్రాసిన స్తోత్రపాఠము)

1 అనాడర్జునుఁ డేమనోవ్యధకు లోనై ధర్మసమ్మూఢతా
ధీనుండై సమరావనిన్ శరణుబొందెన్ నిన్ను నేనట్టులే
దీనత్వంబున నుంటి గమ్యపథవృత్తిన్ పోల్చుకోలేక-నీ
వైనన్ దేల్తువటే ప్రబోధమధుసమ్యగ్వృష్టి సర్వేశ్వరా!

2 దేహార్థ మ్మిటులేల సంతతము భ్రాంతిన్ మున్గి వర్తించుటల్
దేహమ్మస్థిర మాత్మ నిత్యమని నిర్దేశింతు వేనెట్లు ని
ర్వాహింపంగల నాత్మయోగము స్థితప్రజ్ఞాఢ్యుగా నాదుగ
ర్వాహంకారము దూల్చి మేలుకొలుపన్ రాకున్న సర్వేశ్వరా!

3 మానన్ రాదు స్వధర్మకర్మమను నీమాటల్ శ్రవఃపేయముల్
కానీ, కామము నన్నుఁబట్టి దిగలాగంజూచుచుండన్ ప్రభూ!
ఈనాకర్మఫలంబులన్ మఱచి, నేనేరీతి నిస్సంగినై
పూనంజాలుదు కర్మయోగ మది యుద్బోధింపు సర్వేశ్వరా!

4 పుడమిన్ ధర్మము నిల్పి, దుష్టులను నిర్మూలించుచున్ సాధులం
గడకన్ బ్రోచెదనన్న నీదగు ప్రతిజ్ఞన్ లోకముప్పొంగె-యె
య్యెడలం దప్పవయేని జన్మములు నీవీలోకమందింక నా
కిడుమా సాత్త్విక సాధుజన్మమది యింతే చాలు సర్వేశ్వరా!

కర్మంబందు నకర్మముం గనుచు, దుష్కర్మమ్ములన్ మాని, స
త్కర్మంబున్ పొనరింపు మియ్యదియె ఆత్మజ్ఞానసంసిద్ధి కౌ
మర్మంబంచు వచించినాడ విక సామాన్యుండ, నిష్కామమౌ
కర్మాభ్యాస మెటుల్ లభించునని యాక్రందింతు సర్వేశ్వరా!

5 జ్ఞానాధ్వమ్మును జూపి మోక్షమిడగా, సన్న్యాసమున్ కర్మయో
గానుష్ఠానము రెండునున్ సమము లజ్ఞానాత్ములే యెంతు రి
వ్వానిన్ వేఱుగ, సర్వభూతసమతన్ బాటించి నిర్ద్వంద్వుఁడౌ
వానిన్ జ్ఞానియటంద్రు వీనినెటు సంపాదింతు సర్వేశ్వరా!

6 మనసున్ కట్టడిబెట్టి, యింద్రియములన్ బంధించి చిత్తమ్మునన్
మనన ధ్యాన తపఃప్రభావ నిరతిం బాటించి, వీతాఘుఁడై
తనయాత్మన్ పరమాత్మఁ గన్గొని సమస్తప్రాణిజాలంబులో
నినుచూడంగల యోగమార్గమును తండ్రీ తెల్పు సర్వేశ్వరా!

7 హారమ్మందున దారముంబలెనె మాయాచ్ఛన్న విశ్వంబు నం
దారూఢస్థితి నున్న నిన్నెఱుఁగలే కజ్ఞానినై త్రుక్కు చే
దారిం గానని నాకు శ్రద్ధనిడి యాత్మజ్ఞాన మిమ్మంచు ని
న్నారాధించుచునుంటి ప్రోవుము శరణ్యా! దేవ! సర్వేశ్వరా!

8 మరణం బెప్పుడు వచ్చి గొంతు బిగియింపంజూచునో భక్తివి
స్ఫురణన్ నాఁడు స్మరింపఁ గల్గుదునె, చిత్‌జ్యోతిర్మయాకార మ
క్షరబ్రహ్మంబవు నిన్ను సంతతము నాస్వాంతంబునన్ నిల్పుకో
తెరువున్నన్ కరుణించి తెల్పుమది ప్రీతిన్ దేవ! సర్వేశ్వరా!

9 నీయందుం గల వన్నిభూతము లికన్ నీవందు లేవందు నీ
మాయన్ నేర్వను, నిన్ను నేమఱక ఆత్మన్ నిల్పగా సాధనో
పాయంబుండిన తద్రహస్యమును తెల్పంగారాదె ఆరాజ వి
ద్యామోఘమ్ము పవిత్రధర్మముగ నభ్యాసింతు సర్వేశ్వరా!

10 శ్రీమన్మోహన మీ జగద్వితతి నీ సృష్టిస్థితిన్ వెల్గుచో
నీ మాహాత్మ్య విభూతులన్ నుడువగా నీవే సమర్థుండ వీ
సోమాదిత్యులు రుద్రుఁడాది పృథుతేజోమూర్తు లీ నా మన
స్సీమన్ నిల్తురు నీదు కాంతికళలై చెల్వారి సర్వేశ్వరా!

11 అక్షీణోజ్జ్వల కోటిసూర్య కిరణోద్యత్తేజ, మత్యద్భుత
మ్మక్షయ్యమ్మగు తావకీన ఘన దివ్య ద్విశ్వరూప మ్మెదో
సాక్షాత్కారము సేయు మొక్కక్షణమే చాలుఁ బ్రభూ। నీకృపా
భిక్షార్థిని వేచియుంటి నిట నిన్వీక్షింప సర్వేశ్వరా।

12 తనుసౌఖ్య మ్మెది పోవ, దింద్రియనిరోధ మ్మింతయుఁ లేదు, నా
మనముఁ చంచలమై చరించు, పరమాత్మధ్యానభావమ్ము నా
కనువై తోఁచదు భక్తియోగ మెటు లభ్యాసమ్ము కావింతునో
యని యల్లాడుచు నుంటి తెల్పుమిక గమ్యమ్మెదో సర్వేశ్వరా।

13 తనువే క్షేత్రము, దీనియందుఁగల ఆత్మాభిఖ్య క్షేత్రజ్ఞుఁ డం
చును వాకొందురు, వీనినిందెలియు సత్సూత్రంబె జ్ఞానమ్మనం
దనరుఁ, జ్ఞేయము మోక్షసద్మమగు ఆత్మజ్ఞానబ్రహ్మమ్ము, నా
మనమీ జ్ఞానపథానఁ బోవునటులఁ మళ్ళింపు సర్వేశ్వరా।

14 గుణముల్ రాజస తామసమ్ము లివి నాకున్ శత్రులై, దేహ బ
ద్ధునిగాఁజేసి భ్రమప్రమాదములయందుం ద్రోయు చుండెఁ బ్రభూ।
అనిశం బీ భయ మెట్టు లోర్వఁగల నయ్యా సాత్త్వికోదాత్త వ
ర్తనలం బ్రిప్పుము చాలు, నాకు పరమార్థంబిద్ది సర్వేశ్వరా।

15 పైకిఁ వేళ్ళను శాఖలఁ దిగువకుఁ బ్రాకించు నశ్వత్థమై,
నాకుం గల్గగ కర్మబంధము లనంతంబైన సంసార మ
ట్టాఁకల్ పెట్టుచునుండె; దీనినిక వైరాగ్యాసిధారాహతిఁ
వీకఁ ద్రుంచు బలమ్ము నాకొసఁగవే వేగమ్మె సర్వేశ్వరా।

16 వ్యసనాసక్తులు నాస్తికాత్మ లసురుల్ పాపక్రియాలోచనా
ప్రసరోద్వృత్తులు లోకకంటకులు; నిఁ ప్రార్థింతు నోదేవ న
న్నసురుం జేయకు, శాస్త్ర ధర్మ విహిత జ్ఞానార్జనోపాయ మ
భ్యసనమ్ముఁ పొనరింతు దైవగుణముల్ ప్రాపింప సర్వేశ్వరా।

17 ధ్యానాభ్యాస జపాది యజ్ఞక్రతులం దాహారకార్యమ్ములన్
దానమ్మందును సాత్త్వికమ్మయిన శ్రద్ధాసక్తి ని మీ్మపయిన్
నానిత్యార్చనలో నినుం దలతు ఓం తత్ సత్ పదాంకస్థితున్,
ఈ నా జన్మఫలమ్ము సర్వమును నీవే యంచు సర్వేశ్వరా!

18 అనువై, సాత్త్వికభావసమ్మతములౌ త్యాగమ్ము జ్ఞానమ్ము బు
ద్ధినిరూఢిన్ సుఖమున్ ధృతిప్రతిభయున్ దీపింపగాఁ జేయుమీ
మనమం దో ప్రభు! మత్స్వభావనియతం బైనట్టి కర్మమ్ము నం
దనుసంధింతు ఫలమ్ముఁ గోరకయె యావంతైన సర్వేశ్వరా!

ఆ నా ప్రాక్తనకర్మదోషములు వెంటాడంగ అజ్ఞానపా
శానీకంబునఁ జిక్కి డీలువడి ఆధ్యాత్మైకచింతా దరి
ద్రాణం బైన యెడందలో వెలిఁగె జ్యోత్స్నల్, నీప్రబోధామృతో
ద్గాణ ప్రోజ్జ్వల చంద్రబింబ మృదు రాకాశ్రీలు సర్వేశ్వరా!

నీ యాధ్యాత్మిక బోధనోదయ రుచి స్నిగ్ధారుణశ్రీలలో
మాయామోహము రీల్గి మేల్కొనిన యాత్మన్ భక్తి చూఱాడుచున్
నీయాజ్ఞం బడి సర్వధర్మవిధులన్ నీకేసమర్పించి ని
న్నే యర్చింతును నాశరణ్య మిక నీవే యంచు సర్వేశ్వరా!



# కృ తి స మ ర్ప ణ ము

1 చనవుల్ మీఱిన కూర్మి మత్కవిత లాస్వాదించి మేలెంచి తీ
యని యీ కైతల నల్లు భాగ్యమది లభ్యంబయ్యె నీకంచు చూ
చిన చూపుల్ తరితీపు లార మధురాశీర్భాషలన్ జిల్కి దీ
వనలం బల్కిన పెద్దలెల్లరను సంభావించి కై మోడ్చుచున్.

2 తీసిన యూపిరే తిరిగి తీసిన యట్టుల నెందఱెందఱో
వ్రాసిన గీతనే మరల వ్రాసితి నాదగు నాత్మచింతనా
భ్యాసము నాదికాన, భగవద్వచనమ్ముల నెన్ని మార్లికన్
వ్రాసినఁ జెల్లదే బ్రతుకుబాటలు దీపిల జ్ఞానకాంతులన్.

3 నేనెవ్వఁడను కర్తనంచుఁ బలుకన్ నీవే సమస్తంబునై
జ్ఞానానంద కళోజ్జ్వల న్మధురరేఖా జ్యోతియున్ మన్మనః
ప్రాణప్రాణమ వంచు నెంచెదను దేవా ! కృష్ణ ! యోగీశ్వరా !
ఈ నోటంబడి వచ్చు మాటలవి నీవే యంచు భావించెదన్.

4 కనులకు చల్లనైన తెరగట్టుచు దివ్య మనోజ్ఞ దృశ్యమై
మనసును బట్టియూపి నను మాటికి నిల్వగ నీదు నేటికిన్,
మునుకొని వచ్చు వేణురవమోహన గోపకిశోరమూర్తి తీ
యని తలపుంజిఱుల్ తరగలాడు సుధాబ్ధిని ముంచి తేల్చుచున్.

5 ఎవఁడీ నల్లని ముద్దులా డిటుల నా హృద్వీధిలో గాన వై
భవముల్ నిండిన లోతులేర్చి బ్రతుకుంబాటల్ వెలుంగన్ కళా
వ్యవసాయోజ్జ్వల భావభావిత రసవ్యాలోల లీలా మహో
త్సవ విన్యాస విలాస భాసురముగా స్వాదుత్వముల్ చిందెడున్.

6 ఏగానమ్ములు ప్రేమమాధురుల పండించెన్ వ్రజస్త్రీలలో,
ఏగానమ్ములు జ్ఞానదీప్తులను వెల్గించెన్ మనోవీధులన్,
ఆగానమ్ములు పైడిగంటలయి దివ్యస్పర్శ లందిచ్చుచున్
మ్రోగున్ నా హృదయాంతరస్థ మృదు తంత్రుల్ మీటి సాగాడుచున్.

7 ఒకజన్మంబున గాదు నా కిదియు నేదో వేయిజన్మంబు లం
దకలంకమ్ముగఁ జేసినట్టి సుకృతమ్మై జీవితారణ్య మం
దొకదారింబడి పోవ నేఁటి కొకచేయూతన్ బ్రసాదించె త
త్త్వకళారంజిత కాంతిసంతతులు గీతాబోధ దీపద్యుతుల్.

8 మాయని కామమోహాగత మార్గము లం దఘపంకసిక్తమై
పోయిన జీవిత మ్మిది ప్రభూ! భవదీయ దయా విలోకన
శ్రీయుత కాంతిరేఖ పచరించునె యెన్నటికేని జీవితా
ధ్యాయము ధ్యేయమార్గ పరమార్థములం బడి సంచరించునే.

9 ఈ నా అఱ్వదియేండ్ల జీవితమునం దీనాఁటికిఁ బొందగా
లేనైతిన్ భవదీయ తత్త్వమహిమఁ లేశంబు గీతారహ
స్యానందామృత బిందు వొక్కఁ డయినఁ స్వామీ? కృపాభైక్ష్య మే
దో నాయాత్మకు శాంతి నిచ్చు ననుకొందుఁ నేఁడు కృష్ణప్రభూ!

10 పదనై సాగెడు యోగసాధనల త్రోవన్ తావు లూరించుచున్
ఇది నీగీచిన గీటు స్వామి! యిక నా కీజీవితానంద సం
పద పెంపారెడు వెల్గుబాట నడిపింపఁజాలగా సాధనా
భ్యుదయాసక్తి రహించి యెన్నటికి నాలో నిన్ను మన్నింతున్నో,

11 గళరుధిరమ్ము లేరులయి కత్తులకున్ బలివోవు సంగర
స్థలమున నిల్చి జీవన విధా పరమార్థ వినూత్న తత్త్వముల్
చెలువములారు పల్కులఁ వచించిన యోగివి, నేత్రపర్వమై
నిలుతువు జ్ఞానసుందరవసీమధుమూర్తివి పార్థసారథీ!

12 ఆ మహనీయ రూప మధురాదర మేదుర కాంతి లీలగా
నామది దోచుకొన్న యెకనాఁటిది ఈమధురానుభూతి శో
భామల భక్తిభావ విభవమ్ములఁ బొంగి రచించినట్టి గీ
తామృత కావ్య మీ కృతిసమర్పణమున్ గ్రహియింపవే ప్రభూ.

శ్రీకృష్ణార్పణమస్తు

# శ్రీ మద్భగవద్గీత - సాంఘిక జీవనము

## 1. కర్మయోగాభ్యాసము

భరత ఖండము సిద్ధులౌ మహాఋషులు, రాజర్షికల్పులైన పరిపాలకులును నివసించిన కర్మభూమి. సాక్షాత్ భగవంతునకు అవతార స్థానమైన పవిత్రదేశము. మానవజాత్యుద్ధరణమునకై శాశ్వత ధర్మమార్గములు నిర్వచింపబడిన పుణ్యస్థలము. భారతీయ తత్త్వశాస్త్రమునకు, సంస్కృతికి వేదములు ఉపనిషత్తులు మూలకందములు. ఇవి మానవజాతి నైతిక ఆధ్యాత్మిక అభ్యుదయమును పరమావధిగానెంచి జీవిత గమ్యస్థానము చూపుటకై అనాదిగా ప్రతిపాదింపబడి, అమృతాక్షర రూపమున మానవలోకమునకు లభించిన జ్ఞాన నిధులు. సంపూర్ణమైన లౌకిక ఆధ్యాత్మిక సిద్ధుల నందిన ఋషులచే శాస్త్రములుగ, పురాణములుగ, ఇతిహాసములుగ రచింపబడి అవిచ్ఛిన్నముగ వచ్చుచున్న హైందవ ధర్మసిద్ధాంతములు.

ఈ వైదిక సంస్కృతి ఒక్క భారతజాతినే దృక్పథమునందుంచుకొనిన సంకుచిత సిద్ధాంతముగాక దేశ మత జాతి విభేదముల కతీతమై విశ్వశ్రేయమును లక్ష్యముగా నెంచిన సర్వజనీనధర్మము. ఇందులకెన్నియో దృష్టాంతముల చూపవచ్చును. ఈ క్రింది వాక్యముల గమనింపుడు.

"సహనావవతు, సహనౌభునక్తు, సహవీర్యం కరవావహై
తేజస్వినావధీతమస్తు, మావిద్విషావహై, ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః"

"యజుర్వేదము."

"అసతోమా సద్గమయ, తమసోమా జ్యోతిర్గమయ,
మృత్యోర్మా అమృతం గమయ."

"బృహదారణ్యకోపనిషత్తు"

"స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తాః సుఖినోభవన్తు"

ఈ వాక్యముల కేంద్ర భావమిది.

న్యాయమార్గమున ప్రజాపరిపాలనము సాగుగాక. ప్రజలెల్లరు ఎట్టి ద్వేషము లేక అన్యోన్యహితులై, శక్తిమంతులై, తేజోవంతులై సంపదానుభూతితో కలిసి మెలిసి వర్ధిల్లుదురుగాక. ప్రజలు చెడుదారిని వదలి సన్మార్గవర్తనులై, అజ్ఞానాంధకారము పోయి జ్ఞానకాంతిని పొందుదురుగాక. లోకములన్నియు శాంతి సౌఖ్యములతో విరాజిల్లుచుండును గాక.

ఈ విధముగా విశ్వకల్యాణాత్మకమై విలసిల్లుచున్న వేదముల యొక్కయు ఉపనిషత్తులయొక్కయు సారమే శ్రీమద్భగవద్గీత. ఈ గీతావతరణము వెనుక నొక చారిత్రక గాథ యున్నది. హస్తినాపురరాజగు దుర్యోధనుడు తమ దాయాదులగు పాండవులను మొదటినుండియు అనేక కష్టములపాలు చేయుటయే కాక తుదకు తమ రాజ్యమున వారికి సూదిమోపినంతస్థలమైనను ఈయ నిరాకరించెను. శ్రీకృష్ణుని సంధిరాయబారముకూడ విఫలమై కౌరవపాండవులకు యుద్ధమనివార్యమైనది. ఆ యిరుతెగలును కురుక్షేత్రమున తమ తమ సైన్యములతో యుద్ధసన్నద్ధులై నిలచిరి. పాండవ మధ్యముడగు అర్జునుడు పరాజయమెఱుగని మహా పరాక్రమవంతుడు. అతనికి శ్రీకృష్ణుడు రథసారధి. వారి రథము యుద్ధరంగ మధ్యమునకు రాగానే అర్జునుడొకపరి తన యెదిరి సైన్యము వారిని పరికించి చూచెను. అందున్న వారందఱు తనకు గురువులు, బంధువులు, మిత్రులు అయిన స్వజనులే. "అయ్యో! రాజ్యకాంక్షకై వీరి నందఱిని చంపవలెనా. ఇది మహాపాపము" అను విచారము ఒక్కమారుగా పెల్లుబికి వచ్చి విషణ్ణుడై "ఓ కృష్ణా ఈ యుద్ధము నేను చేయజాలను" అని చెప్పి ధనుర్బాణములను జారవిడచి రథముపై చతికిలపడెను. ఆ సంధిగ్ధసమయమున శ్రీకృష్ణు డర్జునునకు కర్తవ్యముపదేశించి, లోక శ్రేయము కొఱకు నీకీ యుద్ధకార్యము తప్పదని చెప్పుచు స్వధర్మ నిర్వహణమును గూర్చియు ఆధ్యాత్మిక జ్ఞానమును గూర్చియు చేసిన ధర్మబోధయే భగవద్గీత. శ్రీకృష్ణుని ప్రబోధముతో అర్జునకు కలిగిన విభ్రాంతి యంతయు నశించినది. కర్తవ్యమును గ్రహించినవాడై యుద్ధమున దుష్టులను వధించి లోకమున ధర్మస్థాపనకు కారకుడయ్యెను.

ప్రపంచమున ఏ ధర్మగ్రంథమునకు లేని ప్రత్యేకత యొకటి గీతయందున్నది. సాక్షాత్ శ్రీకృష్ణభగవానుడే స్వయముగ దీని నర్జునునకు వచించుట, వ్యాసుని వరమువలన ఎవరికిని కనబడకుండ యుద్ధభూమియందే సంజయుడు తిరుగుచు దాని నంతయు వినుట, ఆ శ్రీకృష్ణార్జునుల సంభాషణమును ఛందోబద్ధమొనరించి శ్లోకరూపమున వ్యాసఋషీంద్రుడు చెప్పుచుండగా శ్రీ విఘ్నేశ్వరుడు గంటమును బూని వ్రాయుటయును. మహాభారత కావ్యమున భీష్మపర్వమునందు పదునెన్మిది అధ్యాయములుగ ఈ గీత రచింపబడినది. ఒక్కొక్క అధ్యాయము అందున్న విషయమును బట్టి ఒక్కొక్క యోగముగా చెప్పబడినది. దేహమునందున్న జీవాత్మ జ్ఞానసిద్ధిని పడసి పరమాత్మ సాయుజ్యమును పొందుటయే 'యోగము' అను మాటకు అర్థము. ఇదియే ప్రతి మానవునకు గమ్యస్థానము; పరమశాంతి ప్రదమగు మోక్షపదసిద్ధి.

ఈ మోక్షసిద్ధిని మానవజీవికి పరమార్థముగా బోధించిన భారతీయవేదాంతము యొక్క ముఖ్య సూత్రమును ఈ రీతిగా వచింపవచ్చును. దేహము అస్థిరము, నాశవంతమైనది. ఆత్మ నిత్యము; ఒక దేహము శిథిలమై పతనము కాగానే వేఱొక దేహము నందు చేరును. దేహమునందున్న జీవుడు చేసికొనిన కర్మఫలములను బట్టి జన్మముల నెత్తుచుండును. అస్థిరమగు ఈ దేహసౌఖ్యములకై ఆసక్తిపడి ప్రాకులాడుట వ్యర్థమగు భ్రాంతి. ఈ జననమరణ బంధములనుండి విడివడి జీవాత్మ పరమాత్మను పొంది శాశ్వత సుఖమనుభవించుటకు తలయు సాధనల నభ్యసించుట మానవుని కర్తవ్యము. ఈ సాధనల కొఱకై కర్మ భక్తి జ్ఞాన యోగములను మార్గములు బోధింపబడినవి.

ఈ త్రివిధ మార్గములును శ్రీమద్భగవద్గీతయందు విపులముగ చర్చింపబడినవి. మానవునకు జీవిత సంస్కారముతో బాటు చిత్తశుద్ధి కలిగి పరమాత్మనెఱుగుటకు మూడును సమాన మహిమ కలిగిన త్రోవలే. ఒకదానికొకటి సహాయకారులే. కర్మయోగము ఈశ్వరభక్తిని, ఈశ్వరభక్తి ఆత్మజ్ఞాన సిద్ధిని కలుగజేయును. ఒకటి యెక్కువ వేఱొకటి తక్కువ అని వాదించుటకేమాత్రమును తావులేదు. అట్లు వాదించుకొనుట స్వమతదురభిమానమును చాటుకొనుటయే.

గీత అనగా గానము చేయబడినది అని అర్థము. శిశువులకానందము కల్గించుటకై తల్లి యెట్లు ప్రేమ మధురముగ పాటలాలపించునో అట్లే భగవద్వాణి యగు గీత యొక్క మాతృహృదయము జగత్సంతతి కెల్లను పరామార్థదాయకమగు మనోజ్ఞ ప్రబోధము కావించుచున్నది.

కర్మ భక్తి జ్ఞాన యోగములను మూటిని సమన్వయపరచి లోక ప్రవృత్తి యందున్న మనుజునకొక సులభయోగ మార్గమును చూపిన ప్రతిభ గీతయందున్నది. ఫలాపేక్ష రహితము, ఈశ్వరార్పణము అయిన విధ్యుక్తకర్మాచరణమే ఆ పవిత్ర మార్గము. అదియే నిష్కామకర్మయోగము. ఈ మార్గమునే గీతయందు శ్రీకృష్ణుడర్జునునకు మరల మరల నొక్కి చెప్పుచు యుద్ధకార్యమునకు సుముఖునిగా జేసెను.

మానవునకు కర్మయోగ సాధనయందు గల ప్రత్యేక సౌలభ్యమెట్టిదో తెలిసికొనుటకు ముందు, కర్మ భక్తి జ్ఞాన యోగములు గీతయందెట్లు నిర్వచింపబడినవో చూచుట సమంజసము. గీతయందున్న పదునెన్మిది అధ్యాయములలో మొదటి ఆఱును కర్మయోగ ప్రాధాన్యములనియు, తరువాతి ఆఱును భక్తియోగ ప్రాధాన్యములనియు, తుది ఆఱును జ్ఞానయోగ ప్రాధాన్యములనియు లోకమున వాడుక. కర్మము అనగా శాస్త్ర విధ్యుక్తమైన కర్మాచరణము. జ్ఞానమనగా సర్వేశ్వరుడును, సర్వవ్యాపియు అయిన పరమాత్మ నెఱుగు తెలివి. ఈ అర్థములతో ఈ పదములు గీతయందు వాడబడినవి.

కర్మయోగము: ఫలాపేక్ష వదలి, ప్రియాప్రియములందు సమబుద్ధి కలిగి విధ్యుక్త కర్మాచరణమును అభ్యసించు నేర్పే కర్మయోగము. అనుక్షణము మనుజున కేదో యొక పని చేయవలసియేయుండును. మానుట శక్యముకాదు. కాన ఎవరి విధ్యుక్తధర్మమును వారు చేయుట మంచిది. ఇట్టి కర్మాభ్యాసముచే క్రమక్రమముగ చిత్తశుద్ధి అలవడును. కర్మఫలమునందభిలాష త్యజించి, ఎల్లవేళల ఈశ్వరుని తలంచుచు ఏకార్యము చేసినను ఈశ్వరార్పణముగా చేయుటయే నిష్కామకర్మ సాధన. ప్రజలకు జ్ఞానయోగముతో బాటు కర్మయోగము కూడ చెప్పబడినది. రెండును సమములే. జ్ఞానయోగమునందు గల మోక్షఫలసిద్ధి కర్మయోగమందును కలదు కర్మయోగము శ్రేష్ఠము. కర్మయోగము లేనిదే జ్ఞానయోగసాధన దుర్లభము. ఈ కర్మయోగమును జనకాదిరాజర్షులు, ముముక్షువులగు పూర్వులెందరో, అనుసరించి తరించిరి. కర్మయోగము సులభము. ఆచరణ యోగ్యము. ఉదాహరణములకు అధ్యా. 2 శ్లో. 50, అధ్యా 3. శ్లో. 3, 5, 18, 20, 21, 35 అధ్యా. 4 శ్లో. 7, 8 15, 41, 42 అధ్యా. 5 శ్లో. 2, 5, 6, 10 చూడుడు.

భక్తి ధ్యాన యోగములు రెండును కలిపియే చెప్పబడినవి. పరమేశ్వరునందు చిత్తమును లగ్నమొనరించి తన్మయత్వమును పొందుట భక్తియోగము. నిరాకారునిగ, నిర్గుణునిగ, పరమేశ్వరునుపాసించుటకంటె భక్తియోగనుండున్న సగుణోపాసన సులభము. భక్తియోగము శ్రేష్ఠమైనది. భక్తుడు పరమేశ్వరున కత్యంతప్రియుడు. పరమేశ్వరుని భక్తులు పరమేశ్వరునే చేరుదురు. సర్వవిధముల మనుజులు పరమేశ్వరునే శరణుబొంది యుండుట మోక్ష ప్రాప్తికి మార్గము. అట్టి భక్తియోగము చిరకాల అభ్యాసమువలననే సాధ్యము. అట్టి అభ్యాసమునకు శక్తిలేకపోయినచో ఫలమున కాశింపక సత్కర్మము లొనర్చుట శ్రేయము. ఉదాహరణమునకు అధ్యా. 12 శ్లో 5, 9-11, 19 మున్నగునవి చూడుడు.

జ్ఞానయోగము: సాంఖ్యనిష్ఠ, కర్మసన్న్యాసము, జ్ఞాన మార్గము అనునవి జ్ఞాన యోగమునకు మారుపేర్లు. ప్రకృతి మాయామయము. మిథ్య, ఆత్మ, అనాత్మ అన్నియు కలిసి యిటనున్నవి. ప్రకృతి గుణబద్ధమైన జడమునుండి చైతన్యమగు ఆత్మనెఱుగుట జ్ఞానము. ఆత్మజ్ఞానము పరమోత్కృష్టమైనది. సర్వకర్మములను జ్ఞానమునందే పరిసమాప్తినందును, జ్ఞాని పరమాత్మరూపమే. మనుజుడీ పరమాత్మ దర్శనముపొంది, ఈశ్వరుని సర్వవ్యాపిగా నెఱిగి ప్రాపంచిక విషయముల త్యజించి శుద్ధవైరాగ్య భావమున నిరంతర నిర్వికల్ప సమాధియందుండుట జ్ఞాన యోగసిద్ధి. ఇట్టి సిద్ధి అనేక జన్మ సంస్కారముల ఫలముగ వేలాది జనులలో ఏ ఒక్కనికో లభించును. ఉదా: అధ్యా. 7 శ్లో. 3, 18, 19 అధ్యా. 4 శ్లో. 33 అధ్యా. 10 శ్లో. 20.

ఇట్టి యోగ విధానములు మూడును మానవ జీవితమును పవిత్ర మొనరించి గమ్యస్థానమైన మోక్షమునకు జేర్చు రాజమార్గములే. కావున యెవరికే విధాన మెక్కువ సులభమో, ఆచరణయోగ్యమో కనుగొని ఆ పద్ధతిని యథావిధిగ అనుస

రించుట యుక్తము. ఇది వ్యక్తియొక్క మనస్తత్త్వముపై గూడ యెక్కువగ ఆధారపడి యుండును. ఆలోచనాపరులకు జ్ఞాన, జిజ్ఞాస, భావావేశము కలవారికి భక్తి, తన్మయత్వము, సమాజమున నున్న వారికి కార్యకుశలత్వము అలవడుట కెక్కువ అవకాశమున్నది. "కృష్ణా! నేనిపుడు కార్యాకార్యనిర్ణయమును చేయలేని మూఢుడనై యున్నాను. నాకు శ్రేయమేదియో నీవే నిర్ణయించి చెప్పుము." అని వేడుచున్న అర్జునుని సన్మార్గమున బెట్టు బాధ్యత శ్రీకృష్ణునియందున్నది. మానవజాతి భవిష్యత్తును దృక్పథము నందిడుకొని, ఎదురుగా నున్న పరిస్థితుల నవలోకించి కర్తవ్యము నాలోచించి ఇట్లు నుడివినాడు. "అర్జునా! ఎల్లవేళల నన్నే స్మరించుచు నీవీ యుద్ధకార్యమును నిర్వహింపుము. నీకిపుడిదియే ధర్మకర్తవ్యము. నీకే విజయము లభించును." అధ్యా 8-7. నిస్సందేహమైన వాక్యములతో శ్రీకృష్ణు డర్జునున కొసర్చిన ఉపదేశమిది.

ఏదో మిషతో అర్జునునిచే యెట్లో యుద్ధమును పూర్తి చేయించి తన దారిని తాను ద్వారకకు పోవు తలంపుతో శ్రీకృష్ణుడు తాత్కాలికముగ చెప్పిన వాచావేదాంతము కాదిది. అర్జునునొక మహాకర్మయోగిగా చేయుటకే స్వధర్మ నిర్వహణమునకు ముందునియోగించినాడు. శ్రీకృష్ణుడు కార్యాకార్య విచక్షణ యందు దక్షుడు. తన ముందున్న వారి మనస్తత్త్వమును బాగుగా నెఱిగినవాడు. దుర్యోధనాదుల దుర్మార్గము నిర్మూలనమై లోకమున ధర్మపాలనము నెలకొనవలసిన అగత్యము వచ్చినది. దానిని నిర్వహింపవలసినవాడు అర్జునుడు. అర్జునునితో శ్రీకృష్ణుడిట్లు చెప్పెనని ఒక్కక్షణమూహింతము. "అర్జునా! నీవు బుద్ధిమంతుడవు. మంచి ఆలోచన చేసినావు. యుద్ధమునుండి విరమింపుము. నేను కూడ వెనుకకు పోవుచున్నాను." ఏమైయుండును? వ్యవహారమంతయు తారుమారై జగత్పరివర్తనమే మారిపోయి ఉండును గదా! ఆలోచించియే శ్రీకృష్ణుడట్లు చేయలేదు. అర్జునుని క్షత్రియా ధర్మమైన యుద్ధకర్మమునకే ప్రోత్సహించి నిలబెట్టినాడు. నీ స్వధర్మ నిర్వహణమునందే నీకు ఫలసిద్ధి కలదని చెప్పినాడు. సూర్యుని నుండియు పూర్వ రాజవంశీయులందఱు ఇట్టి కర్మ యోగమును అవలంబించి చరితార్థులైరని ఉదాహరణము చూపినాడు. అర్జునుడు భక్తితత్పరుడై దైవకీర్తనలు పాడుకొనుచు గాని, విరాగియై అరణ్యముల తపస్వియై కాని కాలము గడుపదగినవాడు కాదు. లోకవర్తనమందున్నవాడు. అతడీ యుద్ధమును జయించినచో సాంఘిక ప్రయోజనము విశ్వశ్రేయను కూడ నున్నవి. ఈ కీలకము గ్రహించిన శ్రీకృష్ణుడు అర్జునుని సందేహములన్నియు పోగొట్టి యుద్ధకర్మమునకే పురికొల్పెను. ఈ ఉపదేశమే గీతా సందేశమునకంతకును ఆయువుపట్టు.

శ్రీకృష్ణుడంతటితో ఆగలేదు కర్మయోగాచరణమునకు ప్రణాలికాబద్ధమైన ఒక సుందర రూప చిత్రమును కల్పించినాడు.

కర్మప్రవృత్తి మానవునికి సహజ ధర్మము. ఎవరి స్వధర్మము వారికున్నది. దానిని మానరాదు. శ్రేష్ఠులైనవారి ననుసరించిగాని, తెలిసిన విజ్ఞులనడిగిగాని స్వధర్మ కర్తవ్యమును నిర్వహింపవలెను. ఈ సంస్కారమువలన క్రమక్రమముగ జీవితము పునస్నిర్మాణమగును. దేహపోషణకు వలయు కార్యసాధనలో దోషములేదు. శాస్త్ర సమ్మతమగు సత్కార్యాచరణమువలన చిత్తశుద్ధి కలుగును. అంతకంతకు కర్మఫలమును త్యజించుచు, అన్ని ప్రాణులయందు సమహితత్వము నెంచి చేయుచున్న కర్మములన్నిటిని ఈశ్వరార్పణగా చేయవలయును. ఇదియే జ్ఞాన సిద్ధికి దారితీయును. ప్రతి మానవుడును ఈ విధముగ సులభమార్గమున కర్మయోగియై మోక్షప్రాప్తి నందుటకు వలయు పవిత్ర భావ బీజములను వెదజల్లి జీవనయాత్ర కొక రాజమార్గమేర్పఱచినాడు.

పొలమునందు విత్తులు జల్లుటతో సరికాదు. పైరు ఫలించుటకు భూమి పదునుగా నుండి సారవంతము కావలెను. అట్లే కర్మయోగియొక్క సాధన సక్రమముగా సాగుటకు శారీరక మానసిక సహకారములవసరము. అవి ఆరోగ్యవంతములు నిర్మలములు శక్తివంతములు కావలయును. గీతాచార్యుడిందులకు నిర్దేశించిన విధినియమము లెట్టివో చూడుడు.

పిరికివాడవు కాకుము. నీ కర్తవ్య నిర్వహణమున నిర్భయుండవగుము. రాగద్వేషములు క్రోధ లోభములు ఆత్మనాశన కరములు; నీకు శత్రువులు. ఇంద్రియ నిగ్రహమున వానిని వర్జింపుము. లభించినదానితో తృప్తినందుము. దురాశ వీడుము. అందఱును పరమాత్ముని సంతతియే. సమానులే; భగవానుడందఱియందును సమానముగనే వసించుచున్నాడు. ఎక్కువ తక్కువలు పాటించక అన్ని ప్రాణుల యందును సమదృష్టియు దయయు కలిగియుండుము. లోకకంటకములు క్రూరములు అయిన రాక్షస వృత్తులు తగవు. సత్యాహింసలు ఓర్పు మున్నగు దైవగుణముల నభ్యసింపుము. మనస్సునకు వికాసము, జ్ఞానము కలుగజేయునది సత్త్వగుణము. రజము లోభమునకును, తామసము అజ్ఞానమునకు హేతువులు. ఆహారవిహారములందు, ఆచార విచారములందు, నిదుర భోజనములందు మితములగు సాత్త్వికపద్ధతులనే అలవఱచుకొనుము. దేహమును ఆత్మను కఠిన మార్గముల బాధింపకుము. చిత్తశుద్ధికి భగవద్ధ్యానమునకు ఏకాంతవాసము శుభ్రాసనము అవసరము. దాన, జప, తప అధ్యయనాది సత్కృతులన్నియు భగవత్ప్రీతికరములైన యజ్ఞములే. పాపియైనను భయపడనవసరములేదు. సంకల్పము మంచిదైనచో సన్మార్గమలవడును. ఎవరి ఆత్మను వారిట్లు సన్మార్గాచరణమున ఉద్ధరించుకొని సర్వజనాభ్యుదయమునకు తోడ్పడవలయును. జీవితమంతయు ఈ సాధనతో జ్ఞానపరిపక్వమై పవిత్రమై చరితార్థమగును.

అమృతతుల్యములగు ఈ ఉపదేశములతో అర్జునుని సందేహములు పటాపంచలై "స్వామీ, కృష్ణా! నీవు జగదీశ్వరుడవు. ఏమో అనుకొంటిని. నా భ్రాంతి నశించినది. నీవు చెప్పినట్లే చేయుదును" అనెను. శ్రీకృష్ణుని ఉపదేశముల వఱకెందులకు ?

ఆ భగవానుని జీవితమే నా కర్మయోగసాధనకొక చక్కని ఉదాహరణము. గో గోపకులతో వనములందు సంచరించి ప్రకృతి నర్చించినాడు. యమునా తీరముల మురళి మ్రోయించి విశ్వప్రేమ మాధురులొలికించినాడు. కంసాది దుష్టుల సంహరించినాడు. ధర్మమార్గావలంబులగు పాండవులకు బాసటయైనాడు. అక్రూరుడు, ఉద్ధవుడు, విదురుడు మున్నగువారికి జ్ఞానకాంతిని చూపినాడు. రాజనీతిజ్ఞుడై ధర్మమునకు విజయము సాధించి లోకమున న్యాయమునకు నీతికి స్థానము కల్పించినాడు. శ్రీకృష్ణుని హృదయము లోక కళ్యాణము నాసించిన వసంత నందనము, వట్టి యెడారి కాదు. తలచుకొనినచో ఒక్క క్షణములో కౌరవుల పదునొకండక్షౌహిణుల బలమును రూపుమాపి హస్తినాపుర రాజ్యమును ధర్మజున కిచ్చెడువాడు. అట్లు చేయనేలేదు. జీవితాశయ సిద్ధికై ఎవరి కర్తవ్యము వారు నిర్వహింపవలెను. ఎవరి తపస్సు వారిది. ఎవరి సంస్కారము వారిది. మానవజాతికీ బాటను చూపుటకే శ్రీకృష్ణుడు తన చేతలతో, గీతాబోధలతో మార్గదర్శకుడై నిలచెను.

శ్రీకృష్ణుడు వచించిన ఈ యుపదేశములన్నియు ఒక్క అర్జునునకే కాదు. మనలో ప్రతియొక్కని ముందును నిలచి చెప్పినట్లున్నవి. అన్నియు సుకరములు, సులభములు, సుస్పష్టములు, సత్యసుందరములు. నిత్యవర్తనములో మనకు పనికివచ్చునవియే. ఆచరణీయములే ఆ నాటి పరిస్థితులను బట్టి అర్జునునకు యుద్ధమావశ్యకమైనది. ఈనాటి దేశకాల పరిస్థితులు వేఱు. ప్రతి వ్యక్తికిని జీవితమే ఒక సంగ్రామము వంటిది. మంచి చెడ్డల సంఘర్షణము అడుగడుగున సంభవించుచునే యుండును. మనుజుడు సహజముగ సంఘజీవి. భక్తియోగమునకు కావలసిన భక్తి తత్పరత తాదాత్మ్యము కాని, జ్ఞాన యోగమునకు కావలసిన వైరాగ్యము నిశ్చల సమాధి నిష్టకాని అతనికందుబాటులో లేనివి. ఎంత శ్రమ పడినను అనుదిన జీవయాత్రకు మనుగడయే కష్టమైన ఈ రోజులలో ఇవి యెట్లు సాగును ? మనుజులకిక మిగిలినది సత్కార్యాచరణమే. ఈ సాధనయందే మనుజుడు పవిత్రజీవనుడై సమాజమునకు సహాయకారి అగుట కవకాశమున్నది. చిన్నలైనను పెద్దలైనను మన దైనందిన సమస్యలను పరిష్కరించి సుస్పష్టమైన మార్గమును చూపగల ప్రతిభ గీతయందున్నది. వాని నుపయోగించుకొని ప్రజాశ్రేయమునకు తోడ్పడుటలోనే మన వివేకమునకు సార్థకత కలదు.

శ్రీకృష్ణుడొక సాంఘిక నాయకుడు, మానవతావాది. భారత వైదిక సంస్కృతిని లోక సంగ్రహ భావముతో కార్యాచరణ యోగ్యముగ చెప్పిన మహనీయుడు. కర్మ యోగాభ్యాసమున సామాన్యుని జీవితము గూడ పవిత్రమై మహోన్నతమగు వేదాంత స్థాయికి పోగల మార్గము చూపినాడు. ఈ దృక్పథముతో అర్థము చేసికొనినపుడే శ్రీకృష్ణుని గీతా సందేశము యొక్క సత్యము ప్రయోజనమును ప్రతి వ్యక్తియు దర్శింపగలడు.

వ్యక్తి సంఘమునకు ప్రాతిపదిక. మూలరాయి. సమాజ శ్రేయమొనగూర్చు సాంఘిక ధర్మకార్య నిర్వహణమందందఱును సమాన భాగస్థులే. ఎవరి కర్తవ్యమును వారు విధియుక్తముగ క్రమశిక్షణతో నిర్వహించినపుడే జాతిసర్వతోముఖమైన అభివృద్ధి పొందగలదు. పండితుడు, పరిపాలనాధికారి, గురువు, విద్యార్థి, సైనికుడు, వర్తకుడు, కర్షకుడు, కార్మికుడు, ఎవరైన నేమి ఎవరి కర్తవ్యము వారికున్నది. ఆ కర్తవ్య నిర్వహణమే జీవితలక్ష్యమై స్వార్థరహిత మానవసేవగా ఆకృతి దాల్చవలయునన్నదే గీతా సందేశము. ఈ సత్యమును గుర్తించియే భారత జాత్యుద్ధారకులైన వివేకానందుడు, తిలకు, గాంధి, వినోభాభావే, మొదలగు మహనీయులు భగవద్గీతా తత్త్వమును కర్మయోగ ప్రధానమైన దానినిగ వ్యాఖ్యానించి బోధించిరి. మానవ జీవితమున ధర్మము సుప్రతిష్ఠిత మగుటకు అట్టి సత్కార్యాచరణమే ఆదర్శప్రాయమగు మార్గము.

## 2. కర్మయోగ ప్రశస్తి

శ్రీకృష్ణుడు నిర్వచించిన కర్మయోగ సాధన లోకవర్తనమందున్న సామాన్య మనుజునకు కూడ బహుళ ప్రయోజనకారి కాగలదను విషయము నింతవఱకును మూకుమ్మడిగనే పరిశీలించుట జరిగినది. ఈ వాదము గీతయందెట్లు ప్రామాణికముగను హేతుబద్ధముగను చెప్పబడినదో చూచుటయు యుక్తము. ఏ అధ్యాయమునందా విషయ ప్రాముఖ్యమును విశదీకరించుచు, శ్రీకృష్ణుడు సమయము వచ్చినపుడెల్ల కర్మయోగ విశిష్టతను అర్జునునకు మరల మరల చెప్పుచునే యుండెను. మణిపూసలలో దారమువలె ఈ వాదము ఆద్యంతము కన్పించుచునే యున్నది. ముక్తి సాధారోహణమునకు కర్మయోగము నొక సులభపద్ధతి జేసి ప్రతి అధ్యాయమునందును శ్రీకృష్ణుడర్జునుని ఒక్కొక్క మెట్టు పైకెక్కించునే యున్నాడు.

గీతా పాఠకు లొక్కింత జాగ్రత్తగ నుండవలసిన దిచ్చటనే. చాలచోట్ల జ్ఞాన కర్మ భక్తి విషయములు కలగలుపుగనున్నట్లు కన్పించును. ఏ విషయమున కావిషయము వేఱు వేఱుగ గ్రహించుటకు పరిశీలనతో మరల మరల చదువవలెను. గీతా శ్లోకములందు భాష యెంత సులభమైనదో భావమంత గంభీరముగా నుండును.

మొదటి అధ్యాయమున అర్జునుడు యుద్ధవిముఖుడగుటకు కారణము పిరికితనముగాని అహింసావాదముకాని కాదు. స్వజనులను చంపవలసివచ్చినదే అను భ్రాంతియే. ఈ భ్రాంతిని పోగొట్టుటకై "దేహమే అస్థిరమైనది – ఆత్మ నిత్యము, చంపబడునది కాదు; స్థితప్రజ్ఞుడవై నీ కర్తవ్యమును నిర్వహింపుమని రెండవ అధ్యాయమున బోధింపబడినది. ఈ ఆత్మ బోధతో దేహాసక్తిని నశింపజేసి తనవారు ఇతరులు అన్న విభేదమును గూడ గీత తీసివైచినది. గీతకంతకును ప్రాతిపదిక ఇదియే. ఇట్టి స్థితప్రజ్ఞుని లక్షణములు అధ్యా. 2 శ్లో. 55 నుండి చివరవఱకును చెప్పబడినవి. ఇంచుమించుగా ఈ గుణములే జీవన్ముక్తుని లక్షణములుగా 5వ అధ్యాయమున శ్లో. 18

నుండి చివర వఱకును, భక్తుని లక్షణములుగా అధ్యా. 12 శ్లో. 13 నుండి 19 వఱకును, గుణాతీతుని లక్షణములుగా అధ్యా. 12 శ్లో. 22 నుండి 26 వఱకును, జ్ఞాన గుణములుగ అధ్యా. 13 శ్లో 8 నుండి 12 వఱకు జ్ఞాననిష్ఠుని లక్షణములుగా అధ్యా. 18 శ్లో. 51-53, దైవగుణ సంపదగా అధ్యా. 16 శ్లో. 1-3 లోను చెప్పబడినవి. కనుల కగపడని మోక్షము మాట ఒక నిముసము మఱచిపోయినను లోకములో మనుజుడు సద్వర్తనుడగుటకు కావలయు లక్షణములివియేకదా. మానవులీసత్యము గుర్తించుట పరమార్థము నెఱుగుటయే. గీతాకారుడు మఱి కొంత ముందునకు పోయి నీకు కర్మమొనర్చుట యందే కాని కర్మఫలము నాసించుటకు అధికారము లేదనెను. కర్మఫల త్యాగములో మోక్షము కలదనియు నుడివెను. అధ్యా. 2 శ్లో 47, 51. ఈ వాక్యములతో నిష్కామకర్మము నిస్స్వార్థమైన ప్రజాసేవకు చిహ్నమై, ప్రజాజీవితములో విలువగల స్థానమాక్రమించుకొని వేదాంత స్థాయికి వచ్చినది.

మూడు, నాల్గు, అయిదు అధ్యాయములయందు కర్మయోగ ప్రాముఖ్యముతో బాటు కర్మయోగప్రాశస్త్యము గూడ వివరింపబడినది. వైరాగ్యాశ్రయులగు జ్ఞాననిష్ఠులకే జ్ఞాన యోగము; సామాన్య ప్రజల కొఱకు కర్మయోగము. నిష్కామ కర్మయోగియు మోక్షము పొందగలడు. అధ్యా. 3 శ్లో. 3, 5, 19 చూడుడు. ఈ వాక్యముతో బాటు మఱికొన్ని ప్రధాన విషయములను చెప్పి కర్మయోగ ప్రాశస్త్యమును నిరూపించినాడు గీతాచార్యుడు. ఈ వాక్యము లెంత స్పష్టములో చూడుడు. కర్మయోగ మొక క్రొత్త విషయము కాదు. పూర్వులెందఱో ఆచరించినదే. కర్మయోగముచే జ్ఞానసిద్ధియు కలుగును. కర్మసన్యాసము కంటె కర్మయోగము శ్రేష్ఠము. కర్మయోగము లేనిదే జ్ఞానయోగము దుర్లభము. జ్ఞానయోగమునందున్న ఫలసిద్ధి కర్మయోగమువలనను పొందవచ్చును. అధ్యా. 3 శ్లో. 20, అధ్యా. 4-15, 38, అధ్యా. 5-2, 5, 6 ఈ ప్రమాణ వాక్యములు చాలును. జ్ఞానయోగికి ప్రపంచ విషయములు వదలిన వైరాగ్యమందును మోక్షమునందే దృష్టి. కర్మయోగికి తుదకు జ్ఞానము ముక్తి లభించుచుండగా కర్మాచరణపూర్వకమగు మానవసేవయు ఉన్నది. ఇది దీనిలోని ప్రత్యేకత.

నిష్కామకర్మయోగియే జ్ఞానియుకూడ, సత్కర్మాచరణమున ఎవరి ఆత్మను వారుద్ధరించుకొనవలెను. అధ్యా. 6 శ్లో 1 శ్లో 5, ఈ యోగసాధనకు లక్షణములు ఏకాగ్ర చిత్తము, మితాహారము, సర్వభూతములందు సమదృష్టి. ఇట్టి యోగి సర్వశ్రేష్ఠుడు. "అర్జునా! నీవిట్టి యోగివికమ్ము" (అధ్యా 6-15, 17, 29, 46) అను వాక్యములతో కర్మయోగమునకు మంగళాచరణమైనది.

సప్తమాధ్యాయమగు విజ్ఞాన యోగమున ఒక ముఖ్యాంశమున్నది. భగవచ్చింతనయు సత్కర్మాచరణముతో బాటు రావలెను. లోక హితమునకై సంపద కోరు

అర్థార్థులు కూడ ఉదారులైన ఈశ్వర సేవకులే. పుణ్యకర్మ పరాయణులును పాప నిర్ముక్తులై భగవంతుని భక్తులగుచున్నారు. అధ్యా. 7-16. 28.

అక్షర పరబ్రహ్మయోగమున భవిష్యత్తును కూడ సార్థకము చేయు ఉపాయము చూపబడినది. మరణ మెప్పుడును మన యెదుటనే నిలచియున్నది. మరణ కాల భావనా సంస్కారమే మఱు జన్మమునకు పునాది. ఇది ఒక్క నిముషములో తెచ్చుకొనగలిగినది కాదు. జీవితమంతయు సత్కార్యాచరణము తోడను భగవచ్చింతన తోడను గడపినప్పుడే మృత్యు సమయమునందు మానసమున పుణ్యస్మృతులు కలుగును. "అర్జునా! నీవు సర్వవేళల పరమేశ్వరుని భావింపుము. నీ ధర్మమును నిర్వర్తింపుము" అని భగవానుని నిర్దేశము. అధ్యా. 8 శ్లో. 7, 27.

నవమాధ్యాయమగు రాజవిద్యా, రాజగుహ్య యోగము, గీతా శాస్త్రమునందతి ముఖ్యమైనదేమో అనిపించును. మనుజునకు ఈశ్వరునితోడి పరస్పర సంబంధమిచ్చట దృఢమైనది. ఏమిచేసినను ఈశ్వరార్పణముగనే చేయుము. స్వధర్మ కర్మాచరణము భగవత్పూజయే. నీవిచ్చిన నీటిబొట్టయినను భగవానుడు కరుణతో స్వీకరించును. భక్తుల యోగ క్షేమముల బాధ్యతయు భగవానుడు వహించును. అధ్యా 9 శ్లో. 2, 14, 26, 22, 31, 32 చూడుడు. లోకప్రజల కింతకన్న వేఱు అభయ ప్రధానమేమి కావలయును. మానవుని సత్కార్యాచరణము పరకాష్ఠకు వచ్చిన స్థానమిది.

అంతయు విని, ఇట్టి దయామయుడగు ఈశ్వర స్వరూప స్వభావము లెట్లెటులగునని అర్జునుడడుగగా అతని సందేహములను శ్రీకృష్ణుడొక్కమాటలో కొట్టివేచినాడు. "ఈ వ్యక్తమగు జగత్తు నా లోని ఒక అంశ. సృష్టిలో తేజము, శక్తి, ఐశ్వర్యము యెచ్చటనున్నను అవి నా అంశలే." అని సారాంశమిది. జగత్తులో మంచినే దర్శించుము. మంచినే భావించుము. వ్యక్తమగు స్థూలప్రకృతిలో గల శ్రేష్ఠత్వము నెల్ల ఈశ్వరాంశగా భావించి వర్తించగల్గుచో సూక్ష్మరూపమున నున్న పరమాత్మ వెలుగుట కాలస్యము పట్టదు. దీనికి ఫలితము, మానవ సమాజమునకు నిష్కామముగ నొనర్చిన సేవయొక్క ప్రతిరూపమే అందఱి ప్రాణుల యందున్న (అధ్యా. 10-20) మాధవ సేవగా మనకు మిగిలినది.

విశ్వగోళము సమస్త చరాచరముల తోడను పరమేశ్వరుని విరాట్స్వరూపము నందే యున్నది. ఈ విశ్వరూప సందర్శన భాగ్యమును పొందిన అర్జునుడు వెనువెంటనే శ్రీకృష్ణుని పూర్వరూపమునే చూడగోరెను. పరమేశ్వరుని పూర్ణరూపమును సగుణము, సుందరము, భగవదంశయు నగు సూక్ష్మరూపములోనే చూడగలిగిన సాధన అది. ఈ అధ్యాయాంతమున చెప్పిన "మత్కర్మకృన్మత్పరమో" అధ్యా. 11 శ్లో 55. ఈశ్లోకము గీతకంతకును చాల ముఖ్యమైనదిగ శ్రీశంకర భగవత్పాదులే ప్రశంసించిరని ప్రసిద్ధి. "ఎవడు సర్వప్రాణులందెట్టి వైరము లేక నన్నే భజించుచు, నన్నే ఆశ్ర

-యము పొంది, నిస్సంగియై నా కొఱకే కర్మములాచరించునో, అతడు నన్ను పొందును" అని ఈ శ్లోకార్థము. మానవజాతిని సత్కార్మవర్తనులుగా చేయుటకు భగవాను డేర్పఱచిన వెలుగుబాట యిది.

భక్తియోగమునకు కావలసిన నిశ్చలమానసము, తన్మయత్వము అభ్యాసము చేసి కొనుట అశక్యమైనచో, కర్మఫలము కోరని భక్తుడవై నా కొఱకు కర్మము లొనర్పుము అని శ్రీకృష్ణుని నిర్దేశము. అధ్యా 12 శ్లో 10.

పరమేశ్వరుడైన ఈశ్వరు నెఱుగుట ఒకనాటి పనికాదు. జన్మజన్మల సంస్కార ఫలితము. కర్మ, భక్తి, జ్ఞానముల మేలు కలయికగా జీవిత మీశ్వరమయము కావలెను. "నన్నెఱుగువాడు నన్ను భజించుచున్నట్లే. ఈ రహస్యము నెఱిగి అర్జునా నీ స్వధర్మాచరణము నిర్వర్తించి కృతకృత్యుడవగుము." అని గీతాకారుని వాక్యము. అధ్యా. 15 శ్లో. 20.

కర్మయోగ ప్రాశస్త్యమును తెల్పు ఈ మాటలతో గీతాకారుడూరుకొనలేదు. ఈ లక్ష్యసాధనకనుకూలమైన విధమున శరీరమును మనస్సును ఏ మార్గముల దిద్ది తీర్చవలయునో ఆ విధానములన్నియు నిదురపోవుటనుండి, ఆత్మనిష్ఠవఱకు ఎట్టి గుణముల నలవఱచుకొనవలయునో కూడ చెప్పినాడు. మనుజుని పూర్ణమనీషిగా రూపొందించు ఉత్తమ ప్రబోధమిదియంతయును. కర్మాచరణము, దానము, తపము, జపము, శ్రద్ధ, అధ్యయనము, నిత్యవర్తనము, ధైర్యము ఇత్యాది అన్ని విషయముల లోను కావలసినది సాత్త్వికగుణము. రాజసతామసములు, లోభమునకు, అజ్ఞానమునకు తావులు గాన వర్జనీయములు. భావమునందున్న లక్ష్యము చేరవలసిన గమ్యస్థానము ఎంత పవిత్రము లైనవో చేయవలసిన సాధనయు అంత పవిత్రముగా నుండవలయునన్నదే దీని ముఖ్యోద్దేశము. గుణత్రయ విభాగయోగము, దైవాసుర సంపద్విభాగయోగము. శ్రద్ధాత్రయ విభాగయోగములు వచించు ఉపదేశమే యిది. సాధనకు తగినట్లు మానసమును సిద్ధము చేయవలయును. అప్పుడే సత్కార్మాచరణమునకు తగిన సహకారము లభించును.

తుది పదునెన్మిదవ అధ్యాయమగు మోక్షసన్యాసయోగము ఒకవిధముగా గీతా కావ్యమున కుపసంహారము. ఈ వఱకు చెప్పిన ముఖ్యవిషయములను మరల పునశ్చరణము కావించి స్వధర్మనిర్వహణముయొక్క ప్రాశస్త్యమును చెప్పి, "అర్జునా నాయందే నీ చిత్తము లగ్నమొనర్చి నీ నియత కార్యము లొనర్పుము" అని హెచ్చరించెను. అధ్యా 18-56,57. దానితో అర్జునుని విడువలేదు. "అర్జునా, నేను చెప్పినది వింటివి. దీని నంతయు చక్కగా విమర్శించుకొని నీయిష్టము వచ్చినట్లు చేయుము" అని చెప్పుచునే "సర్వధర్మములను పరిత్యజించి నన్నే శరణుపొందుము" అని శ్రీకృష్ణుడు తుదిమాటగా పలికెను. ఇదియొక చిత్రమైన సన్నివేశము. (అధ్యా

18-63-66, ఉపసంహారస్థమైన వాక్యములివి. పవిత్ర వర్తనమున కేర్పఱచిన పరిధిలో భగవానుడు మానవుని కొసగిన భావస్వేచ్ఛ, నిర్బంధము రెండును ఇందేయున్నవి.

ధర్మములను ఆచరింపవలసియుండగా, సర్వ ధర్మములను పరిత్యజించుటయేమి? అను ప్రశ్న యుదయించును. దీని తాత్పర్యమిది. ధర్మాచరణమును సంపూర్ణముగ సాధించిన తరువాత ఆ స్థితికి కూడ అతీతుడవై భగవంతుని యందే సమాహిత చిత్తుడవు కావలసినదని నిర్దేశము.

ఒక్కమాటలో చెప్పవలయునన్నచో "సాత్త్విక స్వభావుడవై సర్వప్రాణుల యందు సమహితత్వమున నీ నియత కర్మములను ఈశ్వరార్పణముగా చేయుము. చరితార్థుడ వగుదువు" అని గీతాశాస్త్రమున అడుగడుగున కన్పించు ముఖ్యసూత్ర మిది. నిష్కామ కర్మయోగమును ఒక సౌందర్య భావనగా దిద్దితీర్చి భగవానుడు మానవజాతి కొసగిన పవిత్ర లక్ష్యమిది. ఫలోన్ముఖమైన సాధన అలవడవలయునే కాని ఆ లక్ష్యసిద్ధి మనకు తెలియకుండగనే లభించును. ప్రతి ప్రాణియు వ్యక్తమగు దైవాంశయే అయి భాసించుచున్నపుడు మానవసేవాబద్ధమైన విధ్యుక్త కార్యకలాపమంతయు భగవదారాధనగా పరిణమించి మనుజ వర్తనము చరితార్థమగుటలో సందియమేలేదు. ఈ గీతాదేశము ఇంటింట ప్రతిధ్వనించి ప్రతి వ్యక్తికిని, ప్రతి సమాజమునకును, ప్రతి జాతికిని, ప్రతి దేశమునకును మార్గదర్శకమై సర్వజగతియు శాంతిసౌఖ్యములకు నిలయమై విలసిల్లును గాక.

## ౪. గీతా ప్రతిభ

ఆకారమున చిన్నదయ్యు అత్యధిక మహత్త్వము కల ధర్మగ్రంథము గీత. ఇది భగవత్ప్రోక్తమగుటయే ఈ మహిమకు కారణము. గీతా మహిమయొక్క ముఖ్యాంశములు కొన్ని ప్రకృతమిట సూచింపబడినవి.

చారిత్రక సత్యము:

శ్రీకృష్ణుడు చారిత్రకవ్యక్తి, యుగపురుషుడు. గీతా ప్రబోధము చారిత్రక సత్యము, కల్పనాకథ కాదు. ఎన్ని యేండ్ల క్రిందట ఏనాడు గీతాప్రబోధము జరిగినదియు ప్రామాణికముగ నిర్ణయించి చెప్పినవారున్నారు.

అసలట్టి ప్రబోధమునకు యుద్ధరంగమున అవకాశమున్నదా, ధర్మజునివంటి మహనీయులుండగా అర్జునునకే యేల చెప్పవలయును అను సందియములకేమియు తావులేదు. ఆనాటి యుద్ధములు వేఱు. ఇరుతెగలు ఆయుధముల ధరించి సిద్ధముగానున్న తరువాతనే యుద్ధమారంభమగును. శత్రుపక్షమునందున్న పెద్దలను కూడ ముందు గౌరవించికాని యుద్ధము నారంభించెడివారుకారు. ధర్మరాజు భారత

యుద్ధమున అట్లే చేసెను. ముందు ద్రోణ, భీష్ముల కడకేగి వినతులర్పించివచ్చెను. యుద్ధము ఇంకను ప్రారంభము కాలేదు. యుద్ధభూమికి రాగానే అర్జునునకు సందేహములు కలిగినవికదా! ఈ వ్యవధిలో ఒక గంట గంటన్నర కంటె ఎక్కువ పట్టని శ్రీకృష్ణార్జునుల సంభాషణమునకు, గీతా బోధనకు చాలినంత అవకాశమున్నది. అపై, అర్జునుడు శ్రీకృష్ణునకాంతరంగిక మిత్రుడు. ఇద్దరును ఒకరి హృదయముకరు ఎఱిగినవారు. సరిగా యుద్ధము నిర్వర్తించవలసిన సమయమునకే విషాదపూరితమైన భ్రాంతిలో పడినాడు అర్జునుడు. యుద్ధమైన కొలదికాలమునకే ద్వాపరాంతమై కలియుగ మారంభము కానున్నది. లోకమున నీతి ధర్మములు నిలబడుటకై ఉపదేశమీయవలసియున్నది. అర్జునునివంటి మిత్రుడు, సమయము, పరిస్థితులు అన్నియు కలసి వచ్చినవి. వీనిని బాగుగా ఉపయోగించుకొనినాడు శ్రీకృష్ణుడు. "అర్జునా! నీవు నాకిష్టుడవు, ప్రియుడవు కాన ఈ పరమరహస్యమైన ధర్మమును నీకు బోధించితిని" అని శ్రీకృష్ణుడే నుడివెను. చూడుడు. అధ్యా. 10 శ్లో 1. అధ్యా. 18 శ్లో. 64.

మహాశక్తివంతము :

గీతయందలి ప్రతి చరణము అర్థవంతము, మహా మహిమాన్వితము. అర్జునునంతటి మహాధీరుడు "కృష్ణా! నేనీయుద్ధమును చేయను" అని భీష్మించుకొని కూర్చున్నవానిచే "మహాప్రభూ! నీప్రబోధముతో నా సందేహములు భ్రాంతియు నశించినవి. నీవు చెప్పినట్లే చేయుదును" అనిపించినవి. ఇక సామాన్య ప్రజలెక్క లెక్కా. ఇహలోక ఫలితార్థముల నభిలషించి కొన్ని కొన్ని గీతా శ్లోకములను ధ్యాననిష్ఠులై మంత్రములవలె పఠించి సఫలు లగుచున్న వారలనేకు లున్నారు. గీతాభ్యాస సాధకులకు గీతా మహాత్మ్యమునందు చెప్పబడిన ఫలములు కలుగు ననుట కేమియు సందియము లేదు.

ఐహికాముష్మిక దృష్టి :

భారతీయ సంస్కృతి కేవలము పారలౌకికముకాదు. లోకప్రజల యోగక్షేమముల దృక్పథము నందిడుకొని పెంపుచేయబడిన జీవన విధానమగుటచే వేలకొలది యేండ్లుగా అవిచ్ఛిన్నముగా సాగివచ్చుచు అనేక విధముల జగతికి మార్గదర్శకమగుచున్నది. భారతదేశమున వర్ధిల్లిన చతుష్షష్టికళలు, వివిధశాస్త్రములు, రాజర్షి కల్పుల రామరాజ్యములు ఇవి యన్నియు భారతీయ సంస్కృతి కుదాహరణములే. ఈ వైదిక సంస్కృతికి సారమైన గీతయు ఇట్టిదే. కేవలము పారలౌకిక దృష్టియే లక్ష్యమైనచో శ్రీకృష్ణు డర్జునుని తపస్సు చేసికొనుటకై అడవులకే పంపియుండును. అట్లు చెప్పనేలేదు. లోకమున మానవ ధర్మ సంస్థాపనకై యుద్ధమే చేయించెను. నైతికాశ్రయమగు కర్మాచరణ మార్గమున మానవజాతికి పవిత్రశీల నిర్మాణమును చూపుటయే గీతయందు ముఖ్యాంశము. ఈనాటి అధునిక విజ్ఞానమున నూతన విషయ

ములుగ కనిపెట్టబడుచున్న సిద్ధాంతములకు బీజములెన్నియో సంస్కృత వాఙ్మయమున కలవని విజ్ఞులు పలుకుదురు. పరపరిపాలనా ఫలితముగ నష్టముకాగా మనకు మిగిలియున్న సంస్కృత వాఙ్మయ భాండారము నంతయు వెలికితీసి పరిశోధించి ప్రచురించినచో భారతదేశమునకే గాక యావత్ప్రపంచమునకును ప్రయోజనకారి యగును. భారత సంస్కృతి ననుసరించి మనుజుడు వర్తింపవలసిన బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ సన్యాస ఆశ్రమములలో సాధింపదగినవి ధర్మ అర్థ కామ మోక్షములను పురుషార్థములు ఈ సాధనలలో ఐహికాముష్మిక విధానముల రెంటిని సమన్వయపఱచి, విశ్వశ్రేయమున కనువైన లోకవర్తనమును ఆధ్యాత్మిక స్థాయికి తీసికొనిపోయిన విశిష్ఠత గీతయందున్నది.

సర్వభూతదయ - సమదృష్టి :

రాగద్వేషములకు బానిసయై తనతోబాటు జగత్తున వసించుచున్న మానవుల యెడలను ప్రాణులయెడలను కరుణ జూపజాలని వాని యత్నములన్నియు వ్యర్థములే. అనివార్యములగు పరిస్థితులవలన యెందఱెందఱో దుఃఖితులు దీనులు, దరిద్రులు, అనాథులు లోకము నందుందురు. వారందఱు ఆదరణకు అర్హులు. ఎక్కువ తక్కువలు పాటించక ఉన్నంతలో అందఱియెడలను సమదృష్టియు దయయు కలిగి యుండవలసిన ఆవశ్యకత నొక మానవ ధర్మముగ గీత బోధించినది. సుఖ దుఃఖములందు, ప్రియాప్రియములయందు సమదృష్టినిగూడ సర్వభూతదయతో సమానమగు ధర్మముగనే గీత సూత్రించినది. వ్యక్తమగు భగవత్స్వరూపములపై ద్వేషమును భగవంతునియందు భక్తియు ఒకదాని కొకటి పొసగని విషయములు. సర్వభూతములయందు సమదృష్టియు, కరుణయులేని హృదయమున భగవద్భక్తికి తావులేదు. విశ్వప్రేమకు విస్పష్టమైన నిర్వచనములు సమదృష్టియు సర్వభూత దయయును, పూర్వ ఋషుల ఆశ్రమములందు అన్యోన్య వైరభావము కలిగిన జంతువులు కలసిమెలసి తిరిగాడు వనుటకు ఈ విశ్వప్రేమ విస్తరించిన వాతావరణమే కారణము. ఈ సూత్రమును సందర్భము వచ్చినపుడెల్ల గీతాకారుడు చెప్పినాడు. "నిర్వైరస్సర్వభూతేషు" "సర్వభూత హితేరతాః" "సమదుఃఖ సుఖంధీరం" వంటి వాక్యము లెన్నియో ఉన్నవి. అధ్యా 2-15-38-48 అధ్యా 5-18-19 అధ్యా 6-9-32 అధ్యా 12-13-18-17-19 అధ్యా 11-55 అధ్యా 13-10 అధ్యా 14-24 మొ॥

జీవిత లక్ష్యములు - సాధనా విధానము :

మానవుని జీవిత లక్ష్యము లెట్టివి? సమాజ మధ్యమున జీవించు చున్నందులకు, తన జీవితము పవిత్ర మొనరించుకొనిసాధ్యమైనంతలో సమాజ శ్రేయమునకు పాటుపడుట - ఆత్మానందమును, శాంతిని సాధించుట - సత్కర్మముల ఫలితముగ సంస్కారమునంది జనన మరణ రహితమైన మోక్షసిద్ధిని పడయగల్గుట.

ఈ లక్ష్యములను నిర్వచించుటతో సరిపెట్టక లక్ష్యసాధనకు సులభోపాయము లను తెలిపిన గొప్పతనముకూడ గీతయందున్నది. జనసామాన్యమునకు చేసిన మహోప కారములలో నిది అగ్రగణ్యము. లక్ష్యము స్పష్టముగ నున్నను ఆచరణ కష్టమైనచో దాని గొప్పతనమే పోయినది. మనుజుల కందుబాటులోలేని కఠిన పద్ధతులను గీత చెప్పనేలేదు. దేహమును, ఆత్మను కృశింపజేసి కష్టపెట్టు మార్గములను నిషేధించినది కూడ అధ్యా. 17 శ్లో. 6. ఈ ఉపాయములతో సాధనకడ్డువచ్చు అవరోధములు తొలగి అనుష్ఠానయోగ్యమైన విధానిమేర్పడినది. ఈ వ్యాస ప్రథమ భాగమున యోగసాధకు డవలంబించవలసిన విధి నియమములు ఉదాహరింపబడినవి. అవి యన్నియు అందఱకు నిత్యవర్తనమున సులభముగ చేయదగినవే.

ప్రజలకు ముఖ్యముగ గీతాసందేశ మొనరించిన మహోపకారము యజ్ఞము, యోగము, తపము అను పదములకు మనస్సులందు పాతుకొనిపోయిన అర్థములను కూకటి వేళ్ళతో పెరికి వైచి క్రొత్త అర్థములను సృష్టించి వానిని ఆచరణయోగ్యము లుగ చేయుట. మహారణ్య మధ్యమున తపస్సుల కడనున్న ఆధ్యాత్మిక సాధనను నలుగురి మధ్యకును తీసికొని రాగల్గిన గొప్పతనమిది. యజ్ఞములన్నచో ధనవంతు లైన కుబేరులకే అనుకొందురు. తపస్సన్నచో అడవులందున్న జడదారులకే అను కొందురు, యోగమన్నచో అష్టాంగ హఠయోగాది భయంకరక్రియలే అనుకొందురు. త్యాగమన్నచో ఆలుబిడ్డల వదలి అరణ్యముల పట్టి పోవుట యనుకొందురు. ఈ భయ మును గీత తీర్చివైచినది. గీతా ప్రబోధములో క్రోధలోభములు, రాగద్వేషములులేని సత్కార్మము, సజ్జనత్వము మనుజుని గమ్యస్థానము జేర్చు రాజమార్గమయినది. సద్భా వము, సద్గ్రంథ పఠనము, శ్రవణము, మృదువాక్కు, మితాహారము, భగవన్నామ జపము, స్వార్థములేని సత్కార్యాచరణము, సాత్త్వికవర్తనము ఇవియన్నియు యజ్ఞ. తపోయోగములై నట్టింట నిలచినవి. మనుజుని వీపు తట్టి ఆత్మ విశ్వాస మొసగి జీవిత సాధనయందు ధీరునిగా నిలబెట్టినవి. మానవునికి దివ్యత్వ మొసగిన క్రొత్తమార్గము గీతా ప్రబోధము.

అధ్యా. 4_28, 30. అధ్యా. 6_1 అధ్యా. 10_25 అధ్యా. 17_14, 15, 16. అధ్యా. 18_2.

హింస - అహింస :

అర్జునుని యుద్ధమునకు పురికొల్పినది గీత. ఇది హింసామార్గమేమో అనిపించును. బాహ్యరూపములను బట్టి హింస అహింసలను నిర్ణయించుట సత్యదూరము. కత్తి కట్టులు పట్టక ఒక వ్యక్తి అనేకులకు కష్టనష్టములు కలిగించునట్లు వర్తించును. అది హింస. తీవ్ర దుర్మార్గముల నణచుట కొకప్పుడు తీవ్రచర్యలవసరమగును. వానిని హింస అనలేము. అర్జునుడొనరించిన యుద్ధమట్టిదే. ఆనాడు ప్రబలియున్న దుర్మార్గ మును నిర్మూలింపకపోయినచో లోకములో ధర్మమార్గము నిలుచుటకు ఆస్కారమే

లోకపోయెడిది. అహింసా విశిష్టతను గీతాచార్యుడు విస్మరింపలేదు. అహింసను ఆదర్శముగ చెప్పిన సందర్భములెన్నియో ఉన్నవి. అధ్యా. 10 శ్లో. 5 అధ్యా. 16-2 అధ్యా. 13-8. మొ॥

జాతీయ జీవనము - వృత్తి విభజన :

జాతీయ కార్యకలాపములు విజయవంతములై సమాజము ఆర్థికముగ పురోభి వృద్ధి కాంచుటకు వృత్తియందు నైపుణ్యము ఒక ముఖ్యావసరము. వంశపరంపరగను, గుణకర్మములను బట్టియు అనుసరింపబడు స్వాభావిక వృత్తు లిందులకు విశేషముగ తోడ్పడునన్నది నిర్వివాదాంశము. గీతా ప్రబోధమున "చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః" అధ్యా 4-13 అధ్యా. 18-41. 44 మొదలైన వాక్యముల భావము గుణములను బట్టియు సహజకర్మలను బట్టియు చేసిన విభజనమే. కుల విభేదములు కల్పించుటకు ఇందు ఆస్కారమే లేదు. ఈ సూత్రముయొక్క యథార్థ స్వరూపము గ్రహింపలేని ఆధునికులు నేడే శతవిధములైన విభాగములు కల్పించు చున్నారు. ఎవరికే పనియందు వంశక్రమాగతమైన అనుభవము, సహజ గుణము కలవో వారే దానిని తక్కువ వ్యయప్రయాసలతో, ఎక్కువ నేర్పుతో చేయగలిగి దేశ సంపదకు తోడ్పడగలరు. స్వధర్మ నిర్వహణమును గీత అడుగడుగున ప్రబోధించుటలో గల ముఖ్య విశేషమిది.

లౌకిక మత గ్రంథము :

భారతీయ వేదాంతము ఒకే ప్రవక్త చెప్పిన మాటలు కావు. లోక సంగ్రహ చిత్తులు జ్ఞాన సిద్ధులు అయిన అనేక మహనీయుల అనుభవ సిద్ధాంతములు ఆ కారణముచే గీతా ప్రబోధము సకల మత సమ్మతము, సర్వజనీనము అయిన ధర్మవిధానము. ఇందు స్త్రీ పురుష విభేదములు గాని జాతి మత కుల వివక్షతలు గాని పాటింపబడ లేదు. గీతాపఠన శ్రవణములకు అభ్యాసమునకు అందఱును అర్హులే, కాని వారెవరు? గీతను ద్వేషించు వారొక్కరే. అని గీతాచార్యుని వాక్యము అధ్యా. 18-67. ధర్మ జీవనమున భక్తి విశ్వాసములు లేనివారికి గీతను బోధించి మాత్రము లాభమేమి ?

గీత వెలువడి వేలాది సంవత్సరములైనను నేటికిని నిత్య నూతనమై మానవ మార్గదర్శకముగ నున్నది. ఎన్ని కల్పములకైనను శాశ్వతముగ ఇట్లే నిలబడగల పటుత్వము దీనికి కలదు. ప్రతి వ్యక్తికిని అతని వర్తనమున కనువగు మానవధర్మము విప్పిచెప్పి సార్థక జీవుని చేయగల గురుస్థానము ప్రపంచమున భగవద్గీత ఒక్కదానికే దక్కినది. గీతాభ్యాసమున ప్రతి మనుజునకు గల సమస్యా పరిష్కారము లభించుటయే గాక, దుఃఖ నివారణము, ఆనంద ప్రాప్తియు కలుగు ఉపాయములు కలవు. మాతృహృదయమున గల ప్రేమార్ద్రిత గీతయందున్నది. ఈ ప్రతిభా విశేషముల చేతనె గీత లౌకిక మతగ్రంథముగ ప్రస్తుతింపబడినది. కర్మ భక్తి జ్ఞానయోగములను

సమన్వయపరచి విశ్వమానవమతమును చూపిన గీతా ప్రబోధమునకు ముగ్ధులై భారతీయ ప్రముఖులేకాదు, మాక్సుముల్లరు, అనీబిసెంటు, ఎడ్విను ఆర్నాల్డు, ఎమర్సన్, మున్నగు పాశ్చాత్యవిజ్ఞాను లెందఱో గీతను సర్వజనోపకారిగా శ్లాఘించిరి.

అ భ య హ స్త ము :

ప్రతి మనుజుని వెనుకను శాశ్వతరక్షగా భగవానుని అభయహస్తమున్నది. చూడగల్గినవారికిది అనుక్షణము ప్రత్యక్షముగా కన్పడుచునే ఉండును. సత్కార్యాచరణము, నిస్వార్థమానవసేవయు భగవదారాధనములే. భక్తిసాధనములే, మానవ ధర్మమార్గములే. ఇట్టి జీవనమున ప్రతి వ్యక్తికి ఆత్మవిశ్వాసమును కలిగించుటకై భగవానుడెట్టి ధైర్యవాక్యములను పలికెనో చూడుడు.

1. నిష్కామకర్మయోగము ఏ కొంచెము ఆచరింపబడినను జనన మృత్యురూపమగు సంసార భయమునుండి కాపాడును. అధ్యా. 2-40.

2. కర్మయోగమునుండి ఒకప్పుడు భ్రష్టుడైనను ఇహపరములందు దుర్గతిలేదు. శుభము లొనరించిన హేతువుచే మరల సద్వంశములందు జన్మించి జ్ఞానియగును. అధ్యా. 6-40

3. నన్ను ఏకాగ్రచిత్తులై స్మరించువారు నన్ను సులభముగ పొంది పునర్జన్మములేని మోక్షము నందుదురు. అధ్యా. 8-14, 15

4. నన్ను ఆత్మభావమున ధ్యానించువారికి యోగక్షేమములను నేనే సమకూర్చెదను. అధ్యా. 9.22.

5. భక్తితో యెవరేమిచ్చినను తుదకు నీటిబిందువునైనను స్వీకరింతును. అ. 9-26.

6. దుర్మార్గుడైనను నా యందు భక్తియున్నచో శీఘ్రముగ సన్మార్గుడగును. 9-30

7. నా భక్తుడెన్నటికిని నశింపడు. నిశ్చయముగ కృతార్థుడగును. దీనిని ప్రతిజ్ఞ చేసి చెప్పవచ్చును. అధ్యా. 9-31.

8. నన్ను విశ్వసించి చిత్తము నర్పింపుము, అన్ని కష్టములనుండి దాటగలవు. అధ్యా. 18-58.

9. నన్నే శరణుపొందుము. నిన్ను రక్షింతును. అధ్యా. 18-66.

10. పరిస్థితులు విషమించి ధర్మమునకు హాని కల్గుచో, సాధురక్షణ దుష్టశిక్షణ గావించి, ధర్మము స్థాపించుటకు నేను యుగయుగమున జన్మింతును. అధ్యా. 4-7, 8.

జగదీశ్వరుడే మానవునకింత దగ్గఱగా వచ్చి పల్కరించి ధైర్యము చెప్పినపుడు ఇంతకన్నను కావలసినదేమి ? మానవజాతికి దివ్యత్వమొసగజాలిన ఆత్మజ్ఞానప్రబోధమిది. గీతయే పరమాత్ముని నివాసము. గీతాశాస్త్ర సమ్మతముగనే త్రిలోకపాలన సాగుచున్నది. గీత ఉన్న ప్రదేశములన్నియు పవిత్ర తీర్థరాజములు. గీతయందలి ఒక్క శ్లోకమును అభ్యస్తము చేసినను సన్మార్గ జీవనములవడును. గీతాభ్యాసమున మానవ జీవితము దివ్యసంస్కారము పొంది ఈశ్వరమయమగుననుట కెట్టిసందియములేదు.

# స్వవిషయము

మా యింటిపేరు కొండేపూడివారు. హరితస గోత్రము ఆర్వేల నియోగి బ్రాహ్మణశాఖ. పశ్చిమగోదావరి మండలము భీమవరమునకు సమీపమున కాల్వయొడ్డున నున్న కొండేపూడి గ్రామము మా పూర్వుల నివాసము. వారందఱు కొలదిపాటి భూవసతితో కాలము గడపిన గ్రామీణులు. మా తాతగారు సుబ్బన్నగారు. ఆ పేరే నాకు పెట్టిరి. తరువాత సుబ్బారావుగా మారినది. నన్నింకను చాలమంది సుబ్బన్న అని పిలచుటయే వాడుక. నా జననము నలనామ సం॥ర కార్తీకము (నవంబరు 1916) చేబ్రోలు గ్రామమునందు.

మా తండ్రి సర్రాజుగారు, ముగ్గురు అన్నదమ్ములలో పెద్ద. వారికిద్దఱు అక్కచెల్లెండ్రును ఉండిరి. మా తల్లి రత్తమ్మ. ప॥గో॥జిల్లా చేబ్రోలు గ్రామవాసులు ఆదూరివారు ఆమె పుట్టింటివారు. వివాహమైన అనంతరము మా తండ్రిగారు మా మాతా మహస్థానమైన చేబ్రోలునకే వచ్చి స్థిరపడిరి. పల్లెటూరి ఉపాధ్యాయ వృత్తి వారి జీవనోపాధి. ఆ గ్రామము నందున్న పెద్దలు నన్ను చూచినపుడెల్లను మా నాన్నగారి సుజనత్వమును, పవిత్ర జీవనమును పలువిధముల నేటికిని ప్రశంసించు చుందురు. వారి సంతానము మేము నలువురము. వరుసగా దుర్గాంబ, సుబ్బారావు, సత్యనారాయణ, అన్నపూర్ణ. నాకు పదేండ్లు నిండని చిన్న వయస్సు. తీవ్రమైన అగ్నిప్రమాదమునకు గురియై మూడునాల్గు మాసములు చావు బ్రతుకుల మధ్య నుంటిని; ఆస్పత్రి చికిత్సలు నిష్ఫలమైనవి. నా మంచమువద్ద కూర్చొని మా నాన్నగారు "దైవమా ఈ బాలుని కేల ఈ అవస్థ రావలయును. కొంత వయస్సు చెల్లిన నాకు ప్రాప్తించినను తీరిపోయెడిదే" అని చాలసార్లు దీనముగా అనుకొన్నమాటలు నా చెవులయందింకను ప్రతిధ్వనించుచుండును. దారినిపోవు ఒకానొక బైరాగి మంత్రించి యిచ్చిన ఒక సోలెడు నూనెవలన నా గాయము లన్నియు మాని పునర్జీవితము కల్గినది. ఆ బైరాగి తన దారిని తాను పోయెను. ఎంత ప్రయత్నించినను మరల కన్పడలేదని చెప్పుదురు. మా నాన్నగారి హృదయము ఎంత ఆర్ద్రమైనదో, ఆయన సంకల్పబలమెట్టిదో! నాకు నయమైన కొలది దినములకే మకర సంక్రాంతియు వైకుంఠ ఏకాదశియు కలసివచ్చిన ఒక పుణ్యదినమున వ్యాధి యేమియు లేకనే

మా నాన్నగారు దివంగతులైరి. అది 1927 సం॥రము ప్రాంతమై ఉండునని జ్ఞాపకము. చక్కని చాయ, కదిమట్టపు బొమ్మ, మా నాన్నగారి విగ్రహము నేటికిని నా కనులముందుండును.

ప॥ గో॥ జిల్లా చేబ్రోలునందే మా పెదతల్లి మా పెద తండ్రి గార్ల నివాసము కూడ. బొమ్మిరెడ్డిపల్లి గంగరాజు, కనకమ్మ గారలు. కొంత సంపన్న గృహస్థులు. వంశ పరంపరగా వచ్చిన పృథ్వీతత్త్వమై ఉండనోపు, మా నాన్నగారు రాత్రి పగ లనక మా పెదనాన్నగారి పొలములు, తోటల పనులన్నియు తీరిక దొరకినపుడెల్ల చూచుచుండువారు. మా పెదనాన్నగారికి సంతానము లేదు. మా తమ్ముడు సత్య నారాయణను, సీతారామాంజనేయులు అను పేరిడి దత్తు తీసికొనిరి.

మేము చిన్నవారము. వెనుక ఆస్తిపాస్తులు లేవు. తండ్రి కూడ లేకపోవుట. మా పెదతల్లి పెదనాన్నగారింటివద్ద ఆదరము లభించినది. వారిరువురు ఆదర్శ గృహస్థులు. పలువురకు పలువిధముల సాయమొనరించిన పుణ్యవర్తనులు. దేశ మందలి పుణ్యక్షేత్రములు తీర్థములు దర్శించిరి. అనేక ధర్మకార్యములకు దానము లొసగిరి. వారింట నిత్యము గీతా పారాయణము, భాగవతపఠనము జరుగుచుండెడిది. వారిల్లు అన్నపూర్ణ సత్రము వలెనే ఉండెడిది. సలహా కొఱకు, తగవుల పరిష్కారము కొఱకు చుట్టుపట్ల గ్రామములనుండి కూడ చాలమంది ప్రతి దినము మా పెదనాన్న గారి వద్దకు వచ్చెడివారు. ఆస్తులకు సంబంధించిన ముఖ్య విషయములందు కూడ వారిమాట సుప్రీంకోర్టు తీర్పువలె అందఱకు శిరోధార్యమే. ఆ దినములు ఆ సంస్కృతి వేఱు. ఆ వాతావరణము నా జీవితమును చాలవఱకు ప్రభావిత మొనర్చినది. 1964 లో మా పెదనాన్నగారు పరమపదించిరి. దేవత వలె మా పెద్దతల్లిగారింకను మాకంద ఱకు మార్గదర్శకులై యున్నారు. వారిల్లు నేటికి మాకందఱకు స్వగృహతుల్యమే.

నా విద్యాభ్యాసము ప్రారంభము చేబ్రోలులో మా నాన్నగారి వద్దనే. మూడవ ఫారము వరకు సమీపమున నున్న కైకరము, నారాయణపురము గ్రామము లలో, హైస్కూలు విద్య ఏలూరునందు, 1933లో స్కూలుఫైనలు పరీక్ష అయినది. ఈ లోపుగా నడుమ నడుమ అంతరాయములు వచ్చినవి కూడ. చిన్నతరగతి చదువు నకు చాలిన ఉద్యోగము లభించునను చాలునని, చదువు ఆగినపుడు, వ్యవసాయము, ఉపాధ్యాయ వృత్తి, దస్తావేజులు వ్రాయుటవంటి పనులు సాగినవి. నేను చదువు మానుట మా అమ్మగారికిష్టములేదు. ఆమె చాల దూరదృష్టి, విజ్ఞానము కలిగిన మనీషి. దానికి తోడు పట్టుదలయు ఎక్కువే. ఎట్లో కష్టపడి కాలేజీలో చేర్పించి బి. ఏ. వరకు సాగించినది. కాలేజి చదువు శ్రీ పిఠాపురము రాజావారి కళాశాల కాకినాడలో, సుఖముగనే సాగినది. ఇంటర్మీడియటు, బి. ఏ. తరగతులందు ప్రథమ శ్రేణి, ఆంధ్రమున ప్రప్రథమ స్థానము, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు స్వర్ణపతకము, ఆంధ్రాంగ్లభాషావక్తృత్వ పోటీ పరిక్షలలోను, వ్యాసరచనలందును పెక్కు బహు

మానములు, మంచి స్కాలరుషిప్పు, విద్యార్థి సంఘమునకు అధ్యక్షత, ఇత్యాది అర్హతలు లభించినవి.

విద్యార్థి దశయందు సెలవు దినములలో కొందఱు స్నేహితులను వెంటబెట్టుకొని సాంస్కృతిక ప్రచారము చేయుచు గ్రామముల వెంట తిరిగితిని. గాంధి మహాత్ముని సత్యాగ్రహ దినములలో హైస్కూలు నందు సమ్మెకు కారకుడనుగా ప్రధానోపాధ్యాయునిచే శిక్షను పొందితిని.

ఆంధ్ర భాషయందు కొంత ఆసక్తి చిన్ననాటినుండియు కలదు. మా పెదతల్లిగారింటివద్ద నిత్యమును పోతన్నగారి భాగవతము మున్నగు కావ్యములను మా పెద్దవారందఱు చదువుకొనుచుండుట ఈ ఆసక్తికి ప్రథమ కారణము. చిన్నతనముందే ఆంధ్ర భాగవతమునుండి వందలకొలది పద్యములు కంఠపాఠముగా నుండెడివి. ఇప్పటికిని పోతన్నగారి భాగవతమనినచో చెవికోసుకొందును. పదపడి మాకు చాల దగ్గర బంధువు స్వర్గీయ శ్రీ పెమ్మరాజు లక్ష్మీపతిగారు ఆనాటి అగ్రశ్రేణికవులలో నొకరు. మంచి మంచి పుస్తకములను చదువుటకు ఎంతయో ప్రోత్సాహపరచెడువారు. భారతి మున్నగు పత్రికలలో వచ్చుచున్న వారి రచనలవలన మఱికొంత ఉత్సాహము లభించి సాహిత్య కృషి సాగినది. విద్యార్థి దశనుండియే నా గద్య పద్య రచనలు భారతి, ఆంధ్రపత్రిక, కృష్ణా పత్రిక, ప్రతిభ, ఉదయని వంటి ప్రసిద్ధ సాహిత్య పత్రికలలో వచ్చుచుండెడివి.

1938 లో బి. ఏ. పరీక్ష అయినది. నిరుద్యోగము చాల తీవ్రముగ నున్న దినములవి. బి. ఏ. అయిన తర్వాత కాకినాడలోనే శ్రీ దేవిడీ జమీందారుగారు అచ్చువేయించిన ఆంధ్ర విజ్ఞానము అను తెలుగు ఎన్సైక్లోపేడియాకు సంపాదకత్వము, అది మధ్యలో ఆగిపోవుటతో రాజమండ్రిలో ప్రయివేటు ట్యూషనులు సాగినవి. బి ఇడి. సీటునకు ప్రయత్నించితిని కాని దొరకలేదు. పైకి చదువవలెనని అభిరుచి ఉన్నను సాగని ఆర్థిక పరిస్థితి. 1939 లో ద్వితీయ ప్రపంచ సంగ్రామమారంభమైనది. మా బంధువొకరు స్వర్గీయ శ్రీ వెలిచేటి రామమూర్తిగారు పూనాలో డిఫెన్సు అక్కౌంట్సు డిపార్టుమెంటునందు ఉన్నతోద్యోగమున ఉండెడివారు. వారి పరిచయముతో ఆ డిపార్టుమెంటు పరీక్షకు కూర్చొని గుమాస్తాగా చేరితిని. మొదటి యత్నములోనే అక్కౌంట్సు, సర్వీసు పరీక్షలో గూడ ఉత్తీర్ణుడనైతిని. వెంట వెంటనే అక్కౌంటెంటు, అక్కౌంట్సు ఆఫీసరు, పదవులు లభించినవి. ఉద్యోగవృత్తిలో నేను చూచిన ప్రదేశములలో పూనా, జబల్పూరు, అలహాబాదు, సిమ్లా, మీరటు, సికింద్రాబాదు, మద్రాసు, విశాఖపట్టణము ముఖ్యమైనవి. ఈ దేశ సంచారమువలన క్రొత్త క్రొత్త ప్రదేశములు అందున్న తీర్థ క్షేత్రముల దర్శనమే కాక, భారత జాతీయ జీవనమును కొంత విశాల దృక్పథముతో గ్రహించు అనుభవము కూడ లభించినది.

నా వివాహము చిన్నతనమందే అయినది. భార్య సుబ్బలక్ష్మి. తాడేపల్లిగూడెం వద్ద ఆరుగొలను గ్రామకరణము స్వర్గీయ శ్రీ తల్లాప్రగడ సుబ్బారావుగారి ప్రథమ పుత్రిక. మాకు సంతానము ముగ్గురు. ఒక కుమార్తె, ఇద్దరు కుమారులు. కుమార్తె చి॥ సౌ॥ కనకరత్న విద్యావతి, మా మేనల్లుడు, అల్లుడు చి॥ ఆదూరి భీమారావు రైల్వే ఇంజనీయరు. మొదటి కుమారుడు చి॥ సర్వేశ్వరప్రసాదు, బ్యాంకు ఆఫీసరు, కోడలు చి॥ సౌ॥ కామేశ్వరి. రెండవవాడు చి॥ శ్రీనివాసు, బి. యస్ సి. ఫైనల్ పరీక్షకు ఈ సంవత్సరమే వెళ్ళినాడు.

నా ఉద్యోగ విరమణము 1974 సంవత్సరములో విశాఖపట్టణమున. పుట్టి పెరిగిన గ్రామము వేలు. విశాఖపట్టణ ద్వారకానగరున స్వగృహమేర్పడి స్థిర నివాసమైనది. జీవిత యాత్ర యందీవరకు ఎప్పుడేకష్టము కలుగబోయినను దయాపూర్ణుడగు జగదీశ్వరుని అభయహస్తమేదియో వెనుకనుండి నన్ను రక్షించుచునే యున్నది. మా కుటుంబమున కన్నవస్త్రముల లోటులేని పరిస్థితిని కలుగజేసినదా భగవానుని కరుణాకటాక్షమే అని నా ధృఢ విశ్వాసము.

1975 సంవత్సరములో ధర్మచింత, ఆధ్యాత్మిక దృష్టియుగల పుణ్యజీవి మా అక్కగారు సౌ॥ దుర్గాంబగారు పరమపదించిరి. 1976 సంవత్సరము అక్టోబరు నెలలో ఇంచుమించు ఎనుబదియైదు వత్సరముల పండువయసున ఎక్కువ వ్యాధి బాధలు లేకనే పూజ్యురాలైన మా తల్లి రత్నమ్మగారు దివంగతులైరి. ఆశ్చర్యకరమైన లోక విజ్ఞానము, స్వతంత్రములైన భావములు, దృఢసంకల్పము, ఆరోగ్యకరములగు అలవాట్లు గల వ్యక్తి ఆమె. నా ఉద్యోగ విరమణాంతరము మాతృదైవముగ ఆయమకు వలయు సేవచేయు భాగ్యము కొంత లభించినదని నాకొక తృప్తి.

సాధ్యమైనంతవరకు నా శక్తి కొలది సాహిత్యకృషియందే మిగిలిన కాలము గడపవలయునని నా అభిలాష. ఏదో రచన దైవానుగ్రహమున నిత్యము సాగుచునే యున్నది. నైతిక ఆధ్యాత్మిక ఆశ్రయములగు మానవధర్మ సంబంధములైన రచనల వైపే మనసు మ్రొగ్గుచున్నది. దైవేచ్ఛ ఎట్లున్న అట్లు సాగును. ఈ గీతామృత కావ్యరచన నా జీవితమందొక ముఖ్య ఘట్టమని తలంతును.

ఇంతవరకు ముద్రితములైన నా రచనలు :_

(i) కావ్యాంజలి : పద్యకావ్య సంపుటి. ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడెమీ గ్రాంటు నందుకొన్నది. విశ్వనాథ, రాయప్రోలు, మధునాపంతుల, మున్నగు పలువురు కవిపండిత ప్రముఖులు ప్రశంసించిన కావ్యము.

(ii) సర్వేశ్వర స్తవము : భక్తిరసప్రధానములు, వైరాగ్యభావ విలసితములగు పద్యముల శతకము.

(iii) గీతా సంగ్రహము : భగవద్గీత పదునెన్మిది అధ్యాయముల సారము. వచనము.

(iv) గీతామృతము : శ్రీమద్భగవద్గీతకు ఆంధ్రానువాదము.

ముద్రణ కావలసినవి : మేఘ సందేశము, (కాళిదాసకృతికి తెనుగు) చిట్టితల్లి, కవితాలహరి, సాహిత్య సౌరభము మొ॥ చాల ఉన్నవి.

సాహిత్య కృషి ఒక చక్కని అభ్యాసము. ఈ కళాభినివేశము చిత్తశుద్ధి సౌజన్యతల నిచ్చునని నా విశ్వాసము. ఇది యిట్లే సాగుచు చేయగలిగినంతలో నలువురకుపయుక్తముగా నుండు సన్మార్గ జీవనమును సాధించు మనోబలము కలుగ వలెననియే దేవునికి నా నిత్య ప్రార్థన.

— గ్రంథకర్త



శ్రీ కొండేపూడి సుబ్బారావు, శ్రీమతి సుబ్బలక్ష్మి
కవి దంపతులు

# గీతా ప్రార్థన

గీతా పఠనమునకు ముందు ప్రార్థన కావించుట యుక్తము.

గురూపదేశము కలవారు గురుప్రార్థన కావింపవలెను

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుదేవో మహేశ్వరః ।
గురుసాక్షాత్పరబ్రహ్మా తస్మై శ్రీ గురవేనమః ॥

తదుపరి వరుసగా

## విఘ్నేశ్వర ప్రార్థన

శుక్లాం బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం ।
ప్రసన్న వదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోప శాంతయే ॥

## విష్వక్సేన ప్రార్థన

యస్యద్విరద వక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతం ।
విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే ॥

## సరస్వతీ ప్రార్థన

సరస్వతి నమస్తుభ్యం వరదే కామరూపిణి ।
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా ॥

## వ్యాసర్షి స్తోత్రము

వ్యాసం వశిష్ఠ నప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్ ।
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥

## శ్రీకృష్ణ స్తోత్రము

కృష్ణాయ వాసుదేవాయ హరయే పరమాత్మనే ।
ప్రణతక్లేశ నాశాయ గోవిందాయ నమోనమః

## గీతా స్తోత్రము

పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం
వ్యాసేన గ్రథితాం పురాణ మునినామధ్యే మహాభారతమ్
అద్వైతామృత వర్షిణీం భగవతీమష్టాదశాధ్యాయినీమ్
అంబ త్వా మనుసంధధామి భగవద్గీతే భవద్వేషిణీమ్.

# గీతామృతము

## శ్రీమద్భగవద్గీత

## అర్జున విషాదయోగము

## మొదటి అధ్యాయము : సారాంశము

ప్రధాన విషయము :—

యుద్ధసన్నద్ధులై పాండవ కౌరవులు వారి వారి సేనలతో కురుక్షేత్రమున సమావేశమగుట—అర్జునుఁడు యుద్ధరంగస్థితులైన వీరులను పరిశీలించుట—అర్జునుని విషాదము.

అర్జుఁనుడు రాజ్యసుఖముల కాశపడి ఇతర ప్రాణుల చంపనిష్టపడక, ధర్మము నెఱుఁగుట కొఱకై అమితముగ పరితపించెను. అందువలన అర్జునుని విషాదము కూడ నొక యోగముగా చెప్పబడినది.

## సారాంశము

కురుక్షేత్రమున యుద్ధ సంసిద్ధులై చేరిన దుర్యోధనాదులు పాండవులు తదుపరి యేమిచేసిరని ధృతరాష్ట్రుఁడు ప్రశ్నించగా సంజయుఁడిట్లు చెప్పెను.

ఓ ధృతరాష్ట్ర మహారాజా! వినుము. ఉభయ సైన్యములు కురుక్షేత్రమున చేరగానే నీ సుతుఁడైన దుర్యోధనుఁడు ద్రోణుని కడకేగి, భీముని రక్షణ క్రిందనున్న పాండవసైన్యములను, భీష్ముని రక్షణ క్రిందనున్న తమ సైన్యములను చూపి, తన ఇతర సేనానాయకులను కూడ వేఱువేఱుగ తెలియఁజేసెను. ఇరుతెగలలోను మహారథులు, యుద్ధవిశారదులైన వీరులు పెక్కుమంది కలరు. కౌరవవీరులు తమతమ శంఖములను ఉత్సాహపూరితులై పూరించిరి. వెంటనే శ్రీకృష్ణార్జునులు, పాండవవీరులు తమ శంఖముల నొత్తిరి. ఆ శబ్దము భూమ్యాకాశములు నిండి కౌరవులకు హృదయవిదారకముగా నుండెను.

యుద్ధము ప్రారంభము కానున్నది. ఉభయ సేనల మధ్య తన రథమును నిలిపించి, అర్జునుఁడు యుద్ధ సమాగతులైన వీరుల నందఱిని పరిశీలనగా చూచెను. అచట సమావేశమైనవారు తనకు గురువులు, పితామహులు, తండ్రులు, సోదరులు, సుతులు, మిత్రులు మున్నగు స్వజనులు.

అయ్యో, రాజ్యము కొఱకు స్వజనులైన వీరందఱిని చంపవలెనా అను దుఃఖము అర్జునుని మనస్సులో ఒక్కసారి పెల్లుబికి వచ్చినది. జాలితో గుండె కరగినది. అట్లు విషణ్ణుడైన అర్జునుఁడు శ్రీకృష్ణునితో నిట్లనెను.

ఓయి కృష్ణా! యుద్ధములో నాకెదురుగ నిల్చిన వారందఱు నాకు స్వజనులే. రాజ్యాశతో వీరినందఱను చంపవలెనా? అట్టి ఘోరకార్యము నేను చేయఁజాలను. అది వంశనాశనము, మహాపాపము కదా. అట్టి పాపము వలన సనాతనధర్మమే నశించును. దుష్టులైన దుర్యోధనాదుల కీజ్ఞానము లేకపోయిన, తెలిసిన మనమైనను ఈ పాపమునుండి తప్పించుకొనరాదా? ఈ యుద్ధమును తలఁచుచున్న కొలఁదియు నాదేహము వణకిపోవుచున్నది. అవయవములు శిథిలమగుచున్నవి. చర్మమంతయు మండిపోవుచున్నది. నిలుచుటకు గూడ బలము లేదు. ఆయుధములు చేతినుండి జారిపడిపోవుచున్నవి. నేనీ పాడుయుద్ధమును చేయఁజాలను. వంశమే నాశనమగుచున్నపుడు దానివలన ప్రయోజనమేమి? భీష్మద్రోణులు నాకు పూజ్యులు. వారిపై నెట్లు బాణముల ప్రయోగింపగలను

ఈ యుద్ధములో స్వజనులందఱను చంపి రాజ్యసౌఖ్య మనుభవించుట కంటె భిక్షమెత్తుకొనుట మేలు. యుద్ధము చేయకుండ నిరాయుధుడనై యున్న నన్ను దుర్యోధనాదులు చంపినను చంపనిమ్ము. అదియే మేలు. వారిని చంపినందువలన పాపమే గాని వేఱు ప్రయోజనము లేదు. ముమ్మాటికి ఈ యుద్ధము నేను చేయఁజాలననుచు అర్జునుఁడు చేతనున్న గాండీవమును బాణములను జారవిడిచి రథమునందు విచారగ్రస్తుడై చతికిలబడెను.

ఈ అధ్యాయమందలి ముఖ్య శ్లోకములు:

1, 10, 14, 21, 22, 28, 29, 30, 36, 47.

ఓమ్

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

# శ్రీ మ ద్భ గ వ ద్గీ త

## అర్జున విషాదయోగము

ధృతరాష్ట్ర ఉవాచ :- ధృతరాష్ట్రుని ప్రశ్న

శ్లో॥ 1. ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః।
మామకాః పాణ్డవాశ్చైవ కిమకుర్వత సంజయః ॥

గీ॥ అవనియందు ధర్మక్షేత్ర మనగ నొప్పు
ఆ కురుక్షేత్రమున రణవ్యగ్రు లగుచు
పాండురాజ పుత్రులును నావారు చేరి
చెప్పుమో సంజయా ! ఏమి చేసి రచట.

తాత్పర్యము : ఓ సంజయా! భరతభూమిలో ధర్మక్షేత్రమని చెప్పఁగొనదగిన కురుక్షేత్రమున యుద్ధ సంసిద్ధులై దుర్యోధనాదులైన నా వారు, పాండవులును సమావేశమైరి కదా. అటుపిమ్మట వారేమి చేసిరి ?

సంజయ ఉవాచ :- సంజయుడు చెప్పెను.

2. దృష్ట్వాతు పాణ్డవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా।
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్ ॥

సమరమునకయి యచట వ్యూహముగ పన్నఁ
బడిన పాండవబలముల పాఱఁజూచి,
ఉర్విపతియయి యలరు దుర్యోధనుండు
నుడివె నిట్లు ద్రోణాచార్యు కడకుఁజేరి.

తా॥ అపుడు రాజైన దుర్యోధనుఁడు వ్యూహాకృతిగా నేర్పఱుపబడిన పాండవ సైన్యమును జూచి, గురువైన ద్రోణాచార్యుని వద్దకు పోయి యిట్లనెను.

3. పశ్యైతాం పాణ్డుపుత్రాణా మాచార్య ! మహతీం చమూమ్।
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవశిష్యేణ ధీమతా ॥

చూడు మాచార్య ! మీకు శిష్యుఁడు ద్రుపదప
తి తనయుండు, దృష్టద్యుమ్న ధీయుతుండు
పన్నినట్టి వ్యూహమయి, అతిప్రబలమైన
పాండుపుత్రుల సైన్యము వంక నిచట.

తా॥ ఆచార్యా ! పాండవులదైన ఈ సైన్యము వంక చూడుడు. మీశిష్యుఁడైన ద్రుపదరాజు యొక్క కుమారుఁడు ధీశాలి అయిన దృష్టద్యుమ్నుఁడు పన్నిన వ్యూహమిది. అతిప్రబలముగా ఉన్నది.

4. అత్ర శూరా మహేష్వాసా భీమార్జున సమాయుధి।
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః ॥

5. ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్ ।
పురుజి త్కుస్తిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః ॥

6. యుధామన్యుశ్చ విక్రాన్తః ఉత్తమౌజాశ్చ వీర్యవాన్ ।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః ॥

కలరచట శూరులును, ధనుర్విలసితులును,
సమరమందు భీమార్జున సములు నైన
అల్ల యుయుధానుఁడును, విరాటావనిపతి,
వీరుఁడౌ కాశిరాజు, మహారథుండు

ద్రుపదభూపతి, శైబ్యపూరుషవరుఁడు,
కుంతిభోజుఁడు, పరమవిక్రాంతిశాలి
ఆయుధామన్యనృపతియు నచటఁగలరు
దృష్టకేతుఁడును, పురుజిత్పృథ్వీపతియు

ఉత్తమౌజుఁ డనంతవీర్యోత్తముండు,
ద్రౌపదేయులు, మఱి సుభద్రాసుతుండు
చేకితానుఁడు గూడను చేరి రచట
రణమునం దందఱును మహారథులె వీరు.

తా॥ ఈ పాండవుల సైన్యములో మహాశూరులూ, గొప్ప విలుకాండ్రు, యుద్ధమందు భీమార్జున సమానులు ఉన్నారు.

ఆయుయుధానుఁడు (శ్రీకృష్ణుని కుమారుడు సాత్యకి), విరాటుడు, మహారథుఁడైన ద్రుపదుఁడూ, దృష్టకేతుఁడు, చేకితానుఁడు, వీరుఁడైన కాశిరాజు, పురుజిత్తు, కుంతిభోజుఁడు, శైబ్యుఁడు, విక్రమశాలి యుధామన్యుఁడు, ఉత్తమౌజుఁడును ఉన్నారు. అభిమన్యుఁడు, ద్రౌపదికుమారులు కూడ అచ్చటనే ఉన్నారు. వీరందఱు యుద్ధ విద్యలో ఆరితేరిన మహారథులే.

7. అస్మాకం తు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ ! ।
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమితే ॥

బ్రాహ్మణోత్తమ ! యిక మనపక్షమందు
అతిప్రసిద్ధులు నాయకులైన వార
లెవ్వరెవ్వరు కలరో మీ యెఱుక కొఱకు
విశదముగ తెల్పుచున్నాను వినుడు మీరు.

తా॥ విప్రవర్యా ! యిక మన పక్షమందు ప్రముఖులైనవారు యెవరెవరుండిరో ఆ సేనానాయకులను గూర్చి మీకు తెలియుటకై చెప్పుచున్నాను వినుడు.

8. భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః ।
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమిదత్తి స్తథైవచ ॥

9. అన్యేచ బహవశ్శూరా మదర్థే త్యక్త జీవితాః ।
నానాశస్త్రప్రహరణా స్సర్వే యుద్ధవిశారదాః ॥

మీరలున్నారు, తాత భీష్ముండు కలఁడు,
కర్ణుఁడున్నాడు, జయశాలి కలఁడు కృపుఁడు,
అల వికర్ణుఁ డశ్వత్థామ అవిధముగ
సౌమదత్తియు కూడ నిచ్చటనె కలరు.

సకల శస్త్రాస్త్రయుధాన్వితుల్, శౌర్యనిధులు,
నాకొఱకు జీవి తమ్మర్పణ మ్మొనర్ప
నితరు లెందఱొ యున్నార లిచట, వార
లందఱును యుద్ధకోవిదు లైనవారె.

తా॥ మీరు, భీష్ముఁడు, జయశాలికృపుఁడు కర్ణుఁడు ఉన్నారు. అట్లే వికర్ణుఁడు, అశ్వత్థామ, సౌమదత్తియు ఉన్నారు.

నాకొఱకు ప్రాణము లర్పించగల శూరులూ, వివిధములైన ఆయుధములు కలవారు యుద్ధవిశారదులైనవారు ఇతరు లెంతోమంది ఉన్నారు.

10. అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్ ।
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్ ॥

భీష్మ సంరక్షితమ్మయి వెలయు చున్న
మనబల మ్మసంఖ్యాకమై తనరు చుండె;
పరిమితమ్మగు పాండవ బలము లివియె
భీమరక్షిత మగుచుఁ గన్పించుచుండె.

తా॥ అసంఖ్యాకమైన మన సైన్యములు భీష్ముని రక్షణక్రింద నున్నవి. భీమునిచే రక్షింపబడుచున్న ఈ పాండవ సైన్యము పరిమితముగానే ఉన్నది.

11. అయనేషు చ సర్వేషు యథాభాగమవస్థితాః ।
భీష్మ మేవాభిరక్షను భవన్త స్సర్వ ఏవహి ॥

కాన, మీరెల్ల రన్నిమార్గములలోన
సైన్యమందున్న మీయొక్క స్థానములను
వదలిపెట్టక సుస్థిరత్వమున నిలచి
యుండి, భీష్మనే కాపాడుచుండవలయు.

తా॥ యుద్ధరంగములో అన్ని యెడలను మీమీ స్థానములన్ను వదలిపెట్టక మీరందఱు భీష్ముని రక్షించుటయే యిపుడు కర్తవ్యము,

12. తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః।
సింహనాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌ ప్రతాపవాన్॥

అంత దుర్యోధనున కతి హర్ష మలర
వీరుఁ డా కురువృద్ధుఁడు భీష్ముఁ డపుడు
సింహనాదముచేసి, దిక్సీమ మ్రోగ
శంఖమునుగూడ పూరించె శబ్ద మెసఁగ.

తా॥ ఆవిధముగా చెప్పిన దుర్యోధనునకు సంతోషము కలుగునట్లుగా కురువృద్ధుఁడైన భీష్ముఁడు సింహనాదమొనరించి గొప్పశబ్దముతో శంఖమును పూరించెను.

13. తత శ్శంఖాశ్చ భేర్యశ్చ పణవానక గోముఖాః।
సహ సైవాభ్య హన్యన్త స శబ్ద స్తుము లోఽభవత్॥

వెంట వెంటనె కౌరవ వీరు లెల్ల
వారి వారి శంఖములను భేరి గోము
ఖములు పణవానకాది వాద్యముల నొక్క-
మారు మ్రోయింప. శబ్ద మంబరము ముట్టె.

తా॥ వెంటనే కౌరవ వీరులందఱును వారివారి శంఖములను, భేరి మొదలైన వివిధ వాద్యములను ఒక్కమారు మ్రోయింపగా ఆ శబ్దమున్ని దిశలను వ్యాపించినది.

14. తత శ్శ్వేతై ర్హయై ర్యుక్తే మహతి స్యన్దనే స్థితౌ।
మాధవః పాండవ శ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః॥

తెల్లని హయమ్ములను పూన్చి తెచ్చినట్టి
ఒక మహారథమందు కూర్చుండియున్న
కృష్ణుఁడును అర్జునుఁడును పూరించిరంత
వారి దివ్యశంఖములు శబ్దమ్ము లెసఁగ.

తా॥ అంతట, తెల్లని గుఱ్ఱములు పూన్చఁబడిన ఒక మహారథముపై కూర్చున్న కృష్ణార్జునులు గూడ వారి దివ్యశంఖములను మహాధ్వనితో పూరించిరి.

15. పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః।
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః॥

16. అనంత విజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః।
నకులః సహదేవశ్చ సుఘోష మణిపుష్పకౌ॥

17. కాశ్యశ్చ పరమేష్వాస శ్శిఖణ్డీ చ మహారథః।
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చాపరాజితః॥

18. ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృధివీపతే।
సౌభద్రశ్చ మహాబాహుశ్శంఖాన్ దధ్ముః పృథక్ పృథక్॥

15. అచ్యుతుం డూద పాంచ జన్యమును బట్టి,
దేవదత్తము నొత్తె పార్థివుఁడు గూడ
పౌండ్ర మను మహాశంఖమ్ము భయదరీతి
భీమకర్ముఁడై యలరెడి భీముఁ డూదె.

16. నృపతియగు యుధిష్ఠిరుఁడు కుంతీసుతుండు
ధర్మరాజూదె తన యనంత విజయమ్ము,
నకుల సహదేవు లొత్తిరి ప్రకటగతుల
శంఖముల సుఘోష మణిపుష్పకము లనగ.

17. ప్రథితధానుష్కుఁ డా కాశిరాజు, ధరణి
నపజయ మెఱుంగనట్టి సాత్యకి, విరాట
ధారుణీపతి, శిఖండి మహారథుండు
ఆ ద్రుపదుఁడు దృష్టద్యుమ్నుఁ డాదిగాగ

18. ద్రౌపదీపుత్రులును సర్వభూపవరులు
ఉరుబలాఢ్యుఁ డైన అభిమన్యుఁడును కడగి
వేఱువేఱుగ పూరించినారు, వారి
వారి శంఖముల్ తుముల శబ్దమ్ము లెసఁగ.

తా॥ శ్రీకృష్ణుఁడు పాంచజన్యమను శంఖమును, అర్జునుఁడు దేవదత్తమును, భయంకర కర్మము లొనర్చు భీముఁడు తన పౌండ్రమను శంఖమును పూరించిరి.

యుధిష్ఠిరుఁడని పేరుగాంచిన ధర్మరాజు తన అనంతవిజయ మను శంఖమును, నకుల సహదేవులు సుఘోషమణి పుష్పకములను శంఖములను పూరించిరి.

ఆ తరువాత గొప్ప విలుకాఁడైన కాశిరాజు, విజయవంతుఁడు సాత్యకి, విరాటుఁడు, మహారథుఁడైన శిఖండి, ద్రుపదుఁడు, దృష్టద్యుమ్నుఁడు మొదలైన రాజులందఱు, ద్రౌపదీ పుత్రు లయిదుగురు, అభిమన్యుఁడును వారివారి శంఖములను ఒకరి తర్వాత నొకరు పూరించిరి.

19. స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్ ।
న భశ్చ పృథివీం చైవ తుములో వ్యను నాదయన్ ॥

వా రొనర్చిన భూరి శంఖారవమ్ము
అంతటను మహాధ్వనులతో వ్యాప్తమగుచు
భూనభమ్ములయందు మార్మ్రోగి తనరె
ధార్తరాష్ట్రుల హృదయ విదారకముగ.

తా॥ భూమ్యాకాశములలో మారుమ్రోగుచున్న ఆశంఖారవము అంతటను వ్యాపించి, దుర్యోధనాదులైన కౌరవులందఱకు హృదయ విదారకమైనది.

20. అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః ।
ప్రవృత్తే శస్త్ర సంపాతే ధనురుద్యమ్య పాణ్డవః ॥

21. హృషీకేశం తదా వాక్య మిదమాహ మహిపతే ॥

నరవరా! కపికేతనుం డర్జునుండు
తానుకూడ సన్నద్ధుఁడై ధనువుదాల్చి
సమర మారంభ మగుచున్న సమయమందు
కౌరవుల నెల్ల నచ్చట కలయఁ జూచి
పలికె నిట్టుల కృష్ణుని వైపు తిరిగి.

తా॥ ఓరాజా, యుద్ధమారంభము కానున్న ఆ సమయములో కపిధ్వజుఁడైన అర్జునుఁడు ధనుర్ధారియై కౌరవుల నందఱిని తేరిపాఱఁజూచి కృష్ణునితో నిట్లనియెను.

2

అర్జున ఉవాచ : అర్జునుఁడు చెప్పెను.

21 సేనయోరుభ యోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత ॥

ఉభయ సేనల మధ్య మందుంచి యిచట
మాధవా ! నిల్పు మొకయింత మనరథమ్ము.

తా॥ కృష్ణా ! నారథమును కొంత సేపు ఉభయ సేనల మధ్యగా నిలుపుము.

22. యావదేతా న్నిరీక్షేఽహం యోద్ధుకామానవస్థితాన్ ।
కైర్మయా సహ యోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే ॥

ధార్తరాష్ట్రులు రణసముద్యమము తోడ
నెవరెవరు వచ్చిరో యిట బవరమునకు,
ఎవరితో నేను రణ మొనరింపవలెనో,
వారి నందఱ తిలకించు వఱకు నాపు.

తా॥ యుద్ధసన్నద్ధులై ఇచటి కెవరెవరు వచ్చిరో, ఎవరితో నేను యుద్ధము చేయవలసి యున్నదో వారి నందఱిని సరిగా చూచువఱకు రథమును నిల్పుము.

23. యోత్స్యమానాన వేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః ।
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేర్యుద్ధే ప్రియచికీర్షవః ॥

దుష్టుఁ డగు ధృతరాష్ట్రి పుత్రునకు నిచట
రణము నందున ప్రియ మొనర్పంగ నెంచి,
యుద్ధమునకయి చేరిన యోధు లయిన
వారినందఱ వీక్షింపవలెను నేను.

తా॥ దుష్టుఁడైన దుర్యోధనునకు ప్రీతి గొలుపుటకై రణసంసిద్ధులై వచ్చిన యోధుల నందఱను నేను చూడ గోరుచున్నాను.

సంజయ ఉవాచ : సంజయుఁడు చెప్పెను.

24. ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత ! ।
సేన యోరుభ యోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్ ॥

భరత వంశోత్తమా ! యిట్లు పలికి నట్టి
అర్జునుని మాటలను విని అచ్యుతుండు.

25. భీష్మ ద్రోణ ప్రముఖ త స్సర్వేషాం చ మహీక్షితాం।
ఉవాచ పార్థ! పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి॥

ద్రోణ భీష్ములు మున్నగు క్షోణినాధు
లందఱకు రణభూమి యం దభిముఖముగ
ఉభయసేనలమధ్య యందుంచి రథము,
రణసమాగతు లైన కౌరవుల బలము
చూడు మీవంచు పార్థునితోడ ననియె.

తా॥ రాజా! అర్జునుని మాటలను విన్న శ్రీకృష్ణుఁడు తమ రథమును భీష్మ ద్రోణులకు సకల రాజులకును ఎదురుగా, ఉభయసేనలమధ్య నిల్పి "అర్జునా! నీ కోరిక ప్రకారము ఈవచ్చిన కురువీరులను చూడుము" అని చెప్పెను.

26. తత్రా పశ్య త్స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్।
ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీం స్తథా॥

27. శ్వశురాన్ సుహృద శ్చైవ సేన యోరుభ యోరపి।
తాన్ సమీక్ష్య స కౌంతేయస్సర్వాన్ బన్ధూనవస్థితాన్॥

28. కృపయా పరయాఽఽవిష్టో విషీదన్నిదమబ్రవీత్।

అర్జునుడు చూచె నుభయసైన్యముల లోన
సమరసన్నద్ధు లయియున్న సఖుల, సుతుల,
తండ్రులను, గురువులను, పితామహులను,
మేనమామల, మామల, మిత్రవరుల
భ్రాతలను, మన్మలను, సర్వబాంధవులను,

అర్జునుం డిట్లు రణరంగ మందునున్న
యెల్ల బందుగులను విలోకించి నంత
అధిక కరుణాన్వితుండయి స్వాంతమందు
దుఃఖపడి పల్కె కృష్ణుని తోడ నిట్లు.

తా॥ అర్జునుఁ డుభయ సైన్యములలోనున్న తండ్రులను, తాతలను, గురువులను, మిత్రులను, పుత్రులను, మామలను, మేనమామలను, సోదరులను, మనుమలను సర్వ

బంధువులను చూడగనే మిక్కిలి దయగలిగి దుఃఖపడిన మనస్సుతో కృష్ణుని చూచి ఇట్లనియెను.

అర్జున ఉవాచ : అర్జునుఁడు చెప్పెను.

28. దృష్ట్వేమం స్వజనం కృష్ణ ! యుయుత్సుం సముపస్థితమ్ ॥

29. సీదన్తి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి ।
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే ॥

30. గాణ్డీవం స్రంసతే హస్తాత్త్వక్చైవ పరిదహ్యతే ।
న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః ॥

కృష్ణ ! రణసముత్సాహులై యెదుట నున్న
బంధువుల గాంచినంత సర్వాంగములును
సడలుచున్నవి, నోరెండి పిడచగట్టె,
కాయ మిది గగుర్పాటుతోఁ గంపమొందె.

జారుచుండె గాండివము హస్తములనుండి
అఖిల చర్మము మండుచున్నట్టు లుండె
నిలుచుటకు గూడ నేమియు బలములేదు
చిత్త మిదిగూడ భ్రాంతిని జెందు చుండె.

తా॥ కృష్ణా ! యుద్ధాసక్తులై యెదురుగానున్న స్వజనులను చూడగనే నా అవయవములు సడలుచున్నవి. నోరెండిపోవుచున్నది. శరీరమంతయు గగుర్పాటుతో కంపించిపోవుచున్నది.

చేతిలోనున్న గాండీవము జారిపడుచున్నది. చర్మమంతయు మండుచున్నది. నిలుచుటకుకూడ శక్తిలేదు. మనసునందు గూడ ఏదియో విభ్రాంతి కలుగుచున్నది.

31. నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ
న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజనమాహవే.

ప్రకటముగ విపరీత సూచకము లైన
దుర్నిమిత్తము లెల్లెడ తోచుచుండె;
అచ్యుతా ! స్వజనమ్ముల నాహవమున
ఛంపినను కూడ మేలు కాన్పింప దిపుడు.

తా॥ కృష్ణా! ఎచట చూచినను విపరీతమైన అపశకునములే కనిపించుచున్నవి. ఈ యుద్ధములో స్వజనమును చంపి సంపాదింపదగిన మేలుకూడ కన్పింపకున్నది.

32. న కాఙ్క్షే విజయం కృష్ణ! న చ రాజ్యం సుఖాని చ।
కిం నో రాజ్యేన గోవిన్ద! కిం భోగైర్జీవితేన వా॥

కృష్ణ! కాంక్ష వేదిక నాకొకింత గూడ
సమరజయమున రాజ్యసౌఖ్యంబునను గాని;
బ్రతుకునందు, భోగములందు, రాజ్యమందు
కృష్ణ! మనకు ప్రయోజనమేమి కలదు?

తా॥ కృష్ణా! నాకు విజయమువలదు, రాజ్యసౌఖ్యములును వలదు. వానియందు నాకేమియు వాంఛలేదు. భోగ జీవితమునందు, రాజ్యమునందు మనకుగల ప్రయోజనమూ కన్పించుట లేదు.

33. యేషామర్థే కాంక్షితం నో రాజ్యం భోగాస్సుఖాని చ।
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ॥

34. ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహాః।
మాతులా శ్వశురాః పౌత్రా స్స్యాలా స్సమ్బన్ధిన స్తథా॥

రాజ్య భోగ సౌఖ్యములు సర్వమ్ము గూడ
ఎవరికొఱకయి మనము కాంక్షించి నామొ
కలరు వారందఱును రణరంగమున నిచట;
తండ్రి వరుస వారలును, పితామహులును

మామలును, మేనమామలు, మనుమలాది
గురువరులు, వియ్యములవారు, కొడుకు, లెల్ల
బంధువర్గంబు, తమ ధన ప్రాణములను
ఆశలను త్యజియించి యుద్ధార్థు లగుచు.

తా॥ మనమెవరికోసము రాజ్యసుఖములు కోరుచుంటిమో, అట్టి తండ్రులు, తాతలు, మామలు, మేనమామలు, మనుమలు, కొడుకులు, గురువులు, వియ్యాలవారు, బావమరదులు, బంధువులు తమ ధనప్రాణములందు ఆశలను వదలి ఈ రణరంగమునందే ఉన్నారు.

35. ఏతాన్న హన్తు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన ! ।
అపి త్రైలోక్య రాజ్యస్య హేతోః కిం ను మహీకృతే ॥

నను నిచట వారు చంపినను గూడ
నేను వారిని చంపగా నేర నకట,
ఆ త్రిలోక రాజ్యాధి పత్యమునకైన;
స్వల్పమగు భూమికై యింక చంపు టేల ?

తా॥ కృష్ణా ! నన్ను వారు చంపినను సరే మూడులోకాల రాజ్యాధిపత్యమునకైనను వారిని నేను చంపదలచుకోలేదు. ఇంక ఈ భూమి కొఱకు నేను వారిని చంపెదనా ?

36. నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతిస్స్యా జ్జనార్దన ! ।
పాపమేవాశ్రయే దస్మాన్ హత్వైతానాతతాయినః ॥

ధార్తరాష్ట్రుల, బట్టి హత మ్మొనర్ప
యెట్టి సంతస మిక లభియింప గలదు ?
ఆతతాయులం వారిని హతమొనర్ప,
పాపమే కృష్ణ ! మనకు సంప్రాప్త మగును.

తా॥ దుర్యోధనాదులను చంపుటవలన మనకేమి సంతోషము కలుగును. వారు పట్టి దుండగులు, ఆతతాయులు, వారిని చంపుటవల్ల మనకు వచ్చునది పాపమే.

37. తస్మాన్నార్హా వయం హన్తుం ధార్తరాష్ట్రాన్ స్వబాంధవాన్
స్వజనం హి కథం హత్వా సుఖినస్స్యామ మాధవ ! ॥

ధార్తరాష్ట్రులు మనకు బాంధవులు గాన
హతమొనర్చుట వారి నర్హమ్ము గాదు;
స్వజనులను వీరి నెల్లర చంపి యింక
నెట్లు మాధవా ! మనము సుఖింపగలము.

తా॥ దుర్యోధనాదు లందఱు మనకు బంధువులు. వారిని చంపుట్ల తగదు. స్వజనులను చంపి మన మెట్లు సుఖపడగలము కృష్ణా !

38. యద్యప్యేతే న పశ్యన్తి లోభోపహత చేతసః।
కులక్షయ కృతం దోషం మిత్రద్రోహే చ పాతకం॥

క్షితి తలాన మిత్రద్రోహ కిల్బిషమున,
వంశనాశమ్ముచే, వచ్చు పాపములను
ధార్తరాష్ట్రులు లోభచేతస్కు లగుట
అరయ జాలని వారలే అయినఁగూడ —

తా॥ ఈ దుర్యోధనాదులు రాజ్యలోభులు, అందుచే మిత్రద్రోహము వంశనాశనము వలన వచ్చు పాపములను వారు తెలిసికొనఁగల్గిన వారు కాకపోయినను,

39. కథం న జ్ఞేయ మస్మాభిః పాపాదస్మాన్ని వర్తితుమ్।
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిర్జనార్దన ! ॥

వంశనాశనకార్యమ్ము వలన గలుగు
పాపమెఱిఁగి యుండియు నిట్టి పాపకృత్య
దోషములనుండి మనమైన తొలఁగి చనక,
కృష్ణ ! ఈ పాపముల నొనరింప నేల ?

తా॥ ఆ వంశనాశనము వంటి దోషముల నెఱిఁగిన మనమైనను ఆ దోషముల నుండి తొలగి పోగూడదా?

40. కులక్షయే ప్రణశ్యన్తి కులధర్మాస్సనాతనాః।
ధర్మే నష్టే కులం కృత్స్నమధర్మోఽభి భవత్యుత॥

వంశనాశన మైనచో వంశమం ద
నాదిసిద్ధమౌ ధర్మము లంతమగును;
అట్టి కులధర్మములు నాశమైన యపుడు,
వంశమందు నధర్మమె వ్యాప్తిగాంచు.

తా॥ వంశము నశించినచో ఆ వంశమందలి సనాతన ధర్మమంతయు నశించును; కులధర్మము నశించిన వంశము లో అధర్మమే ప్రబలును.

41. అధర్మాభిభవాత్కృష్ణ ప్రదుష్యన్తి కులస్త్రియః ।
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః ॥

42. సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్యచ ।
పతన్తి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః ॥

43. దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః ।
ఉత్సాద్యన్తే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః ॥

ఇక నధర్మము ప్రబలిన యెడల కృష్ణ !
చెడుదురను దుష్టలై కులస్త్రీలుకూడ,
స్త్రీలు దోషస్వభావలై చెడిర యేని
వర్ణసంకర మగును ప్రపంచమందు,

కులవిఘాతకులకు, సర్వకులమునకును
కలుగు నరకమ్మె వర్ణసంకరము వలన;
వారి పితరు లందఱికి ప్రాప్తమగు నింక
నధమగతులె పిండోదకవిధులు లేక.

వర్ణసంకర మొనరించువారి యొక్క
పాపదోషమ్ము చేత, శాశ్వతములైన
జాతిధర్మమ్ములును కులాచారవిధము
లన్నియును నాశమై యడుగంటి పోవు.

తా॥ వంశము నం దధర్మము వ్యాప్తిచెందినచో కులస్త్రీలు చెడిపోవుదురు. దానివలన వర్ణసంకరము తప్పదు.

వర్ణసంకరము వలన ఆ వర్ణసంకరము కలిగించిన వారికి, ఆ వంశమునకంతకూ నరకమే ప్రాప్తి. ఆ పైని వారి పితృదేవతలు పిండోదకములు లేక అధోగతి పాలగుదురు.

వర్ణసంకరము చేయువారి పాపము వలన, శాశ్వతముగా ఉండవలసిన జాతిధర్మములు కులాచారములు అన్నియు అడుగంటిపోవును.

44. ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన।
నరకే నియతం వాసో భవతీత్యను శుశ్రుమ ॥

ఓ జనార్దన! కులధర్మ మెర్వి యందు
నాశమందిన, మనుజసంతతుల కెల్ల
శాశ్వతమ్మగు నరకవాసమ్మె గతిగ
కలుగునంచును వింటిమి కాదెమనము.

తా॥ ఆ విధముగా కులధర్మములు నశించిన మనుజసంతతులకు అనంతమైన నరకవాసమే గతి యగునని చెప్పగా మనము విన్నాము కదా!

45. అహో! బత! మహత్పాపం కర్తుం వ్యవసితావయమ్।
యద్రాజ్య సుఖలోభేన హన్తుం స్వజనముద్యతాః ॥

అయ్యయో, ఎంత ఆశ్చర్యమైన దిద్ది!
కేవలము రాజ్యమునె కోరి కృష్ణ! మనము
బంధువర్గము నెల్ల చంపంగబూని
యెట్టి ఘోరపాప మొనర్పనెంచినాము!

తా॥ కృష్ణా! ఎంత ఆశ్చర్యమిది! కేవలము రాజ్యసుఖము కోసము గదా, బంధువర్గమును చంప సమకట్టి ఇట్టి ఘోరపాపమును చేయదలంచితిమి.

46. యది మామప్రతీకార మశస్త్రం శస్త్ర పాణయః।
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్ ॥

యుద్ధ మొనరింపకయె నిరాయుధుడ నైన
నన్ను శస్త్రముల్ దాల్చి రణమ్ము నందు
ధార్తరాష్ట్రులు చంపగాఁ దలఁచిరేని
చచ్చుటయె మేలు, వారిని చంపుకంటె.

తా॥ యుద్ధమును విరమించి, యెవరిని యెదిరించక, నిరాయుధుడనై ఉన్న నన్ను, దుర్యోధనాదులు ఆయుధములు దాల్చి చంపఁదలచినచో ఆ చావే మేలు కదా.

సంజయ ఉవాచ: సంజయుఁడు చెప్పెను.

47. ఏవముక్త్వార్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్ ।
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్న మానసః ॥

అట్లు వచియించి శోకవిహ్వల మనస్కు-
డర్జునుం డా రణావని యందె తనదు
హస్తమందున్న విల్లమ్ము లట్టె విడచి
చతికిలంబడి కూర్చుండె స్యందనమున.

తా॥ ఆ విధముగా చెప్పి అర్జునుఁడు అమితమైన దుఃఖముచే ఉద్విగ్నమైన మనస్సుతో చేతిలోనున్న గాండివమును బాణములను విసర్జించి ఆ యుద్ధభూమియందే రథముపై చతికిలబడి కూర్చుండిపోయెను.

ఇది ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు,
యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదమునగు
శ్రీభగవద్గీతయందు అర్జున విషాదయోగమను
ప్రథమాధ్యాయము
* సమాప్తము *

# గీతామృతము

## శ్రీమద్భగవద్గీత

## సాంఖ్యయోగము

### రెండవ అధ్యాయము : సారాంశము

ప్రధాన విషయము :—

సంఖ్యా సంబంధమైనది సాంఖ్యము. నాశవంతము పంచభూతాత్మకములగు దేహాదులు తదితర ప్రకృతి తత్త్వములను లెక్కించి, వానికతీతము, అవ్యయము, నిత్యమునగు ఆత్మ వస్తుజ్ఞానము నుపదేశించునది సాంఖ్యయోగము.

ఇందలి ముఖ్యాంశములు :—

దుఃఖితుడగు పార్థుని శ్రీకృష్ణుడు యుద్ధమునకు సముఖునిగా చేయుట—ఆత్మ వస్తు విచారణ—నిష్కామ కర్మము—స్థితప్రజ్ఞుని లక్షణములు.

### సారాంశము

అర్జునుడట్లు విషణ్ణుడై కన్నీరు కార్చుచు ఓ కృష్ణా! నేను ధర్మమేదియో అధర్మమేదియో యెఱుగని దీనస్థితిలో నున్నాను. నాకు మేలేదియో నిర్ణయించి నీవే చెప్పుము, అనగా శ్రీకృష్ణుడిట్లు నుడివెను,

'అర్జునా! నీ పద్ధతి నా కంగీకారము గాదు. ఈ సందిగ్ధసమయములో నీకీ పిరికితనమెట్లు వచ్చినది? ఇది బొత్తిగా నీచమైనది. పైగా పండితునివలె గూడ వాదించుచున్నావే! బలపరాక్రమవంతుడవు, రాచబిడ్డవు అయిన నీకిది తగదు. యుద్ధమును త్యజించినచో నీవసమర్థుడవని అనరాని మాట లందురు. నీకీ అపకీర్తి శాశ్వతమై నిలుచును. క్షత్రియునకు యుద్ధము

స్వధర్మము. అందు గెలిచినచో రాజ్యసంపద కలదు; మరణించినచో స్వర్గ సౌఖ్యము లభించును, కాన దుఃఖము విడిచి లెమ్ము.

బంధువులను చంపుచున్నందులకు గదా నీకీ విషాదము. పుట్టినవారికి చావు తప్పదు. తప్పించుకొనలేని వీని కొఱకై దుఃఖమెందులకు? ఇంతకును చంపువాడెవఁడు చచ్చువాడెవఁడు? ఇది వట్టిభ్రమ. మనకు కనబడుచున్న దేహములకే జననమరణము లున్నవి. దేహము నాశ్రయించుకొనియున్న ఆత్మకు లేవు. చినిగిపోయిన ప్రాతబట్టలను విసర్జించి మనుజుడు క్రొత్త బట్టలను ధరించుచున్నట్లే పతనమైన దేహమును విడచి వేఱొక దేహము నందు ఆత్మ చేరుచుండును. ఖడ్గము గాని, అగ్ని గాని, జలము గాని, వాయువు గాని ఆత్మనేమియు చేయఁజాలవు. ఆత్మ నిత్యుఁడు, అగోచరుఁడు, ఊహించుటకు కూడ శక్యము గాదు. అట్టి పరమాత్మయే ఈ జగత్తంతయు నిండియున్నాడు. అన్ని ప్రాణులయందున్న ఆత్మయు నొక్కటే. ఈ ఆత్మ ఒకరిని చంపునది, ఒకరిచే చంపఁబడునదియు కాదు. ఆత్మజ్ఞానము కలవారు బ్రతికియున్నవారి కొఱకు గాని, మరణించిన వారి కొఱకు గాని విలపింపరు. ఈ ఆత్మతత్త్వము యొక్క నిజము నెఱింగి యికనైనను నీ కర్తవ్యమైన యుద్ధమునకు నిశ్చింతగా లెమ్ము.

అర్జునా! యుద్ధము పాపకర్మమంటివి కదా. కర్మబంధములనుండి తప్పించుకొని మోక్షమునందగల యోగబుద్ధినిగూర్చి కూడ నీకు చెప్పెదను వినుము. వేదములందు కొంత భాగము స్వర్గాదిసౌఖ్యములే పరమలక్ష్యము లుగా బోధించుచు వానికనువైన యజ్ఞక్రియలను కూడ చెప్పును. వాని యందు మోక్షఫలము లేదు.

ముముక్షువు యొక్క లక్షణము లివి. ప్రాపంచిక విషయ సుఖము లందు చరించెడి ఇంద్రియములను మనస్సును నిగ్రహించవలెను. కోరికలువీడి కర్మము నాచరించుటయే మన పని. కర్మఫలము నాశింపరాదు. విష యేంద్రియ ప్రవర్తనము నిరోధించుటయేకాక మనస్సునందలి విషయవాసన లను కూడ నిర్మూలించవలెను. సత్త్వరజస్తమములగు త్రిగుణముల కతీతుఁ

డయి, కష్టసుఖములందు, మంచిచెడ్డలందు, సమబుద్ధి కలిగి యుండ వలయును. కర్మములందాసక్తి యున్నచో నది కోపమునకు, తుదకు బుద్ధి నాశమునకు దారితీయును. వీనిని వదలినవాడే నిష్కామ కర్మయోగి.

ఈ యోగసాధనకు, నిశ్చయమైన బుద్ధి అవసరము; లేనిచో మనస్సు పలువిధముల పోవును. ఇంద్రియములు బలమైనవి. పండితునైనను లొంగ దీసుకొనును. వాని నణచిపెట్టినపుడే బుద్ధి స్థిరమైయుండును. అట్టి స్థిర బుద్ధిచే అజ్ఞానమును నశింపజేసినపుడే మనోవికలత్వముపోయి విరక్తి లభించును. ఇదియే స్థితప్రజ్ఞ.

స్థితప్రజ్ఞుని లక్షణములను వినుము. మనసున కోరికలు లేకపోవుట, ఆత్మయందు సదా తృప్తుడై యుండుట. 'నేను,' 'నాది' అను భావములు లేక యుండుట, సుఖదుఃఖాది ద్వంద్వములందు రాగద్వేషములు లేక చరించుట. ఇంద్రియములను మనస్సును నిగ్రహించి కామవాసనలు నిర్మూలించుట, భగవంతునియందు లగ్నమైన చిత్తము కలిగి యుండుటయును.

అట్టి స్థితప్రజ్ఞుడు నాయందే మనస్సును లగ్నముచేసి మననశీలుడు కావలెను. దానివలన మనోనైర్మల్యము, పరమశాంతియు కలుగును. ఇదియే బ్రహ్మసంబంధమైన స్థితి. ఈ స్థితిని పొందిన మనుజుడు తిరిగి ప్రాపంచిక విషయ సంబంధమైన మోహమున పడడు. మరణసమయ మందిట్టి స్థితి యున్నవానికి బ్రహ్మానందమనబడు మోక్షము లభించును.

ఈ అధ్యాయమందలి ముఖ్య శ్లోకములు :

2, 7, 17, 18, 22, 27, 30, 31, 39,

41, 45, 47, 48, 54, 64, 68, 71, 72.

# శ్రీమద్భగవద్గీత

## రెండవ అధ్యాయము

## సాంఖ్య యోగము

**సంజయ ఉవాచ :-** సంజయుఁడు చెప్పెను.

1. తం తథా కృపయాఽఽవిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్ ।
విషీదన్త మిదం వాక్య మువాచ మధుసూదనః ॥

ఓన్నృపాల ! యీవిధముగా నల్లమందు
వ్యాకులుండయి, జాలితో వగచు చుండి,
కనుల వెంబడి కన్నీరు కార్చుచున్న
అర్జునునితోడ కేశవుం డనియె నిట్లు.

తా॥ రాజా, ఈ విధముగా విచారపడుచు, జాలితో కన్నీరు కార్చుచున్న అర్జునుని చూచి శ్రీకృష్ణుఁడిట్లనెను.

**శ్రీ భగవానువాచ :-** శ్రీ భగవానుఁడు చెప్పెను.

2. కుతస్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్ ।
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున ! ॥

అర్జునా ! ఈ విషమ సమయమున నీకు
ఎటు జనించె మలినమగు నిట్టి భ్రాంతి,
పరమమూఢత్వ మిది కీర్తికరము గాదు
రాదు సుమి దీనివలన స్వర్గమ్ము కూడ.

తా॥ అర్జునా ! యిట్టి సందిగ్ధసమయములో నీకీ మలినమైన భ్రాంతి యెట్లు కలిగినది. ఇది పూర్తిగా అజ్ఞానము. దీనివలన కీర్తియు రాదు, స్వర్గమును లభ్యము కాదు.

3. క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వ య్యుపపద్యతే ।
క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వో త్తిష్ఠ పరన్తప. ॥

శత్రు సంహర్త వో ధనంజయుఁడ ! నీకు
పౌరుషవిహీన మియ్యది వలదు వినుము,
ఈ తలపు తుచ్ఛ మనుచిత మ్మింక నైన
హృదయ దౌర్బల్యమును త్యజియించి లెమ్ము.

తా॥ అర్జునా ! శత్రువుల నందఱిని సంహరించగల శక్తిశాలివి నీవు. పిరికివాడవై పోకుము. ఈ నీచమైన పద్ధతి నీకు తగదు. గుండె దిటవుచేసికొని లెమ్ము.

**అర్జున ఉవాచ.** అర్జునుఁడు చెప్పెను.

**4.** కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన ।
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హావరిసూదన ॥

**5.** గురూ నహత్వాహి మహానుభావాన్ శ్రేయో భోక్తుం భైక్ష్యమపీహ లోకే ।
హత్వార్థకామాంస్తు గురూ నిహైవ భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్ ॥

పూజనీయులు ద్రోణభీష్ముల నెదిర్చి
బవరమందున వీరిని బాణహతుల
నెట్లు లొనరింప గల్గుదు ? కృష్ణ ! చెపుమ.

ఆ మహాత్ముల గురువుల హత మొనర్చు
కంటె భిక్షమెత్తుటయె లోకమున మేలు,
ఇట్టి గురువుల జంపి ఈ యిహము నందె
రక్తమయమగు నట్టి ఈ రాజ్యభోగ
మింక అర్థకామినయి భుజింపవలయు.

తా॥ కృష్ణా ! ద్రోణ భీష్ములు నాకు పరమపూజ్యులు. వీరి నెదిరించి బాణము లతో నెట్లు కొట్టగలను. ఆ మహానుభావులను గురువులను చంపుటకంటె బిచ్చమెత్తి కొనుట మేలు. వీరిని చంపినచో ఈ లోకమునందే కేవలము అర్థకామలోభినై ఈ నెత్తుటికూడును తినవలెను.

6. న చైతద్విద్మః కతరన్నో గరీయో । యద్వా జయేమ యదివానో జయేయుః ।
యానేవ హత్వా న జిజీవిషామ, స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః ॥

సమర మందు వారికగునొ జయము, మనకొ,
యేది శ్రేయమ్మొ వీనిలో నెఱుఁగ కుంటి,
ఎవ్వరిని చంపి జీవింప నిచ్ఛ లేదొ
వారె ధార్తరాష్ట్రు లున్నార లెదుట.

తా॥ యుద్ధములో జయాపజయములెవరికి కలుగునో చెప్పలేము కదా. యుద్ధము చేయుటా మానుటా, ఏది శ్రేష్ఠమైనదో అదియు నాకు తెలియుటలేదు. ఎవరిని చంపదగదని తలంచితినో వారే నాకు యుద్ధమున యెదురై ఉన్నారు.

7. కార్పణ్య దోషోపహతస్వభావః పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః ।
యచ్ఛ్రేయ స్స్యా న్నిశ్చితం బ్రూహి తన్మే శిష్యస్తేఽహం శాధిమాం త్వాం ప్రపన్నమ్ ॥

చిత్త మజ్ఞాన వశమున చెడియె, కృష్ణ !
ధర్మమెఱుఁగని మూఢచేతనుఁడ గాన
అడుగుచున్నాను ; నీకు శిష్యుఁడను నిన్నె
శరణుబొందితి నీవె నిశ్చయము జేసి
శ్రేయమును జెప్పి నన్ను శాసింపు మింక.

తా॥ తెలియనితనముచేత నా స్వభావము పాడైనది. ఏది ధర్మమో, ఏది అధర్మమో యెఱుగజాలని స్థితిలో నుంటిని. నీవే నాకింక శరణు. కృష్ణా ! నీకు శిష్యుఁడనైతిని. నాకు మేలు కలిగించునదేదియో, నీవే నిర్ణయించి నన్నా ప్రకారముగ ఆజ్ఞాపించుము.

8. న హి ప్రపశ్యామి మమాపనుద్యా । ద్యచ్ఛోషణ మిన్ద్రియాణామ్ ।
అవాప్య భూమా వసపత్న మృద్ధం రాజ్యం సురాణా మపి చాధిపత్యమ్ ॥

మహిని శత్రువులేని సామ్రాజ్యరమను,
దేవతాధిపత్యమును పొందినను గూడ,
యెఱుఁగఁజాలను; కృష్ణ! నే నిపుడు నాదు
ఇంద్రియమ్ముల నెల్ల శోషింపఁజేయు
నట్టి శోకాగ్ని నెట్లు చల్లార్ప వలెనొ.

తా॥ నిష్కంటకము, సమృద్ధము అయిన సామ్రాజ్యము గాని, చివరకు స్వర్గాధిపత్యము లభించినను, ఇప్పుడు నా యింద్రియముల దహింపఁజేయుచున్న ఈ దుఃఖమును చల్లార్చు నుపాయము నెఱుగకుంటిని.

సంజయ ఉవాచ :- సంజయుఁడు చెప్పెను.

9. ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరన్తపః।
న యోత్స్య ఇతి గోవిందముక్త్వా తూష్ణీం బభూవ హ ॥

శత్రువుల తపింపగ జేయు శక్తిశాలి
పార్థు డిట్లు కృష్ణునితోడ పలికి, పిదప
'ఓయి గోవింద! యుద్ధమ్ముచేయఁజాల'
ననుచు వచియించి మిన్నకుండెను తనంత.

తా॥ ఈ విధముగ నుడివిన అర్జునుఁడు కృష్ణుని చూచి "ఓ గోవిందా నేను యుద్ధము చేయలేను" అని పలికి తూష్ణీభావముగా ఊరకుండెను.

10. తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత!।
సేనయోరుభయోర్మధ్యే విషీదన్తమిదం వచః ॥

ఓ మహారాజ! పార్థు డిట్లుభయసైన్య
మధ్యమందుండి వ్యాకులం పడుచు కొంచి,
మందహాస మొనర్చెడి చంద మలర
కృష్ణుఁ డీవిధమ్ముగ వచియించె నపుడు.

6. న చైతద్విద్మః కతరన్నో గరీయో। యద్వా జయేమ యదివానో జయేయుః।
యానేవ హత్వా న జిజీవిషామ, స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః ॥

సమర మందు వారికగునో జయము, మనకొ,
యేది శ్రేయమ్మొ వీనిలో నెఱుఁగ కుంటి,
ఎవ్వరిని చంపి జీవింప నిచ్చ లేదొ
వారె ఆధార్తరాష్ట్రు లున్నార లెదుట.

తా॥ యుద్ధములో జయాపజయములెవరికి కలుగునో చెప్పలేము కదా. యుద్ధము చేయుటా మానుటా, ఏది మేలైనదో అదియు నాకు తెలియుటలేదు. ఎవరిని చంపదగదని తలఁచితినో వారే నాకు యుద్ధమున యెదురై ఉన్నారు.

7. కార్పణ్య దోషోపహతస్వభావః పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః।
యచ్ఛ్రేయ స్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే శిష్య స్తేఽహం శాధిమాం త్వాం ప్రపన్నమ్ ॥

చిత్త మజ్ఞాన వశమున చెడియె, కృష్ణ!
ధర్మమెఱుఁగని మూఢచేతనుఁడ గాన
అడుగుచున్నాను; నీకు శిష్యుఁడను నిన్నె
శరణుబొందితి నీవె నిశ్చయము జేసి
శ్రేయమును జెప్పి నన్ను శాసింపు మిఁక.

తా॥ తెలియనితనముచేత నా స్వభావము పాడైనది. ఏది ధర్మమో, ఏది అధర్మమో యెఱుగజాలని స్థితిలో నుంటిని. నీవే నాకింక శరణు. కృష్ణా! నీకు శిష్యుఁడనైతిని. నాకు మేలు కలిగించునదేదియో, నీవే నిర్ణయించి నన్నా ప్రకారముగ ఆజ్ఞాపించుము.

8. న హి ప్రపశ్యామి మమాపనుద్యా। ద్యచ్ఛోషణ మిన్ద్రియాణామ్।
అవాప్య భూమా వసపత్న మృద్ధం రాజ్యం సురాణా మపి చాధిపత్యం ॥

మహిని శత్రువులేని సామ్రాజ్యరమను,
దేవతాధిపత్యమును పొందినను గూడ,
యెఱుఁగఁజాలను; కృష్ణ! నే నిపుడు నాదు
ఇంద్రియమ్ముల నెల్ల శోషింపఁజేయు
నట్టి శోకాగ్ని నెట్లు చల్లార్ప వలెనొ.

తా॥ నిష్కంటకము, సమృద్ధము అయిన సామ్రాజ్యము గాని, చివరకు స్వర్గాధిపత్యము లభించినను, ఇప్పుడు నా యింద్రియముల దహింపఁజేయుచున్న ఈ దుఃఖమును చల్లార్చు నుపాయము నెఱుగకుంటిని.

**సంజయ ఉవాచ :-** సంజయుఁడు చెప్పెను.

9. ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరన్తపః।
న యోత్స్య ఇతి గోవిందముక్త్వా తూష్ణీం బభూవ హ॥

శత్రువుల తపింపగ జేయు శక్తిశాలి
పార్థు! డిట్లు కృష్ణునితోడ పలికి, పిదప
'ఓయి గోవింద! యుద్ధమ్ముచేయఁజాల'
ననుచు వచియించి మిన్నకుండెను తనంత.

తా॥ ఈ విధముగ నుడివిన అర్జునుఁడు కృష్ణుని చూచి "ఓ గోవిందా నేను యుద్ధము చేయలేను" అని పలికి తూష్ణీభావముగా ఊరకుండెను.

10. తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత!।
సేనయోరుభయోర్మధ్యే విషీదన్తమిదం వచః॥

ఓ మహారాజ! పార్థు డిట్లుభయసైన్య
మధ్యమందుండి వ్యాకులం పడుట కాంచి,
మందహాస మొనర్చెడి చంద మలర
కృష్ణుఁ డీవిధమ్ముగ వచియించె నపుడు.

తా॥ రెండు సేనల మధ్యమున అట్లు దుఃఖపడుచున్న అర్జునుని చూచి, నవ్వు ముఖము పెట్టినవానివలె కృష్ణుఁడిట్లు చెప్పుచున్నాడు.

శ్రీ భగవానువాచ :- శ్రీ భగవానుఁడు చెప్పెను.

11. అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ।
గతాసూన గతాసూంశ్చ నానుశోచ న్తి పండితాః ॥

పలుకుచుంటి వర్జున ! మహాప్రాజ్ఞునివలె
దుఃఖపడరాని వారికై దుఃఖమేల ?
బ్రతికియున్న వారికి మఱి మృతులకొఱకు
నైన యేడ్వ రాత్మజ్ఞాను లైన వారు.

తా॥ ఓ అర్జునా ! ఎవరికోసము దుఃఖించరాదో వారి కొఱకు నీవు దుఃఖపడ చున్నావు. పైగా పెద్దపండితునివలె గూడ మాట్లాడుచుంటివే. బ్రతికి ఉన్నవా కొఱకు గాని, మరణించిన వారికొఱకు గాని జ్ఞానులైన వారేడ్వరు సుమా.

12. న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః ।
న చైవ న భవిష్యామస్సర్వే వయమతః పరమ్ ॥

ఈ నృపాలురు నీవును నేను గాని
ఒక్కనాడును లేకుండ నుండలేదు;
వెనుకఁ నుస్నట్లు, ఇపుడున్న విధముగానె
ఉండు మందఱమును భావి యందు గూడ.

తా॥ ఇక్కడున్న రాజులందరు, నీవును, నేను గాని ఎప్పుడునూ లేనివారము కాము. ఇకముందు కూడ నుందుము. మనయందున్న ఆత్మలు శాశ్వతమైనవి.

13. దేహి నోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా ।
తథా దేహా న్తర ప్రాప్తి ర్ధీర స్తత్ర నముహ్యతి ॥

దేహధారికి నెటుల ఈదేహ మందు
బాల్య యౌవనమ్ములు జరావస్థ లగునొ,
అట్లె దేహాంతరప్రాప్తి యగును గూడ;
అందులకు జ్ఞాని మోహము నందబోడు.

తా॥ జీవునికి దేహమునందు బాల్యము యౌవనము ముసలితనము ఒకదాని తరువాత నొకటి వచ్చునట్లే, మరణానంతరము ఒక దేహము తరువాత మఱియొకటి ప్రాప్తమగును. ఇందులకు జ్ఞానము కలవారు దుఃఖించరు.

14. మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణ సుఖదుఃఖదాః।
ఆగమాపాయినోఽనిత్యాస్తాం స్తితిక్షస్వ భారత ॥

స్పర్శ శబ్దము మొదలగు వాని వలన
ఇంద్రియమ్ముల యందు జనించుచుండు
కష్టసుఖములు శీతోష్ణ కారణములు
వచ్చుచును పోవు నివ్వి శాశ్వతము కావు;
కాన, ఓర్చియుండుము పార్థ! వీని నెల్ల.

తా॥ అర్జునా వినుము. శబ్ద స్పర్శాదివిషయముల వలన దేహేంద్రియములకు శీతము ఉష్ణము కష్టము సుఖము ఇత్యాదులు కలుగుచుండును. ఇవి వచ్చుచు పోవునవియే కాని శాశ్వతములు కావు. వీనిని నీవు ఓర్చుకొనవలయును.

15. యం హి నవ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ।
సమదుఃఖ సుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే॥

కష్టసుఖముల సమదష్టి గాంచ గలుగు
ధీరుడగు వాని నవియు బాధింపబోవు;
పురుషపుంగవ! ఆ ధీరపురుషుడె సుమి
అర్హుడై యుండు మోక్షమ్ము నందుటకును.

తా॥ కష్టసుఖములను నిశ్చలుండై సమముగా చూడగలిగినట్టి ధీరచిత్తుని అవి బాధించలేవు. అర్జునా అట్టి పురుషుడే మోక్షపదవికి అర్హుడు.

16. నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః।
ఉభయోరపి దృష్టోఽన్తస్త్వనయోస్తత్త్వదర్శిభిః॥

లేనివానికి ఉనికియే లేదు భువిని,
ఉన్నవస్తువునకు లేమి ఉండబోదు;
ఇట్టి సత్ అసత్తుల మధ్య నెసగు నిశ్చ
య, మరయుదురు తత్వజ్ఞాను లైన వారె.

తా॥ నశింపకుండ ఉండే వస్తువు (ఆత్మ) సత్తు. ఇది నిత్యము. దీనికి లేకపోవుట అనునది లేదు. నశించిపోవునది (దేహము). అసత్తు. ఇది అనిత్యము. దీనికి ఉనికి అనునది లేదు. ఈ రెంటికి మధ్యగల భేదము నెఱిగినవారే తత్వజ్ఞానులు.

17. అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్।
వినాశమవ్యయస్యాస్య న కశ్చిత్కర్తుమర్హతి॥

ఎట్టి పరమాత్మచే విశ్వ మిది సకలము
వ్యాప్తమయ్యెనొ ఆయాత్మ నరయు మీవు;
అవ్యయమును నాశరహిత మైన దిద్ది,
దీని నెవరును నాశమొం దింపలేరు.

తా॥ ఏ పరమాత్మచే ఈ విశ్వమంతయు నిండియున్నదో ఆ ఆత్మ నాశము లేనిది. దాని కెవరును వినాశము ఘటింపలేరు.

18. అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తాః శరీరిణః।
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత॥

దేహి ఇదమిద్ధ మనుచును తెలియరాని
నిత్యుడై అవినాశియై నెగడుచుండు;
ఈ శరీరమ్ము లివి మాత్రమే నశించు,
కాన యుద్ధసక్తుండవు కమ్ము పార్థ.

తా॥ అర్జునా దేహి నిత్యుఁడు. అట్టి ఆత్మను అవ్యయునిగను, నాశములేని వానిగను, ప్రత్యక్షముగా తెలియఁబడనివానిగను చెప్పిరి. దేహములే నాశవంతములు. కాబట్టి ఈ దేహముల కొఱకు చింతలను వదలి యుద్ధము చేయుము.

19. య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్।
ఉభౌ తౌ న విజానీతో నాయం హన్తి న హన్యతే॥

ఆత్మ యొకరిని చంపునం చరయువాడు
ఆత్మ యొకనిచే చచ్చునం చరయువాడు
ఇరువురును తెలియనివారె; ఇట్టి యాత్మ
చంపువాడును కాబోడు - చంపఁబడడు.

తా॥ ఆత్మ ఒకరిని చంపునని గాని, ఒకరిచే చంపఁబడెడువాడని గాని భావించు ఇరుతెగలవారును అజ్ఞానులే. ఆత్మ చావదు, చంపఁబడదు.

20. న జాయతే మ్రియతే వా కదాచి న్నాయం భూత్వా భవితా వా న భూయః।
అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే॥

ఆత్మ జనన మరణముల నందబోడు,
ఉండి యొకపుడు, మఱలలేకుండ పోడు,
నిత్యుఁడై సనాతనుఁడయి నెగడు; తనువు
చంపబడి నప్పటికిని ఆత్మ చంపఁబడడు,

తా॥ ఆత్మకు జననమరణములనునవి లేవు. ఒకప్పుడుండి మరల లేకుండపోవు వాడును కాదు. ఆత్మ శాశ్వతమయినవాడు. తానాశ్రయించుచున్న ఈ దేహములు చంపబడుచున్నప్పటికిని ఆత్మ చంపబడడు.

21. వేదావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్।
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హన్తికం॥

ఆత్మ నవినాశిగా, మఱి అవ్యయునిగ,
జనన మెఱుఁగని వానిగా, శాశ్వతునిగ,
నెఱిఁగి యున్నట్టి మానవుఁ డెవ్వడైన
యెవని చంపును? ఎట్లు చంపించునెవని?

తా॥ అర్జునా, జననమరణములు లేనివానినిగా, నిత్యునిగ నాశరహితునిగ ఆత్మ నెఱిఁగిన వాఁడెవఁడును ఒకరినెట్లు చంపగలుగును? ఎట్లు చంపించగలుగును? ఇవి సాధ్యము గాని పనులు.

22. వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి।
తథా శరీరాణి విహాయ జీర్ణా, న్యన్యాని సంయాతి నవాని దేహీ॥

చినిగినట్టి బట్టల విసర్జించి మనుజుఁ
డితర నూత్నవస్త్రముల ధరించు రీతి,
ఆత్మయును శిథిలమగు దేహముల విడచి
చేరుచుండును క్రొత్త శరీరములను.

తా॥ మానవులు చినిగిపోయిన ప్రాతబట్టలను విడచి క్రొత్తబట్టలను కట్టుకొను చున్నట్లుగానే ఆత్మయును ఒక దేహము పతనముకాఁగానే దానిని విడచి మఱియొక దేహమును చేరుచుండును.

23. నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః।
న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః॥

ఆయుధములు ఛేదింపలే వాత్మ నెపుడు
ఆత్మను దహింపజాల దా యగ్ని యైన
జలము లైనను తడుపంగ జాల వింక
వాయువైనను శుష్కింపఁ జేయలేదు.

తా॥ ఈ ఆత్మ పదార్థమును ఆయుధములు నరకలేవు, అగ్ని కాల్చలేదు, నీరు తడపలేదు, వాయువు ఎండింపలేదు.

24. అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచ।
నిత్య స్సర్వగత స్థాణు రచలోఽయం సనాతనః ॥

నరుకబడడాత్మ, స్థిరుడయి పరగుచుండు
తడువ డెండింపఁబడదు దగ్ధమ్ముకాదు.
అతిసనాతను డగుచు దానలరు చుండు;
నిత్య మచలుఁడై అంతట నిండియుండు.

తా॥ ఈ ఆత్మ నరుక బడదు, దగ్ధమొనరింపఁబడదు, ఎండింపఁబడదు తడుపఁ బడదు. అన్నిచోటులను సుస్థిరముగా వ్యాపించియున్న సనాతనుఁడు. శాశ్వతముగా ఉండువాడు.

25. అవ్యక్తోఽయ మచిన్త్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే।
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి ॥

నిర్వికారుఁ డీ యాత్మ, వర్ణింపరాని
వా, డగోచరుం డగుచు భావనకు గూడ
నందడని వచియింతు రీ ఆత్మ నెఱిఁగి
యింకనైనను పార్థ! దుఃఖింప బోకు.

తా॥ ఆత్మ అగోచరుఁడు. ఇట్టివాడని ఊహించుటకు కూడ సాధ్యముకాదు. నిర్వికారుఁడని గూడ చెప్పబడిన ఈ ఆత్మను తెలిసికొని ఇంకనైనను పార్థా! నీవు దుఃఖింప తగదు.

26. అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్।
తథాపి త్వం మహాబాహో నైవం శోచితు మర్హసి ॥

అర్జునా! ఒకవేళ ఈ యాత్మ గూడ
నెల్లపుడు పుట్టుచును మరణించు ననుచు
భావమం దెంచితేనియు, బాహుబలుఁడ
వైన నీవిట్లు వగవ నర్హమ్ముగాదు.

తా॥ ఒకవేళ ఈ ఆత్మకూడ దేహముతోఁ బాటు జనన మరణములు పొందు చుండునని నీవు అనుకొనుచున్నావేమో అట్టి స్థితిలోకూడ, మహాభుజబలుఁడవైన అర్జునా నీవు శోకింపఁదగదు.

27. జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ।
తస్మా దపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి ॥

జనన మందిన వానికి చావు ధ్రువము,
చచ్చినట్టి వాడును పునర్జన్మమందు,
కాన అనివార్య మైనట్టి వీనికొఱకు
నెంతమాత్రము నీవు దుఃఖింపరాదు.

తా॥ పుట్టినవానికి మరణము, మరణించిన వానికి తిరిగి పుట్టుకయు తప్పవు. తప్పించుకోలేని వీటిగూర్చి నీకీ దుఃఖమెందులకు ?

28. అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత।
అవ్యక్త నిధనాన్యేవ తత్ర కా పరిదేవనా ॥

పుట్టుకకు పూర్వము, మరణమ్మునకు పిదప
ప్రాణు లెటులుండు నదియు కన్పడదు మనకు;
కానబడునివ్వి ఈ మధ్యకాల మందె,
అట్టియెడ యేల నిట్టి దుర్వ్యథలు పార్థ।

తా॥ పుట్టుకకు పూర్వముగాని మరణించిన తర్వాతగాని ప్రాణికోటులు కన్పడవు. జనన మరణములకు ఈ మధ్యనున్న కాలములోనే యివి కంటికగపడును. అట్టి వాని విషయమై యిట్లు దుఃఖించుట యెందులకు.

29 ఆశ్చర్య వ త్పశ్యతి కశ్చిదేన మాశ్చర్యవ ద్వదతి తథై వ చాన్యః।
ఆశ్చర్యవచ్చైన మన్య శ్శృణోతి శ్రుత్వా ప్యేనం వేద న చై వ
కశ్చిత్ ॥

అబ్బురముతో విలోకించు నాత్మ నొకఁడు,
మఱియొకం డట్లె పలుకు నాత్మను గురించి,
వేఱొకఁడు విను నదియొక వింతయనుచు,
కాని, నిజము నెఱుంగ రొక్కరును గూడ.

తా॥ ఈ ఆత్మ నొకఁడు ఆశ్చర్యకరమైన దానినిగా చూచును. అలాగునే మఱియొకఁడు ఆశ్చర్యకరమైనదనుచు మాటలాడును. వేఱొకఁడు ఆశ్చర్యముగా వినును. ఆత్మయొక్క నిజస్థితిని వీరెవ్వరును తెలిసికొనుటలేదు.

30. దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత ।
తస్మా త్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి ॥

అన్ని ప్రాణుల దేహము లందు నున్న
ఆత్మ నిత్య మవధ్యుఁడై యలరు; కాన,
ఇట్టి ప్రాణుల కొఱకు దుఃఖింపఁ దగదు.

తా॥ అర్జునా, అన్ని ప్రాణుల దేహములలో ఎచటనున్నను ఆత్మ చంపఁబడదు. కాబట్టి, ఈ ప్రాణుల గూర్చి నీవు దుఃఖింపతగదు.

31. స్వధర్మ మపి చావేక్ష్య న వికమ్పితు మర్హసి ।
ధర్మ్యాద్ధి యుద్ధా చ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే ॥

సహజము స్వకీయ మగు నీదు క్షాత్రధర్మ
మెఱిఁగి నప్పటి కైన కంపింపఁ దగదు;
క్షత్రియున కెందయిన వేఱొ కండు కలదె,
ధర్మయుద్ధముకంటె నుత్తమము పార్థ ।

తా॥ అర్జునా! నీ స్వధర్మమైన క్షాత్రధర్మమును తెలిసికొని అయినా నీవు చలించకూడదు. సుక్షత్రియునకు ధర్మయుద్ధమునకంటె శ్రేష్ఠమైన పని వేఱొకటి లేదు కదా.

32 యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వార మపావృతమ్।
సుఖినః క్షత్రియాః పార్థ! లభన్తే యుద్ధ మీదృశమ్ ॥

ద్వారములు తెఱవఁబడిన స్వర్గమువలె
యత్నమేమియు లేక లభ్యమగు చున్న
ఇట్టి యుద్ధకార్యమ్ము ప్రాప్తించినట్టి
క్షత్రియులె సౌఖ్యవంతు లీ జగతి పార్థ!

తా॥ అర్జునా! నీకీ యుద్ధము ద్వారములు తెఱచుకొనియున్న స్వర్గము విధముగా, ఏ విధమైన యత్నము లేకుండ లభ్యమగుచున్నది. ఇట్టి ధర్మయుద్ధమును చేయుట కవకాశమును పొందగలిగిన క్షత్రియులే గద సౌఖ్యవంతులు.

33 అథ చేత్త్వ మిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి।
తత స్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాపమవాప్స్యసి ॥

అతుల ధర్మసమన్విత మైన యిట్టి
యుద్ధమును చేయకయె ఊరకుంటి వేని,
వంశధర్మము కీర్తిని వదలిపెట్టి
పాపమునె పొందెదవు నీవు పార్థ! వినుము.

తా॥ అర్జునా! ధర్మయుతమైన ఇట్టి యుద్ధ మొనరించుటకు నీ కవకాశము లభించినది. దీనిని చేయక నీవు మఱలిపోయితి వేని నీకులధర్మమును కీర్తిని వదలుకొనిన వాడవేకాక, పాపమును కూడ ఒడిగట్టుకొనెదవు.

34. అకీర్తిం చాపి భూతాని కథయిష్యన్తి తేఽవ్యయామ్।
సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే ॥

ఇట్టి నీ దుర్యశమె వచియింత్రు మనుజు
లర్జునా! శాశ్వతమ్ముగ నవనిపైన;
మానవంతుల కీ యవమాన మధిక
దుర్భరమ్మగు గాదె మృత్యువున కంటె.

తా॥ చిరస్థాయిగా నీయొక్క ఈ అపకీర్తినే ప్రజలు చెప్పుకొందురు. ఆత్మాభిమానము కలవారికి ఇట్టి అవమానము చావుకంటె యెక్కువైనది గదా.

35. భయాద్రణా దుపరతం మంస్యన్తే త్వాం మహారథాః ।
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్ ॥

ఈవరకు గూడ నిను గారవించు చున్న
రణవిశారదు లగు మహారథులు గూడ
సమర భయమున పార్థుడు జంకె ననుచు,
చుల్కనగ నిన్ను భావించు చుందు రింక.

తా॥ ఇప్పటి వఱకు నిన్నొక మహావీరునిగా గౌరవించుచున్న యుద్ధవిశారదులు కూడ నిన్నింక చుల్కనచేసి యుద్ధమునకు భయపడి పారిపోయిన పిరికివాడని హేళన చేయుదురు.

36. అవాచ్యవాదాంశ్చ బహూన్ వదిష్యన్తి తవాహితాః ।
నిన్దన్తస్తవ సామర్థ్యం తతో దుఃఖతరమ్ ను కిమ్ ॥

నీదు సామర్థ్యమును పార్థ! నిందజేసి,
నీదు శత్రువు లింక ననేకములుగ
పలుకుచుందురు సుమ్ము దుర్భాషణముల
నింతకంటె దుఃఖతర మింకేమి యుండు?

తా॥ ఇంకను వినుము. నీవు పూర్తిగా అసమర్థుడవని నిందించుచూ అనేకములైన అనరానిమాటలను నీ శత్రువులు నిన్ను గూర్చి అనెదరు. దీనికంటె అధికమైన దుఃఖము వేఱొకటుండునా.

37. హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్ ।
తస్మాదుత్తిష్ఠ కౌన్తేయ యుద్ధాయ కృతనిశ్చయః ॥

సమరమున గెల్వ రాజ్యభోగములు గలవు,
చచ్చినన్నైన లభియించు స్వర్గపదము:
కాన, లేలెమ్ము సంగ్రామ కార్యమునకు
నిశ్చయాత్ముఁడ వగుచు కౌంతేయ నీవు.

తా॥ యుద్ధములో శత్రువులను గెలిచిన రాజ్యభోగములు అనుభవించగలవు. మరణించినచో స్వర్గసుఖములు పొందెదవు. కాబట్టి అర్జునా యుద్ధము చేయవలెనను నిర్ణయముతో ఇక లెమ్ము.

38. సుఖదుఃఖే సమేకృత్వా లాభాలాభౌ జయా జయౌ।
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి॥

కష్టసుఖము లందును, లాభనష్టములను,
సమరమున గల్గు జయ పరాజయములందు,
సమమనస్కుఁడ వయి లెమ్ము సమరమునకు;
పాప మంటదు దర్జున, దీని వలన నీకు.

తా॥ అర్జునా, కష్టసుఖములు, లాభనష్టములు పోరిలో గెల్పోటములు సమముగా భావించి యుద్ధమునకు నడుముకట్టి లెమ్ము. దీనివలన నీకేవిధమైన పాపమూ అంటదు.

39. ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు।
బుద్ధ్యా యుక్తో యయా పార్థ! కర్మబన్ధం ప్రహాస్యసి॥

అర్జునా! సాంఖ్యతత్త్వమౌ ఆత్మబుద్ధి
చెప్పితిని నీకు - యే జ్ఞానసిద్ధి వలన
కర్మబంధముల్ విడనాడ గలవొ అట్టి
యోగబుద్ధి నిక వచించుచుంటి వినుము.

తా॥ అర్జునా! యింతవఱకు నీకు చెప్పినదంతయు సాంఖ్య సంబంధమైన ఆత్మతత్త్వము. ఏ జ్ఞానము వలన నీవు కర్మబంధమునుండి విడివడి మోక్షమును పొందగలవో ఆ యోగబుద్ధిని ఇకమీద చెప్పబోవుచున్నాను. వినుము.

40. నేహాభిక్రమ నాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే।
స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్॥

మొదలిడిన వెన్క నిష్ఫలం బిదియు కాదు,
ఇందు వ్యతిరేక మగు దోష మేమి లేదు,
ఇట్టి ధర్మాచరణ స్వల్ప మేని గూడ
ప్రజల రక్షించు సంసారభయమ్ము నుండి.

తా॥ ఈ చెప్పబోయెడి కర్మయోగసాధన మొదలిడిన తర్వాత నిష్ఫలము కాదు. దీనిలో విరుద్ధమైన దోషము ఏమియు లేదు. ఈ యోగమును ఏ కొంచెము చేయగలిగినను చాలు. అదియే ప్రజలను సంసారభయమునుండి రక్షించును.

41. వ్యవసాయాత్మికా బుద్ధిరేకేహ కురునన్దన।
బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్॥

అట్టి యోగమందున, నిశ్చయాత్మక మగు
బుద్ధి యొకటియె సుస్థిరమ్ముగ నెసంగు;
నిశ్చయము లేని బుద్ధులు నిరత మవని
పరుగు లెత్తుచు నుండును పలువిధముల

తా॥ కర్మయోగమునకు కావలసినది నిశ్చితమైన బుద్ధి ఒకటియే. నిశ్చయములేని బుద్ధులు స్థిరములేక, నిరంతరము పలుమార్గములు బట్టి పోవుచుండును.

42. యా మిమాం పుష్పితాం వాచం ప్రవద న్త్యవిపశ్చితః।
వేదవాదరతాః పార్థ! నాన్యద స్తీతి వాదినః॥

43. కామాత్మనః స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్॥
క్రియావిశేషబహులాం భోగైశ్వర్యగతిం ప్రతి॥

వేదవచనమ్ము లందె సంప్రీతి గలుగు
వారు వేదముల్ తెలిపెడి ఫలముకంటె
వేఱొకటి లేదనుచు అవివేకు లగుచు
పలుకుదురు బాహ్యసుందర వాక్యములను.

కామవాసను లగుచు, స్వర్గమ్మె లక్ష్య
మని తలంచుచు, బహుళకర్మముల వలన
జన్మకర్మఫలమ్ము లైశ్వర్యప్రాప్తి
కలుగునంచును వారలు పలుకుచుంద్రు.

తా॥ వేదవచనములందు ప్రీతిగలవారు వేదములు తెలిపెడి స్వర్గసుఖముకంటె అధికమైనది వేఱొకటిలేదని పైకిమాత్రము ఇంపైన మాటలను చెప్పుచుందురు. కాని, వానివలన మోక్షఫల మేమాత్రమును లేదు,

కామచిత్తులై వారు స్వర్గమునె లక్ష్యముగా నెంతురు. బహుళ కర్మములు సల్పుచుండుటచేతనే అట్టి జన్మ కర్మఫలములు భోగైశ్వర్యములు లభించుననియు వారు పలుకుచుందురు.

44. భోగైశ్వర్య ప్రసక్తానాం తయాఽపహృత చేతసామ్।
వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ న విధీయతే॥

అట్టివారలు పల్కు వాక్యమ్ములకును
మనసు వశమయి, భోగసంపదల యందు
సక్తులగువారి బుద్ధి నిశ్చయములేక
నిలువగా జాలదు సమాధినిష్ఠ యందు.

తా॥ పై జెప్పినట్టి వారి మోక్షఫలశూన్యములగు వాక్యములకు మనసు లొంగి పోయిన వారు భోగైశ్వర్యములందే ఆసక్తి కలిగియుందురు. వారి బుద్ధియు స్థిరత్వము లేక సమాధినిష్ఠలో నిలువజాలదు.

45. త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున।
నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥

వేదములు త్రిగుణాత్మకవిషయములనె
తెలుపుచుండును, వదలుమా త్రిగుణములను;
ద్వంద్వరహితుడ వగుచు సత్త్వమునమెలగి
తలపబోక యోగక్షేమములను గూడ
ఆత్మనెఱిగిన విజ్ఞాని వగుము పార్థ!

తా॥ అర్జునా! వేదములు సత్త్వరజస్తమో త్రిగుణాత్మకములగు సంసార విషయకర్మకాండలను తెలుపునవిగా ఉన్నవి. కాబట్టి, నీవా త్రిగుణములను వదలి, సుఖదుఃఖాది ద్వంద్వములు లేనివాడవయి, యోగక్షేమములందును దృష్టిలేక శుద్ధ సత్త్వము నాశ్రయించి ఆత్మజ్ఞానివి కమ్ము.

46. యావా నర్థ ఉదపానే సర్వత స్సంప్లుతోదకే।
తావా స్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥

బావియం దెంత ఉపయోగఫలము కలదొ
అంతటను నీరుగల ప్రవాహమ్ము నందు
ఇమిడియున్న దా ఫలితమ్ము – ఇట్లె సకల
వేదకర్మము లందు చెప్పిన ఫలమ్ము
ఆత్మనెఱిఁగిన బ్రాహ్మణు నందుఁ గలదు.

తా॥ స్నానపానాదులకు ఒక బావి యందెంత ప్రయోజనమున్నదో ఆ ప్రయోజన మంతయు పెద్ద జలప్రవాహమునందును కలదు. అట్లే వేదకర్మములందు చెప్పబడిన ఫలము పరమార్థము నెఱిఁగిన బ్రహ్మజ్ఞాని యందును కలదు.

47. కర్మణ్యే వాధికార స్తే మా ఫలేషు కదాచన।
మా కర్మఫలహేతుర్భూర్మాతే సఙ్గోఽ స్త్వ కర్మణి॥

కలదు నీకధికారము కర్మముల, నొ
నర్చువఱకె; కర్మఫలమునందులేదు
కావలదు గూడ సత్ఫల కారణమ్ము,
మానగూడ దెప్పుడును కర్మమునొనర్చ.

తా॥ కర్మముల నాచరించుట వఱకే నీకు అధికారము కలదు గాని ఆ కర్మ ఫలముల నాసించుటయందు లేదు. అట్టి కర్మఫలమునకు కారణుడవు కూడ కాకుము. అట్లని కర్మలను మానుకొనరాదు.

48. యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ।
సిద్ధ్యసిద్ధ్యోః సమోభూత్వా సమత్వం యోగ ఉచ్యతే॥

సంగమును వీడి యోగనిష్ఠాత్ముడవయి
కర్మమొసఁగు ఫలాఫల గతుల యెడల
సమముగా నుండి, పార్థ! కర్మము నొనర్చు
అట్టి సమబుద్ధినే యోగ మని వచింత్రు.

తా॥ 'నేను' 'నాది' అను ఆసక్తి వీడి, చేయునట్టి కర్మము వలన ఫలితము సిద్ధించినను లేకపోయినను సమదృష్టిగల యోగనిష్ఠతో కర్మము నాచరింపుము. ఆ సమత్వబుద్ధినే నిష్కామకర్మయోగమని చెప్పిరి.

49. దూరేణ హ్యవరం కర్మ బుద్ధి యోగా ద్ధనంజయ।
బుద్ధౌ శరణ మన్విచ్ఛ కృపణాః ఫలహేతవః॥

ఫలము నాశించు కర్మమ్ము పార్థ! యెపుడు
కడు నధమ మగు బుద్ధియోగమ్ముకంటె—
పొందు మాశ్రయ మా సమబుద్ధి యందె
కృపణులే కర్మఫలము నాసించు వారు.

తా॥ ఫలాఫలములందు సమబుద్ధి కలిగిన యోగమే శ్రేష్ఠమైనది. ఫలాపేక్షగల కర్మము హీనమైనది. అందుచే అర్జునా! నీవా సమత్వబుద్ధియందే శరణు పొందుము. కర్మఫలము నాసించెడువారు అల్పులు.

50. బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృత దుష్కృతే।
తస్మా ద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మ సు కౌశలమ్॥

అట్టి సమబుద్ధిశాలి, ఇహమ్ము నందె
పుణ్యపాపముల్ వీడి విముక్తుడగును;
ఇట్టి యోగము నీ వనుష్ఠింపవలయు,
కర్మ మందిట్టి నేర్పె యోగ మనబడును.

తా॥ పై జెప్పిన బుద్ధియోగశాలి ఈ యిహమునందే తన పుణ్యపాపములనుండి విడివడుచున్నాడు. ఇట్టి సమత్వబుద్ధియగు నిష్కామకర్మనే నీవాచరింపుము. కర్మము నొనరించుటలో ఈ నేర్పే యోగము.

51. కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః।
జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛన్త్య నామయమ్॥

బుద్ధియుక్తులై యలరెడి పురుషవరులు
కర్మఫలముల యందలి కాంక్ష, లేక,
తప్పుకొనగల్గి జన్మబంధముల నుండి
పొందుదురు దుఃఖరహితమౌ మోక్షపదము.

తా॥ సమత్వబుద్ధి గలిగిన వివేకులు కర్మఫలము నాసింపరు. జన్మ బంధములు నుండి కూడ తప్పించుకొని యేవిధమైన దుఃఖమును లేని మోక్షపదమును పొందుదురు.

52 యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతి తరిష్యతి।
తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్యచ ॥

మోహ కాలుష్యమున బడి మునిగిపోక
దానినుండి అర్జున! బుద్ధిదాటినపుడె,
వినిన యట్టివి యికముందు వినగదగిన
విషయములలో విరక్తి లభింప గలదు.

తా॥ అర్జునా! ఎప్పుడు అజ్ఞానమను మాలిన్యమును పోగొట్టుకొని నీ బుద్ధి నిర్మలమైనదో అప్పుడు నీవు వెనుక వినినవి యికముందు వినబోవు విషయములనుండి వైరాగ్యము లభించును. అనగా కర్మఫలములయందు ఆసక్తి పొందకయుందువు.

53. శ్రుతి విప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా।
సమాధావచలా బుద్ధిస్తదా యోగమవాప్స్యసి ॥

వివిధ విషయార్థ వాదముల్ వినుట చేత
కలతపడిన నీబుద్ధి చంచలము గాక,
నిశ్చల ధ్యాన నిష్ఠను నిలచి నపుడె
యోగసిద్ధిని పొందెదవోయి పార్థ.

తా॥ అర్జునా! విషయ సంబంధములగు పలురకముల వాదములు వినుటచే నీ బుద్ధి కలతపడినది. పరమాత్మధ్యానమందు స్థిరమైన నీ బుద్ధి నిలచినపుడు నీవు ఆత్మసాక్షాత్కారమును పొందగలవు.

అర్జున ఉవాచ:- అర్జునుఁడు చెప్పెను.

54. స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ।
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్।

అచ్యుతా! సుస్థిరసమాధి యందు నున్న
ఈ స్థితప్రజ్ఞని స్వభావ మెట్టులుండు,
ఇట్టి స్థిరబుద్ధి గలుగువాడెట్లు పలుకు,
ఎట్టి రీతిగ నితడు వర్తించుచుండు.

తా॥ కృష్ణా! స్థిరబుద్ధిగలిగి సమాధినిష్ఠ పొందగలిగిన స్థితప్రజ్ఞుని లక్షణము లెట్టివి. ఆతని ప్రవర్తనము. సంభాషణము ఎట్టులుండును.

శ్రీభగవానువాచ :- శ్రీభగవానుఁడు చెప్పెను.

55. ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్ ।
ఆత్మన్యే వాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్త దోచ్యతే ॥

పార్థ! మానసమ్మందున ప్రబలుచున్న
కోరికల నెల్ల మొదలంట గోసివైచి
ఆత్మయం దాత్మచే ముద మందినపుడె
పల్కఁబడు నాతడును స్థితప్రజ్ఞు డనుచు.

తా॥ అర్జునా! మనసునందున్న కోరికలను ఆశలను సర్వము త్యజించి పరిశుద్ధమైన ఆత్మయందు ధ్యానచిత్తముచే ఆనందమనుభవించువాడే స్థితప్రజ్ఞుడు.

56. దుఃఖేష్వను ద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః ।
వీతరాగ భయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే ॥

కలతపడక మనమున దుఃఖమ్ములందు,
సుఖము లందున ఆసక్తి చూపబోక,
రాగ భయ కోప దుర్గుణ రహితు డైన
మునియె పార్థ! స్థితప్రజ్ఞు డనగబడును.

తా॥ దుఃఖములు కలిగినప్పుడు మనసులో క్షోభపడక, సుఖములందు ఆసక్తిలేక, అనురాగము కోపము భయము వదలగలిగిన ధ్యానపరుడు (ముని) స్థితప్రజ్ఞు డనబడును.

57. యస్సర్వత్రా నభిస్నేహ స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్ ।
నాభి నన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥

సర్వవిషయమ్ము లందు నిస్సంగు డగుచు
మంచి చెడ్డలు సంభవం బయిన యపుడు
సంతసమ్మును గాని ద్వేషమును గాని
లేని మనుజుడె, సుస్థిర జ్ఞాని యగును.

తా॥ ఏ విషయమందును అభిమానములేక మంచి కలిగినపుడు సంతోషము గాని, చెడు కలిగినపుడు ద్వేషము గాని లేనివాని జ్ఞానము స్థిరమైనది (స్థితప్రజ్ఞుడు).

58. యదా సంహరతే చాయం కూర్మోఽఙ్గానీవ సర్వశః।
ఇన్ద్రియాణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥

అవయవమ్ముల తనలోని కణచి ముడిచి
పెట్టుకొన గల్గి నట్టి తాబేలువోలె
విషయసుఖముల చెంతకు వెడలకుండ,
ఇంద్రియమ్ముల నెల్లను మరలింప గలుగు
వాని ప్రజ్ఞయె సుస్థిరమైన దగును.

తా॥ తాబేలు అవయవములను తనలోనికి ముడుచుకొనగల్గును. అట్లే విషయ సుఖముల దారికిపోవు తన ఇంద్రియముల నా దారికి పోకుండ మరలించుకొనువాని ప్రజ్ఞయె స్థిరమైనది (స్థితప్రజ్ఞుడు).

59. విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః।
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే॥

అణగునే గాని విషయవర్తనలు, దేహి
కణగిపోవు కోర్కెలు నిరాహారమునను;
అతడు పరమాత్మరూపమ్ము నరసి నపుడె
సకల విషయవాసనలు నాశనము లగును.

తా॥ నిరాహారము వలన శుష్కించిన దేహికి విషయప్రవర్తన మాత్రము అణగిపోవును. విషయ సుఖములందుగల వాసనలు కాంక్షలు అంతము కావు. పరమాత్మ యొక్క యథార్థస్వరూపము నరసినపుడే ఆ వాంఛలు అడుగంటును.

60. యతతో హ్యపి కౌన్తేయ! పురుషస్య విపశ్చితః।
ఇంద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః॥

అర్జునా! యెంత యత్నించి నప్పటికిని
పండితుని చిత్తమును గూడ ప్రబలరీతి
కలతనొందించి, అతిబలాత్కారముగను
తీసికొనిపోవుచుండు నింద్రియములెల్ల

తా॥ అర్జునా! ఇంద్రియములు అతిబలమైనవి. వానిని నిగ్రహించవలెనని ప్రయత్నించు పండితుని మనస్సును కూడ అవి తమవైపు బలాత్కారముగ లాగు చుండును.

61. తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః।
వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥

ధ్యానయుక్తుడు సర్వేంద్రియముల నణచి
చిత్త మతిభక్తి నాయందె చేర్పవలయు;
ఏలయన, నింద్రియముల జయించినపుడె
వానిప్రజ్ఞయు సుస్థిరమైన దగును.

తా॥ ఇంద్రియములను బాగుగ నిరోధించి, ధ్యానయుక్తుడై సాధకుడు మనస్సును నాయందు లగ్నము చేయవలెను. ఇంద్రియములను వశమందుంచికొనినపుడే అతని బుద్ధి స్థిరముగా నుండును. (స్థితప్రజ్ఞుడు)

62. ధ్యాయతో విషయాన్ పుంసః సఙ్గస్తేషూప జాయతే।
సఙ్గా త్సంజాయతే కామః కామా త్క్రోధోఽభిజాయతే॥

విషయచింతన వలన నావిర్భవించు
విషయ సుఖములం దాసక్తి; విషయసంగ
కారణమ్మున పుట్టును కోరికలును,
కోరికలవల్ల జనియించు కోపగుణము.

తా॥ విషయసుఖములను గూర్చియే ఆలోచించు మనుజునకు వానియందే ఆసక్తి కలిగి కోరిక లుదయించును. కోరికలు నెరవేర్చుటయందు కోపగుణ ముద్భవించును.

63. క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతి విభ్రమః।
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి॥

కోపమున బుట్టు నవివేకగుణము, దాని
వలన మానవునకు మతిభ్రమయు గల్గు.
చిత్తవిభ్రాంతి చేత నశించు బుద్ధి,
బుద్ధిహీనతచే చెడిపోవు నతఁడు.

తా॥ ఆ కోపము వలన అవివేకము, అవివేకము వలన భ్రాంతి, భ్రాంతి వలన బుద్ధినాశము కలుగును. బుద్ధి నశించిన జనుడు భ్రష్టుడైపోవును.

64. రాగద్వేష వియుక్తైస్తు విషయానిన్ద్రియై శ్చరన్।
అత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి॥

మనసు స్వాధీనమం దుంచుకొనిన వాఁడు,
తనకు వశమయి రాగమత్సరము వెడలి
నట్టి యింద్రియముల సుఖ మ్మనుభవించి
నప్పటికిని, మనశ్శాంతి నందగలఁడు.

తా॥ మనసును స్వాధీనపరచుకొనినవాడు, రాగద్వేషములు లేక తన వశవర్తులుగానున్న ఇంద్రియముల వలన దేహపోషణార్థమైన అన్నపానాదుల ననుభవించుచుండినను నిర్మలమగు మనశ్శాంతి నందగలడు.

65. ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోప జాయతే।
ప్రసన్న చేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతి॥

నిర్మలమ్మయి చిత్తమ్ము నెగడు నపుడు
సకల దుఃఖబాధలును నాశనములగును;
అట్టి నిర్మలమానసుం డుండగలుగు
నచిరకాలమ్ములో సిరమైన బుద్ధి.

తా॥ మనస్సును ఆ రీతిగా నిర్మల మొనరించుకొన్నపుడు సర్వ దుఃఖములు సమసిపోవును. అట్టి నిర్మలమనస్కునికే శీఘ్రముగా స్థిరబుద్ధి అలవడును.

66. నాస్తి బుద్ధి రయుక్తస్య న చాయుక్తస్య భావనా।
న చాభావయతః శాన్తి రశాన్తస్య కుతః సుఖమ్॥

కలుగబోవింద్రియముల నిగ్రహము లేక
స్థిరమయిన బుద్ధియును, నాత్మచింతనయును
శాంతియలవడ దా ఆత్మ చింతలేక,
సౌఖ్య మెటనుండి వచ్చును శాంతిలేక?

తా॥ ఇంద్రియనిగ్రహము లేకపోయిన నిశ్చయమైన బుద్ధి గాని, ఆత్మచింతనము గాని అలవడవు. ఆత్మచింతనములేనిచో మనశ్శాంతి కలుగదు. శాంతి కలుగనిచో ఇంక సౌఖ్యమెచ్చటినుండి వచ్చును ? రాదు.

67. ఇన్ద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావ మివామ్భసి ॥

విషయ చరములౌ నింద్రియవితతి యందు
హృదయ మనుసరించుచునున్న యింద్రియమ్మె
జ్ఞానమును హరియించును; జలధియందు
పడవలను లాగివేయు తుపాను వోలె.

తా॥ సముద్ర మధ్యమున పడవలను లాగివేయు తుఫానుగాలివలె విషయ సుఖములందు వర్తించు ఇంద్రియములలో దేనికి వశమయి మనస్సు అనుసరించునో ఆ యింద్రియమే మనుజుని యొక్క బుద్ధిని హరించి మూఢుని చేయును.

68. తస్మా ద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః।
ఇన్ద్రియా ణీన్ద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥

అట్టి కారణమ్మున అర్జునా! యెవండు
విషయ సుఖముల చెంతకు వెడలకుండ
ఇంద్రియముల పూర్తిగ నిగ్రహింప గలడో
వాని జ్ఞానము సుస్థిర మైన దగును.

తా॥ కాబట్టి, ఓ అర్జునా! విషయముల వైపునకు పోకుండా ఇంద్రియముల నిగ్రహించవలెను. అట్లు చేయగలిగిన వాని జ్ఞానము స్థిరముగ నిలుచును.

69. యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ।
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥

ప్రాణికోటుల కజ్ఞాన మనెడు రాత్రి
మేలుకొను యోగికి పగటివేళయద్ది
ప్రాణులు విషయ సౌఖ్య జాగ్రతలనుండ
ఆత్మ నెఱిగెడు మౌనుల కదియె రాత్రి.

తా॥ పరమార్థతత్త్వము గోచరము గాని ప్రాణులకేది అజ్ఞానమనెడు రాత్రియో, ఇంద్రియనిగ్రహమునందు జాగృతి కలిగి ఆత్మావలోకనచేయు యోగికది పగటివేళ. విషయతత్పరతయందు జాగృతి వహించు ప్రాణులకు ఏది పగలో విషయాసక్తియందు దృష్టిలేక పరమార్థతత్త్వమును దర్శించు యోగికది రాత్రియే.

70. ఆపూర్యమాణ మచల ప్రతిష్ఠమ్ సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్।
తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే స శాన్తి మాప్నోతి
నకామకామీ ॥

జలముతో నిండి అచలమౌ సంద్రమందు
కలసినట్లుగ వాహినీజలము లెన్నొ,
ఎవనియందున కామ్యమ్ము లెల్ల నణగి
పోవునోవాడె శాంతిని పొందుచుండు?
ప్రాప్త మిదిగాదు విషయలంపటున కెపుడు.

తా॥ పూర్ణముగ జలముతోనిండియు తీరమును దాటిపోవక స్థిరముగానున్న సముద్రమునందు నదీజలములు ప్రవేశించి కలియుచున్నట్లే, భోగవిషయములన్నియు యోగనిష్ఠునియందు పైకిరాక అణగిపోవుచున్నవి. అతడే శాంతిని పొందగలుగును కాని విషయ సుఖములందు తగులుకొనినవాడు పొందజాలడు.

71. విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాం శ్చరతి నిస్పృహః।
నిర్మమో నిరహంకారః స శాన్తి మధిగచ్ఛతి ॥

విషయ వాంఛల నెల్లను విడచి, మమత
వీడి, మనమం దహంకృతి కూడ మరచి,
దేనికిని ఆశపడక వర్తించుచుండు
నట్టి మనుజుడె పొందును ఆత్మశాంతి.

తా॥ విషయ వాంఛలను మొదలంట కోసివైచి, 'నాది' అను మమకారము, 'నేను' అను అహంకారము వీడి అన్ని ఆశలను త్యజించువానికి పరమశాంతి లభ్యమగును.

72. ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ! నైనాం ప్రాప్యవిముహ్యతి।
స్థిత్వాఽస్యా మన్త కాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి ॥

బ్రహ్మపరమైన దీ స్థితి పార్థ! దీని
నందగల్గిన వాడు మోహమున బడడు,
అంత్యసమయ మం దీస్థితియందె యుండి
పడయగల్గును బ్రహ్మనిర్వాణపదము.

తా॥ అర్జునా! యిది యంతయు పరమాత్మ సంబంధమైన స్థితి. దీనిని పొందిన వానికి తిరిగి ప్రపంచ విషయమైన మోహము కలుగదు. మరణ సమయమందీస్థితి యున్నచో బ్రహ్మసాయుజ్యము లభించును.

ఇది ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు
యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదమునగు
శ్రీమద్భగవద్గీతయందు సాంఖ్యయోగము
ద్వితీయాధ్యాయము సమాప్తము.



# గీతామృతము

## శ్రీమద్భగవద్గీత

## కర్మయోగము

## మూడవ అధ్యాయము : సారాంశము

ప్రధాన విషయము :—

లోకమున ప్రతివ్యక్తియు నిత్యము నేదోయొక కర్మ నాచరించుచునే యుండును. తన విధ్యుక్త కర్మమును ఫలాపేక్ష లేక ఈశ్వరార్పణముగా చేయుటయే నిష్కామ కర్మము.

ముఖ్యాంశములు :—

ఫలాపేక్షరహితమైన కర్మాచరణము - యజ్ఞకర్మములు - లోకమునకు సన్మార్గదర్శకమైన కర్మాచరణము - జ్ఞాని, అజ్ఞాని - మనసున రాగ ద్వేషములు. కామక్రోధములు లేకుండ యుండుట.

## సారాంశము

సాంఖ్యయోగమును వినిన అర్జునుఁడు జ్ఞానకర్మయోగములలో తనకేది శ్రేయము? జ్ఞానమే శ్రేయమైనచో తానీ ఘోరమైన యుద్ధకర్మమునకేల దిగవలయునని అడుగగా శ్రీకృష్ణుడిట్లు చెప్పెను.

అర్జునా! జ్ఞాన, కర్మయోగములు రెండును శ్రేయోదాయకములే. రెంటిని నేనే చెప్పితిని. ప్రతివ్యక్తియు ప్రతిక్షణమును ఏదో ఒక కర్మమును చేయుచునే ఉండును. ఇంద్రియములను నిరోధించి, విషయభావనను కూడ మనసునకు రానీయక ఫలాపేక్షను వదలి కర్మము లొనర్పవలెను.

కర్మములను చేయుచుండుటయే మేలుగాన శాస్త్రవిధ్యుక్తములైన కర్మాచరణ మొనర్పవలెను. జీవయాత్ర కవి మిక్కిలి ఉపయుక్తము లగును.

భగవద్విషయమైన యజ్ఞకర్మములందు తక్క ప్రజలు సామాన్యముగా ఇతర కర్మములందు బద్ధులగుదురు. కాన అర్జునా! యజ్ఞకర్మములను ఫలాసక్తిలేక చేయవలయును. యజ్ఞములతోబాటు ప్రజలను బ్రహ్మదేవుడు సృష్టించి ప్రజలకిట్లు చెప్పెను. యజ్ఞకర్మముల వలన దేవతలు తృప్తులై ప్రజల కష్టైశ్వర్యము లిచ్చెదరు. తిరిగి పూజారూపముగ వానిని ప్రజలు దేవతలకు సమర్పించుట విధి. ఇట్లు దేవతలు ప్రజలు అన్యోన్యము శ్రేయఃకాములై యుండుట మంచిది. కలిగినదంతయు తానే తినవలయునను లోభత్వము ఉండుట దేవతలయెడల నపచారము చేయుటయే. సత్కర్మము వేదమునుండి కలిగినది. వేదము అక్షర పరబ్రహ్మమువలన కలిగినది. కాన పరమాత్మ యజ్ఞమునందు ప్రతిష్ఠితుడై యుండెను. ఈ జగద్వర్తనము నందఱు ననుసరించవలసినదే.

ఆత్మ నెఱిఁగి ఆత్మానందమును పొందువాడే జ్ఞాని. అట్టివానికి ఒకరి నాశ్రయించు పనియేలేదు. కర్మాచరణమునకు కూడ అతడు అతీతుడు. కర్మఫలాపేక్షలేని కర్మయోగులకు మోక్షసిద్ధి కలుగును. పూర్వము జనకుడు మున్నగు రాజు లిట్టి కర్మయోగులై తరించిరి. శ్రేష్ఠులు చేసిన పనులను, వారేర్పఱచిన సదాచారములనే ప్రజ లనుసరింతురు. కాన లోకమును మంచి త్రోవలో పెట్టు నిమిత్తము సత్కర్మము లొనర్పవలెను.

అజ్ఞానులు ప్రతిఫలాపేక్షతో కర్మము లాచరించుచుందురు, జ్ఞానులు వారికి చిత్తచాంచల్యము కలిగించరాదు. అట్లుచేసినచో వారు కర్మములను చేయుటయే పూర్తిగా మానెదరు. ప్రకృతి స్వాభావికములు జన్మాంతర సంచితములగు గుణములచే ఇంద్రియములు తమంత తాము కర్మముల నొనర్చును. అజ్ఞానులా ప్రకృతి గుణములకు లోబడుదురు. అట్టి కర్మములందు తనకు సంబంధము లేకపోవుట గ్రహించి జ్ఞానియైనవాడు ఆ కర్మములందాసక్తి పడడు. శాస్త్రసమ్మతమైన కర్మములను జ్ఞాని తాను చేయుచు, ఇతరు

లకు మార్గదర్శకుఁడు కావలెను. కావున ఓ అర్జునా! నేను చేయుచున్నాను. అను కర్తృత్వభావమును వదలి అన్నిపనులను నాయందు సమర్పించుచు నీ స్వధర్మమైన యుద్ధము నొనరింపుము. పరధర్మ మెప్పుడును భయావహమైనదే.

చెవులకు శబ్దమునందువలె ప్రతి యింద్రియమునకును వానికేర్పడిన విషయమునందు ప్రీతిగాని, ద్వేషముగాని ఉండును. ఈ రాగద్వేషములే శత్రువులు, వీనికి వశము కాగూడదు. మనసునందిష్టము లేకపోయినను కామము (వాంఛ) ప్రజలచే బలాత్కారముగ పాపకార్యములు చేయించుచుండును. అదియే క్రోధముగా పరిణమించును. ఈ కామమునకు తృప్తి యనునదిలేదు. ఇంద్రియముల నాశ్రయించి జ్ఞానమును కప్పివేయును. కావున మొట్టమొదట ఇంద్రియముల నరికట్టి కామము నణచవలెను.

దేహము, మనస్సు వీనికంటె బుద్ధి, బుద్ధికంటె ఆత్మ శ్రేష్ఠుడు. బుద్ధిచే మనోచాంచల్యమును నశింపజేసి, కామము నణచి, ఆత్మవస్తువు నెఱుగుటకు యత్నింపవలెను.

ఈ అధ్యాయమందలి ముఖ్యశ్లోకములు.

1, 3, 5, 7, 9, 12, 15. 19,

26, 27, 30, 35, 36, 37, 43.

# శ్రీమద్భగవద్గీత

## మూడవ అధ్యాయము

## కర్మ యోగము

అర్జున ఉవాచ : అర్జునుఁడు చెప్పెను.

1. జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన ।
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ ! ॥

జ్ఞానయోగమ్మె కర్మయోగమున కంటె
శ్రేయమనుచును నీ యభిప్రాయ మైన
ఓ జనార్దన ! ఈ ఘోరయుద్ధమునకు
నన్ను నియమింపగా కారణ మ్మదేమి ?

తా॥ ఓ జనార్దనా ! జ్ఞానమే కర్మముకంటె శ్రేష్ఠమైనచో ఈ ఘోరయుద్ధమునందు నన్నేల దింపుచున్నావు ?

2. వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే ।
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహ మాప్నుయామ్ ॥

కలగలుపులుగ నున్న వాక్యముల తోడ
నన్ను భ్రమ పెట్టు రీతి నున్నావు నీవు,
దేనిచే నేను మేలు పొందెదనొ దాని
నే, వచింపుము కేశవా ! నిర్ణయించి.

తా॥ ఒకదాని కొకటి పొందక మిశ్రమములుగా కనబడుచున్న వాక్యములతో నన్ను భ్రమ పెట్టువానివలె నుంటివి నీవు. కృష్ణా ! ఏది నాకు శ్రేయోదాయకమో నీవే నిర్ణయించి ఆ ఒక్క విషయము నే నాకు చెప్పుము.

శ్రీ భగవానువాచ :- శ్రీ భగవానుఁడు చెప్పెను.

3. లోకేస్మిన్ ద్వివిధా నిష్టా పురా ప్రోక్తా మయాఽనఘ ।
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం ॥

అనఘ అర్జున ! ఈలోకమందు వెనుక
జ్ఞానయోగమార్గము నల సాంఖ్యులకును,
యోగులగు వారికిని కర్మయోగ విధము,
ద్వివిధనిష్ఠలు గూడ చెప్పితిని నేను.

తా॥ అర్జునా ! సాంఖ్యుల కొరకు జ్ఞానయోగమును, యోగులగు వారికి కర్మయోగము నసెడు ఈ రెండువిధములగు అనుష్ఠానములను వెనుక నేనే చెప్పితిని.

4. న కర్మణా మనారమ్భాత్ నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।
న చ సన్న్యస నాదేవ సిద్ధిం సమధి గచ్ఛతి ॥

కర్మముల చేయమానిన కారణమున
కలుగ బోదిల నిష్కామ కర్మసిద్ధి;
ఆ ప్రకారమె కర్మసన్యాస మొకటి
చేసినంత మాత్రాన మోక్షసిద్ధి రాదు.

తా॥ కర్మముల నాచరించుట మానినంతమాత్రమున ముక్తి దొరకదు. ఆ ప్రకారమే కర్మసన్యాస మొనరించినంత మాత్రమున జ్ఞానసిద్ధియుం లభింపదు. ఫలాపేక్ష వదలి నిష్కామబుద్ధితో కర్మములను చేసినపుడే సిద్ధి లభించును.

5. న హి కశ్చిత్క్షణమపి జాతు తిష్ఠత్య కర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మసర్వః ప్రకృతి జైర్గుణైః ॥

కర్మ మొనరింపకయె క్షణకాల మైన
ఉండబో డెవ్వడైన నీ యుర్వి యందు;
ప్రకృతియె అవశుడగు ప్రతివానిచేత
ఏదియేని కర్మమును చేయించు చుండు.

తా॥ కర్మమును చేయకుండ ఒక్క క్షణమైనను యెవ్వడును ఉండడు. ప్రకృతి సహజమైన గుణమే, అస్వతంత్రుడగు మనుజునిచే ఏదో ఒక కర్మమును చేయించచుండును.

6. కర్మేన్ద్రియాణి సంయమ్య య అస్తే మనసా స్మరన్।
ఇన్ద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచార స్స ఉచ్యతే॥

ఎవ్వడవివేకి యగుచు కర్మేంద్రియముల
నణచి యుంచుచు, మానసమందు విషయ
సుఖములనె సదా స్మరియించుచుండు, నతడు
చెప్పబడును మిథ్యాచార శీలి యనుచు.

తా॥ ఇంద్రియములను మాత్రము కట్టుబాటు చేసి మనస్సులో విషయసౌఖ్యములను గూర్చియే సదా తలపోయు అవివేకిని కపటాచారవంతునిగా నెంతురు.

7. యస్త్విన్ద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున।
కర్మేన్ద్రియైః కర్మయోగమసక్త స్స విశిష్యతే॥

ఎవడు మనసుచే తనదు సర్వేంద్రియముల
నణచియుంచుచు కర్మేంద్రియములచేత
కర్మము లొనర్పగలడో నిష్కాముడగుచు
నతడు శ్రేష్ఠగుణుండయి యలరుచుండు.

తా॥ అర్జునా! ఎవడు మనస్సుచే తన యింద్రియములనన్నిటిని స్వాధీనమందుంచుకొని, వానిచే కర్మయోగమును యెట్టి ఫలాసక్తి లేక ఆచరింపజేయునో అతడే శ్రేష్ఠుడు.

8. నియతం కురు కర్మ త్వం కర్మజ్యాయో హ్యకర్మణః।
శరీర యాత్రాపి చ తే న ప్రసిద్ధ్యేద కర్మణః॥

కర్మము నొనర్ప కుండుట కంటె, దాని
చేయుటయె మేలు; కాన శాస్త్రీయ మైన
కర్మము నొనర్పు మర్జున! కాని యెడల
అలవడదు వక్కనగు జీవయాత్ర కూడ.

తా॥ ఓ పార్థా! కర్మములను మానుటకంటె చేయుటయే మేలు. కావున శాస్త్రవిధ్యుక్తమైన కర్మములనే చేయదగును. కర్మములను మానినయెడల దేహయాత్ర కూడ సాగదు.

9. యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మ బన్ధనః।
తదర్థం కర్మ కౌంతేయ ముక్తసఙ్గ స్సమాచర॥

అర్జునా! యజ్ఞకర్మమ్ము లందు తక్క
అన్యకర్మబద్ధు లగుదు రవని జనులు;
కాన, ఫలకాంక్ష లేని నిష్కామ నియతి
యజ్ఞకర్మమ్ము నీవు చేయంగవలయు.

తా॥ పార్థా! దైవప్రీతికరములైన యజ్ఞములందు దక్క ప్రజలు ఇతర కర్మములలోనే కట్టుబడి యున్నారు. కాబట్టి, ఫలకాంక్షలేని నిష్కామ నియతితో నీవు శాస్త్రీయమైన యజ్ఞకర్మములను చేయుము.

10. సహ యజ్ఞాః ప్రజా స్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః।
అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽస్త్విష్ట కామధుక్॥

యజ్ఞములతోడ బ్రహ్మ సృష్ట్యాది యందు
ప్రజలసృష్టించి వారితో పలికె నిట్లు
"యజ్ఞములొసంగుగాక కామ్యార్థములను
యజ్ఞములొనర్చి వృద్ధితోనలరు" డనుచు.

తా॥ సృష్ట్యాదియందు బ్రహ్మదేవుడు యజ్ఞములతో బాటు ప్రజల సృష్టించి, "యజ్ఞములు మీ యిష్టవాంఛలను నెఱవేర్చుగాక, యజ్ఞములుచేసి మీరు వృద్ధి పొందుడు" అని ప్రజలతో ననెను.

11. దేవాన్భావయతానేన తే దేవా భావయన్తు వః।
పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ॥

తృప్తినిడుడు యజ్ఞములందు దేవతలకు
దేవతలుగూడ నిత్తురు తృప్తి మీకు;
ఇట్టు లన్యోన్య సద్భావ నేచ్ఛతోడ
అలరుచుండుడు మీరు శ్రేయమ్మునంది.

తా॥ ఈ యజ్ఞకర్మములచే మీరు దేవతలను సంతోషపెట్టుడు. దేవతలు కూడ మీ యిష్టకామములిచ్చి మీకు తృప్తి కలుగజేయుదురు. మీరిట్లు అన్యోన్యము సద్భావముతోనుండి మేలు పొందుడు.

12. ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యన్తే యజ్ఞ భావితాః ॥
తైర్దత్తా నప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః ॥

యజ్ఞపూజితులై దేవతాది ప్రజల
కిత్తు రిష్టభోగమ్ములను; వారిచ్చి నట్టి
వస్తువు లొకింత తిరిగి దేవతల కీక
తానె తినువాడు చోరుడే యౌను సుమ్ము.

తా॥ యజ్ఞముల వలన తృప్తులై దేవతలు ప్రజలకు ఇష్టభోగము లిచ్చెదరు. వానిలో కొంత అయినను తిరిగి యజ్ఞార్పణముగా దేవతల కీయకుండ సర్వము తానే అనుభవించువాడు చోరుడే అగును.

13. యజ్ఞశిష్టాశిన స్సన్తో ముచ్యన్తే సర్వకిల్బిషైః ॥
భుంజతే తే త్వఘం పాపా యే పచన్త్యాత్మ కారణాత్ ॥

యజ్ఞశేషము భుజియించు సజ్జనాళి
పాపములనుండి ముక్తులై పరగుచుంద్రు,
తమకొఱకు మాత్రమే వండి తామె తినెడు
వార లనుభవింపు నది పాపమ్మె యింక.

తా॥ దేవతల కర్పించగా మిగిలిన యజ్ఞశేషమును భుజించు జనుల పాపము లన్నియు నశించును. అట్లుకాక తమ కొఱకు మాత్రమే వండి తామే తినువారు పాపమే మూటకట్టుకొందురు.

14. అన్నాద్భవన్తి భూతాని పర్జన్యా దన్నసంభవః ।
యజ్ఞా ద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మ సముద్భవః ॥

అన్నమున భూతజాల ముత్పన్న మగును,
సంభవించు నన్నమ్ము వర్షమ్ము కతన,
వర్షమేఘముల్ యజ్ఞమ్ము వలన బుట్టు,
కర్మసంభవ మింక యజ్ఞమ్ము వినుము.

తా॥ అన్నము వలన ప్రాణులు, వర్షము వలన అన్నము, యజ్ఞముల వలన వర్ష మేఘములు, ఉద్భవించుచున్నవి. యజ్ఞము సత్కర్మము వలన సంభవమగుచున్నది.

15. కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవమ్ ।
తస్మా త్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్ ॥

వేదములె కర్మకాండను విశదపరచు,
వేదములు బ్రహ్మమందుండి వెలువడినవి,
కాన, సర్వమందునవ్యాప్తిగాంచియున్న
బ్రహ్మమెపుడును యజ్ఞకర్మముల గలదు.

తా॥ యజ్ఞకర్మములను చెప్పుచున్న వేదములు అక్షరపరమాత్మవలన కలిగినవి. కావున సర్వవ్యాపకమగు పరమాత్మ నిరంతరము యజ్ఞము అందుండును.

16. ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః ।
అఘాయు రింద్రియారామో మోఘం పార్థ స జీవతి ॥

పార్థ! ఈవిధి నడిపింపబడుచు నున్న
ఈ జగచ్చక్రము ననుసరింప నట్టి
వాడు పాపియై, ఇంద్రియవ్యసను డగుచు,
వ్యర్థజీవియై బ్రతుకు నీ యవని యందు.

తా॥ ఈ విధముగా నడచుచున్న జగచ్చక్రమును అందఱును అనుసరించ వలసినదే. అట్లు ప్రవర్తింపనివాడు కేవలము ఇంద్రియలోలుడై ఈ లోకములో వ్యర్థ జీవిగనే బ్రతుకును.

17. యస్త్వాత్మరతిరేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః ।
ఆత్మన్యేవ చ సన్తుష్ట స్తస్య కార్యం న విద్యతే ॥

ఎవ్వఁ డాత్మయొక్క నిజమ్ము నెఱిఁగియుండి,
ఆత్మతృప్తిని పొందుచు, నాత్మయందె
అనుభవించునో ఆనంద మట్టివాఁడు
చేయవలసిన కార్య మీ క్షితిని లేదు.

తా॥ ఆత్మ నెలుగుటయందె ఆసక్తికలిగి, తృప్తుడై ఆత్మానందమనుభవించు వానికి మఱి చేయవలసిన కార్యమేదియును లేదు.

18. నైవతస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన ।
న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థ వ్యపాశ్రయః ॥

కర్మమునలేదు లాభ మా జ్ఞానికెందు,
కర్మ మొనరింపకుండిన కారణమున
కూడ లేదనర్థము; ప్రాణికోటి నతడు
స్వార్థమున కాశ్రయింపగా పనియె లేదు.

తా॥ అట్టి ఆత్మతత్త్వము నెఱిగినవానికి కర్మము చేయుటవలన ప్రయోజనము, చేయకపోవుటవలన అర్థము గాని రెండును లేవు. స్వార్థముకయి అతడు ఏప్రాణిని ఆశ్రయింపవలసిన పనియేలేదు.

19. తస్మా దసక్త స్సతతం కార్యం కర్మ సమాచర ।
అసక్తోహ్యాచరన్ కర్మ పరమాప్నోతిపూరుషః ॥

కాన, కర్మఫలమ్మున కాంక్ష వదలి,
నీదు కర్తవ్యమును పార్థ! నిర్వహింపు;
అట్లు నిస్సంగుడై కర్మ మాచరించు
పురుష డందును పరమార్థ మోక్షపదము.

తా॥ కాబట్టి కర్మఫలమునందెట్టి ఆసక్తియు చూపక అర్జునా! నీకర్తవ్యము ను నీవు నిర్వహింపుము. అట్టి నిష్కామకర్మము నాచరించినవాడు మోక్షపదమును పొందగలడు.

20. కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః ।
లోకసంగ్రహ మేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి ॥

జనకుడాదిగ నృపులు నిష్కామకర్మ
ము వలననె గద పొందిరి మోక్షపదము
కాన, లోకసంగ్రహ మెంచి యైన పార్థ!
ఆచరింపుము నిష్కామ మైన కర్మ.

తా॥ పూర్వము జనకుఁడు మొదలైన రాజఋషులు నిష్కామకర్మమువలననే గదా మోక్షము పొందినది. కాబట్టి లోకమును సన్మార్గములో పెట్టునిమిత్తమైనను నీవు సత్కార్మము చేయదగియున్నది.

21. యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరే జనః।
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే॥

శ్రేష్ఠగుణులైన నరు లొనరించుచుండు
కర్మములె చేయుచుంద్రు లోకమున జనులు,
ఏప్రమాణములను శ్రేష్ఠు లేర్పఱచిరొ
అన్య జనులును వానినే యనుసరింత్రు.

తా॥ ఉత్తమ గుణులు చేయు రీతిగనే ప్రజలందఱు కర్మను లొనరించు చుందురు. ఆ శ్రేష్ఠు లేర్పరచిన ప్రమాణములను సదాచారములనే లోకులు కూడ అనుసరింతురు.

22. న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన।
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి॥

నాకు లభియింప నట్టిది, నాకు కావ
లసినదియు మూడులోకము లందు లేదు;
చేయదగు కార్యమే లేదు క్షితిని నాకు
కాని, వర్తించు చుంటి నీకర్మమందె.

తా॥ అర్జునా! నాకిదివరకు లభ్యముకానిది కాని, ఇకముందు నేను పొంద వలసినది గాని ఈ మూడులోకములందేమియు లేదు. నేను చేయవలసిన కార్యమును లేదు. అయినప్పటికి ఈ కర్మములను ఆచరించుచునే ఉన్నాను.

23. యదిహ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతన్ద్రితః।
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ! సర్వశః॥

అర్జునా! కర్మ మొనరించు టందు నేను
సర్వవిధములచే ప్రతిక్షణము గూడ
జాగ్రత వహించి వర్తింప జాల నేని
అనుసరింతు రీవిధమునే జనులు కూడ.

తా॥ అర్జునా! ప్రతి క్షణము కూడ నేను జాగ్రతవహించి కార్యములు నిర్వహింపక ఉండినచో, ప్రజలు కూడ అదేవిధమును అనుసరించి కర్మములందు చూపవలసిన జాగ్రతను శ్రద్ధను చూపరు.

24. ఉత్సీదేయు రిమే లోకా న కుర్యాం కర్మ చేదహం।
సంకరస్య చ కర్తాస్యా ముపహన్యా మిమాః ప్రజాః॥

నేను కర్మచేయక యుందు నేని లోకు
లందఱును భ్రష్టులైపోదు రవని యందు
ప్రజల నిటు చెడగొట్టిన వాడ నగుచు
కర్మ సాంకర్యమునకును కర్త నగుదు.

తా॥ కర్మములు చేయుట నేనసలే మానుకొంటినేని ప్రజలు భ్రష్టులైపోదురు. ప్రజలను చెడగొట్టుటయేగాక, కర్మసాంకర్యమునకు గూడ నేను కర్తనగుదును.

25. సక్తాః కర్మణ్య విద్వాంసో యథా కుర్వన్తి భారత।
కుర్యా ద్వి ద్వాం స్తథాఽసక్త శ్చికీర్షుర్లోకసంగ్రహం॥

ప్రతిఫలాపేక్ష తోడ కర్మముల జ్ఞాన
హీను లొనరించెడి విధము గానె, జ్ఞాను
లైన జనులు ప్రజాసంగ్రహమ్ము నెంచి
కర్మ మొనరింపవలె ఫలాకాంక్ష లేక.

తా॥ అర్జునా! ప్రతిఫలము నాసించి అజ్ఞానులు కర్మములు చేసినట్లే, జ్ఞానవంతులు ఫలాపేక్షను వదలి లోకమునకు మంచి మార్గము చూపునిమిత్తము నిష్కామ కర్మము చేయవలెను.

26. న బుద్ధి భేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్।
జోషయే త్సర్వ కర్మాణి విద్వాన్యుక్తః సమాచరన్॥

కర్మములొనర్చి యోగి నిష్కామసరణి
ఇతరులను కూడ తగ ప్రోత్సహింపవలెను;
ఫలముకోరి కర్మమొనర్చు పామరులకు
చిత్తచాంచల్యమును కల్గజేయ రాదు.

తా॥ కర్మఫలము నందాసక్తి కలిగి కర్మముల నాచరించు పామరులను కర్మ విముఖులుగా జ్ఞానులు చేయరాదు. జ్ఞానులైనవారు నిష్కామకర్మమును తాము అనుష్ఠించి ఇతరులను కూడ ఆ రీతి చేయుటకు ప్రోత్సహించవలెను.

27. ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః।
అహంకారవిమూఢాత్మా కర్తాహ మితి మన్యతే॥

ప్రకృతిగుణముల చేతనే బహువిధముల
కర్మము లొనర్పఁబడుచుండె గాని, మూఢ
జను లహంకారవశులయి జగతి యందు
తామె కర్త లైనట్లుగ తలఁచు చుంద్రు.

తా॥ ప్రకృతి వలన బుట్టిన తమయొక్క సత్త్వరజస్తమోగుణముల చేతనే కర్మములు చేయబడుచున్న విషయము గ్రహింపలేని మూఢులు అహంకారముతో తామే చేయుచున్నట్లు తలంతురు.

28. తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః।
గుణాగుణేషు వర్తన్త ఇతి మత్వా న సజ్జతే॥

అర్జునా! గుణకర్మ యథార్థతత్త్వ
మెఱుఁగు యోగి, గుణములగు నింద్రియములె
వాని విషయమ్ము లందలి వర్తనమ్ము
సల్పు ఔఱిఁగి, కర్మములనిస్సంగియగుచు
తాను వానికి కర్తగా తలపబోడు.

తా॥ ఓ అర్జునా! గుణములు—కర్మములు వీని విభజన నెఱిగిన తత్త్వవేత్త గుణములనబడు ఇంద్రియములు వానియొక్క విషయములందు తగిలి కర్మము లొనరించుచున్నవని గ్రహింపగలుగును. యదార్థముగ తనకు వానిలో సంబంధము లేకపోవుటచే కర్మములయందు యేవిధమైన ఆసక్తిని పెట్టుకొనడు.

29. ప్రకృతేర్గుణసమ్మూఢాః సజ్జన్తే గుణకర్మసు ।
తా నకృత్స్నవిదో మన్దాన్కృత్స్నవి న్న విచాలయేత్ ॥

ప్రకృతిగుణముల వశులయి భ్రమను మునిగి
ఇంద్రియాదుల విషయమ్ము లందె రక్తు
లైన మందబుద్ధులను, అల్పజ్ఞమతుల,
జ్ఞాని చలియింపగాఁ జేయ జనదు పార్థ!

తా॥ ప్రకృతి గుణములవశులై భ్రాంతిలోఁబడి, వాని కర్మములందే ఆసక్తులైన మందబుద్ధులైన అల్పజ్ఞులను, జ్ఞానులగువారు చలింపజేయరాదు. చలింపచేసినచో వారు కర్మము లొనర్చుటయే మానుకొందురు.

30. మయి సర్వాణి కర్మాణి సన్న్య స్యాధ్యాత్మచేతసా ।
నిరాశీ ర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః ॥

అన్నికర్మముల్ గూడ నధ్యాత్మబుద్ధి
నెసఁగి పార్థ! నాయందెయర్పింపుమింక;
ఆశయును మమకార మన్నదియు వదలి
చేయు మీ సమరమ్ము నిశ్చింతతోడ.

తా॥ పార్థా! ఆత్మవిచారమునందే ఉంచిన మనస్సుతో అన్ని కర్మములను నాయందు సమర్పింపుము. కర్మములందు ఏవిధమైన ఆశ గాని, మమకారము గాని లేక నీకర్తవ్యమైన యుద్ధమును నిశ్చింతగా చేయుము.

31. యే మే మతమిదం నిత్య మనుతిష్ఠన్తి మానవాః ।
శ్రద్ధావన్తోఽనసూయన్తో ముచ్యన్తే తేఽపి కర్మభిః ॥

పార్థ! నాయొక్క ఈయభిప్రాయములను
శ్రద్ధచూపుచు నెట్టిద్వేషమ్ము లేక
అనుసరించుచు నుండెడి మనుజవరులు
కర్మబంధవిముక్తులు కాగలారు.

తా॥ నేను చెప్పిన ఈ అభిప్రాయములం దసూయ లేక శ్రద్ధాళువులై ఎవరు అనుసరించుచున్నారో వారు గూడ కర్మబంధమునుండి ముక్తులగుచున్నారు.

32. యే త్వేత దభ్యసూయన్తో నానుతిష్ఠన్తి మే మతమ్।
సర్వజ్ఞాన విమూఢాంస్తాన్ విద్ధి నష్టా న చేతసః॥

ఎవ్వరింక నామతము ద్వేషించి అనుస
రింపబోరొ, వారిని బుద్ధిహీనులుగను,
బొత్తిగ జ్ఞానమెఱుఁగని మూఢులుగను,
భ్రష్టులుగ నెంచుమీ పార్థ! స్వాంతమందు.

తా॥ ఎవరు ఈ నామతమును ద్వేషించి అనుసరింపకయుందురో వారు బుద్ధిహీనులు, జ్ఞానశూన్యులు, మూఢులు, చెడిపోయినవారనియే పార్థా! నీవు భావించుము.

33. సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞానవానపి।
ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కిం కరిష్యతి॥

జ్ఞానవంతుడైన, నితరప్రాణులైన,
తమ ప్రకృతిప్రకారమ్మె నిత్యమ్ము నవని
నడపుచుందురు తమవర్తనముల నెల్ల;
కాన, ఫలమేమి ప్రకృతి నిగ్రహమువలన?

తా॥ శాస్త్రజ్ఞానమెఱిఁగిన పండితుఁడైనను, ఇతర ప్రాణులైనను తమ ప్రకృతి గుణముల ప్రకారమె ప్రవర్తింతురు. కాన, ప్రకృతిని గ్రహించుటవలన ప్రయోజనము లేదు. పూర్వజన్మ సంస్కారము ననుసరించి ప్రవర్తించుట అందఱికున్నదే.

34. ఇన్ద్రియస్యేన్ద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ।
తయో ర్న వశ మాగచ్ఛే త్తౌ హ్యస్య పరిపన్థినౌ॥

వాని కేర్పడిన విషయభావమందు
అమరియున్నవి ప్రతియింద్రియమునకును
ద్వేషరాగముల్ ఎవడును వీని కింక
వశము కాగూడ దివిరెండు ప్రబలరిపులు.

తా॥ ప్రతి యింద్రియమునకును వాని కేర్పడిన విషయభావమందు ఇష్టాయిష్టములు కూర్చబడి యున్నవి. ఈ రాగద్వేషములు రెండును మానవునికి ప్రబలరిపులు. వీని కెవరును వశము కాగూడదు.

35. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥

తనస్వధర్మము గుణరహిత మయికూడ
చక్కగా నాచరణమందు సాగుచున్న
అన్యధర్మముకంటె శ్రేయమ్మెయగును,
మృత్యు వయిన మేలు స్వధర్మవృత్తి యందు
పరుల ధర్మపద్ధతి భయప్రదమె యెపుడు.

తా॥ చక్కగా నాచరింపబడు పరుల ధర్మములకంటె, గుణము తక్కువైన దైనను ఎవని స్వధర్మము వారికి శ్రేయోదాయకమైనది. స్వధర్మాచరణమందు మృత్యువు సంభవించినను మేలే. పరధర్మమెప్పుడును భయావహమైనదే.

అర్జున ఉవాచ:- అర్జునుడు చెప్పెను.

36. అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః॥

హృదయమం దిచ్ఛ లేకపోయినను గూడ
పురుష డెపుడు బలాత్కారపూర్వకముగ
చేయుచుండును పాపపుచేష్ట లెన్నొ
కృష్ణ! ఇట్లు ప్రేరేపింతు రెవరు చెపుమ.

తా॥ కృష్ణా! మనుష్యున కిష్టము లేకపోయినను బలాత్కారపూర్వకముగ నెన్నో పాపకృత్యములు చేయుచున్నాడు. వీని నీవిధముగ దుష్టకార్యములకు ప్రేరేపించున దెవరు.

శ్రీభగవానువాచ :- శ్రీ భగవానుడు చెప్పెను.

37. కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్॥

అర్జునా ! రజోగుణజన్య మయిన కామ
మే, మహాపాపములను చేయించుచుండు;
ఇదియె క్రోధ, మెంతటికిని తృప్తిపడదు,
పరమశత్రువు మోక్షపిపాసువులకు.

తా॥ పాపకార్యములు ప్రేరేపించునది రజోగుణమువలన పుట్టిన కామము. అదియే క్రోధముగా మారును. ఎంత అనుభవించినను తీరనిదియు, పాపకారణమైన ఈ కామము మోక్షమార్గమునందెదురగు మహాశత్రువు.

38. ధూమే నావ్రియతే వహ్ని ర్యథాదర్శో మలేన చ।
యథోల్బే నావృతో గర్భ స్తథా తేనేద మావృతమ్ ॥

అద్దముపయిని మురికియు, అగ్నిపైని
పొగయు, గర్భమందలి శిశువుపయి మావి
ఆవరించియుండెడు రీతి ననుసరించి,
కామ మీ జ్ఞానగుణమును కప్పియుండు.

తా॥ పొగ నిప్పును, మాలిన్యము అద్దమును, మావి గర్భస్థమగు శిశువును ఎట్లావరించుకొనియుండునో అట్లే కామము జ్ఞానమును కప్పివేయును.

39. ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా।
కామరూపేణ కౌంతేయ దుష్పూరేణానలేన చ ॥

పూర్తియగుట లేదీ కామమునకు, పార్థ !
దీని కనలమ్ము వలెనె తృప్తియును లేదు,
జ్ఞానులకు నిత్యశత్రువీ కామగుణము
జ్ఞానమును కప్పుకొనియుండు సంతతమ్ము.

తా॥ కామమునకు ఎప్పటికిని పూర్తిఅగుట అనునది లేదు. అగ్నివలెనె కామమునకును ఎంత అనుభవించినను తృప్తియులేదు. జ్ఞానమును ఆవరించుకొనియుండు ఈ కామగుణము జ్ఞానాభిలాషులకు నిత్యశత్రువు.

40. ఇన్ద్రియాణి మనో బుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే ।
ఏతై ర్విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినమ్ ॥

బుద్ధియును మన స్సింద్రియములును కామ
మునకు నాశ్రయములని వాకొనగ బడెను.
ఇంద్రియములచే జ్ఞానమునెల్ల కప్పి
కామమే నరులకు భ్రాంతి కలుగజేయు.

తా॥ మనుజునకు గల బుద్ధి, మనస్సు ఇంద్రియములు కామమునకు ఆశ్రయములని పెద్దలు చెప్పిరి. ఇంద్రియములచేత జ్ఞానమును కప్పివైచి ఈ కామగుణమే మనుజుని, విభ్రాంతికి వశునిగాఁ జేయును.

41. తస్మాత్త్వ మిన్ద్రియా ణ్యాదౌ నియమ్య భరతర్షభ ।
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞాన విజ్ఞాన నాశనమ్ ॥

భరతవంశవర్ధనుడవు పార్థ! వినుము
నీవు మొదట ఇంద్రియముల నిగ్రహించి
జ్ఞాన విజ్ఞాన నాశన కారణమును,
పాపహేతువౌ కామమున్ వదలవలయు

తా॥ అర్జునా! పై కారణములచే నీవు మొట్టమొదట ఇంద్రియముల నిగ్రహించి, నీవప జ్ఞాన విజ్ఞానముల నశింపజేయునదియు పాపహేతువునైన కామమును త్యజింపవలయును.

42. ఇన్ద్రియాణి పరాణ్యాహు రిన్ద్రియేభ్యః పరం మనః ।
మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధేః పరతస్తు సః ॥

దేహమునకంటె శ్రేష్ఠ మింద్రియచయమ్ము,
ఇంద్రియములకంటెను శ్రేష్ఠ మీ మనస్సు,
మనసుకంటె శ్రేష్ఠము బుద్ధి యనగజెల్లు
అట్టి బుద్ధికంటెను శ్రేష్ఠ దాత్మయగును.

తా॥ దేహమునకంటె ఇంద్రియములు గొప్పవి. ఇంద్రియములకంటె మనస్సు, మనస్సుకంటె బుద్ధియును గొప్పవి. ఎయ్యది బుద్ధికంటెను శ్రేష్ఠతరమో అదియే ఆత్మ.

43. ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా ।
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్ ॥

అర్జునా ! బుద్ధికంటె నీయాత్మ శ్రేష్ఠుఁ
డని యెఱింగి ఈ బుద్ధిచేతనె మనస్సు
నిశ్చలమ్ముగ నొనరించి, నిగ్రహించి
రూపుమాపు మీ కామశత్రువును నీవు.

తా॥ అర్జునా బుద్ధికంటె ఆత్మను శ్రేష్ఠునిగా యెఱింగి ఆ బుద్ధిచేతనె మనస్సునకు చాంచల్యము లేకుండ నిగ్రహించి, కామము అనబడు ప్రబలశత్రువును రూపుమాపుము.

ఇది ఉపనిషదర్థప్రతిపాదకము, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రము,
శ్రీకృష్ణార్జున సంవాదమునగు శ్రీమద్భగవద్గీత
యందలి కర్మయోగమను
తృతీయాధ్యాయము
సమాప్తము

——

# గీతామృతము

## శ్రీమద్భగవద్గీత

## జ్ఞానయోగము

### నాల్గవ అధ్యాయము: సారాంశము

ప్రధాన విషయము:—

అధ్యాత్మజ్ఞాన మహిమ—అట్టి జ్ఞానసాధనకు మార్గములు.

ముఖ్యాంశములు:—

నిష్కామ కర్మయోగప్రశంస — భగవన్మహిమ కర్మము, అకర్మము, వికర్మము — వివిధములగు యజ్ఞములు. జ్ఞానయజ్ఞము—జ్ఞానమహత్త్వము.

### సారాంశము

శ్రీకృష్ణభగవానుఁడు అర్జునున కిట్లు చెప్పెను.

అర్జునా! నేను నీకిపుడు చెప్పినది నాశరహితమైన నిష్కామ కర్మ యోగము. ఈ యోగసాధన మనోనైర్మల్యము చిత్తశాంతి నొసగి ఆధ్యాత్మ జ్ఞాన సంపాదనకు దోహదము చేయును. సృష్ట్యాదిని నేను దీనిని సూర్యున కుపదేశించితిని. సూర్యుడు మనువునకు, మనువు ఇక్ష్వాకునకు దీని నుపదేశించిరి. ఇట్లే వంశక్రమాగతముగా రాజఋషులందఱు దీని నభ్యసించిరి. చాలకాలమగుటచే నిప్పుడిది నశించినది. నీవు నాకు భక్తుఁడవు, సఖుఁడవు గాన అతిరహస్యమైనను దీనిని నీకు చెప్పితిని.

నాకును, నీకును, ఈ రాజులందఱకును అనాదినుండియు ఎన్నో జన్మములు గడచినవి. వానిని నే నెఱుఁగుదును. నీవెఱుఁగవు. నాకు జనన మరణములు లేనప్పటికిని నా మాయాశక్తిచే నే నుద్భవించుచుందును.

జగతిలో ధర్మమునకు హాని కలిగి అధర్మము ప్రబలినపుడు, సజ్జనులను రక్షించి, దుష్టులను శిక్షించుటకును, ధర్మమును, పునరుద్ధరించుటకును, ప్రతి యుగమందును నేను అవతరించుచున్నాను. నా జన్మములు, అవతారములు దివ్యములైనవి. వీని నిజతత్త్వమెఱింగినవారు మరణానంతరమున నన్ను చేరుకొందురు.

ప్రజలను వారి వారి గుణములు, కర్మముల ననుసరించి నాలుగు వర్ణములుగా నేనే సృజించితిని. ఎవరెట్లు వారి కర్మముల నొనర్చి నన్నాశ్రయించుచుందురో అట్లే వారిని నే నను్రగహింతును.

కర్మము యొక్క తత్త్వము నెఱుగుట చాల కష్టము. అయినను శాస్త్ర సమ్మతమైన కర్మమును, శాస్త్ర నిషిద్ధమైన వికర్మమును, ఏమియు చేయకపోవుట అను అకర్మమును గూర్చి చక్కనెఱుగవలెను.

కర్మములందు ఆసక్తి, ఫలాపేక్షను వదలినపుడే యోగికి ఆత్మాశ్రయ బుద్ధియు జ్ఞానము కలుగును. అట్టివాడు దైనందిన వృత్తియందున్నను కర్మము చేయనివాడే. ఆ యోగి కేవలము దేహధారణ నిమిత్తము కర్మము లొనర్చినను అతనిని పాపములంటవు.

ప్రతి వ్యక్తియు పరులనుండి ధన వస్తు సంపదల పరిగ్రహించుట కాసక్తిచూపక, తనకు అప్రయత్నముగ లభించిన దానితోడనే తృప్తిబొంద వలెను.

ఈ లోకమందు కర్మాచరణమువలననే ఫలితములు శీఘ్రముగ లభించుటచే చాలమంది దేవతారాధన కర్మములు చేయుదురు. యజ్ఞము లట్టివి. యజ్ఞము నొనర్చువాడు, హోమము, హోమద్రవ్యములు, అగ్ని మున్నగునవన్నియు బ్రహ్మస్వరూపములుగనే చూడగలిగినపుడు, యజ్ఞకర్త తుదకు ఆ బ్రహ్మసాయుజ్యమునే పొందును.

యజ్ఞము లనేకవిధములు. దేవతారాధనము, ఇంద్రియనిగ్రహము, జీవబ్రహ్మైక్యభావము, విషయ సుఖములందు విరక్తి, ప్రాణాయామము,

దానములు, తపము, వేదాధ్యయనము, ఆహారవిహార నియమములు, ఇవన్నియు యజ్ఞములే. పాపమును పోగొట్టునవియే. యజ్ఞశేషాన్నము అమృతసమమైనది. దానిని భుజించినవానికి పరబ్రహ్మపదము లభించును. ఏదోయొక విధమైన యజ్ఞమునయినను శాస్త్రవిధిగ నొనరింపనివానికి ఇహపరసౌఖ్యములు లేవు.

కర్మములెట్టివైనను అవియన్నియు తుదకు జ్ఞానమునందే పరిసమాప్తి అగును. అందువలన అన్ని యజ్ఞములలోను జ్ఞానయజ్ఞము మిక్కిలి శ్రేష్ఠమైనది. అధ్యాత్మ జ్ఞాన సముపార్జనమే జ్ఞానయజ్ఞము.

అర్జునా! యెట్టి జ్ఞానము వలన నీ మనస్సునందలి భ్రాంతి తొలగి, నీవు సమస్త ప్రాణులను నీయందు, పిదప నాయందు చూడగలవో అట్టి జ్ఞానమును తెలిసికొనుము. జ్ఞానసంపాదనకు వినయవిధేయతలు గలిగిన గురుశుశ్రూషయే మంచి యుపాయము. జ్ఞానమునకు సమానమైనది మఱియొకటి లేదు. నిస్సందేహము నిర్మలమైన చిత్తము గల యోగసిద్ధుడు జ్ఞానమును తన యాత్మయందే అనుభవించును. ఇంద్రియనిగ్రహము కల్గి కర్మఫలమును దాశ త్యజించి నిష్కామకర్మయోగము పొందినవానికి, సందేహములను భ్రాంతిని తొలగించు జ్ఞానము లభించును. అట్టి నిష్కామ కర్మమునే నీవును ఆచరింపుము.

ఈ అధ్యాయమందలి ముఖ్యశ్లోకములు.

1, 5, 7, 8, 10, 13, 17, 18, 21,

23, 24, 31, 33, 34, 36, 38, 41.

# శ్రీమద్భగవద్గీత

## నాల్గవ అధ్యాయము

## జ్ఞానయోగము

శ్రీభగవానువాచ :— శ్రీభగవానుఁడు చెప్పెను.

1. ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్ ।
వివస్వాన్ మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽబ్రవీత్ ॥

అవ్యయమగు నీ కర్మయోగాచరణము
నర్కునకు చెప్పినాడ నే నాదియందు
ఇనుఁడ చెప్పెను దీనిని మనువునకును
మనువు వచియించె నిక్ష్వాకు మనుజపతికి.

తా॥ అర్జునా! ఇప్పుడు నీకు చెప్పిన కర్మయోగ మవ్యయమైనది. సృష్ట్యాదియందు దీనిని నేను సూర్యున కుపదేశించితిని. సూర్యుఁడు మనువునకు, ఆ మనువు ఇక్ష్వాకునకు దీనిని తరువాత తెలియఁజేసిరి.

2. ఏవం పరమ్పరాప్రాప్త మిమం రాజర్షయో విదుః ।
స కాలేనేహ మహతా యోగో నష్టః పరన్తప ॥

అర్జునా ! ఇట్లు వంశక్రమాగత మగు
నీ మహాకర్మయోగము నెఱిఁగి డింద్రి
రాజఋషు లెల్లరును కాని, కాలగతిని
ఉర్విపై నశియించె నీ యోగ మెల్ల.

తా॥ ఇట్లు వంశక్రమాగతముగా ఒకరి తర్వాత ఒకరెఱిఁగిన ఈ గొప్ప కర్మయోగమును పూర్వము రాజఋషు లెల్లరును యెఱుఁగుదురు. కాని, చాల కాలము గతించుటచే నది క్రమముగ మూలబడి నశించినది.

3. స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః।
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేత దుత్తమమ్॥

పార్థ! నీవు నా సఖుఁడవు, భక్తుఁడవును
కాన, ఈ అనాదియగు నిష్కామకర్మ
యోగమును చెప్పితిని నీకు; ఉర్వినిద్ది
అతిరహస్యము, ఉత్తమ మని యెఱుంగు.

తా॥ అర్జునుఁడా! నీవు నాకు మిత్రుడవేకాక నాయందు భక్తికలవాడవు. ఆ కారణమున అతిసనాతనమును, రహస్యమును, ఉత్తమమునైన ఈ నిష్కామ కర్మ యోగమును నీ కుపదేశించితిని.

అర్జున ఉవాచ: అర్జునుఁడు చెప్పెను.

4. అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః।
కథ మేత ద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి॥

పూర్వకాలాన సూర్యుడు పుట్టె నెపుడు
కృష్ణ! పిమ్మట నీవు జన్మించి నావు
కాన యెట్లిక తెలిసికోగలను దీని
నర్కునకు చెప్పి తీవు సృష్ట్యాది ననుచు.

తా॥ ఓ కృష్ణ! సూర్యుఁడెప్పుడో పూర్వమునుండియు ఉన్నవాడు. ఆతరువాత నే కదా, నీవు జన్మించినది. సృష్ట్యాదియందే దీనిని సూర్యునికి నీవు తెలిపితినంటివి. ఎట్లీ విషయమును గ్రహింపగలను.

శ్రీ భగవానువాచ:- శ్రీ భగవానుఁడు చెప్పెను.

5. బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున।
తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరన్తప॥

అర్జునా! నాకు, నీ యవని యందు
గడచిపోయె జన్మము లనేకములు; వీని
నెల్ల, మానసమందు నేనెఱిఁగి యుంటి,
ఎంతమాత్రము వీని నీవెఱుఁగ వింక.

తా॥ అర్జునా! నాకును నీకును ఈ పుడమిపై ఎన్నో జన్మములు గడచినవి. వాని నన్నిటిని నేనెఱుగుదును కాని నీ వెఱుగజాలవు.

6. అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్ ।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా ॥

జనన మెఱుగని వాఁడ, నాశనము లేని
వాఁడ, ప్రాణికోటులకు నీశ్వరుఁడ నయ్యు
నేను నాదుప్రకృతిని స్వాధీనమందు
నుంచి నామాయ వలన జన్మించు చుంటి.

తా॥ నేను పుట్టుక గాని నాశము గాని లేనివాఁడను. ప్రాణులన్నిటికి గూఁడ ప్రభువును. అయినను స్వకీయమగు నా ప్రకృతిని స్వాధీనమందుంచి నా మాయా ప్రభావముచే, నేను జన్మించుచున్నాను.

7. యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానాం సృజా మ్యహం ॥

ఎప్పుడెపుడు ధర్మమ్ము క్షీణించిపోయి
పృథ్వీమీద నధర్మము వృద్ధియగునొ,
అర్జునా! అట్టి సమయమ్ము లందు నన్ను
నేనె సృష్టిచేసికొను చున్నాను భువిని.

తా॥ అర్జునా! భూమిపై ధర్మమునకు హాని కల్గి అధర్మము ప్రబలుచున్న అన్ని సమయములందును, నేనె స్వయముగ అవతరించు చున్నాను.

8. పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాప నార్థాయ సంభవామి యుగే యుగే ॥

సాధుసజ్జనకోటి రక్షణము కొఱకు
సకల దుర్మార్గ జనవినాశనము కొఱకు
ధర్మసంస్థాపనార్థమ్ము ధరణి నేను
యుగయుగమ్మున జన్మించు చుంటి పార్థ.

తా॥ అర్జునా! లోకములో దుర్జనులను శిక్షించి సజ్జనులైనవారిని కాపాడుట కొఱకు, ధర్మ పద్ధతులను స్థిరముగ స్థాపించుటకును ప్రతి యుగమందును నేను జన్మించుచుంటిని.

9. జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున॥

అర్జునా! యెవ్వ డిట్టి దివ్యమగు నాదు
జన్మకర్మముల నిజమ్ము సర్వ మెఱుగు
నతడు చేరును దేహాంత మైన వెనుక
నన్నె, మఱల నతనికి జన్మమ్ములేదు.

తా॥ అర్జునా! ఈ నా జన్మకర్మములు, దివ్యములు అలౌకికములైనవి. వీని యథార్థమును తెలిసికొనిన తత్త్వజ్ఞుడు మరణించిన తరువాత నా సాయుజ్యమును పొందును. అతనికి లోకమున పునర్జన్మ ముండదు.

10. వీతరాగ భయక్రోధా మన్మయా మాముపాశ్రితాః।
బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః॥

బహుళజనులు రాగభయకోపములు వీడి
నన్నె సముపాశ్రయించి మన్మయులు నగుచు
పావనులు నయి జ్ఞానతపమ్మె వలన
పొందగలిగిరి మద్భావ మోక్షపదము.

తా॥ మనసునందు ప్రీతి, భయము, కోపము అను గుణములు వీడి నేనె గతియని నన్నాశ్రయించి, మనస్సును నాయందె లగ్నము చేసినవారు, ఈ విధమగు జ్ఞానతపము వలననే అతి పవిత్రులై అనేక జనులు నా సాయుజ్యమును (మోక్షమును) పొందిరి.

11. యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః॥

అర్జునా ! యెవ్వరెట్లు నన్నాశ్రయించు
చుందురో, వారిపై చూపుచుందు నట్లె
నాయనుగ్రహ; మీ్మకారణమ్ము చేత
నన్నివిధముల జనులు నన్ననుసరింత్రు.

తా॥ అర్జునా ! ఎవరు నన్నే విధమున ఆశ్రయించి భావించుచుందురో ఆ విధము గనే నేను వారియం దనుగ్రహము చూపించుచుందును. ఈ కారణముచే జనులు సర్వవిధముల నా మతము ననుసరించుచున్నారు.

12. కాంక్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః।
శీఘ్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా ॥

ఈ మనుష్యలోకమున లభించుచుండు
శీఘ్రముగ కర్మసాఫల్యసిద్ధి; కాన
కర్మఫలము నం దాకాంక్ష గలిగి నట్టి
జనులు దేవతారాధన సల్పుచుంద్రు.

తా॥ ఈ మర్త్యలోకమున కర్మముల వలన ఫలితములు శీఘ్రముగ లభించును. ఆ కారణమున కర్మఫలముల కోరు జనులు యెక్కువగ దేవతారాధనలను సల్పుచున్నారు.

13. చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః।
తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్ ॥

జనుల గుణకర్మభేదము లనుసరించి
నాల్గు వర్ణముల సృజించినాను నేనె;
అట్టి సృష్టికి నేకర్త నైన గూడ
నన్నెఱుగు మకర్తగ నవినాశి ననుచు.

తా॥ వారి వారి గుణములను కర్మస్వభావమును అనుసరించి ప్రజలను నాలుగు వర్ణములుగ నేనే సృజించితిని. నేనట్లు సృష్టికర్తనయినను కర్తకానివానినిగను, శాశ్వతునిగను నన్ను తెలిసికొనుము.

యథార్థమునకు గుణముల ననుసరించిన కర్మములనన్నియు భగవదధీనమైన ప్రకృతియే చేయుచున్నది. ప్రకృతియే కర్త్రి. భగవానుడు తటస్థుడైన సాక్షీభూతుడే.)

14. న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా।
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే॥

నన్ను కర్మమ్ము లంటవు నాకు కర్మ
ఫలములం దిచ్ఛయును కూడ గలుగ బోదు;
ఇట్టి నాతత్త్వ మెఱిఁగి చరించు నతఁడు
కర్మ బంధము లందున కట్టుబడడు.

తా॥ నన్ను కర్మములంటవు. తత్ఫలములందు వాంఛయును నాకు లేదు. ఇట్లు నన్ను తెలిసికొనినవారు కూడ కర్మబంధములచే కట్టుబడరు.

15. ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః।
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్॥

ఈవిధము నెఱింగియె ఆచరించినారు
పూర్వకాలాన గూడ ముముక్షుజనులు,
అతిపురాతన మిది పూర్వులాచరించి
నదియు; ఇట్టికర్మమె పార్థ! ఆచరింపు.

తా॥ ఈ కర్మఫలకాంక్షలేని విధానమును తెలిసికొనియే పూర్వము మోక్షాసక్తులైన జనులు ఈ కర్మము నాచరించినారు. పూర్వులు చేసినట్టిది, పురాతనకాలము నుండియు వచ్చుచున్న ఈ కర్మవిధానమును అర్జునా! నీవును అనుసరింపుము.

16. కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః।
తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్॥

'కర్మ' మననేమి? ఏది 'అకర్మ' మనుచు,
పండితులు గూడ భ్రాంతిలో బడిరి పార్థ;
అశుభములనుండి యెటు ముక్తి నందగలవొ
తెలుపుచుంటి నాకర్మమ్ము తెలిసికొనుము.

తా॥ 'కర్మ' మననేమి? 'అకర్మ' మననేమి? ఈ సందేహములోబడి పండితులైనవారే సరిగా తెలిసికొనజాలకున్నారు. దేనిని తెలిసికొనినట్లయిన, సంసారబంధములు కల్పించు అనర్థములనుండి ముక్తి పొందగలవో ఆ కర్మవిధానమును తెలిపెదను వినుము.

17. కర్మణో హ్యాపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః।
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః॥

'కర్మ' మన శాస్త్రవిధ్యుక్తకర్మకాండ,
అఖిలశాస్త్రనిషిద్ధమైనది 'వికర్మ',
ఏపనియు చేయకుండుటయే 'అకర్మ',
కర్మతత్త్వ మగాధమై క్రాలుచుండు
గాన, వీని చక్కగ నెఱుఁగఁగ వలయు.

తా॥ శాస్త్రవిధ్యుక్తమైనదే 'కర్మము'. శాస్త్రములు నిషేధించినది 'వికర్మ'. ఏ పనియు చేయక సోమరితనముగా ఉండుట "అకర్మ". కర్మము యొక్క నిజతత్త్వము చాల లోతైనది. ఈ విషయమును కూలంకషముగా తెలిసికొనుట అవసరము.

18. కర్మ ణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః।
స బుద్ధిమాన్ మనుష్యేషు సయుక్తః కృత్స్నకర్మకృత్॥

కర్మమందు 'అకర్మ', 'అకర్మ' మందు
కర్మ మరయువాడె, మనుజగణము నందు
బుద్ధిశాలియు యోగియు, పుణ్యకర్మ
లెల్ల చేసినవాడుగా నెంచ బడును.

తా॥ కర్మమునందు అకర్మము, అకర్మమునందు కర్మమును చూచినవాడే మనుజులలో బుద్ధిశాలి, యోగి, పుణ్యకర్మలు చేసినవాడు నగును.

(ఈ కార్యము వలన నాకీలాభము రావలెను అను కాంక్ష—నేను చేయువాడను అను అహంకార మమకారములు; ఈ భావములను వదలి ఫలాపేక్షయు ఆసక్తియు లేకపోవుటయే కర్మమునందు అకర్మమును చూచుట. యత్నించి దేహేంద్రియములను

కర్మములందు ప్రవర్తింపకుండ కట్టుబాటు చేయుట అకర్మ కాని మనస్సు కామవాసనలు వదలక పలువిధముల చలించుచుండును. ఇది కర్మబంధమునందు తగుల్కొనుటయే. అట్టి వారి అకర్మమునందు కర్మబంధములు ఇమిడియున్నవి. దీనిని తెలిసికొనుటయే అకర్మమునందు కర్మమును చూచుట. కావున ఈ కామవాసనలను గూడ పూర్తిగ త్యజింపవలయును.)

19. యస్య సర్వే సమారమ్భాః కామ సంకల్ప వర్జితాః ।
జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం తమాహుః పండితం బుధాః ॥

ఎవని కర్మమ్ము లిల ఫలాపేక్ష లేక
కామసంకల్ప రహితమై క్రాలగలవొ,
అతఁడె కర్మముల్ జ్ఞానాగ్ని కాహుతిడిన
పండితు డటంచు విబుధులు పలుకుచుంద్రు.

తా॥ ఎవని కర్మములు కోరికలు, ఆసక్తికితో కూడిన సంకల్పములు లేనివై ఉన్నవో, అతడె కర్మములను జ్ఞానాగ్నియందు దగ్ధమొనరింపఁజాలిన పండితుఁడని విబుధులు చెప్పుదురు.

20. త్యక్త్వా కర్మ ఫలాసఙ్గం నిత్యతృప్తో నిరాశ్రయః ।
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః ॥

కర్మఫలితమ్ము లందలి కాంక్షవదలి
దేని నాశ్రయింపక మనఃతృప్తుడగుచు,
నిత్యకర్మప్రవృత్తి నుండినను కూడ,
అతడు కర్మమ్ములను చేయునట్టి వాడె.

తా॥ కర్మఫలములందు ఆసక్తివదలి, ప్రపంచ విషయములను వస్తువులను దేనిని ఆశ్రయింపక (ఆత్మాశ్రయమే కలిగి), దైనందిన ప్రవృత్తియందున్నవాడు కర్మములను చేయనివాడే అగును.

21. నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః ।
శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥

ఆశవిడనాడి, తన మానసాత్మలందు
నిగ్రహముకల్గి, సంపాదనేచ్ఛ వదలి,
దేహధారణ కొఱకె సద్వృత్తి చేయు
వాడు పొందబో డెట్టి పాపమును గూడ.

తా॥ ఆశలను వదలి, మనోబుద్ధులను నిగ్రహించి, ధన వస్తు స్వీకారమును త్యజించి, కేవలము దేహధారణ కొఱకు కర్మముల చేయువాడు పాపమును పొందడు.

22. యదృచ్ఛాలాభ సన్తుష్టో ద్వన్ద్వాతీతో విమత్సరః ।
సమః సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే ॥

తన కయాచితముగ వచ్చుదాని తోడ
తృప్తిపడి, ద్వంద్వములకు నతీతు డగుచు,
కలిమిలేముల సమబుద్ధి కలిగియుండి,
మత్సరము లేనివాడు కర్మములొనర్చి
నప్పటికిని, కర్మనిబద్ధుఁ డతఁడు గాడు.

తా॥ అయాచితముగ వచ్చినదానితో తృప్తిపడవలెను. సుఖదుఃఖములకు, కలిమి లేములకు రాగద్వేషములు పొందక సమదృష్టితో నుండవలెను. ఈర్ష్య, అహంకారము వర్జించవలెను. అట్టి గుణములు కలిగిన మానవుఁడు కర్మబంధములందు తగులుకొనడు.

23. గత సఙ్గస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః ।
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే ॥

సంగరహితుఁడై, కామవాసనలు వీడి,
జ్ఞాననిష్ఠుఁడగుచు యజ్ఞకర్మములను
పరహితార్థము చేసెడు వానియొక్క
కర్మములు సర్వమును పూర్తిగా నశించు.

తా॥ కోరికలయందు ఆసక్తిని వదలి, రాగద్వేషాది మనోవాసనలను త్యజించి, ఆత్మజ్ఞాననిష్ఠతో పరోపకారార్థము దేవపూజార్థము యజ్ఞకర్మములు చేయువాని కర్మములు, బంధములను కలుగజేయక, నశించిపోవును.

24. బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్।
బ్రహ్మైవ తేన గన్తవ్యమ్ బ్రహ్మకర్మ సమాధినా ॥

యజ్ఞకర్తయు, హోమద్రవ్యములు, నగ్ని
అర్పణములుసర్మమ్ము బ్రహ్మముగ నరయు
బ్రహ్మవిష్ఠ డందునదియు బ్రహ్మపదమె.

తా॥ యజ్ఞమ్మునందలి హోమద్రవ్యములు, అగ్ని, హోమము, హోమము చేయు వాడు, సర్వమును బ్రహ్మస్వరూపములుగా భావించి ఏకాగ్రచిత్తముతో యజ్ఞకర్మ మొనరించువాడు బ్రహ్మమునే పొందును.

25. దైవ మేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే।
బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం యజ్ఞేనై వోపజుహ్వతి ॥

అమరపూజార్థ మైనట్టి యజ్ఞములనె
యోగులగు కొంద తొనరించు చుందురిలను;
బ్రహ్మభావన యనియెడు వహ్నియందు
వేల్చుదురు జీవునే జ్ఞానక్షేత్రలిలను.

తా॥ దేవతల యొక్క అర్చనారూపములయిన యజ్ఞములను కొందఱు యోగు లాచరింతురు. మఱికొందఱు జీవబ్రహ్మైక్యభావమగు అభేదచింతనలో జీవుని హోమము చేయుదురు.

26. శ్రోత్రాదీ నీన్ద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి।
శబ్దాదీన్విషయా న్యన్యే ఇన్ద్రియాగ్నిషు జుహ్వతి ॥

నిగ్రహమ్మను నగ్నిలో నిలిపి వేల్చు
చుంద్రు కొందఱు శ్రోత్రాదియింద్రియములు;
అన్యు లీయింద్రియము లను నగ్నులందే
వేల్చుచుందురు శబ్దాది విషయములను.

తా॥ నిగ్రహమను అగ్నియందు చెవి మొదలగు నింద్రియముల నాహుతి చేయుదురు. మఱికొందఱు ఈ యింద్రియముల నెడు అగ్నియందు శబ్దాదివిషయములను వేల్తురు.

(ఇంద్రియములను విషయముల పై పునః చలింపకుండ చేయుట, విషయములందు ఇంద్రియములకు ఆసక్తి లేకుండ చేయుటయే దీని భావము.)

27. సర్వాణీన్ద్రియ కర్మాణి ప్రాణకర్మాణి చాపరే।
ఆత్మసంయమ యోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే॥

ప్రాణకర్మల నింద్రియవర్తనముల
జ్ఞానసాధనచేత ప్రజ్వలితమైన
ఆత్మనిగ్రహమనెడు యోగాగ్ని యందె
కొందఱాహుతి చేయుచునుందు రింక.

తా॥ మఱికొందఱు ఇంద్రియ వ్యాపారములను, ప్రాణాదివాయువుల పనులను, జ్ఞానముచే పెంపొందింపబడిన మనోనిగ్రహమను అగ్నియందు వేల్తురు. మోక్షసాధనకు కావలసిన మనోనిగ్రహమునకు ముందు ఇంద్రియవర్తనములను ప్రాణాదివాయువులను స్వాధీనముందుంచి అరికట్టుట అవసరమని దీని భావము.

28. ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగ యజ్ఞా స్తథాపరే।
స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ యతయః సంశితవ్రతాః॥

ద్రవ్యదానమ్ముల నొసంగి తపమొనర్చి,
వేదపఠనముచే జ్ఞానవేత్త లగుచు,
యోగసాధకులై యెన్నియో విధముల,
యజ్ఞము లొనర్తురి దృఢవ్రతు లైన జనులు.

తా॥ ద్రవ్యదానములే యజ్ఞముగ కొందఱు, తపస్సే యజ్ఞముగ కొందఱు, యోగసాధనయే యజ్ఞముగ కొందఱు, వేదాధ్యయనమే యజ్ఞముగ కొందఱు ఆచరింతురు. వారందఱు సత్ప్రయత్నములు కలవారై దృఢవ్రతులునయి యున్నారు.

29. అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే।
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః॥

అన్యజనులు ప్రాణాయామయత్నులగుచు
కడ(కతోడ ప్రాణాపానగతుల నిల్పి,
ప్రాణవాయువు వేల్తు రపానమందు,
ప్రాణమందు వేల్తు రపానవాయువులను.

తా॥ ప్రాణాయామపరులైనవారు మఱికొందఱున్నారు. ప్రాణాయామము మనోచాంచల్యమును పోగొట్టును. ప్రాణాపానవాయుచలనమును నిరోధింతురు (కుంభకము). ప్రాణవాయువును పైనుండి క్రిందికి పోవునట్లుగ చేసి అపానవాయువుతో చేర్చుదురు. (పూరకము). అపానవాయువును ఊర్ధ్వముగ తీసికొని వచ్చి ప్రాణ వాయువునందు చేర్చుదురు (రేచకము). ఇవి ప్రాణాయామ విధానములు.

30. అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి ।
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపిత కల్మషాః ॥

నియమి తాహారమునె తిను నిష్ఠతోడ
ప్రాణములువేల్తు రన్యులు ప్రాణమందె;
ఇట్లు యజ్ఞవేత్తలె వీరలెల్ల, యజ్ఞ
ఫలము వలనను పాపముక్తులును గూడ.

తా॥ కొందఱు ఆహారనియమములను పాటించి ప్రాణాదివాయువులను ఆ వాయువులందే వేల్తురు. సాత్త్వికాహారము మితాహారముచే మనసుగూడ సాత్త్విక విషయములందు వర్తించును. ఆ సాధనముచే వశము చేసికొనబడిన ఇంద్రియములందు ఇంద్రియ వ్యాపారములను నశింపజేయుదురు.

వీరలందఱును యజ్ఞ పద్ధతులెఱిగినవారే. యజ్ఞఫలము వలన పాపములనుండి ముక్తులయినవారే.

31. యజ్ఞ శిష్టామృత భుజో యాన్తి బ్రహ్మ సనాతనమ్ ।
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ ॥

అమృతసమమైన యజ్ఞశేషము భుజించు
వారికి లభించు శాశ్వతబ్రహ్మపదము,
యజ్ఞ మొకదానినైన చేయని జనునకు
అర్జునా ! లేదిహపరములందు సుఖము.

తా॥ యజ్ఞములందు శేషించిన అన్నము అమృత సమమైనది. దీనిని భుజించు వారికి శాశ్వతమైన బ్రహ్మసాయుజ్యము (మోక్షము) లభించును. పై జెప్పిన అనేక విధములైన యజ్ఞములలో ఒకదానినైన చేయనివానికి ఇహమునందు పరమునందును సుఖము లేదు.

32. ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే।
కర్మజాన్ విద్ధి తాన్ సర్వానేవం జ్ఞాత్వా విమోక్ష్యసే॥

వేదములయందు నీరీతి వివిధయజ్ఞ
పద్ధతులు విపులముగ తెల్పంగబడియె;
కర్మభవములె సర్వయజ్ఞములు, దీని
తెలిసికొనిన కర్మవిముక్తి గలుగు పార్థ!

తా॥ అర్జునా! నానావిధములైన యజ్ఞముల గూర్చి సవిస్తరముగ వేదములు తెల్పుచున్నవి. అన్ని యజ్ఞములు కర్మములనుండి పుట్టినవానినిగ నెఱుగుము. అట్లు తెలిసికొనిన నీవు కర్మలనుండి విముక్తుడవు కాగలవు.

33. శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞా జ్ఞానయజ్ఞః పరన్తప।
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే॥

ద్రవ్యమయమైన యజ్ఞసాధనల కంటె
జ్ఞానసాధన యనెడు యజ్ఞమ్మెమేలు;
సకలకర్మముల్ నిరవశేషమ్ము లగుచు
అంతమొందు నాత్మజ్ఞాన మందె తుదకు.

తా॥ సకల కర్మములు నిశ్శేషముగా జ్ఞానమునందే పరిసమాప్తి నందుచున్నవి. అందువలన ద్రవ్యమయమైన యజ్ఞములకంటె జ్ఞానయజ్ఞమే శ్రేష్ఠమైనది.

34. తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః॥

బ్రహ్మతత్వజ్ఞులౌ జ్ఞానివరులె నీకు
జ్ఞానముపదేశ మొనరింపఁగలరు పార్థ!
తెలిసికొనుము వారికి నమస్సులు ఘటించి
సేవలొనరించి, ప్రశ్నించి చిత్తమెఱిఁగి.

తా॥ అర్జునా! బ్రహ్మతత్త్వమెఱిగిన జ్ఞానులే నీకు సదుపదేశ మొసంగగలరు. వారి వద్దకు బోయి సాష్టాంగనమస్కారము లొనర్చి, తగు సేవలొనర్చి, సమయ మెఱిగి ప్రశ్నించి సందేహములు తీర్చికొనుచు జ్ఞానమును సంపాదింపుము.

35. యజ్ఞాత్వా నపునర్మోహ మేవం యాస్యసి పాణ్డవ।
యేన భూతాన్య శేషేణ ద్రక్ష్య స్యాత్మన్యథోమయి॥

ఎట్టిజ్ఞానమ్ము వలన నీవిట్టి భ్రమను
తిరిగిపొందవొ, నీవిక దేనిచేత
అఖిలభూతజాలమును నీయందు చూచి,
పిదప నాయందు చూడగల్గుదువొ, అర్జు
నా! తెలిసికొనుమట్టి జ్ఞానమును నీవు.

తా॥ అర్జునా! ప్రస్తుతము నీకు కలిగిన భ్రాంతిని ఏ జ్ఞానమును తెలిసికొన్నచో నీకు తిరిగి కలుగదో, దేనిచేత నీవు ఈ సమస్తమైన ప్రాణికోట్లను నీయందు చూడ గలిగి, పిమ్మట నాయందు చూచెదవో ఆ విధమైన జ్ఞానమును తెలిసికొనుము. (తన యందున్న ఆత్మస్వరూపమే అన్ని ప్రాణులయందున్నదని తెలిసికొనిన వానికి అందఱి యందున్న ఏకత్వభావము గోచరించును. అది అందఱను తనయందు చూచుటయే. ఆ స్థితి పరమాత్మను తెలిసికొనుటయే అనగా సర్వమును పరమాత్మయందు చూచుటే)

36. అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః।
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి॥

పాపు లందఱికంటె పాపమునుచేసి
నట్టి వాడవే పార్థ! నీవయినగూడ
జ్ఞానమను నావ ఆశ్రయమైన యెడల
దాటగలవు పాపమను సంద్రమును నీవు.

తా॥ అర్జునా! నీవు పాపులలో మహాపాపివే అయినను జ్ఞానమును ఆశ్రయించిన యెడల ఆ జ్ఞానమను నావచేతనే పాపమును దాటగలవు.

37. యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున।
జ్ఞానాగ్నిస్సర్వ కర్మాణి భస్మసాత్కురుతే తథా॥

అర్జునా! యెట్లు సంజ్వలితాగ్ని రగిలి
కట్టెలన్నిటి భస్మముగా నొనర్చు
నాప్రకారముగా జ్ఞాన మనెడు నగ్ని
సర్వవిధకర్మములను నాశనమొనర్చు.

తా॥ అర్జునా! బాగుగా మండింపబడిన అగ్నియందు కట్టె లేవిధముగా భస్మమగునో, అట్లే జ్ఞానమను అగ్నియందు సంచిత కర్మములన్నియు పూర్తిగా దగ్ధములగును.

38. నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే।
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విన్దతి॥

జ్ఞానతుల్యమై పావనమైన వస్తు
వొక్కటియు కానుపింప దీ యుర్వియందు,
యోగసిద్ధుడు తానె కాలోచితముగ
ననుభవించు నీజ్ఞానము నాత్మయందె.

తా॥ ఈ ప్రపంచమున జ్ఞానమునకు సమానమై పవిత్రమైన వస్తు వొక్కటియు లేదు. కర్మయోగసిద్ధినందిన వానికి కాలక్రమమున అట్టి నిర్మలజ్ఞానము ఆత్మయందు కలుగును.

39. శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేన్ద్రియః।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తి మచిరేణాధిగచ్ఛతి॥

ఇంద్రియముల నెల్లను నిరోధించియుంచి,
జ్ఞానసంపాదమునందె శ్రద్ధగలుగు
వాడు, తప్పక జ్ఞానలాభమ్ము నంది
త్వరితముగ పొందగల్గును పరమశాంతి.

తా॥ ఇంద్రియములను వశమునందుంచుకొని, జ్ఞానసంపాదనమునందు శ్రద్ధ గలిగి యున్నవాడు శీఘ్రముగ జ్ఞానవంతుడై పరమశాంతిని గూడ పొందగల్గును.

40. అజ్ఞశ్చా శ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి।
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః॥

జ్ఞానశూన్యునకును శ్రద్ధహీనునకును
సంశయమనస్కునకును నాశనమె కల్గు;
సంశయాత్ముడై యుండెడు జనున కెపుడు
లేదిహమ్మును, పరమును, లేదుసుఖము.

తా॥ అజ్ఞానికి, జ్ఞానము సంపాదించుటకు శ్రద్ధ లేనివానికిని, సంశయములతోనే నిండియున్న మనస్సు గలవానికిని, నాశమే కలుగును. సంశయచిత్తుడైయున్న నరునికి ఇహము లేదు, పరములేదు, సౌఖ్యమంతకన్నను లేదు. అట్టివాడు ప్రతి దానికిని సందేహించుచు తన కర్తవ్యమును నెఱవేర్చలేడు.

41. యోగసన్న్యస్త కర్మాణం జ్ఞానసంఛిన్న సంశయమ్।
ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నన్తి ధనంజయ!॥

కర్మయోగమున త్యజించి కర్మఫలము
లన్నిటిని, జ్ఞానమున సంశయములనణచి,
ఆత్మతత్త్వవిదుండయి యలరువాడు
కర్మపాశనిబద్ధుండు కాడు పార్థ!

తా॥ నిష్కామ కర్మయోగము వలన కర్మఫలముల త్యజించి, జ్ఞానముచే సంశయముల నివారించుకొని, ఆత్మజ్ఞాని కాగలుగువాడు కర్మబంధములందు చిక్కుకొనడు.

44. తస్మా దజ్ఞాన సమ్భూతం హృత్థ్సం జ్ఞానాసి నాత్మనః
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత॥

కాన, అర్జున! అజ్ఞానకారణమున
జనితమయినట్టి నీచిత్తసంశయమును
జ్ఞానఖడ్గాన నరికి నిష్కామకర్మ
యోగ మొనరింపు; లెమ్మిక యుద్ధమునకు.

తా॥ కావున ఓ అర్జునా! అజ్ఞానముచేతను భ్రమవలనను కలిగిన నీ సందేహములను జ్ఞానమను కత్తిచే నరికివైచి, నిష్కామమగు కర్మమును నిర్వహించుటకు సంసిద్ధుడవు కమ్ము; —యుద్ధమునకు కూడ లెమ్ము.

ఇది ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు
యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున
సంవాదమునగు శ్రీమద్భగవద్గీత
యందలి జ్ఞానయోగమను
నాల్గవ అధ్యాయము
సమాప్తము

---

# గీతామృతము

## శ్రీమద్భగవద్గీత

## కర్మసన్న్యాసయోగము

## ఐదవ అధ్యాయము : సారాంశము

ప్రధాన విషయము :—

సన్న్యాసమనగా త్యాగము. సర్వకర్మములను వీడి నిర్విషయముగా నుండుట కర్మసన్న్యాసము. కర్మఫలాపేక్షలేని నిష్కామ కర్మయోగమును అభ్యసించిన తరువాతనే కర్మసన్న్యాస పూర్వకమైన ఆత్మస్థితి యలవడును.

ముఖ్యాంశములు :—

సాంఖ్యకర్మయోగముల తారతమ్యము—వాని లక్షణములు—జ్ఞాన, భక్తి, ధ్యాన విషయముల చర్చ.

### సారాంశము

అర్జునునకు మఱల నొక సందేహము కలిగినది. కర్మపరిత్యాగపూర్వకమైన జ్ఞానమును చెప్పి శ్రీకృష్ణుడు కర్మయోగము నా వెంటనే ప్రశంసించుచుండెను. వీనిలో నిశ్చయముగా తనకేది శ్రేయోదాయకమో తెలియగోరగా శ్రీకృష్ణుఁడిట్లు చెప్పెను.

అర్జునా రెండును మోక్షదాయకములే. అవి ఒకటినుండి మఱియొకటి భిన్నము గాదు. కర్మయోగము శీఘ్రఫలితముల నిచ్చును. రాగద్వేషములు, సుఖదుఃఖములు, మానావమానాది ద్వంద్వముల కతీతుఁడైన నిష్కామ కర్మయోగి నిత్యసన్న్యాసియే. జ్ఞానసిద్ధికి నిష్కామకర్మము ప్రాతిపదిక,

ప్రథమ సోపానము. ఈ కర్మయోగము వలన గూడ బ్రహ్మసాయుజ్యమే లభించును.

చిత్తశుద్ధిప్రాప్తికి కర్మయోగము ముఖ్యము. కర్మములను ఎట్టి ఫలాపేక్షలేక పరమేశ్వరార్పణముగనే భావించి ఆచరించవలెను. అన్ని ప్రాణులయందున్న ఆత్మయు నొకటియే యను సమత్వబుద్ధి యున్నపుడే ఆత్మ దర్శనమగును. అట్టి సమదృష్టి గలిగిన మనుజుని కర్మములంటవు. చూచుట, వినుట తుదకు ఉచ్ఛ్వాసనిశ్వాసములు మున్నగు పనులన్నియు ఇంద్రియములు స్వాభావికము వర్తించుట వలననే నిర్వహింపఁబడుచున్నవి. తానై చేయుచున్నదేమియులేదని గ్రహించగలిగిన యోగికి వానియందు ఆసక్తి కాని అభిమానము గాని ఉండదు. అందువలన నతఁడు కర్మబద్ధుఁడు గాడు. అతనిని పాపము లంటవు.

జన్మాంతర సంస్కారముల వలన లభించిన యెవరి పుణ్యాపాపములు వారివి. భగవానుఁడు వానిని గ్రహింపఁడు. వానిని భగవానుని కారోపించుట భ్రమ మాత్రమే.

ఇంద్రియనిగ్రహుఁడైన కర్మయోగికి చిత్తశాంతి లభించును. తక్కిన వారికది ప్రాప్తము కాదు. ఆ యోగియె మనస్సుచే కర్మములను త్యజించి తానేమియు చేయక, చేయించక తన యాత్మయందే పరమసుఖము ననుభవించును.

లోని అజ్ఞానమును క్రమక్రమముగ నశింపఁజేయవలెను. పరమాత్మనే పరమగతిగ శరణు పొందవలెను. ఉత్తమ (గోవు) నీచ (కుక్క) భేదములు లేక, సర్వమున సమబుద్ధిని పెంపొందింపవలెను. అట్టి సమబుద్ధియున్న వానికి సుఖదుఃఖములందు సంతోషద్వేషము లుండవు. అతడు సంసారమును తరించి భగవంతునియందున్నట్లే. ఋషులనగా వారే. వారికి మఱి పునర్జన్మ లేదు.

ప్రాపంచిక సుఖములెల్ల వచ్చుచు పోవుచుండును. ఈ అశాశ్వతము లగు వానియందు జ్ఞానికి ఆసక్తి కలుగదు. అవ్యయమైన ఆత్మజ్ఞానానందమే జ్ఞానియొక్క లక్ష్యము.

శరీరము శిథిలము కాకముందే కామకోపముల నణచుటకు ప్రయత్నములు సాగవలెను. ధ్యాననిష్ఠతో ఆత్మయందు జ్ఞానకాంతి వెలుగునటుల చేసికొనవలయును. అట్టి స్థితియందే జీవునకు పరమాత్మయందైక్య భావము కలుగును. అట్టి ఆత్మవేత్తలు సర్వమునందును పరబ్రహ్మమును గాంచెదరు.

ఆశ, కోపము, భయము, అను గుణములను వీడి, ఇంద్రియము లందును మనస్సునందును చాంచల్యములేక, కనుబొమల మధ్యయందు దృష్టిని నిల్పి, ప్రాణాయామము నొనరించుచు ధ్యాననిష్ఠ నభ్యసించవలెను. తపములకు యజ్ఞములకు భోక్తనుగను, అన్ని ప్రాణులకును క్షేమంకరుడైన హితునిగను నన్నెఱిగి మననశీలి కావలెను. అట్టి యోగియే పరమశాంతిని పొందగలుగును.

ఈ అధ్యాయమందలి ముఖ్య శ్లోకములు.

1, 2, 8, 9, 12, 15, 23, 24, 27, 28

# శ్రీ మ ద్భ గ వ ద్గీ త

## ఐదవ అధ్యాయము

## క ర్మ స న్న్యా స యో గ ము

అర్జున ఉవాచ: అర్జునుఁడు అడిగెను.

1. సన్న్యాసం కర్మణాం కృష్ణ! పునర్యోగం చ శంససి।
యచ్ఛ్రేయ ఏతయో రేకం తన్మేబ్రూహి సునిశ్చితమ్॥

కృష్ణ! కర్మసన్యాసమే శ్రేయ మనుచు
చెప్పి, కర్మయోగమును మెచ్చెదవు మరల,
రెంటియందున నాకేది శ్రేయమగునొ
నిశ్చయమ్ముగ నద్దానినే వచింపు.

తా॥ ఓ కృష్ణా! జ్ఞానమును సంపాదించుటయే మేలని చెప్పి మరల నిష్కామ కర్మయోగమును ప్రశంసించుచున్నావు. ఈ రెంటిలో నాకేది మేలొనగూర్చునో దానినే నిశ్చయించి చెప్పుము.

శ్రీభగవానువాచ:— శ్రీభగవానుఁడు చెప్పెను.

2. సన్న్యాసః కర్మయోగశ్చ నిః శ్రేయసకరావుభౌ।
తయోస్తు కర్మసన్న్యాసాత్ కర్మయోగో విశిష్యతే॥

కర్మసన్యాస, నిష్కామకర్మము లను
నివ్విరెండును మోక్షము నిచ్చునవియె;
కాని, రెంటిలో కర్మయోగమ్మె భువిని
కర్మసన్యాసయోగమ్ము కంటె మేలు.

తా॥ కర్మత్యాగముతో కూడుకొనిన జ్ఞానయోగము, కర్మఫలముల నాసింపని నిష్కామ కర్మయోగము రెండును మోక్షదాయకములే. కాని, ఈ రెంటియందు కర్మయోగమే కర్మసన్యాసముకంటె మేలైనది,

3. జ్ఞేయస్స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి।
నిర్ద్వన్ద్వో హి మహాబాహో సుఖం బన్ధాత్ప్రముచ్యతే॥

అర్జునా! సుఖదుఃఖాదు లైన ద్వంద్వ
ముల కతీతుఁడై, యెట్టి వాంఛలునులేక
దేనియందును ద్వేషమ్ము లేనివాఁడు
నిత్యసన్న్యాసి; కర్మ బంధింప దతని.

తా॥ ఓ అర్జునా! దేనిని ద్వేషింపనివాడు, దేనిని కోరనివాడు, ఎల్లప్పుడును సన్న్యాసియే, త్యాగబుద్ధికలవాడే. అట్టి వాడు సుఖదుఃఖాది ద్వంద్వముల కతీతుడు కావున అతనిని కర్మములు బంధింపవు.

4. సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పణ్డితాః।
ఏకమప్యాస్థితః సమ్యగుభయోర్విన్దతే ఫలమ్॥

జ్ఞానకర్మయోగములు భిన్నములైన
వందు రవివేకులే, విజ్ఞు లట్లులనరు;
వానిలో నిష్ఠతో నొకదాని నైన
నిర్వహించిన, వచ్చు రెండింటిఫలము.

తా॥ అవివేకులు జ్ఞానయోగము కర్మయోగము వేఱువేఱు అని తలంతురు, పండితు లట్లు చెప్పరు. ఈ రెంటిలో ఏ ఒక దానినైనను నిష్ఠతో ఆచరించినచో రెండింటిలో చెప్పబడిన ఫలితము పొందవచ్చును.

5. యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే।
ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి॥

జ్ఞాననిష్ఠులుపొందు మోక్షమునె చేర
గలరు, నిష్కామకర్మయోగులును కూడ;
రెండుయోగములను సమరీతి గాంచు
వాడె నిజమును చూచిన పండితుండు.

తా॥ జ్ఞానయోగులు ఏ మోక్షపదవిని పొందుదురో కర్మయోగులును దానినే పొందగలరు. రెండు యోగములును ఒకేరీతి ఫలము నిచ్చునవిగ చూచువాడే నిజమును కనుగొనిన పురుషుడు.

6. సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తు మయోగతః।
యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి॥

కర్మయోగ మభ్యస్తము కానియెడల
కర్మసన్న్యాస మందుట కష్టతరము;
కర్మయోగ మనుష్ఠింప గలుగు మునియె
శీఘ్రకాలాన బ్రహ్మసంస్థితిని పొందు.

తా॥ నిష్కామ కర్మయోగసాధన లేకుండ కర్మసన్న్యాసమును పొందుట కష్టతరము. కర్మయోగమును చక్కగ ననుష్ఠింపగలిగిన మునియె త్వరితముగ బ్రహ్మ సాయుజ్యమును పొందును.

7. యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేన్ద్రియః।
సర్వభూతాత్మ భూతాత్మా కుర్వన్నపి న లిప్యతే॥

నిర్మలాత్ముఁడు, నిర్జితేంద్రియుఁడు, కర్మ
యోగి, నియతచిత్తుఁడు తనయుల్లమందు
అఖిలభూతజాలమ్మున నలరుచున్న
యాత్మ, తనయాత్మయొక్కటే యనితలంచి,
కర్మముల నొనర్చియు నందు కట్టుబడడు.

తా॥ మనస్సును ఇంద్రియములను జయించి, నిర్మలాత్ముఁడై సర్వభూతముల యందున్న ఆత్మయు, తన యాత్మయు ఒక్కటే పరమాత్మ అంశగా భావించువాడు కర్మము నాచరించుచున్నను కర్మబద్ధుడు కాడు.

8. నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్।
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్

9. ప్రలపన్ విసృజన్ గృహ్ణ న్నున్మిషన్ని మిష న్నపి।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్ ॥

చూచుచుండుట, వాసనచూచుటయును.
తినుట. నడచుట, వినుట, నిద్రించుటయును
శ్వాసవిడచుట, చేతితో తీసికొనుట,
మలవిసర్జనచేయుట, మాటలాడు
టయును, తాకుట, రుచిచూచుటయును, తుదకు
కనులుమూసి తెరచు టాది, కర్మచయము
ఇంద్రియములు తమంత కావించుచున్న
చేష్టలే గాని తానుగా చేయు కార్య
మించుకంతయు లేదని యెంచువాడు
తత్త్వవేత్తయు యోగసాధనపరుండు.

తా॥ పరమార్థతత్త్వము నెఱిగిన యోగవేత్త చూచుట, వినుట, మున్నగు ఆయా సర్వకార్యములందు ఇంద్రియములే ప్రవర్తించుచున్నవని గ్రహించి తానెట్టి కర్తృత్వభావమును పొందడు.

10. బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః।
లిప్యతే న సపాపేన పద్మపత్రమివామ్భసా ॥

అంబువులు తామరాకున కంటనటుల.
కర్మఫలకాంక్షను త్యజించి కర్మములను
ప్రీతితో పరమాత్మ కర్పించుచున్న
వాని నంటబోవెట్టి పాపములు గూడ.

తా॥ నీరు తామరాకు నంటని విధముగానే, కర్మములన్నియును పరమేశ్వరార్పణముగనే భావించి చేయుచు కర్మఫలము నాశింపనివానిని పాపము లంటవు.

11. కాయేన మనసా బుద్ధ్యా కేవలైరిన్ద్రియైరపి।
యోగినః కర్మకుర్వన్తి సఙ్గంత్యక్త్వాఽఽత్మశుద్ధయే ॥

కర్మఫలకాంక్ష త్యజియించి, కర్మయోగు
లాత్మశుద్ధికొఱకె, ఇంద్రియములచేత,
తమమనస్సుచే, బుద్ధిచే, తనువుచేత
నాచరింతురు కర్మమ్ము లవని యందు.

తా॥ కర్మయోగులు, ఏ విధమయిన ఆసక్తి లేకయే, తమ ఇంద్రియములు, తనువు, మనస్సు, బుద్ధిచేత, కేవలము ఆత్మశుద్ధి కొఱకె సత్కర్మము లాచరింతురు.

12. యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తిమాప్నోతి నైష్ఠికీమ్।
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే ॥

కర్మఫలవాంఛల త్యజించి, కర్మయోగి
పొందగల డాత్మనిష్ఠచే మోక్షశాంతి;
కర్మయోగనిష్ఠుఁడు కాక కర్మఫలము
కోరువాడు బద్ధుఁడగు సంసారమందు.

తా॥ కర్మఫలములను త్యజించిన కర్మయోగి ఆత్మ నిష్ఠాస్వరూపమగు మోక్ష శాంతిని పొందును. అట్టి నిష్ఠలేక కర్మఫలములందే ఆసక్తి కలుగువాడు సంసార బంధములందే చిక్కుపడి యుండును.

13. సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ।
నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్నకారయన్ ॥

కర్మముల మనశ్శుద్ధిగా ద్యజించి
ఎట్టిపనియు చేయకయు, చేయింపకుండు
దేహి, నిత్యమ్ము నిర్జితేంద్రియుఁడు నగుచు
పట్టణప్రాయమై నవద్వారమైన
ఈశరీరము నందు సుఖించుచుండు.

తా॥ కర్మములను మనసా త్యజించి, ఇంద్రియనిగ్రహుండై ఎట్టి పనియు తాను చేయకయు, చేయింపకయు యున్న కర్మయోగి నవద్వారములు గల పురమువలెనున్న ఈ శరీరమునందు సుఖించుచుండును.

(2 కన్నులు, 2 చెవులు, 2 ముక్కురంధ్రములు, 1 నోరు, 2 మలమూత్ర విసర్జన రంధ్రములు ఇవి తొమ్మిదియు శరీరమందలి నవద్వారములు)

14. న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః ।
న కర్మఫలసంయోగమ్ స్వభావస్తు ప్రవర్తతే ॥

కలుగజేయ డీశ్వరు డెట్టికర్మములను
గాని, కర్తృత్వములుగాని, కర్మఫలము
లందు సంబంధములుగాని, ప్రాణితతికి;
పరగు నవియెల్ల ప్రకృతిస్వాభావికముగ.

తా॥ ప్రాణులకు ఎట్టి కర్మములను, కర్తృత్వభావములను కర్మఫలములతోడి సంబంధములను ఈశ్వరుఁడు కలుగజేయఁడు. జన్మాంతర సంస్కారమువలన గలిగిన ప్రకృతి స్వాభావికముగ నవి కలుగుచున్నవి.

15. నాదత్తే కస్యచిత్పాపం న చైవ సుకృతం విభుః ।
అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః ॥

ఈశ్వరుఁడు తాను గ్రహియింప డెవనియొక్క
పాపములు పుణ్యములనైన; వారియొక్క
జ్ఞానమును కప్పియున్న అజ్ఞానకార
ణమున ప్రాణులు మోహజాలమున మునుగు.

తా॥ ఈశ్వరుఁడెవని యొక్క పాపములను గాని పుణ్యమును గాని స్వీకరింపడు. సాక్షిమాత్రుఁడే. అజ్ఞాన కారణముచేత నే వివేకమును గోల్పోయి భ్రమలోబడిన ప్రాణులు వీనిని పరమాత్మ కారోపింతురు. వారి వారి పుణ్యపాపములను జీవులువారే చేసికొనుచున్నారు. అనుభవించుచున్నారు. ఇది వారి జన్మాంతరసంస్కార ఫలము.

16. జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః ।
తేషా మాదిత్యవత్ జ్ఞానం ప్రకాశయతి తత్పరం ॥

జగతి నెవ్వ రాత్మజ్ఞాన శక్తివలన
నాసమొనరింపగలరో అజ్ఞానపటలి
వారిజ్ఞానము సూర్యునివలె వెలింగి,
చేయు పరతత్త్వమును ప్రకాశించునటుల.

తా॥ ఎవరు ఆత్మజ్ఞానము వలన తమ అజ్ఞానమును నశింపజేయగలుగుదురో వారి జ్ఞానము సూర్యునివలె తేజస్సు కలదియై ఆత్మయందు పరబ్రహ్మస్వరూపమును ప్రకాశింప జేయును.

17. తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః।
గచ్ఛ న్త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః॥

అట్టిపరమాత్మనె గతిగ నాశ్రయించి
మానసము బుద్ధియును పరమాత్మయందె
నిలిపి, నిష్ఠులై జ్ఞాననిర్దళితపాపు
లైన వారందుదురు జన్మలేని ముక్తి.

తా॥ ఆ పరమాత్మనే గతియని యాశ్రయించి, మనస్సును బుద్ధిని పరమాత్మ యందె నిష్ఠతో లగ్నముచేసి, దాని వలన పొందిన జ్ఞానముచే పాపములను నశింప జేసికొనినవారు పునర్జన్మలేని ముక్తిని పొందుదురు.

18. విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని।
శుని చైవ శ్వపాకే చ పణ్డితాః సమదర్శినః॥

వినయ విద్యావిభవు డైన విప్రునందు,
గోవునందు, ఏనుగునందు, కుక్కయందు
కుక్కమాంసము తిను హీనగుణుని యందు
పండితుఁడు సమదృష్టితో పరగు చుండు.

తా॥ జ్ఞానులు —విద్యావంతుఁడైన బ్రాహ్మణునందు, ఏనుగునందు, గోవునందు, కుక్కయందు, కుక్కమాంసము తినువానియందు గూడ సమదృష్టి కలిగియుందురు. అన్ని ప్రాణులయందు వారు పరమాత్మనే దర్శించుచు సమభావమును కలిగియుందురు.

19. ఇహైవ తైర్జితః సర్గో యేషాం సామ్యే స్థితం మనః।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః॥

హృదయమున స్థిరమగు సమదృష్టి గలుగు
వారిహామునందె భవము గెల్వంగ గలరు;
సర్వసమమును విగతదోషమ్ము నైన
బ్రహ్మమును వారు స్థిరముగ పడసినట్లై.

తా॥ మనస్సునందన్ని ప్రాణుల యెడల సమభావము కలవారు ఈ లోకము నందే జననమరణములను జయించిన వారగుదురు. బ్రహ్మము దోషములేనిది, అన్నిటి యందును సమముగా నుండునది గాన వారు బ్రహ్మము నందున్న వారే.

20. న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియమ్ ।
స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మ విద్బ్రహ్మణి స్థితః ॥

మోహరహితుఁడు సుస్థిరబుద్ధిశాలి
బ్రహ్మనిష్ఠాయుతుండును బ్రహ్మవేత్త
ముదమునొందబోడు ప్రియమ్ము లొదవినపుడు,
అప్రియములందు దుఃఖమ్ము నందబోడు.

తా॥ భ్రాంతి లేనివాడు, నిశ్చలమైన బుద్ధిగలవాడు, బ్రహ్మవిదుడును, ప్రియములకు సంతోషపడడు. అప్రియములకు దుఃఖపడడు. రెండిటియందును అతని మనస్సు సమభావమున వర్తించును.

21. బాహ్య స్పర్శే ష్వసక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖమ్ ।
స బ్రహ్మయోగ యుక్తాత్మా సుఖమక్షయ మశ్నుతే ॥

స్వాంతమందు బాహ్యవిషయాసక్తి లేని
వాడె ఆత్మసుఖమ్మును బడయగలఁడు,
అతడు బ్రహ్మయోగసమాధి నలరుచుఁడి
అక్షయమ్మగు నానంద మనుభవించు.

తా॥ ప్రాపంచిక విషయములందు ఆసక్తిని పెట్టుకొననివాడే ఆత్మసుఖమును పొందుచున్నాడు. అతడే బ్రహ్మనిష్ఠను కలవాడై శాశ్వతమగు సుఖమును అనుభవించు చున్నాడు. బాహ్యవిషయములందాసక్తి లేనపుడు మనస్సు అంతర్దృష్టి గలిగి ఆత్మ స్థితిని తెలిసికొనును.

22. యేహి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే।
ఆద్య_న్త వ_న్తః కౌంతేయ న తేషు రమతే బుధః ॥

పార్థ! విషయసంయోగమ్ము వలన కలుగు
సౌఖ్యభోగము లవని శాశ్వతము కావు;
అపయిని దుఃఖహేతువు లగును గూడ
కాన, బుధులకుండదు ప్రీతి వానియందు.

తా॥ ఇంద్రియ విషయములతోడి సంయోగము వలన కలుగు సుఖములు వచ్చుచు పోవుచుండును. శాశ్వతములు కావు. పైగా అవి దుఃఖమునకు కారణములు కూడ. అందుచే జ్ఞానులయినవారికి అట్టి సుఖములయందు ప్రీతి లేదు. అట్టి విషయేంద్రియ సుఖము నిజమునకు సుఖము కాదు. మనస్సును పెడత్రోవల పెట్టునదియే.

23. శక్నో తీహైవ యస్సోఢుం ప్రాక్శరీర విమోక్షణాత్।
కామ_క్రోధోద్భవం వేగం స యు_క్తః స సుఖీ నరః॥

కాయ మీభువి పతనము గాక ముందె
కామకోపగుణముల వేగమ్ము నెవ్వఁ
డణచికొన శ_క్తిమంతుఁడొ, అతఁడె యోగ
యుక్తుఁడును శాశ్వతసుఖమ్ము నొందువాడు

తా॥ మరణము ప్రా_ప్తించినచో చేయునదియే లేదు. అందుచే మరణమునకు పూర్వమే కామము కోపము అను గుణముల యొక్క తీవ్రతను నిరోధింపగలిగినపుడె యోగసిద్ధిని పొందినవాడై మనుజుడు శాశ్వత సుఖము నందును.

24. యోఽ_న్తః సుఖోఽ_న్త రారామ _స్తథా న్తర్జ్యోతి రేవ యః।
స యోగీ బ్రహ్మనిర్వాణమ్ బ్రహ్మ భూతోఽధి గచ్ఛతి ॥

అలరు నెవని కాత్మధ్యాన, మాత్మసుఖము,
కలుగునెవనికి నాత్మలో జ్ఞానకాంతి,
అట్టి యోగనిష్ఠుండు బ్రహ్మస్వరూపు
డగుచు బ్రహ్మసాయుజ్యము నందగలడు.

తా॥ ఆత్మధ్యానము కలిగి, ఆత్మసుఖము ననుభవించుచు, ఆత్మజ్ఞాన ప్రకాశమును పొందగలిగిన యోగనిష్ఠుడు బ్రహ్మస్వరూపుడగుచు పరమాత్మతో ఏకీభావము నందును. బాహ్యసుఖముల నిచ్ఛగింపని శుద్ధవైరాగ్యభావమున ఆత్మజ్ఞానియై బ్రహ్మ నిర్వాణ స్థితిని పొందును.

25. లభన్తే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః।
ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితే రతాః॥

పాపరహితులు, ద్వంద్వభావముల నణచి
యింద్రియములనెల్లను నిగ్రహించువారు,
అఖిలభూతహితాత్ములై యలరు ఋషులు;
పడయుచున్నారు బ్రహ్మకైవల్యపదము.

తా॥ పాపములు పోగొట్టుకొనినవారు, సుఖదుఃఖాది ద్వంద్వముల కతీతులు, ఇంద్రియనిగ్రహులు, సర్వభూతములయందు సమహిత బుద్ధికలవారే ఋషులు. వారే బ్రహ్మసాయుజ్యమును పొందుచున్నారు. పై నుడివిన గుణములన్నియు ఋషిత్వమునకు సాధనములు.

26. కామక్రోధ వియుక్తానాం యతీనాం యతచేతసామ్।
అభితో బ్రహ్మ నిర్వాణమ్ వర్తతే విదితాత్మనామ్॥

మనసు స్వాధీన మందుంచుకొనినవారు,
కోరికలు, కోపమునులేనివారు; ఆత్మ
తత్త్వవేత్తలు, యోగసాధకులు నైన
వారికి లభించు సర్వత్ర బ్రహ్మపదము.

తా॥ వాంఛలు కాని, వాంఛల వలన కలుగు కోపము గాని లేనివారు, మనస్సును విషయసుఖముల వైపునకు పోకుండ చేయగల్గినవారు, ఆత్మయొక్క యథార్థము నెఱిగినవారు యోగసాధన కలవారు అన్ని విధములుగ బ్రహ్మసాయుజ్య మునే పొందుచున్నారు.

27. స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాం శ్చక్షుశ్చైవాన్తరే భ్రువోః।
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యన్తర చారిణౌ॥

28. యతేన్ద్రియ మనో బుద్ధి ర్మునిర్మోక్ష పరాయణః।
విగతేచ్ఛా భయక్రోధో యస్సదా ముక్త ఏవ సః॥

ఇంద్రియసుఖమ్ములను జేరనీక దరికి,
దృష్టినిల్పుచు భ్రూమధ్యదేశమందు,
ముక్కునందు ప్రాణాపానముల సమప్ర
సారమొనరించి, —కోప, మిచ్ఛయును, భయము
పూర్తిగత్యజించి—ఇంద్రియమ్ములను, బుద్ధి
మానసము, నిగ్రహించి, స్వాధీనపరచి—
సతతమననశీలి యయి మోక్షమునుగోరు
మునికి లభియించు నెల్లప్డు ముక్తిపదము.

తా॥ ఇంద్రియసుఖములను బయటకునెట్టి—ఆశ, కోపము, భయమును విడనాడి—బుద్ధి, మనస్సు, ఇంద్రియములకు చాంచల్యము లేకుండచేసి—నాసికామార్గమున ప్రాణాపానవాయువుల ప్రసారము సమానముగ నొనర్చి—కనుబొమల మధ్య దృష్టిని నిల్పి—ధ్యానము చేయు మునికి సదా ముక్తి లభించును.

29. భోక్తారం యజ్ఞతపసాం సర్వలోక మహేశ్వరమ్।
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తి మృచ్ఛతి॥

ఎల్లలోకమ్ములకును మహేశ్వరునిగ,
ఎల్లప్రాణులకు పరమహితుడననుచు,
భోక్త ననుచు తపోయజ్ఞములకు గూడ,
నన్నెఱుగుయోగి పొందుచున్నాడు శాంతి.

తా॥ అన్ని లోకములకు ప్రభువునిగను, అన్ని ప్రాణులకు హితమొనర్చువానిగను, తపోయజ్ఞముల కన్నిటికి భోక్తనుగను నన్నెఱుంగువానికి పరమశాంతి లభించుచున్నది.

ఇతి ఉపనిషద్దర్థప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును,
శ్రీకృష్ణార్జున సంవాదమువగు శ్రీమద్భగవద్గీత యందలి
కర్మసన్న్యాసయోగమను పంచమాధ్యాయము
* సమాప్తము *

# గీతామృతము

## శ్రీమద్భగవద్గీత

## ఆత్మసంయమయోగము

## ఆరవ అధ్యాయము : సారాంశము

ప్రధాన విషయము :—

ఇదియే ధ్యానయోగము. దేహేంద్రియములను, మనస్సును, బుద్ధిని చాంచల్యము లేక నిరోధించి ధ్యానమార్గమందు ఆత్మను నెలకొల్పుట, యిందు చర్చింపబడినది.

ఇందలి ముఖ్యాంశములు :—

యోగసిద్ధుని గుణములు — ఆత్మోద్ధరణము — ధ్యానవిధానము—మనోనిగ్రహము — యోగసిద్ధిసాధన.

## సారాంశము

శ్రీకృష్ణభగవానుఁడిట్లు చెప్పెను.

అర్జునా ! కర్మఫలము నాశింపని నిష్కామకర్మాచరణుడే సన్యాసియును, యోగియును. కేవలము బాహ్యాడంబరమునకై అగ్నిహోత్రాది క్రియలను కర్మములను వదలినంతమాత్రముచేత కాదు. కామవాసనా రహితమైన చిత్తనైర్మల్యమలవడవలెను. ధ్యానయోగికి నిష్కామకర్మమే సాధనము. ఆ యోగనిష్ఠ సాధించినవానికి కర్మనివృత్తిరూపమైన చిత్తశాంతియే ముఖ్యలక్షణముగా నుండును. విషయసుఖములందును కర్మములందును ఆసక్తిలేనివాఁడు, సంకల్పరహితుఁడు అయిన వ్యక్తియే యోగసిద్ధుఁడు.

ఆత్మను పాడొనరింపకూడదు. పరిశుద్ధమై నియతమైన మనస్సుచే ఎవరి ఆత్మను వారు ఉద్ధరించుకొనవలెను. ఆత్మను పరమాత్మధ్యానమందే యుంచవలెను. లేనియెడల మలినమైన తన మనస్సే తనకు శత్రువై హాని చేయును.

సుఖదుఃఖములు, మానావమానములు మున్నగు ద్వంద్వములకు అతీతుఁడై, సర్వప్రాణులయెడ సమబుద్ధి కలిగి, నిర్వికారుడైనవానికే పరమాత్మధ్యానము లభించును.

యోగసాధకుఁడు శుచియైన ప్రదేశమున దర్భాసన మేర్పఱుచుకొని. మనస్సు నటునిటు పోనీయక ఏకాగ్రచిత్తుడై ఏకాంతముగ ధ్యానసాధన సల్పవలయును. నిర్భయము, బ్రహ్మచర్యము, చిత్తప్రశాంతత పాటించ వలెను. మనోనిగ్రహముగల యోగి ఆత్మధ్యానవంతుడై మోక్షరూపమైన శాంతిని పొందుచున్నాడు. ఆహారము, నిద్ర, ప్రవర్తన, మెలకువ వీని యన్నిటియందును మితమైన పద్ధతులే గాని విపరీతమైన అలవాట్లుండరాదు. ఈ సాధనకు కావలసినది నిశ్చలమైన చిత్తము,

నిగ్రహింపబడిన మనస్సునందే శాంతియు, దుఃఖసంబంధములేని ఆనందానుభవము కలుగును. అట్టి స్థితియే ఆత్మ సాక్షాత్కారమనబడుచున్నది. సంకల్పములు, కోరికలు పూర్తిగా త్యజించి, బాహ్యవిషయములనుండి మనస్సును మరల్చి క్రమక్రమముగా మనస్సును ఆత్మధ్యానమందుంచ వలెను. అటునిటు పరుగులెత్తు మనస్సును తిరిగి మరలించి తీసికొని రావలెను. అట్టి ధ్యానయోగికి సర్వోత్తమమగు ఆత్మానందము లభ్యమగు చున్నది. సమబుద్ధి కలిగి, అందటి కష్టసుఖములు తన అనుభవములవంటి వే యని గ్రహించి, సర్వత్ర పరమాత్మను, పరమాత్మయందు సర్వమును ధ్యానయోగి చూడగల్గును. అట్టి యోగి బ్రహ్మస్థితిని పొందినవాడే.

మనస్సు నిజముగా చంచలమైనది, కట్టుబాటొనరించుట కష్టము. కాని అభ్యాసము వలన నది సాధ్యమగును. మనస్సును జయింపలేనివానికి

యోగసిద్ధి లభ్యము కాదు. ఒకవేళ ఇట్టి యోగసాధనలో మొదటినుండియు శ్రద్ధ కలిగి తుట్టతుదకు సిద్ధిపొందజాలనివాడైనను భ్రష్టుఁడు కాడు. సత్ప్రయత్నము కలవారి కెప్పుడును దుర్గతి కలుగదు. అట్టి మనుజుడు చాల కాలము పుణ్యలోకము లనుభవించి తిరిగి భూమియందు భాగ్యవంతులు, సదాచారులు లేదా యోగసాధకులున్న గృహములందు జన్మించి పూర్వవాసనా బలముచే తిరిగి యత్నమొనర్చి యోగసిద్ధుఁడగును

యోగియే తపస్వులకంటెను, శాస్త్రజ్ఞానులకంటెను శ్రేష్ఠుడు. యోగు లందరిలో మనస్సును సదా నాయందు లగ్నమొనర్చి ధ్యానించువాడు మిక్కిలి ఉత్తముడు. కాబట్టి అర్జునా, నీవట్టి ధ్యానయోగివి కమ్ము.

ఈ అధ్యాయమందలి ముఖ్యశ్లోకములు.

1, 3, 5, 7, 8, 11–14, 17, 24, 25, 29,

35, 37, 40, 45, 46, 47.

# శ్రీ మ ద్భ గ వ ద్గీ త

## ఆరవ అధ్యాయము

## ఆ త్మ స ం య మ యో గ ము

శ్రీభగవానువాచ :— శ్రీభగవానుఁడు చెప్పెను.

1. అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః।
స సన్న్యాసీ చ యోగీచ న నిరగ్నిర్న చాక్రియః॥

కర్మఫలములం దిసుమంత కాంక్షలేక,
చేయదగిన సత్కార్మముల్ చేయునతఁడె
అగును సన్యాసి యోగియు నవనియందు;
అగ్నిక్రియల కర్మమ్ముల నాచరింప
తాను మానిన యంతమాత్రమున కాదు.

తా॥ చేయదగినవిగా విధ్యుక్తమైన కర్మములను కర్మఫలాపేక్షలేక చేయువాఁడే సన్యాసియు, యోగియు నగును. కేవలము అగ్నిహోత్రమును, కర్మములను వదలినంతమాత్రమున కాదు. మనుజుఁడు బాహ్యావర్తనములతో పాటు, లోనివాసనలు గూడ నశించినపుడే సన్యాసి కాని, యోగి కాని కాగలడు.

2. యం సన్న్యాస మితి ప్రాహుర్యోగం తం విద్ధి పాణ్డవ।
స హ్యసన్న్యస్త సంకల్పో యోగీ భవతి కశ్చన॥

అర్జునా! దేని సన్యాసమని వచింత్రో,
అదియె యోగమని యెఱుంగు మాత్మయందు;
కామసంకల్పరహితుఁడు కానివాడు
యోగి కాఁజాలఁ డెవఁడు నీయుర్వియందు.

తా॥ అర్జునా! ఏది సన్యాసమని చెప్పఁబడినదో అదియె యోగము కూడ. ఏలయన కామాదిసంకల్పములను త్యజింపలేనివాఁడు యోగి కాజాలడు. కావున సంకల్పరాహిత్యమే సన్యాసము (జ్ఞానము) నకు, కర్మయోగమునకు, ముఖ్యలక్షణము.

3. ఆరురుక్షోర్మునే ర్యోగం కర్మకారణ ముచ్యతే।
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే॥

యోగసిద్ధిని బడయుట కుత్సహించు
మునికి, నిష్కామకర్మమె ముఖ్యగుణము;
అట్టి సిద్ధిని బడయుయోగాత్మునకును
చిత్తశాంతి లక్షణమని చెప్పబడెను.

తా॥ జ్ఞానయోగసిద్ధి పొందగోరువానికి నిష్కామకర్మయే సాధనము. అట్టి సిద్ధిని పడసిన యోగికి చిత్తశాంతియే ముఖ్యలక్షణము. అనగా కర్మనివృత్తిరూపమైన చిత్తశాంతి.

4. యదా హి నేన్ద్రియార్థేషు న కర్మ స్వనుషజ్జతే।
సర్వసంకల్ప సన్యాసీ యోగారూఢ స్తదోచ్యతే॥

కర్మములయందు విషయసౌఖ్యములయందు,
ఎట్టి ఆసక్తిలేక జీవించుచుండి,
సకల సంకల్ప కామవాసనలు వదలు
వాడె యోగసిద్ధుఁడని చెప్పంగబడును.

తా॥ మనుజుఁడెప్పుడు ఇంద్రియవిషయములందును, కర్మములందును ఆసక్తిని కలిగియుండడో, సకల సంకల్పములను త్యజించునో, అప్పుడతడు యోగసిద్ధుఁడని చెప్పబడుచున్నాడు.

5. ఉద్ధరే దాత్మనాఽఽత్మానం నాత్మాన మవసాదయేత్।
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః॥

తనను తానుద్ధరింపఁగ దలపవలెను,
చనగ లా దధోగతికిని తనకుదానే;
తనకుబంధువు శుద్ధమౌ తనమనస్సె,
తనకుశత్రువు మలినమౌ తనమనస్సె.

తా॥ ఎవరికివారు వారి ఆత్మచేతనే వారి ఆత్మ నుద్ధరించుకోవలెను. కాని, వారి యాత్మనధోగతికి త్రోయగూడదు. వారియొక్క నిర్మలినమైన మనస్సే వారికి బంధువు. వారియొక్క కలుషమైన మనస్సు వారికి శత్రువే. గురుశాస్త్రాదులు దారిచూపువారే. ముఖ్యముగ కావలసినది ఆత్మోద్ధరణయందు శ్రద్ధ గలిగిన స్వప్రయత్నము.

6. బన్ధు రాత్మాత్మన స్తస్య యేనాత్మై వాత్మనా జితః।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తే తాత్మైవ శత్రువత్ ॥

ఎవఁడు మనసునీరీతి జయింపఁగలఁడో,
వాని కాతనియాత్మయే బంధువగును;
మనసు నిర్జింపలేనట్టి మానవునకు,
వానియాత్మయే శత్రువై హానిజేయు.

తా॥ మనస్సును జయించి స్వాధీనమందుంచుకొనిన వానికి తన మనస్సు తనకు బంధువై ఉపకరించును. లేనిచో మనసు దుర్విషయములందు ద్రిప్పి శత్రువువలె హాని చేయును. ఇచ్చట కేవలము మనస్సు అనియే కాదు, ఇంద్రియములు శరీరము కూడను. వానిని నియమితము లొనర్చి ఆత్మజ్ఞాన సాధనమున కనువుగా చేసికొనవలెను.

7. జితాత్మనః ప్రశా న్తస్య పరమాత్మా సమాహితః।
శీతోష్ణ సుఖదుఃఖేషు తథా మానావమానయోః ॥

మనసు నిగ్రహించినవాడు, మహితశాంతి
యుతుడు, మానావమాన—శీతోష్ణములను—
కష్టసుఖముల—సమబుద్ధి గలిగియుండి
తాను పొందుచుండు పరమాత్మానుభవము.

తా॥ మనస్సును జయించి చిత్తశాంతి పొందగలిగినవాడు కష్టసుఖములు, శీతోష్ణములు, మానావమానముల యందు సమదృష్టియు నిర్వికారమును గలిగి పరమాత్మజ్ఞానమునందు నిలకడ కలిగియుండును.

8. జ్ఞానవిజ్ఞాన తృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః।
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాఞ్చనః ॥

జ్ఞాన విజ్ఞాన పరితృప్త మానసుండు
నిర్వికారుఁడు నిర్జితేంద్రియుఁడు నగుచు,
మన్ను, రాయి, బంగారు సమానరీతి
గాంచువానిని యోగునిగా వచింత్రు.

తా॥ శాస్త్రజ్ఞానము, అనుభవజ్ఞానము పూర్తిగ కలిగిన మనస్సుగలవాడు, ఇంద్రియముల స్వాధీనమందుంచుకొనినవాడు, మన్ను, రాతిబెడ్డ, బంగారములందు ఎక్కువతక్కువలులేని సమదృష్టి కలుఁగువాడు యోగి యని చెప్పబడుచున్నాడు. ఈ లక్షణములున్న యోగి పరిపక్వస్థితి చెందిన యోగి యని భావము.

9. సుహృన్మిత్రా ర్యుదాసీన మధ్యస్థ ద్వేష్యబన్ధుషు।
సాధు ష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే॥

ఎవఁడు మిత్రులయందు సుహృత్తులందు,
బంధువులయందును తటస్థులందు పాపు
లందు సజ్జనులందు మధ్యస్థులందు,
ద్రోహులందును సమబుద్ధితో చరించు,
నాతఁడే ఉత్తమోత్తమమైన నరుఁడు.

తా॥ బంధువులు, మిత్రులు, మేలొనర్చువారు, సజ్జనుల యందొక భావము— మధ్యస్థులు, తటస్థులందు వేఱుభావము—ద్రోహులు, పాపులు అగువారియందు మఱి యొక భావములేక అందఱియందు సమమైన బుద్ధి కలిగియుండుట ఉత్తముడైన మనుజుని లక్షణము. అతఁడే శ్రేష్ఠుఁడు. అట్టి సమహితభావము కలిగినప్పుడే ప్రాణు లందరియందున్న ఆత్మ ఒకటియే అను ఆత్మదృష్టి కలుగును.

10. యోగీ యుంజీత సతత మాత్మానం రహసి స్థితః।
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః॥

సాధకుండగు యోగి ఆశనుత్యజించి
ఎవరినుండి యేదియును గ్రహింపబోక,
ఇంద్రియమనస్సులను నిగ్రహించియుంచి,
కావలెను ధ్యాననిష్ఠుఁ డేకాంతమందు.

తా॥ ఆశను త్యజించవలెను. నాకిది కావలెను అని యెవరినుండియు ఏమియు పరిగ్రహింపరాదు. ఇంద్రియములను మనస్సును స్వాధీనమందుంచుకొనవలెను. ఏకాంతమైన స్థలమునందు ఆత్మధ్యాననిష్ఠను సాగింపవలెను. ఇవి యోగసాధనకు కావలసిన ముఖ్యలక్షణములు. కనుకనే పూర్వమున మునులు, ఋషులు ప్రశాంతమైన అరణ్యములను నెలవుగా జేసికొనిరి.

11. శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసన మాత్మనః।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరమ్ ॥

12. తత్రైకాగ్రం మనఃకృత్వా యతచిత్తేన్ద్రియక్రియః।
ఉపవిశ్యాసనే యుంజ్యాద్యోగ మాత్మవిశుద్ధయే ॥

మిగులయెత్తును పల్లమేమియును లేక
సమతలమ్మయి శుచియైన స్థలమునందు—
దర్భలును, మృగాజినము, వస్త్రమ్ము పఱచి
స్థిరమయిన ఆసనమ్ముగాఁజేసి అందు
చేరికూర్చుండి, యేకాగ్రచిత్తుఁడగుచు
కట్టిపెట్టి చిత్తేంద్రియ కార్యములను
ధ్యానయోగసాధనలను మానవుండు
చిత్తశుద్ధి పొందుట కభ్యసింపవలెను.

తా॥ యోగసాధనకు అనువైన పరికరములు, పరిసరములు కూడ కావలెను. అప్పుడే మనస్సు చెదరిపోక నిష్ఠయందు నిలచును.

ఎత్తుపల్లములులేని సమప్రదేశము, శుచియైన స్థలము—దర్భలు, లేడిచర్మము వానిపై వస్త్రము పఱచిన ఆసనము—మనస్సు ఇంద్రియములు ఇతర కార్యములందు పోకుండుట—ఇవి కావలెను. ఆయాసనమందు కూర్చుండి చిత్తశుద్ధికై ధ్యానముతో, యోగసాధన నభ్యసింపవలెను,

13. సమం కాయ శిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరం।
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చా నవలోకయన్ ॥

14. ప్రశాన్తాత్మా విగతభీర్బ్రహ్మచారివ్రతే స్థితః ।
మనఃసంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః ॥

నడుము, మెడ, తలయును నిట్టనిడుపుగాగ
స్థిరముగ చలింపకుండగచేసి నిల్పి,
ఇటునటు చెదరి దిక్కుల కేగకుండ
దృష్టి నాసికాగ్రమున కేంద్రీకరించి,
స్వాంతమున ప్రశాంతుడును నిర్భయుడునగుచు,
బ్రహ్మచారియై యాత్మనిగ్రహమొనర్చి
నేనె గతియని నమ్మి ధ్యానింపవలయు
నాపయిని తనమనసు లగ్నమ్ముచేసి.

తా॥ ధ్యానాభ్యాసమునకు ఈ క్రింది విధాన మనుసరించవలెను. పై జెప్పిన ఆసనమునందు స్థిరముగ కూర్చుండి నడుము, కంఠము, శిరస్సు చలింపకుండ నిలిపి యుంచవలెను. దిక్కులు చూడక దృష్టిని ముక్కుకొనయందే ఉంచవలెను. బ్రహ్మచర్యము పాటించుచు, మనస్సు నిశ్చలముగా ప్రశాంతముగ నుండునట్లుచేసి నిర్భయుడై, నాయందే ఆత్మను నిల్పి ధ్యాన మొనర్పవలెను.

15. యుంజన్నేవం సదాఽఽత్మానం యోగీ నియతమానసః ।
శాన్తిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి ॥

నియతమానసుడగు యోగి నిరతమిట్లు
ధ్యానసాధనమార్గమం దాత్మనుంచి,
నాస్థితియు మోక్షమనియు ననంగదగిన
పరమచిత్తోపశాంతిని బడయగలడు.

తా॥ చిత్తనిగ్రహముగల యోగి యెల్లప్పుడు ఈ రీతిగ ధ్యానసాధనయందు ఆత్మను నిలుపగలిగినచో, నాయందు ఉన్నట్టిదియు పరమశాంతియుతమునగు మోక్షపదమును పొందగలడు. ఈ సిద్ధి పొందుటకు సంతతాభ్యాసమే ముఖ్యము.

16. నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాన్తమనశ్నతః।
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున॥

అర్జునా! తిండిపోతున, కసలేతిండి
తిననివానికి, నిద్రమత్తునకు, మరియు
బొత్తిగా నిద్ర పోవని పూరుషునకు,
ఇట్టి యోగసంసిద్ధి లభింపబోదు.

తా॥ యోగసాధనకు, అన్నిటియందును మితములైన పద్ధతు లుండవలెను. దేని యందును విపరీతమైన అలవాట్లు పనికిరాదు. అమితాహారము, ఎక్కువగా నిద్రయు కూడవు. అట్లే బొత్తిగా తిండిమానుట కాని, నిద్రపోకపోవుట గాని పనికిరాదు. మితములైన అలవాట్లే దేహమును, మనస్సును ఆరోగ్యకరము నిర్మలమైన స్థితి యందుంచి సాధనకు దోహదములగును.

17. యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు।
యుక్త స్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా॥

అన్నపానాదులందు విహారమందు,
వర్తనమునందు కార్యనిర్వహణమందు,
నిదురయందును, మేలుకొనిన యపుడును,
యోగ్యమగు మితాచారము లున్ననాడె
దుఃఖహరములౌ యోగసిద్ధులు లభించు.

తా॥ అన్నపానాదులు, విహారములు. నడవడి, కార్యనిర్వహణ, నిద్ర, మేలకొనగానుండుట, వీనియన్నిటియందు కూడ మితములు సర్వసమ్మతములులైన పద్ధతు లుండవలెను. అప్పుడే ఎట్టి దఃఖములులేని యోగసిద్ధి లభించును. దుఃఖ నివారణకు ఇట్టి మితాచారములు కల్గిన యోగాభ్యాసమునే అనుసరింపవలెను.

18. యదా వినియతం చిత్త మాత్మన్యేవావతిష్ఠతే।
నిస్పృహః సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా॥

తనకు వశమైన చిత్తమ్ము ననవరతము
ఆత్మయందె నిలిపి, విషయములవీడి,
వాంఛలేమియు లేకుండ వరలినపుడె,
సిద్ధిగలయోగి యంచును చెప్పబడును.

తా॥ అటు నిటు చెదరక స్వాధీనమైన మనస్సును నిత్యమును ఆత్మధ్యానమందు నిలిపి, కామ్యభోగములందు ఆసక్తిని వీడినవానినే యోగసిద్ధికలవాడని చెప్పుదురు.

19. యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా ।
యోగినో యతచిత్తస్య యుంజతో యోగ మాత్మనః ॥

గాలిలేని స్థలమునందు కదలకుండ
స్థిరముగానిల్చి వెలిగెడు దీపమువలె,
మనసును జయించి ధ్యానసాధనల నభ్య
సించుయోగిచిత్తమ్ము సుస్థిరత నందు.

తా॥ యోగసాధనకు నిలకడ గలిగిన మనస్సు అవసరము. మనస్సు స్వాధీనమందుండి ధ్యానసాధన అలవడినపుడు, గాలిలేనిచోటుల నిలకడగా వెలిగెడు దీపము విధముగానె, సాధకుని చిత్తము స్థిరత్వమును పొందగలుగును.

20. యత్రో పరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా ।
యత్ర చైవాత్మ నాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి ॥

21. సుఖమాత్యన్తికం యత్త ద్బుద్ధిగ్రాహ్యమతీన్ద్రియమ్ ।
వేత్తియత్ర నచైవాయం స్థితశ్చలతి తత్త్వతః ॥

యోగసేవచే వశమునందున్న చిత్త
మెపుడు పరమాత్మయందు క్రీడింపగలదో,
మనసుచేత నెప్పుడు పరమాత్మ నాత్మ
యందె చూచుచు సంతస మందగలదో,

అపుడె ఇంద్రియాతీత మాద్యంతరహిత
మగుచు, పరిశుద్ధబుద్ధిచే నరయదగిన
పరమసుఖమును ధ్యానతత్పరుఁడు పొంది,
అచలుఁడై ఆత్మతత్త్వము నందెయుండు.

తా॥ యోగాభ్యాసముచే వశమైన మనస్సు పరమాత్మయందే నిలిచినపుడు, తన మనసులో పరమాత్మభావము ననుభవించుచు ఆత్మానందము పొందగలిగినపుడును, ఇంద్రియముల కగోచరమైనదియు, అనంతమైనదియు, పరిశుద్ధబుద్ధివలననే గ్రహింపగల్గినదియు అగు పరమసుఖమును పొంది ధ్యానశీలి ఆత్మతత్త్వమునందు స్థిరుఁడై యుండును. సుస్థిరమైన ఆత్మధ్యానమున కీ మార్గము అనుసరణీయము.

22. యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః ।
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే ॥

23. తం విద్యా ద్దుఃఖ సంయోగ వియోగం యోగసంజ్ఞితమ్ ।
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా ॥

ఎట్టి ఆత్మసుఖము పొంది, యింతకంటె
అధికసుఖ మొండు లేదని అరయునట్టి
ఆత్మవేత్మ, చలింప డత్యధికదుఃఖ
బాధలు తనకు కలిగినప్పటికి గూడ,

లేశమును దుఃఖబాధలు లేనియట్టి
దిద్దియే యోగమనుచును యెఱుగనగును,
నిర్విచారమౌ మానసనిశ్చయమ్ము
చేతనే లభ్య మాయోగసిద్ధి ఫలము.

తా॥ ఎట్టి ఆత్మసుఖమును ఆనందమును పొంది దానికంటె శ్రేష్ఠతరమైనదేదియు మఱియొకటిలేదని తెలిసికొనిన ఆత్మవేత్త గొప్ప దుఃఖబాధలు తనకు గలిగినను కలతనొందక ధీరుఁడై యుండును. లేశమును దుఃఖబాధలు లేనిదగు ఈ స్థితినే యోగమని తెల్లియవలయును. ఎట్టి సంక్షోభము కలతలులేని నిశ్చలమనస్సుతోడనే యిట్టి యోగసిద్ధి లభ్యమగును.

24. సంకల్ప్రప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వా నశేషతః।
మనసై వేన్ద్రియగ్రామం వినియమ్య సమన్తతః॥

25. శనైః శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా।
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్॥

వాసనలవల్ల మనసున ప్రభవమందు
కామితముల నిశ్శేషముగా ద్యజించి,
విషయసుఖముల చెంతకు వెడలనట్టి
మనసుచేతనె యింద్రియాళిని మరల్చి.

ధైర్యముగలట్టి బుద్ధిచే తనమనస్సు
నల్లనల్లన క్రమముగా నాత్మయందె
లగ్నమొనరించి, వేఱుతలంపు లెంత
మాత్రమును చేరనీరాదు మానసమున

తా॥ జన్మాంతర సంచితములగు సంకల్పముల వలన బుట్టు కోరికలు, పూర్తిగ త్యజించి, విషయసుఖముల చెంతకు పోకుండా ఇంద్రియములను మనస్సుచే మరలించి, బుద్ధిధైర్యముతో మనస్సును ఆత్మచింతనయందే మెల్లమెల్లగా లగ్నముచేసి, ఆత్మ ధ్యానము తప్ప యితర చింతనలను మనస్సునకు రాకుండ చేయవలెను.

26. యతో యతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరమ్।
తత స్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్॥

అస్థిరమ్మును చంచలమైన మనసు
ఎచ్చటెచ్చటనో సంచరించునపుడు
తిరిగి యటనుండి మరలించి తెచ్చి మనసు
నాత్మయందె లగ్నమ్ము చేయంగవలయు.

తా॥ మనస్సు సామాన్యముగ అస్థిరమైనది చంచలమైనదియగును. ఎచ్చ టెచ్చటికో అన్యవిషయములకై మనసు పోవునపుడు దాని నావిషయములనుండి మరలించి తిరిగి ఆత్మయందె లగ్నము చేయవలెను. మనోచాంచల్యము నరికట్టుటకు నిరంతరము దానిని కనిపెట్టుచునే యుండవలెను. సాధకు డెదుర్కొను కష్టములలో నిది యొకటి.

27. ప్రశాన్త మనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమమ్ ॥
ఉపైతి శాన్త రజసం బ్రహ్మభూత మకల్మషమ్ ॥

కడుప్రశాంతమనస్కుఁ డకల్మషుండు
బ్రహ్మమూర్తి రజోగుణరహితుఁడగుచు
పరగు, యోగివరునకు లభ్యమగుచుండు
స్వయముగా వచ్చి తనయంత, పరమసుఖము.

తా॥ చిత్తశాంతి గలవాడు, పాపరహితుఁడు, కామక్రోధాదిరజోగుణములు లేనివాడు, బ్రహ్మరూపుఁడు అయిన యోగపురుషునికి సర్వోత్తమమైన ఆత్మానంద సుఖము లభించును. తన సాధనలను సక్రమముగా చేసిన యోగికి ఫలితము స్వయముగనే సిద్ధించును.

28. యుంజన్నేవం సదాఽఽత్మానం యోగీ విగతకల్మషః ।
సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యన్తం సుఖమశ్నుతే ॥

విగతపాపుడై యెల్లవేళలందు
ఆత్మయందున మానస మైక్యపఱచు
ధ్యానయోగి తేలికగ బ్రహ్మానుభవమె
అనదగిన శాశ్వతసుఖమ్ము నందగలడు.

తా॥ పాపములు లేనివాడై, నిరంతరము మనస్సును ఆత్మచింతనయందే ఉంచు ధ్యానయోగికి బ్రహ్మానుభవరూపమైన పరమానందసుఖము సులభముగనే ప్రాప్తించును. ముముక్షువు యొక్క లక్ష్యసిద్ధికి చెప్పబడిన సులభమార్గమిది.

29 సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని ।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥

ఎల్లప్రాణులపై సమదృష్టి కలిగి,
అఖిలభూతమ్ములను తనయాత్మయందు—
తనదునాత్మను సర్వభూతములయందు
యోగనిష్ఠాపరుఁడు చూచుచుండునెప్డు.

తా॥ ఆత్మయందు బ్రహ్మానుభవమును సాధించిన యోగి అన్ని ప్రాణులయందు సమభావము కలిగి అఖిల భూతములను తనయందు, తనను సర్వభూతములయందు దర్శింప గల్గును.

40. యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి।
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ॥

అఖిలభూతసమూహము లందు నన్ను–
అఖిల భూతజాలమును నాయందు–నెవ్వ
డరయునో, వానికేను నాకతడు గూడ
నొకరికొకరము కన్పడుచుందు మెపుడు.

తా॥ అఖిల భూతములయందు, నన్నును, నా యందఖిలభూతములను చూచు వానికి నేను కనబడకపోను, నాకతడు కనబడకపోడు. భగవానుడు సర్వప్రాణుల యందును ఆత్మరూపుడే గాన అట్టి యోగికి సులభముగా గోచరించును.

31. సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః।
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే॥

అఖిల భూతాంతరాత్ముఁడ నయిన నన్ను
నెవ్వఁ డేకాత్మగానె ధ్యానించుచుండు
నాతఁ డెట్టికార్యమ్ములయందు నున్న
గూడ, నాయందు వర్తించువాడె అగును.

తా॥ సర్వభూతములయందున్న నన్ను అభేదబుద్ధితో ఏకాత్మగానె ధ్యానించువాడు ఏకార్యములందు ప్రవర్తించుచున్నను నాయందున్నవాడే. అట్టివాని కార్యములన్నియు భగవదర్పణపూర్వకములైనవే గాన ఆతడెప్పుడును భగవంతునియందున్నవాడే.

32. ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః ॥

అర్జునా యెవ్వ డఖిలజీవాళి పొందు
కష్టసుఖముల తనయొక్క కష్టసుఖము
లకు సమమ్ముగా మదిని తలంపగలుగు,
ఆతఁడె ఉత్తమోత్తమయోగి యని వచింత్రు.

తా॥ తనయొక్క ఆత్మవంటిదే తక్కినవారి ఆత్మ కూడనని తలంచుచు వారి కష్టసుఖములను తన కష్టసుఖములతో సమముగా చూడగలుగువాడె యోగులలో ఉత్తముడు.

33. యోఽయం యోగ స్త్వయాప్రోక్త స్సామ్యేన మధుసూధన।
ఏత స్యాహం న పశ్యామి చంచల త్వాత్ స్థితిం స్థిరామ్ ॥

అచలమగు బుద్ధిచేత లభ్యమగు నదియు
కృష్ణ! నీవిప్డు నాకు బోధించినట్టి
యోగమిది స్థిరముగనుండునో, మరేమొ,
తెలియకుంటిని మనసుచంచలమె యగుట.

తా॥ కృష్ణా! నీవిపుడు నాకుపదేశించినట్టి యోగము మనోనిశ్చలత్వముచేతనే సిద్ధింపదగినది. మనస్సు చంచలమైనదగుటచే అట్టి యోగమేవిధముగ స్థిరముగా నుండునో తెలియుటలేదు. జీవాత్మ పరమాత్మల సామ్యరూపస్థితి ఎట్లు స్థిరముగ నిలువగలదో తెలిసికొనుట ముముక్షువులకు ముఖ్యావసరము.

34. చంచలం హి మనః కృష్ణ! ప్రమాథి బలవద్దృఢమ్।
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్ ॥

దృఢమయినదియు బాధలొందించు నదియు
చంచలమ్మైన దీమానసమ్ము కృష్ణ!
ఎట్టి లీవాయువును నిరోధింప లేమొ
అట్లె మనసునిల్పుట కష్టమని తలంతు.

తా॥ కృష్ణా! మనస్సు చాల బలమయినది, దృఢమయినది, ప్రాణులను బాధలపాలుజేయును. మనస్సు చాల చంచలమైనది. వాయువును నిరోధించలేనట్లే మనస్సును కట్టుబాటు చేయుట గూడ కష్టమని తలంచుచున్నాను.

శ్రీ భగవానువాచ:- శ్రీ భగవానుడు చెప్పుచున్నాడు.

35. అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్।
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే ॥

సందియములేదు మనసు చంచలమె పార్థ!
దానినిలుపుట కష్టమ్మె—కాని, అదియు
సాధ్యమైయుండు అభ్యాససాధనమున,
భావమందు వైరాగ్యమ్ము వలనకూడ.

తా॥ అర్జునా! సందేహము లేదు, మనసు చంచలమైనది; స్థిరముగా నిల్పుట కష్టమే. కాని అభ్యాసము వలనను ఏ విషయమందు ఆసక్తిలేని వైరాగ్యమువలనను మనోనిశ్చలత్వమును సాధింపవచ్చును.

36. అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః।
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః॥

మానసము నిగ్రహింపని మనుజులకును
ప్రాప్తి కాబోదు బ్రహ్మైక్యపదము, పార్థ!
యత్నమొనరించి తగునుపాయములచేత
చిత్తము జయించు వానికీ సిద్ధి గలుగు.

తా॥ మనోనిగ్రహము లేనివానికీ యోగము (బ్రహ్మైకసిద్ధి) లభించదు. తగిన ఉపాయముచే యత్నముచేసి మనసును వశపరచుకోగలిగిన వానికిది తప్పక సిద్ధించును.

అర్జున ఉవాచ: అర్జునుఁడు చెప్పెను.

37. అయతిః శ్రద్ధయోపేతో యోగచ్చలిత మానసః।
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ! గచ్ఛతి॥

అచ్యుతా! శ్రద్ధయున్నవాడైన గూడ
చిత్తనియమము లేనందుచేత యోగ
చలితుడై యోగఫల మంద శక్తిలేని
వ్యక్తియేమగు? యేగతినందునతడు?

తా॥ కృష్ణా! యోగసిద్ధిని పొందవలెననే ప్రయత్నమునందు శ్రద్ధ ఉన్నప్పటికి మనోనిగ్రహము లేకపోవుటచే ఆ సిద్ధిని పొందలేని వాని గతియేమి? అతడేమై పోవును,

38. కచ్చిన్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్ర మివ నశ్యతి।
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి ॥

అచ్యుతా! మోక్షపదమార్గమందు స్థిరము
గనని మూఁడు డిహపరసౌఖ్యములు లేక
రెండువిధముల గూడ భ్రష్టుండె యగుచు
నాశమయిపోవడా? విభిన్నాభ్రమువలె.

తా॥ కృష్ణా! మోక్షసంపాదనమార్గమున స్థిరత్వములేనివాడు, ఇహపరములు రెండునులేక భ్రష్టుడై, ఛిన్నాభిన్నమైన మబ్బువలె నశించిపోడా?

39. ఏతం మే సంశయం కృష్ణ! ఛేత్తు మర్హస్యశేషతః।
త్వదన్యః సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే ॥

కృష్ణ! నాసంశయమ్ము పూర్తిగ నశించు
నటుల జేయగల్గినవాడ వగుదు వీవె,
ఇట్టి సందేహమును నివారింపఁజేయ
నన్యు డెవ్వఁడు నాకులభ్యమ్ము గాడు.

తా॥ కృష్ణా! నా మనస్సులోనున్న సందేహమును తీర్చగలిగినవాడవు నీవే. ఈ సందేహములను తీర్చగలుగువారు ఇతరులెవ్వరును నాకు లేరు.

శ్రీభగవానువాచ :— శ్రీభగవానుఁడు చెప్పెను.

40. పార్థ నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే।
న హి కల్యాణ కృత్కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి ॥

అర్జునా! యోగసంసిద్ధినందబోని
మనుజుఁ డిహపరమ్ములను నాశనముగాడు;
ఏలయన, మంచిపను లొనరించునట్టి
వార లెవరును దుర్గతిపాలు కారు.

తా॥ అర్జునా! యోగమార్గమునందు స్థిరత్వములేనివాడయినను ఇహపరములరెంటియందు భ్రష్టుడు కాడు. సత్ప్రయత్నముచేయు వారెవ్వరికిని దుర్గతి పట్టదు.

41. ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీః సమాః।
శుచీనాం శ్రీమతాం గేహే యోగ భ్రష్టోఽభిజాయతే ॥

అట్టి యోగభ్రష్టుఁడు పుణ్యులందగలుగు
అమరలోకాన చాలకాలము వసించి,
అవనిపైని మరలపుట్టు నతడు భాగ్య
వంతులును సదాచారులౌ వారియిండ్ల.

తా॥ ప్రయత్న మొనరించియు తుట్టతుదకు యోగసిద్ధి పొందలేనివాడు, పుణ్య కార్యముల చేసినవారు పోవుచున్న స్వర్గలోకములు పొంది చాలకాలమచట వసించి, తిరిగి భూలోకమున భాగ్యవంతులు సదాచారులు అయిన వారి గృహములందు పుట్టును.

42. అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్ ।
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్ ॥

అటులగానిచో ధీమంతులైన యోగి
జనులు గల్గిన మంచివంశమ్ము నందె
జననమందుచునుండు నా మనుజుఁడెపుడు;
అట్టి జన్మమె దుర్లభమైన దవని.

తా॥ ఆ విధముగా కానిచో అతడు ధీశాలురైన యోగపురుషులున్న సద్వంశము నందు జన్మించును. అట్టి జన్మము గూడ కడు దుర్లభమైనది గదా.

43. తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదేహికమ్ ।
యతతే చ తతో భూయస్సంసిద్ధౌ కురునన్దన ॥

అర్జునా! ఆపునర్జన్మమందు, పూర్వ
జన్మసంబంధమగు జ్ఞానసంపదలను
పొంది, ఆశక్తివలననే పుడమిపయిని
యోగసిద్ధికై యత్నించుచుండు మరల.

తా॥ అతడు పొందిన పునర్జన్మమున, పూర్వజన్మ సంబంధమగు బుద్ధిసంపర్కముచే యోగసిద్ధి బడయుటకు మరింత యెక్కువగా ప్రయత్నించును.

44. పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః।
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతి వర్తతే ॥

వెనుక జన్మములోని సాధనల వలన
పరమయోగమునకె లాగబడు నతండు;
యోగచింతనచాలు వేదోక్తకామ్య
కర్మముల కతీతుఁడయి సద్గతినిపొంద.

తా॥ పూర్వజన్మాభ్యాస బలమున నతడు యోగసిద్ధిమార్గమునకే లాగబడు చుండును. యోగము నెఱుగవలయునను అభిలాషయున్నను చాలు, వేదములందు చెప్పబడిన కర్మఫలములను దాటగలుగుచున్నాడు.

45. ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః।
అనేక జన్మ సంసిద్ధ స్తతోయాతి పరాంగతిమ్ ॥

పట్టుదలగల్గి, యత్నతత్పరత నున్న
యోగివర్యుఁడు పాపశూన్యుడయిపొందు
బహుళజన్మసాధనల లభ్యమగు యోగ
సిద్ధి; పిదప నుత్తమమోక్ష సిద్ధిగూడ.

తా॥ దృఢదీక్ష గల్గి ప్రయత్నశీలుఁడైన యోగి పాపరహితుఁడై, అనేక జన్మము లందుగల అభ్యాసములచే యోగసిద్ధిని, తదుపరి మోక్షఫలమును గూడ పొందగలడు.

46. తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః।
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మా ద్యోగీ భవార్జున ॥

తాపసులకంటె, సర్వశాస్త్రముల నెఱుఁగు
వారికంటెను, కర్మతత్పరుల కంటె
ధ్యానయోగియె యధికుండు; కాన, నీవు
ధ్యానసాధనగల యోగివగుము పార్థ.

తా॥ అర్జునా! తపము చేయువారికంటె, శాస్త్రజ్ఞాన మెఱిగినవారికంటె, అగ్నిహోత్రాది కర్మముల చేయువారికంటె ధ్యానయోగియే శ్రేష్ఠుడు. కాన, నీవును అట్టి యోగివి కమ్ము.

47. యోగినామపి సర్వేషాం మద్గతే నాన్తరాత్మనా ।
శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః ॥

అట్టి యోగాత్ములగు వారియం దెవండు
నాపయిని తనమనసు లగ్న మొనర్చి
ధ్యానమొనరింప గలఁడో శ్రద్ధాళువగుచు,
నతఁడె యత్యధికుఁడని నాయభిమతమ్ము.

తా॥ యోగులు చాలమంది కలరు. అట్టి వారందఱిలోను ఎవఁడు నాయందు మనస్సును దృఢముగా నిల్పి నన్ను గూర్చి ధ్యానించునో అట్టివాఁడు సర్వయోగి శ్రేష్ఠుఁడనియే నేను తలతును.

ఇది ఉపనిషదర్థప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును,
శ్రీకృష్ణార్జునసంవాదమునగు శ్రీమద్భగవద్గీతయందు
ఆత్మసంయమయోగమను
ఆరవ అధ్యాయము
సమాప్తము

# గీతామృతము

## శ్రీమద్భగవద్గీత

## విజ్ఞానయోగము

## సప్తమ అధ్యాయము : సారాంశము

ప్రధాన విషయము :—

శాస్త్రముల వలన తెలియదగిన విశేషజ్ఞానము విజ్ఞానము, లేక అనుభవము వలన పొందదగిన జ్ఞానము. ముక్తినిగోరువారు ఎఱుగదగిన ఆత్మజ్ఞానమును విజ్ఞానము అందురు. దీనిని గూర్చి ఈ అధ్యాయమున బోధింపబడినది.

ఇందలి ముఖ్యాంశములు :—

పరా అపరా ప్రకృతులు—పరమాత్మ స్థితి—అన్యదేవతారాధన—భగవన్మహిమ.

### సారాంశము

అర్జునునకు శ్రీకృష్ణభగవానుఁడిట్లు చెప్పెను.

అర్జునా ! అనుభవపూర్వకమైనదియు, సంపూర్ణముగ నన్ను తెలిసికొనుటకు వీలైనదియు, మోక్షమును సంపాదించునదియునగు జ్ఞానమును నీకుపదేశించెదను వినుము. వేలాది మనుజులలో ఎవనికో యొకనికి మాత్రమే ఈ జ్ఞానపిపాస కలుగును. అట్టి జ్ఞానపిపాసువులలో ఎవనికో ఒకనికి మాత్రమే నా యథార్థతత్త్వము తెలియును.

నా ప్రకృతి రెండు విధములు. ఆకాశము, నీరు, గాలి మున్నగు జడరూపమైనది మొదటిది; ఇది అపరా ప్రకృతి. దీనికంటె శ్రేష్ఠమైనది రెండవది; జీవరూపమైన పరా ప్రకృతి. ఇవి రెండును ప్రాణికోటుల ఉత్పత్తికి కారణములు. ఇట్లే జగత్ప్రళయమునకు కూడ నేను కారకుఁడను.

ఈ జగమునందు నాకంటె వేఱైనది ఏమియు లేదు. సర్వలోకములు నాయందే యున్నవి. జలములోని రుచి, సూర్య చంద్రుల కాంతి, వేదము లందలి ఓంకారము, ప్రాణికోటులలోని జీవము నేనే. ఆ ప్రాణులకు మూలహేతువును నేనే. సత్త్వరజస్తమోగుణములకు వశమై ప్రాణికోటులు అవివేకమునఁబడి నన్ను తెలిసికొనలేకున్నవి. ఈ త్రిగుణసంబంధమైనదే మాయ. వీనికి అతీతుఁడనైన నన్ను శరణు పొందినవారే ఈ మాయను దాటగలరు. ఈ మాయకు వశమై అజ్ఞానమునకు లోఁబడినవారు నా దరికి రాలేరు.

నా భక్తులు నాలుగు తెఱఁగులుగ నున్నారు. వారు 1. ఆపదలో నున్నవారు. 2. ధనమును కోరువారు. 3. నా తత్త్వము నెఱుఁగగోరువారు. 4. జ్ఞానము నందభిలాషగలవారు. వారందఱిలో నాయందు ఏకాగ్రభక్తిగల జ్ఞానియే శ్రేష్ఠుఁడు, నాకు ప్రియుఁడు. అనేక జన్మముల సాధనాఫలితముగనే జ్ఞానము లభించును. అట్టి జ్ఞానులైన మహాత్ములరుదు. వారికి జగమంతయు వాసుదేవమయముగనే కన్పించును.

పూర్వజన్మవాసనలు వదలలేని కొందఱు కోరికెలతో ఇతర దేవతలనే ఆరాధించుచుందురు. ఎవరే దేవతల నారాధించినను వారికి గల శ్రద్ధను కలుగజేయువాఁడను నేనే. నేను విధించిన ఫలితములనే వారు వారి దేవతల వలన పొందుదురు. ఆ ఫలితము లశాశ్వతములైనవే. అన్యదేవతాభక్తులు ఆ దేవతలను చేరుచుందురు; కాని, నా భక్తులు శాశ్వత మోక్షస్థానమైన నన్నే చేరుదురు.

మాయ అడ్డుగా నుండుటవలన జ్ఞానశూన్యులు నన్నెఱుఁగలేరు. నన్ను సామాన్యునిగనే భావించుచుందురు. భూతభవిష్యద్వర్తమానకాలములలో

నున్నవన్నియు నాకెఱుకయే. ఇతరు లెఱుగరు. కష్టసుఖ భావరూపమైన మాయామోహములు జనులకు పుట్టుకతోనే కల్గుచున్నవి, పుణ్యకర్మముల వలన పాపములను నశింపఁజేసికొనినవారు అజ్ఞానమునుండి ముక్తులగు చున్నారు.

జరామరణములనుండి ముక్తిగోరుచు నన్నాశ్రయించి ప్రయత్న పరులైనవారే కర్మమును గూర్చియు, బ్రహ్మమును గూర్చియు పూర్తిగా తెలిసికొనఁగల్గుచున్నారు. అట్టివారికే చిత్తనిగ్రహము వలన, మృత్యువేళను గూడ అధిభూతము, అధిదైవము, అధియజ్ఞములతో గూడియున్న నన్ను మనస్సున గుర్తింపఁగల శక్తి అలవడుచున్నది.

ఈ అధ్యాయమందలి ముఖ్య శ్లోకములు

3, 13, 16, 17. 19, 30

# శ్రీమద్భగవద్గీత

## సప్తమ అధ్యాయము

## విజ్ఞాన యోగము

శ్రీ భగవానువాచ :- శ్రీ భగవానుఁడు చెప్పెను.

1. మయ్యాసక్తమనాః పార్థ యోగం యుంజ న్మదాశ్రయః ।
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు ॥

నాపయిని మానసము నిల్పి, నన్నె యాశ్ర
యించి, యోగసాధన మొనరించు చుండి,
అర్జునా! శంకలేని సమగ్రరీతి
నన్ను తెలిసికోగల విధానమును వినుము.

తా॥ అర్జునా! నన్నే శరణు పొంది, నాయందే మనస్సు లగ్నముచేసి యోగము సాధించుచు సందేహమేమియులేని సంపూర్ణరీతిగ నన్నెఱుంగగల మార్గమును వినుము.

2. జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యామ్యశేషతః ।
యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్య జ్జ్ఞాతవ్య మవశిష్యతే ॥

ఇహమునందెట్టి జ్ఞానము నెఱిఁగియున్న
అన్య మక్కఱలేదొ మోక్షప్తి కొఱకు,
స్వానుభవమైన యాజ్ఞాన మేను నిరవ
శేషముగ నీకొఱకు వచించెదను వినుము.

తా॥ ఈ లోకమునందు ఏవిధమైన జ్ఞానమును తెలిసికొనిన పిమ్మట మోక్షము కొఱకు మఱి యితర మక్కఱలేదో, అట్టి జ్ఞానమును అనుభవపూర్వకమైన దానిని గూడ నీకు పూర్తిగ తెలియఁజేసెదను.

3. మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే।
యతతా మపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః॥

ఎవఁడొ యొకఁడె వేలాది మానవులలోన
మోక్షసిద్ధికొఱకు యత్నమును బొనర్చు;
అట్లు యత్నించి సిద్ధులైనట్టియోగు
లం దొకఁడె నాదు నిజతత్త్వ మరయఁగల్గు.

తా॥ వేలాది జనులలో ఏ ఒక్కఁడో మోక్షసిద్ధికై యత్నించును. అట్లు యత్నించువారిలో నెవఁడో యొకఁడే నా నిజతత్త్వమును తెలిసికొనుచున్నాడు.

4. భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధి రేవ చ।
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా॥

నేల, ఆకాశ, మగ్ని యు, నీరు, గాలి
మనసు, బుద్ధి, అహంకారమనగ నాదు
ప్రకృతి యెనిమిది విధములై పరఁగుచుండు.

తా॥ నా ప్రకృతి (మాయ) యెనిమిది విధములు. అవి భూమి, ఆకాశము, అగ్ని, నీరు, గాలి, మనసు, బుద్ధి, అహంకారము.

5. అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్।
జీవభూతాం మహాబాహో! యయేదం ధార్యతే జగత్॥

అర్జునా! యిది అల్పమౌ అపరప్రకృతి,
ఇంతకంటెను శ్రేష్ఠమై యెసఁగు నాదు
ప్రకృతి, జీవరూపము పరాప్రకృతి కలదు,
ఈ ప్రపంచము నదియె ధరించుచుండు.

తా॥ అర్జునా! ఈ ప్రకృతి జడమైనదియు, అల్పమైనదియునగు 'అపరా ప్రకృతి' ఇంతకంటెను శ్రేష్ఠమైన నా 'పరాప్రకృతి' వేఱొకటి యున్నది. అదియె జీవరూపమయి ఈ ప్రపంచమునంతయు ధరించుచున్నది.

6. ఏతద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా ॥

ఈ విధమైనట్టి రెండు ప్రకృతులె పార్థ!
భూతకోటి ఉత్పత్తికి హేతువులగు;
హేతువును నేనె ఈజగత్సృష్టి కర్తై
సకల జగతికి విలయకారకుఁడ నేనె.

తా॥ జడజీవరూపములగు నీ సర్వభూతములును ఈ పరా, అపరాప్రకృతుల వలననే జగతిలో పుట్టుచున్నవి. నేనే ఈ రెండు రకముల ప్రకృతుల ద్వారా జగత్తు యొక్క ఉత్పత్తికి, వినాశమునకు కూడ కారణుఁడను.

7. మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ ।
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా యివ ॥

పార్థ! నాకంటె భిన్నమై పరఁగునట్టి
దన్య మేమియు లేదించుకంత గూడ,
దారమందున మణిసముదాయము వలె
సర్వజగతి నాయందు కూర్చబడియుండె.

తా॥ అర్జునా! నాకంటె వేఱైనదొకటియు లేదు. దారమునందు మణులు గ్రుచ్చబడినట్లే సర్వలోకములు నాయందే కూర్చబడి యున్నవి.

8. రసోఽహమప్సు కౌన్తేయ ప్రభాస్మి శశిసూర్యయోః ।
ప్రణవః సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు ॥

జలమునందలి రుచియును, చంద్ర సూర్యు
లందు కాంతియు, గగనమ్మునందు శబ్ద,
మాగమమ్ములందు ఓంకార మగుదు నేనె,
జనులయందు నుండెడి పౌరుషమును నేనె.

తా॥ అర్జునా! జలమందు రుచియును, చంద్ర సూర్యుల కాంతియు, ఆకాశమందలి శబ్దమును, వేదములందలి ఓంకారమును, మనుష్యులందున్న పౌరుషమును నేనే అయి యున్నాను.

9. పుణ్యోగంధః పృథివ్యాం చ తేజ శ్చాస్మి విభావసౌ।
జీవనం సర్వభూతేషు తప శ్చాస్మి తపస్విషు ॥

ధరణీతలమందుఁ గల సుగంధమును నేనె,
అగ్నియందలి తేజమ్ము నగుదు నేనె,
ప్రాణికోటులయందు జీవమును నేనె,
తాపసులయందుఁ గల జ్ఞానతపము నేనె.

తా॥ అర్జునా! భూమియందున్న సుగంధమును, అగ్నిలోని తేజమును, తపస్వులందున్న జ్ఞానతపమును, సర్వ ప్రాణులందుగల చైతన్యమును నేనే.

10. బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్।
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్ ॥

అర్జునా! సర్వభూతచయమ్మునకును
శాశ్వతమ్మైన ఆదిబీజమును నేనె,
బుద్ధిమంతుల నిర్మలబుద్ధి నేనె,
సర్వతేజస్వులందు తేజమును నేనె.

తా॥ అర్జునా! అఖిల భూతములకును సనాతనమైన మూలకారణుఁడను నేనే. బుద్ధిమంతులయందలి బుద్ధియు, తేజముగల వారి యందలి తేజస్సును నేనే.

11. బలం బలవతాం చాహం కామరాగవివర్జితమ్।
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ ॥

కామరాగములత్యజింప గలిగినట్టి
బలయుతులయందుఁ గల మనోబలము నేనె,
ధర్మమార్గమ్మునకు విరుద్ధమ్ము గాని
కామితము నేనె ప్రాణిసంఘమ్మునకును.

తా॥ కామరాగ రహితమగు మనోబలము గల వానియొక్క బలమును నేనే. ప్రాణులయందు గల ధర్మయుతమగు సంకల్పమును నేనే.

12. యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసాశ్చయే।
మత్త ఏవేతి తా న్విద్ధి న త్వహం తేషు తేమయి॥

సాత్త్వికము రాజసము తామసమ్ము లైన
భావములు సకలమ్ము నావలన గలుగు;
కలవు నాయందు నవియెల్ల, కాని యింక
వానియందున మాత్రము నేను లేను.

తా॥ సత్త్వరజస్తమోగుణభావములు నావలననే కలుగుచున్నవి. అవి నావశములై యున్నవి. కాని నేను వానికి వశుడను కాను.

13. త్రిభి ర్గుణమయై ర్భావై రేభి స్సర్వ మిదం జగత్।
మోహితం నాభిజానాతి మా మేభ్యః పర మవ్యయమ్॥

ఈ త్రిగుణముల శక్తియే హేతువగుచు
అఖిలజగతియు నవివేకమందు మునిఁగి
తెలియఁజాలకయున్న దీ త్రిగుణములకు
నన్యుఁడను నాశరహితుఁడ నైన నన్ను.

తా॥ ఈ త్రిగుణముల ప్రభావము వలననే లోకమంతయు అవివేకములోఁబడి, ఈ త్రిగుణములకు వేఱైనవాఁడను నాశములేనివాఁడను అయిన నన్ను తెలిసికొనలేక యున్నది.

14. దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా।
మామేవ యే ప్రపద్యన్తే మాయా మే తాం తరన్తి తే॥

దైవసంబంధమైనదీ త్రిగుణభావ
మయము గానున్న నాయొక్క మాయ, కనుక
నన్నె శరణని భజియించు నరులు దక్క
ఇతరు లీమాయ దాటి తరింపలేరు.

తా॥ త్రిగుణాత్మకమైన ఈ నా మాయ దైవసంబంధమైనది. నన్నే గతిగా భావించి పూజించువారు తప్ప ఇతరు లీ ప్రకృతిమాయను దాటలేరు.

15. న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః।
మాయయాపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః॥

మాయచే జ్ఞానమెల్ల గోల్పోయినట్టి
పాపవర్తను, లసురస్వభావయుతులు,
మూఢమానసులు, నరాధములును పార్థ!
నన్ను దరిజేరి శరణుబొందంగరారు.

తా॥ మాయచే అజ్ఞానులైయున్న పాపులు, మూఢులు, క్రూరస్వభావము గలవారు, నీచులు అయిన వారు నన్ను పొందుటలేదు.

16. చతుర్విధా భజన్తే మాం జనాస్సుకృతినోఽర్జున।
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ॥

పుడమిపై నాల్గుతెఱఁగుల పుణ్యజనులు
నన్ను సేవింతు రర్జున! నాదుతత్త్వ
మరయఁగోరు జిజ్ఞాసువు, లార్తజనులు
అర్థవాంఛాయుతులు, జ్ఞానాభిరతులు.

తా॥ అర్జునా! భూమిపై నాలుగుతెఱఁగులైన పుణ్యజనులు నన్ను సేవించు చున్నారు. వారు: 1. ఆపదలందున్నవారు, 2. ధనమును గోరువారు, 3. నన్ను పూర్తిగా తెలిసికొనగోరువారు, 4. జ్ఞానవంతులును.

17. తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే।
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమప్రియః॥

అన్నివేళలందు సమాహితాత్ముఁ డగుచు
నన్నె యేకాగ్రభక్తి ధ్యానమ్మొనర్చు
జ్ఞానియే వారిలో శ్రేష్ఠుఁడైనవాఁడు
అతని కేను ప్రియుండ; నాకతఁడు ప్రియుఁడు.

తా॥ ఆ నాల్గుతెఱఁగుల పుణ్యజనులయందును, నాయందే మనస్సునుంచి యేకాగ్రభక్తిగల జ్ఞానియే శ్రేష్ఠుఁడు. అతనికి నేనును, నాకతఁడును ప్రియులము.

18. ఉదారాః సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్।
అస్థితః స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్॥

వారలందఱు గూడ నుదారజనులె,
అందు జ్ఞానియె నారూపమనితలంతు;
ఆతఁడెల్లప్పు మనసు నాయందె నిల్పి
భావమునఁ దలంచును నన్నె పరమగతిగ.

తా॥ పైఁదెలిపిన నాల్గువిధములగు భక్తులును ఉదారస్వభావులే. కాని వారిలో జ్ఞానిని మాత్రము నా రూపముగనే యెంతును. ఏలయన ఆతఁడు నన్నే పరమగతిగ ఆశ్రయించి నాయందే తన మనస్సును సదా నిలిపియుంచును.

19. బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే।
వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః॥

బహుళజన్మముల్ చనిన తర్వాత నరుఁడు
జ్ఞానవంతుఁడై ఈ సర్వజగతి యెల్ల
వాసుదేవుఁడంచెంచి, నన్బడయుచుండు;
అవనియందున అట్టి మహాత్ము లరుదు.

తా॥ అనేక జన్మముల సాధనాఫలితముగ నరుఁడు జ్ఞాని యగుచున్నాఁడు. ఆ జ్ఞానము వలన ఈ జగత్తంతయు వాసుదేవమయమే అని గ్రహింపఁగలిగి అతఁడు నన్ను పొందుచున్నాఁడు. భూమిపై అట్టి మహానుభావులరుదుగ నుందురు.

20. కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యన్తేఽన్యదేవతాః।
తం తం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాః స్వయా॥

వెనుకజన్మములోని వాసనలవలన
కోరికలమున్గి జ్ఞానమ్ము గోలుపోయి,
ఇతర దేవతలనె భజియింత్రు కొంద
ఱమగుణమ్మైన నియమమ్ము ననుసరించి.

తా॥ కొందఱు జన్మాంతర సంబంధమగు విషయవాసనల బలముచే, అవివేకులై కోరికలను పోగొట్టుకొనలేక ఇతర దేవతలనె తదనుకూలములైన నియమములతో పూజించుచుందురు.

21. యో యో యాం యాం తనుం భక్తం శ్రద్ధయాఽర్చితు మిచ్ఛతి।
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్॥

భక్తు లెవరెవ రెట్టిదేవతల గూర్చి
శ్రద్ధమీఱ నారాధన సలుపనిచ్ఛ
గింతురో, వారి కా శ్రద్ధయే స్థిరముగ
నుండునట్లుగ చేయుచునుందు నేను.

తా॥ ఏ యే భక్తులు ఏయే దేవతలను శ్రద్ధతో పూజింపఁదలఁతురో వారి వారికి ఆ దేవతలందు గల శ్రద్ధను స్థిరముగ నుండునట్లు నేనే చేయుచున్నాను.

22. స తయా శ్రద్ధయా యుక్తః తస్యారాధన మీహతే।
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్హితాన్॥

ఇటుల శ్రద్ధాళువగు భక్తుఁ డిచ్ఛతోడ
సలుపు దేవతారాధనవలనఁ గూడ,
ఏను విధియించినట్టిదే ఇష్టఫలము
పడయుచుండు నాయాయి దేవతలవలన.

తా॥ ఈ విధముగ శ్రద్ధతో నితర దేవతారాధన సలుపు భక్తుఁడు గూడ నే నేర్పాటు చేసిన కామితార్థములనే ఆ దేవతల ద్వారా పొందుచున్నాఁడు.

23. అన్తవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్।
దేవాన్ దేవయజో యాన్తి మద్భక్తా యాన్తి మా మపి॥

స్వల్పబుద్ధులై అన్యదేవతల వలన
వారు పొందు సంపద లశాశ్వతమె యగును;
వారు వారి దేవతలను చేరుకొనగ,
నాదుభక్తులు చేరుచున్నారు నన్నె.

తా॥ అన్యదేవతలను పూజించువారు అల్పబుద్ధులు. వారు వారి దేవతల వలన పొందు ఫలములు శాశ్వతముగా ఉండవు. వారు వారి దేవతలను చేరుకొందురు. నా భక్తులు మాత్రము నన్నే చేరుచున్నారు.

24. అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యన్తే మా మబుద్ధయః।
పరం భావమజానన్తో మమావ్యయ మనుత్తమమ్॥

అవ్యయ మ్ముత్తమోత్తమ మగుచు, ప్రకృతి
కిని అతీతమౌ నారూపమును గ్రహింప
లేని మూఢాత్ము లవ్యక్తుఁడైన నన్ను
కనులకును గన్పడెడివానిగాఁ దలంత్రు.

తా॥ నాశరహితమైనదియు, సర్వోత్తమమును, ప్రకృతికి అతీతమైనదియు నగు నా స్వరూపమును గ్రహింపలేని మూఢాత్ములు మనస్సునకు కనులకు అగోచరుఁడనగు నన్ను మానవదేహాకారునిగనే తలంచుచున్నారు.

25. నాహం ప్రకాశః సర్వస్య యోగమాయాసమావృతః।
మూఢోఽయం నాభిజానాతి లోకో మా మజమవ్యయమ్॥

యోగమాయావృతుండనై యుంటఁ జేసి
సర్వజనులకు నేను గోచరుఁడ గాను,
అవ్యయుఁడ జన్మరహితుఁడ నైన నన్ను
తెలియఁజాలరు జ్ఞానశూన్యులగు జనులు.

తా॥ యోగమాయచే కప్పబడియుండుటచే నన్ను అందఱును చూడఁజాలరు. వారు అజ్ఞానులగుటచే నన్ను పుట్టుక, నాశములేనివానిగా యెఱుఁగలేక నాకు కూడ జననమరణములున్నవని తలంతురు.

26. వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున।
భవిష్యాణిచ భూతాని మాం తు వేద న కశ్చన॥

అర్జునా! గతించిన కాలమందు, వర్త
మానమందు, రాబోవు కాలాన నున్న
ప్రాణులన్నిటి నెఱుఁగుదు నేను; కాని
యితరులెవ్వరు గూడ నన్నెఱుఁగలేరు.

తా॥ అర్జునా! భూతకాలమందు, వర్తమానకాలమందు ఉన్నవారినీ, భవిష్యత్కాలమందుండబోవు వారిని నేనెఱుఁగుదును. కాని, యితరులెవ్వరు నన్నెఱుఁగ లేరు.

27\. ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వన్ద్వ మోహేన భారత!।
సర్వభూతాని సమ్మోహం సర్గే యాన్తి పరంతప ॥

అఖిల భూతమ్ములును జన్మ మందినపుడె
పార్థ! కామకోపమ్ములవలన కలుగు
కష్టసుఖరూపమగు మాయ కారణముగ
మునుఁగుచున్నవి అజ్ఞానమోహమందు.

తా॥ పార్థా! అన్ని ప్రాణులును పుట్టుకతోడనే అజ్ఞానమోహమునఁబడుచున్నవి. కామకోపముల వలన కలుగు కష్టసుఖరూపమైన మాయ వలననే ఆమోహము కలుగుచున్నది.

28\. యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్ ।
తే ద్వన్ద్వ మోహనిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః ॥

పుణ్యకర్మముచే పాపములను పాఱఁ
ద్రోలినజనులు సుఖదుఃఖరూపమైన
మోహమునువీడి, అజ్ఞానముక్తు లగుచు
నన్నుఁగొల్తురు దృఢనిష్ఠ ననవరతము.

తా॥ పుణ్యకర్మము లొనర్చి పాపమును పోగొట్టుకొనిన జనులు, సుఖదుఃఖరూపమైన మోహమును అజ్ఞానమును వీడి దృఢనిష్ఠతో నన్నే పూజించుచుందురు.

29\. జరామరణ మోక్షాయ మామాశ్రిత్య యతన్తి యే।
తే బ్రహ్మ తద్విదుః కృత్స్నమధ్యాత్మం కర్మ చాఖిలమ్ ॥

జనులెవరు జరామరణమోక్షమ్ము కోఱకు
యత్నమొనరింతురో నన్నె ఆశ్రయించి,
వారె అధ్యాత్మనుగురించి, బ్రహ్మమనగ,
కర్మమఖిలము తెలిసికోగలుగువారు.

తా॥ ముసలితనము, చావు లేకుండ చేసికొనుటకై నన్నే ఆశ్రయించి సాధన చేయువారే బ్రహ్మమును, అధ్యాత్మను, సర్వకర్మమును తెలిసికొనగల్గుదురు.

30. సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః।
ప్రయాణకాలేఽపి చ మాం తే విదుర్యుక్తచేతసః ॥

సాధిభూతునిగా, సాధియజ్ఞునిగను,
మఱియు సాధిదైవముగ నన్నెఱుఁగువారు
చిత్తనిగ్రహముండుటచేత నన్ను
మృత్యువేళను గూడ గుర్తింపగలరు.

తా॥ అధిభూతము, అధిదైవము, అధియజ్ఞములతో గూడిన నన్నెఱిగియున్న వారు మరణకాలమందును నన్ను తెలిసికొనుచున్నారు.

ఇది ఉపనిషదర్థప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును,
శ్రీకృష్ణార్జునసంవాదమునగు శ్రీమద్భగవద్గీతయందలి
విజ్ఞానయోగమను సప్తమాధ్యాయము
సమాప్తము

# గీతామృతము

## శ్రీమద్భగవద్గీత

## అక్షరపరబ్రహ్మయోగము

## ఎనిమిదవ అధ్యాయము : సారాంశము

ప్రధాన విషయము :—

అక్షరమనగా నాశములేనిది. నాశరహితమగు పరబ్రహ్మమును గూర్చి ఈ యధ్యాయమున తెలుపబడినది.

ఇందలి ముఖ్యాంశములు :—

బ్రహ్మము, అధ్యాత్మ మున్నగు వానిని గురించి పార్థుని ప్రశ్నలు. శ్రీకృష్ణుని సమాధానములు—మరణకాల పరిస్థితి, ప్రణవోపాసన—సృష్టి లయములు—భగవానుని స్వరూపము – శుక్ల (జ్ఞాన) కృష్ణ (అజ్ఞాన) మార్గములు — యోగమాహాత్మ్యము.

## సారాంశము

వెనుకటి అధ్యాయాంతమున శ్రీకృష్ణుఁడు నుడివిన బ్రహ్మము, అధిభూతము, అధియజ్ఞుడు మున్నగువానిని గూర్చియు ముఖ్యముగా మనుజుఁడవసాన సమయమున పరమాత్మను స్మరించుచు, పరమాత్మను చేరగలుగు విధానమును గూర్చియు నెఱుఁగగోరి అర్జునుఁడు ప్రశ్నింపగా శ్రీకృష్ణుఁడిట్లు చెప్పుచున్నాడు.

అర్జునా! నాశవంతమైన గుణము కలది అధిభూతము. నాశరహిత మైనది పరబ్రహ్మము. ఆ బ్రహ్మము యొక్క అంశయే అన్ని ప్రాణులయందు జీవరూపముననున్న అధ్యాత్మ. ఆవిరాట్పురుషుడే అధిదైవము దేహ మందుండు అధియజ్ఞుడను నేనే.

మృత్యుకాలమున మనుజులెట్టి యాలోచనలతో నుందురో మరణా నంతరమున వారలారూపములనే పొందుదురు. నన్నే స్మరించుచు శరీరమును వీడు నరుడు నన్ను తప్పక పొందగలడు. అందుచే అర్జునా నీవు సర్వ కాలములయందును నన్నే స్మరించుచుండుము. మరణ సమయమందు మనోనిశ్చలత్వమును కలిగి, కనుబొమల మధ్యదృష్టి నిలిపి పరమాత్మను స్మరించువాడు తప్పక ఆ పరబ్రహ్మములో నైక్యమగును. అట్టి మృత్యు సమయమున తక్కిన ఆలోచనలను కట్టిపెట్టి ప్రాణవాయువును శిరముననున్న బ్రహ్మరంధ్రమున జేర్చి. యోగము నభ్యసించుచు 'ఓం' అను ఒక్క ప్రణవ శబ్దమును ఉచ్చరించుచున్న యెడల సర్వోత్తమ మోక్షపదము లభించును. వారికిక లోకమున పునర్జన్మము లేదు.

కలి, ద్వాపర, త్రేతా, కృతయుగములు కలిసి (మొత్తము 43,20,000 సంవత్సరములు) ఒక మహాయుగము. అట్టి వేయి మహాయుగములు బ్రహ్మ కొక పగలు. ఇంకొక వేయి మహాయుగములు రాత్రి. అట్టివి 100 సంవత్సర ములు బ్రహ్మయొక్క ఆయుపు.

బ్రహ్మ యొక్క పగటికాల మారంభమగునప్పుడు సర్వచరాచరములు సృష్టి యగుచున్నవి. రాత్రి కాగానే అవి లయమగుచుండును. పూర్వ కల్పముననున్న ప్రాణికోటులే మరల మరల జనన మరణము లందు చుండును. ఈ ప్రాణికోటులన్నియు నశించినప్పటికిని, నశింపనట్టి వస్తువు పరమాత్మ యొకటి యున్నది. అదియే నేను. అన్యచింతలేని భక్తివలననే ఆ పరమపదసిద్ధి లభించును.

జగమునందు జ్ఞాన అజ్ఞాన మార్గములు శాశ్వతమైనవి ఒకటి (జ్ఞానము) మోక్షప్రాప్తికి మార్గము చూపును; వేరొక దానివలన జనన

మరణ భూయిష్ఠమగు సంసారబంధమే యెడతెగక కల్గుచున్నది. ఈ మార్గముల నిజతత్త్వముల తెలిసికొనిన మనుజుఁడే యోగి. అట్టి యోగి తపోదానములు, వేదాధ్యయనము వలన లభించు దానికన్న అధిక పుణ్యమునే పొంది బ్రహ్మపదమును పడయును. అర్జునా! నీవును ఆ జ్ఞానమునే పడయగల ధ్యాననిష్ఠను నిరంతరము కలిగియుండి, అట్టి యోగివి కమ్ము.

ఈ అధ్యాయమందలి ముఖ్య శ్లోకములు

5, 8, 13, 22. 26, 27

# శ్రీ మ ద్భ గ వ ద్గీ త

## ఎనిమిదవ అధ్యాయము

## అ క్ష ర ప ర బ్ర హ్మ యో గ ము

అర్జున ఉవాచ :— అర్జునుఁడు అడిగెను.

1. కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ।
అధిభూతం చ కిం ప్రోక్త మధిదైవం కిముచ్యతే ॥

పూరుషోత్తమ, కృష్ణ! చెప్పు మొకయింత
ఎట్టి దా బ్రహ్మమనఁబడు? ఏది కర్మ
మేది యధ్యాత్మ? మధిభూత మెట్టిదనుచు
ఏది అధిదైవమనుచు వచింపఁబడును?

తా॥ పురుషోత్తముఁడవైన కృష్ణా! బ్రహ్మమేది? అధ్యాత్మమెయ్యది? కర్మమనఁనేమి? అధిభూతము, అధిదైవము అని వేనిని చెప్పుదురు?

2. అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మి న్మధుసూదన।
ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసి నియతాత్మభిః ॥

అచ్యుతా! దేహమందధియజ్ఞుఁ డెవరు?
ఈ శరీరమునం దాతఁ డెట్టు లుండు?
మనసు వశమునందుంచుకొనిన జనులు
మృత్యువేళల నిన్నెట్టు లెఱుగగలరు?

తా॥ అచ్యుతా, ఈ శరీరమున అధియజ్ఞుఁడెవఁడు, ఆత డెట్లుండును. మనసు స్వాధీనమందుంచుకొనినవారు మరణ సమయమున నిన్నెట్లు తెలిసికొనగలరు?

శ్రీభగవానువాచ :— శ్రీభగవానుఁడు చెప్పెను.

3. అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మ ముచ్యతే।
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః ॥

అవ్యయమ్ము సర్వోత్కృష్ట మైన యాత్మ
బ్రహ్మమనబడు; జీవుఁడై ప్రాణులందు
తత్స్వభావమె తనరు అధ్యాత్మయనగ,
పలుకఁబడు భూతసృష్టిని కలుగఁజేయు
త్యాగపూర్వకక్రియ కర్మమనుచు భువిని.

తా॥ శాశ్వతము, సర్వోత్తమము అయిన పరమాత్మనే బ్రహ్మమందురు. ఆ పరబ్రహ్మ యొక్క అంశమే సర్వభూతములందు జీవరూపమున ప్రకటమై 'అధ్యాత్మ' అనబడును. ప్రాణికోటుల ఉత్పత్తిని కలుగజేయు త్యాగపూర్వకము, యజ్ఞరూపకము అయిన కార్యమును 'కర్మము' అనెదరు.

4. అధిభూతం క్షరోభావః పురుషశ్చాధిదైవతమ్ ।
అధియజ్ఞోఽహ మేవాత్ర దేహే దేహభృతాం వర ॥

అర్జునా! నాశవంతమౌ నట్టి సహజ
గుణము కలదియె అధిభూత మనగబడును,
ఆ విరాట్పురుషుం డధిదైవతమ్ము,
అగుదు నధియజ్ఞుఁడను దేహమందు నేనె.

తా॥ నశించునట్టి గుణము కలిగిన పదార్థము అధిభూతము, ఇదియే అపరా ప్రకృతి. పరాప్రకృతియగు విరాట్పురుషుడు అధిదైవము. (అధ్యా. 7. శ్లో॥ 4, 5). ఈ దేహమందు అధియజ్ఞుఁడను నేనే; అనగా త్యాగబుద్ధి, స్వార్థరాహిత్యము మున్నగు సద్గుణములే అధియజ్ఞము.

5. అన్తకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కలేబరమ్ ।
యః ప్రయాతి స మద్భావం యాతి నా స్త్యత్ర సంశయః ॥

మృత్యుసమయాన నన్నె స్మరించుకొనుచు
నీశరీరము నిట త్యజియించువాఁడు
పడయఁగల్గును నాస్వరూపమును తాను,
ఇందు సందియ మిసుమంత యేని లేదు.

తా॥ మరణ సమయమునందు నన్ను స్మరించుచు శరీరమును వీడు జీవి నా సాయుజ్యమును పొందును. ఇందు సందేహమేమియు లేదు.

6. యం యం వాపి స్మరన్ భావం త్యజత్యన్తే కలేబరమ్ ।
తం తమేవైతి కౌన్తేయ సదా తద్భావ భావితః ॥

అర్జునా ! మృత్యుకాలమ్మునందు మనుజుఁ
డేతలంపుతో తనువుత్యజింపఁగలడో,
తలపులందున్న యారూపములనె సతము
తిరిగి పొందు నాతండు తత్స్మరణవలన.

తా॥ ఏయే ఆలోచనలతో నరుఁడు మరణకాలమున శరీరమును త్యజించునో, ఆ భావముల స్మరణవలన కలిగిన సంస్కారముచే తిరిగి ఆ రూపములనే మనుజుఁడు తరువాతి జన్మలందు పొందుచున్నాఁడు.

7. తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్యచ ।
మయ్యర్పిత మనో బుద్ధిర్మామేవైష్యస్యసంశయః ॥

కాన, అర్జున ! యిక సర్వకాలములను
నన్నె స్మరియించుకొనుచు, మానసము బుద్ధి
నాకె అర్పించి యుద్ధమొనర్ప లెమ్ము,
సందియము లేదు ననునీవు పొందగలవు.

తా॥ కావున, ఓ అర్జునా! సర్వకాలములందును నన్ను స్మరించుచు, మనస్సును బుద్ధిని నాయందర్పించి యుద్ధము చేయుము. నిస్సందేహముగ నీవు నన్ను పొందగలవు.

8. అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా ।
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్ ॥

పార్థ ! అభ్యాసయోగసంపదను కలిగి
అన్యచింతల వైపున కరుగనట్టి
చిత్తశుద్ధితో ధ్యానమ్ము చేయువాఁడు
పడయఁగల్గును దివ్యుఁడౌ పరమపురుషు.

తా॥ అర్జునా! యోగమభ్యసించుచు, ఇతరములగు తలపులులేని చిత్తశుద్ధితో, ధ్యానము చేయుచున్న మనుజుఁడు, దివ్యుఁడయిన ఆ పరమపురుషుని పొందగలఁడు.

9\. కవిం పురాణ మనుశాసితార మణోరణీయాం స మనుస్మరేద్యః ।
సర్వస్య ధాతార మచింత్య రూప మాదిత్యవర్ణం తమసః పరస్తాత్ ॥

10\. ప్రయాణకాలే మనసాఽచలేన భక్త్యాయుక్తో యోగబలేన చైవ ।
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్ స తం పరం పురుషముపైతి దివ్యం ॥

అణువుకంటెను సూక్ష్ముఁడు, నఖిలవేత్త,
ఆద్యుఁ, డఖిలరక్షకు, డచింత్యాకృతియును,
తరణితేజస్వి, అజ్ఞానతమసమునకు
నవల నలరుచుండెడు పరమాత్మనెంచి—
మరణసమయాన నిశ్చలమనసు తోడ
భక్తితో, యోగబలమున ప్రాణవాయు
చలనమును కన్బొమలమధ్య నిలిపియుంచి,
ఎవఁడు ధ్యానయుక్తుఁడయి స్మరింపఁగలఁడొ
వాఁడె పొందు నా దివ్యుఁడౌ పరమపురుషు.

తా॥ మరణకాలమందు నిశ్చలమైన మనస్సు కలిగి, భక్తిభావముతోను యోగముచేతను కనుబొమల మధ్య ప్రాణవాయువును నిల్పి, అణువుకంటె అతిసూక్ష్మమైనవాఁడు, సర్వము నెఱిఁగినవాఁడు సనాతనుఁడు, అందఱిని రక్షించి పరిపాలించువాఁడు, సూర్యునివలె స్వయంప్రకాశమైనవాఁడు, వూహించరానివాఁడు, అజ్ఞానాంధకారమున కావలనున్నట్టి దివ్యపురుషుఁడైన పరమాత్మను ధ్యానించు మానవుడు ఆ పరమాత్మనే చేరుకొనును.

11\. యదక్షరం వేదవిదో వదన్తి విశన్తి యద్యతయో వీతరాగాః ।
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తేపదం సంగ్రహేణప్రవక్ష్యే ॥

ఏది అవ్యయమందురొ వేదవిదులు,
దేనిఁజేరగయతులు యత్నింత్రొ వీత
రాగులై, దేనివాంఛింత్రొ బ్రహ్మచారు
లట్టిపదము చెప్పెద సంగ్రహముగ పార్థ!

తా॥ వేదవేత్తలు దేనిని శాశ్వతమని నుడువుచున్నారో, యోగులు ఏ స్థానమును చేరుకొనుటకు ప్రయత్నించుచుందురో బ్రహ్మచర్యవ్రతులు దేనిని పొందుటకు కోరుచుందురో అట్టి పరమపదమును గూర్చి నీకు సంగ్రహముగ తెలిపెదను. అర్జునా! వినుము.

12. సర్వద్వారాణి సంయమ్య మనోహృది నిరుధ్యచ ।
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్ ॥

13. ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్
యః ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్ ॥

అన్ని యింద్రియముల నిగ్రహమ్మొనర్చి,
హృదయమానసమ్ముల నిరోధించి యుంచి,
ప్రాణవాయువు బ్రహ్మరంధ్రమునఁ జేర్చి,
అచలుఁడై, యోగధారణయందు నుండి,
'ఓం' అనెడు బ్రహ్మవాచక మొక్కదాని
నుచ్చరించుచు, స్మరణచేయుచును నన్నె,
తనువు విడనాడి చనుచున్న మనుజవరుఁడు
పొందఁగలఁడు సర్వోత్తమమోక్షపదము.

తా॥ ఇంద్రియములను కట్టుబాటుచేసి, హృదయమును మనస్సును చెదరిపోకుండ నిల్పి, శిరస్సునందున్న బ్రహ్మరంధ్రమందు ప్రాణవాయువును చేర్చి, ఆత్మను గూర్చిన చింతనము నిశ్చలుడై చేయుచు, 'ఓం' అను ఒక్క పదమును ఉచ్చరించుచు, నన్నే భావించుచు, శరీరమును విడచుచున్న మనుజుఁడు సర్వోత్తమమైన మోక్షమును పొందగలఁడు.

14. అనన్యచేతాస్సతతం యో మాం స్మరతి నిత్యశః ।
తస్యాహం సులభః పార్థ ! నిత్యయుక్తస్య యోగినః ॥

అర్జునా ! అన్యచింత ఆవంతలేక
ఎవఁడు నిత్యమ్ము నన్నె స్మరించఁగలఁడో,
అట్టి సంతతధ్యానాత్ముఁడైన యోగి
వరుఁడె పొందగలఁడు సులభముగ నన్ను.

తా॥ అర్జునా! ఇతరములైన ఆలోచనలులేక, నిత్యము నన్ను స్మరించుచున్న ధ్యానయోగి, కడుసులభముగ నన్ను పొందగలఁడు.

15. మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్ ।
నాప్నువన్తి మహాత్మాన స్సంసిద్ధిం పరమాం గతాః ॥

పరమపదసిద్ధి నందిన భవ్యమతులు
పొందుదురు నన్నె; మఱి వారు పొందఁబోరు
సకల దుఃఖభూయిష్ఠ మశాశ్వతమగు
జన్మ మెప్పుడు తిరిగి యీ జగతియందు.

తా॥ మోక్షపదమును పొందఁగల్గిన మహానుభావులు నన్నే చేరుదురు. దుఃఖములతో కూడినదియు, అశాశ్వతము అయిన జన్మమును వారు తిరిగి పొందరు.

16. ఆబ్రహ్మ భువనాల్లోకాః పునరావర్తినోఽర్జున ।
మాముపేత్య తు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే ॥

అర్జునా! బ్రహ్మలోకపర్యంతమున్న
పుణ్యలోకము లేగిన పురుషులకును
మరల పుట్టుట తప్ప దీ ధరణియందు;
నను(బడయు వారి కిట్టి జన్మమ్ములేదు.

తా॥ అర్జునా! బ్రహ్మలోకము వఱకున్న యే లోకమునకు నరుఁడేగినప్పటికిని మరల భూమిపై పుట్టవలసినదే. కాని, నన్ను పొందినవానికి మాత్రము భూమిపై పునర్జన్మము లేదు.

17. సహస్రయుగ పర్యన్తమహర్యద్బ్రహ్మణో విదుః ।
రాత్రిం యుగ సహస్రాన్తాం తేఽహోరాత్రవిదో జనాః ॥

బ్రహ్మ కొక్క పగలు గాని, రాత్రి గాని,
వేయి యుగముల కాలమై పెంపుచుండు;
ఎవ్వ రీ కాలపరిమితి నెఱుఁగ గలరొ,
వా రెఱుఁగుదురు రాత్రింబవళ్ళ నిజము.

తా॥ బ్రహ్మదేవుని పగలు వేయి యుగముల పరిమితిగల దానిగను, అట్లే బ్రహ్మదేవుని రాత్రి వేయి యుగముల కాలపరిమితిగల దానిగ నెఱుఁగువారే రాత్రింబవళ్ళ యదార్థతత్త్వము నెఱిఁగినవారు.

కలియుగము 4,32,000 సంవత్సరములు. ద్వాపరయుగము 8,64,000 సం॥లు. త్రేతాయుగము 12,96,000 సం॥లు. కృతయుగము 17,28,000 సం॥లు. మొత్తము 43,20,000 సంలు. ఒక మహాయుగము. అట్టి వేయి మహాయుగములు బ్రహ్మకు ఒక పగలు. అట్టి వేయి మహాయుగములు ఒక రాత్రి.

18. అవ్యక్తా ద్వ్యక్తయః సర్వాః ప్రభవ న్త్యహరాగమే ।
రాత్ర్యాగమే ప్రలీయ న్తే తత్రై వావ్యక్త సంజ్ఞకే ॥

ఆ పగటికాల మారంభమైన యపుడు
ప్రభవమగు సర్వ మవ్యక్త ప్రకృతినుండి,
తిరిగి యవ్యక్తప్రకృతిలో నురిగిపోవు
రాత్రిసమయాన సకలచరాచరములు.

తా॥ బ్రహ్మదేవుని ఆ పగటివేళ ఆరంభమైనపుడు, సర్వచరాచరములు అవ్యక్త ప్రకృతినుండి యుద్భవించుచున్నవి. రాత్రి కాగానే అవి యన్నియు ఆయవ్యక్త ప్రకృతియందే లీనమగుచున్నవి.

19. భూతగ్రామస్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే ।
రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవత్యహరాగమే ॥

పూర్వకల్పాన నున్నట్టి భూతచయయె
అవనిపుట్టుకర్మాధీన మగుచు మరల
రాత్రియగునంత లీనమై ప్రకృతియందె,
ప్రభవ మగుచుండు తిరిగి యా పగటివేళ.

తా॥ పూర్వకల్పమునందున్న భూతకోటియే కర్మవశమున మరల మరల పుట్టి బ్రహ్మ యొక్క రాత్రి కాగానే ప్రకృతియందు లీనమగుచున్నది. బ్రహ్మకు పగలు కాగానే మరల పుట్టుచున్నది.

20. పర స్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః ।
యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి ॥

ఇట్టి యవ్యక్తప్రకృతికి నితరమగుచు,
ఆద్య మవ్యక్త ముత్తమ మైన వస్తు
వొకటి యున్నది నశియింపకుండ, సకల
ప్రాణులును నశియించినప్పటికి కూడ.

తా॥ సర్వభూతములు నశించినప్పటికిని కూడ, పై జెప్పిన అవ్యక్తప్రకృతికి అన్యమైనదియు, సనాతనమైనదియు అగోచరము ఉత్తమమైనదియు అయిన వస్తు వొకటి ఎన్నటికి నాశనములేనిది ఉన్నది.

21. అవ్యక్తోఽక్షర ఇత్యుక్తస్తమాహుః పరమాం గతిమ్।
యంప్రాప్య న నివర్తన్తే తద్ధామ పరమం మమ॥

అవ్యయుండు, అగోచరుం, డనగనొప్పు
వానినే పల్కుచుందురు పరమగతిగ;
దేని పొందిన జన్మమ్ము తిరిగి రాదొ,
అదియె నేనైన ఆ పరమాత్మ పదము.

తా॥ ఎవఁడు అగోచరుఁడు శాశ్వతుఁడు అని చెప్పఁబడునో ఆ పరమాత్మయే పరమగతిగ యెంచఁబడుచున్నాడు. దేనిని పొందిన మరల పునర్జన్మలేదో అదియే నాయొక్క పరంధామ పదము.

22. పురుషః స పరః పార్థ! భక్త్యా లభ్యస్త్వనన్యయా।
యస్యాన్తః స్థాని భూతాని యేన సర్వమిదం తతమ్॥

అఖిలభూతము లెవ్వరియందు నుండు,
ఎవ్వఁడీ సర్వజగతి వ్యాపించియుండు,
అట్టి సర్వాత్ముఁడగు పరమాత్మ అన్య
చింత లేని నిశ్చలభక్తిచే లభింపు

తా॥ అర్జునా! అఖిల భూతము లెవ్వనియందు నివసించుచున్నవో, ఎవ్వడు జగత్తంతయు నిండియుండెనో, అట్టి పరమాత్మ అన్యచింతలులేని నిశ్చల భక్తిచే లభించుచున్నాఁడు.

23. యత్ర కాలే త్వనావృత్తిమావృత్తిం చైవ యోగినః।
ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ ॥

యోగులేకాలమందు మృత్యువును పొంది
తిరిగిపుట్టరో; యెప్పుడు మరణమంది
మరల జన్మించుచుందురో ధరణియందు
వినుము కౌంతేయ ! తత్కాలమును వచింతు.

తా॥ అర్జునా ! వినుము, యోగిజనులు ఏ సమయమందు మరణించినట్లయిన తిరిగి పునర్జన్మమందరో, యెప్పుడు మరణించిన మరల పునర్జన్మమును పొందెదరో ఆ కాలమును గూర్చి చెప్పెదను.

24. అగ్నిర్జ్యోతి రహశ్శుక్ల షణ్మాసా ఉత్తరాయణమ్।
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ॥

అగ్నియందున, తేజమునందు, పగటి
యందు, శుక్లపక్షమునందు, ఆరునెలల
ఉత్తరాయణమందు మృత్యుగతి చనెడు
బ్రహ్మవిదు లందెదరు పరబ్రహ్మపదము.

తా॥ అగ్ని, తేజము, పగటివేళ, శుక్లపక్షము, ఉత్తరాయణ మారునెలలయందు వారి కధిపతులగు దైవములున్న మార్గమునబోవు యోగులు (బ్రహ్మవేత్తలు) పరమాత్మ పదమును పొందెదరు.

25. ధూమో రాత్రి స్తథా కృష్ణష ణ్మాసా దక్షిణాయనమ్।
తత్ర చాంద్రమసం జ్యోతిర్యోగీ ప్రాప్య నివర్తతే ॥

క్షపను, పొగయందు, కృష్ణపక్షమున, దక్షి
ణాయనమునందు మరణము నందుచున్న
యోగు లా చంద్రమండలజ్యోతి చేరి
తిరిగి జన్మించు చుందురీ ధరణియందు.

తా॥ రాత్రి, పొగ, కృష్ణపక్షము, దక్షిణాయనము ఆరు నెలలయందు మరణించి తదధిపతులైన దేవతల మార్గమున బోవు యోగులు చంద్రమండలమందున్న జ్యోతిని జేరి తిరిగి భూమియందు జన్మించుచుందురు.

26. శుక్ల కృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతే మతే।
ఏకయా యాత్యనావృత్తి మన్యయాఽఽవర్తతే పునః॥

ఇట్లు శుక్లకృష్ణములుగా నెఱుఁగఁబడెడు
మార్గములు శాశ్వతములంచు మహేంద్రులంత్రు;
కలుగు నొకదానిచేత మోక్షపదసుఖము,
మఱొకదానిచే కలుగు జన్మములు మరల.

తా॥ జ్ఞానాజ్ఞానరూపములైన శుక్ల కృష్ణపక్ష మార్గములు రెండును శాశ్వతములైనవని తలపఁబడుచున్నవి. ఒక మార్గము వలన (జ్ఞానము) పునర్జన్మములేని మోక్షప్రాప్తియు, వేఱొకదాని వలన (అజ్ఞానము) మరల మరల జన్మములును కలుగుచున్నవి.

27. నైతే సృతీ పార్థ! జానన్యోగీ ముహ్యతి కశ్చన।
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున!॥

ఇట్టు లీ రెండుమార్గము లెఱుఁగు యోగి
అర్జునా! మోహజాలమునందు పడడు,
కాన, అర్జున! యెల్లప్డు ధ్యాననిష్ఠ
విడక నీవును యోగయుక్తుఁడవు కమ్ము.

తా॥ ఈ జ్ఞానాజ్ఞాన మార్గముల రెంటిని చక్కగా ఎఱిఁగియున్న యోగి అవివేకమున పడడు. కావున, అర్జునా! నీవును నిత్యము ధ్యాననిష్ఠను కలిగి ఆ విధమైన యోగివి కమ్ము.

28. వేదేషు యజ్ఞేషు తపఃసు చైవ దానేషు యత్పుణ్యఫలమ్ ప్రదిష్టమ్।
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా యోగీ పరం స్థానముపైతిచాద్యమ్॥

వీని నెఱుఁగగల్గిన యోగి దానమందు,
తపములందు, యజ్ఞమున, వేదములయందు,
కలుగు పుణ్యమ్మునకు నధికముగ పొంది
ఆదికారణ మైన బ్రహ్మపదమందు.

తా॥ వీని నన్నిటి నెఱిగిన యోగి, దానమునందు, తపమునందు, యజ్ఞమందు, వేదములందు చెప్పబడిన పుణ్యఫలమునకంటె అధికమునే పొంది, జగతి కాదికారణ మైన బ్రహ్మపదమును పొందును.

ఇది ఉపనిషదర్థప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును,
శ్రీకృష్ణార్జునసంవాదమునగు శ్రీమద్భగవద్గీతయందలి
అక్షరపరబ్రహ్మయోగమను ఎనిమిదవ అధ్యాయము
స మా ప్త ము

# గీతామృతము

## శ్రీమద్భగవద్గీత

## రాజవిద్యా రాజగుహ్యా యోగము

## తొమ్మిదవ అధ్యాయము : సారాంశము

**ప్రధాన విషయము :—**

అన్ని విద్యలలోను అధ్యాత్మజ్ఞాన విద్య శ్రేష్ఠమైనది. కనుకనే అది రాజవిద్య యనఁబడినది. మఱియు, పూర్వకాలమున ఇక్ష్వాకుఁడు, జనకుఁడు మొదలైనే రాజఋషులందఱు దీని నభ్యసించి తరించిరి. ఆ విద్య మోక్ష ప్రాప్తికి సులభసాధనములైన రహస్యములను కూడ బోధించును. అవియే ఈ అధ్యాయమునందు ప్రస్తావింపఁబడినవి.

**ఇందలి ముఖ్యాంశములు :—**

భగవానుని స్వరూపము — ప్రపంచోత్పత్తి—స్వర్గఫలము — నిష్కామ కర్మ మహిమ.

## సారాంశము

శ్రీకృష్ణభగవానుఁడిట్లు పలికెను.

అర్జునా ! నీ వసూయలేనివాఁడవు. ఆ కారణముచే సంసారబంధమునుండి ముక్తినిచ్చునట్టి విద్యను గూర్చి నీకు తెలిపెదను. ఇది అతిరహస్యమైనది. అనుభవపూర్వకముగ దీనిని తెలిసికొనవచ్చును. ఆచరణకు కూడ నిది బహు సులభమైనది. దీనిని తెలిసికొనుటయందు శ్రద్ధలేనివారు శాశ్వతముగ సంసారబంధమున బడుచున్నారు.

ఇంద్రియముల కగోచరుఁడనై జగమునందంతటను నేను నిండి యున్నాను. నాకు స్వాధీనమందున్న మాయాప్రకృతి వలన ఈ భూతజాలము లన్నియు సృష్టి యగుచున్నవి. బ్రహ్మకల్పాంతమున ఈ ప్రాణికోట్లన్నియు ఆ ప్రకృతిలోనే లీనమగుచున్నవి. కల్పాదిని అవి మరల జనించుచున్నవి. ఇట్లే భూతకోటులు ప్రకృతివశమయి జననమరణములు పొందుచున్నవి. ఈ ప్రాణికోటులన్నియు నాయందే యున్నవి. అవి నా యంశగా మాత్ర ముండుటచే నేను వానియందు లేను.

నేను సృష్టికార్యమున కధ్యక్షుఁడనే. మాయాప్రకృతివల్ల నీసృష్టియు, జగచ్చక్రము, నడచుచున్నవి. ఇది నా యోగమహిమ. దీని నెఱుఁగక ఈ దేహముతోనున్న నన్ను సామాన్య మానవునిగనే అవివేకులు తలంచు చున్నారు. వారు రాక్షసగుణము కలిగిన వ్యర్థజీవులే. దైవగుణములు కలిగిన పుణ్యాత్ములు సర్వభూతకోటికి ఆదికారణుఁడనియు, అవ్యయుఁడనియు నన్నెఱిఁగి పరమభక్తులై దృఢనిశ్చయముతో నన్ను సేవించుచున్నారు. జీవుడు, పరమాత్మ ఒకటేయను అద్వైతభావముతో కొందఱు, మఱి కొందఱు నన్ను తమకంటె వేఱైన దైవమునుగ ద్వైతభావమున గూడ పూజించుచున్నారు.

ఈ జగత్తునకు తల్లి, తండ్రి, రక్షకుఁడు, ప్రభువు, సృష్టి స్థితి లయములు, యజ్ఞము, యజ్ఞద్రవ్యములు, ఎండవానలు, అవ్యయమైన 'సత్' అశాశ్వతమైన 'అసత్' పదార్థములన్నియు నేనే.

కొందఱు వేదములలో చెప్పబడిన యజ్ఞము లొనర్చి స్వర్గసౌఖ్యము లను పొందుచున్నారు. వారి పుణ్యము క్షీణించిపోవగానే వారు తిరిగి భూలోకవాసమునకే వచ్చుచున్నారు. వారికీ జనన మరణములు తప్పవు. నిజమున కీ యజ్ఞకర్మములకు ప్రభువును నేనే. దానిని వారెఱుగక మోక్షమును పొందలేకున్నారు.

అన్యచింతలేని ఏకాగ్రభక్తితో నన్ను పూజించువారి యోగక్షేమము లను నేను కాపాడెదను. వారు నన్నే పొందుదురు. నిర్మలాంతఃకరణతో

వారు సమర్పించు పూవునైనను, పండునైనను, పత్రమైనను తుదకు జలము నైనను నేను సంప్రీతితో స్వీకరింతును. కావున అర్జునా, నీ వేకార్యము లొనర్చుచున్నను వానిని నాకు సమర్పింపుము. ఇదియే ముక్తిమార్గము.

సకల ప్రాణికోట్లును నాకు సమములే. ఒకరు ఎక్కువ. ఒకరు తక్కువ కారు. మహాపాపియైనను నన్ను భావించి పూజించుచున్నచో అతఁడు శీఘ్రముగ ధర్మాత్ముఁడై ముక్తికర్హుఁడగును. నన్ను శరణుపొందిన నాభక్తు లెన్నటికిని చెడరని ఘంటాపథముగ చెప్పుము. రాజర్షులు విద్వాంసులైన బ్రాహ్మణులే కాదు, ఎవరైనను నన్నాశ్రయించి పరమగతిని పొంద నర్హు లగుదురు. కాబట్టి, అర్జునా! నీవు నన్నే భావించుచు నాకు వినయపూర్వక ముగ నమస్కారము లొనర్చుచు నాయందాసక్తుఁడవు కమ్ము. నన్నే పొందుదువు.

ఈ అధ్యాయమున ప్రత్యేకముగ సులభసాధ్యములగు సాధనా పద్ధతులు చెప్పబడినవి. నిష్కామకర్మమును అందఱును ఆచరింపవచ్చునని చెప్పబడినది. మహాపాపియైనను ముక్తి పొందుటకు మార్గముపదేశింపబడినది. భక్తుఁడేమిచ్చినను భగవానుఁడు స్వీకరించును. భక్తుని యోగక్షేమములకు భగవానుఁడే బాధ్యత వహించుచున్నాడు. భగవద్భక్తుఁడెన్నటికి చెడిపోవడని కూడ శ్రీకృష్ణభగవానుఁడు అభయప్రధాన మొసగెను. ఆధ్యాత్మికసాధనలో సులభమార్గములగు ఇట్టి పరమరహస్యములు చెప్పబడిన అధ్యాయమిది.

ఇందలి ముఖ్య శ్లోకములు

11, 21, 22, 26, 29, 31

# శ్రీమద్భగవద్గీత

## తొమ్మిదవ అధ్యాయము

## రాజవిద్యా రాజగుహ్యయోగము

శ్రీ భగవానువాచ :- శ్రీ భగవానుఁడు చెప్పెను.

1. ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే ।
జ్ఞానం విజ్ఞాన సహితం యత్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥

పార్థ! నీవసూయయె లేనివాఁడ వగుట,
బంధములనుండి ముక్తి లభ్యమగు నదియు,
అనుభవజ్ఞానసహితమ్ము నతిరహస్య
మైన జ్ఞానమ్ము చెప్పుచున్నాను వినుము.

తా॥ అర్జునా! నీవు అసూయలేనివాఁడవు. ఆ కారణమున సంసారబంధము నుండి మోక్షము నిచ్చునదియు, అనుభవ సహితముగ తెలియఁగలిగినట్టిదియు, రహస్యమైనదియు నగు జ్ఞానమును చెప్పుచున్నాను వినుము.

2. రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిదముత్తమమ్ ।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్ ॥

అతిరహస్యము, రాజవిద్యయగు యోగ,
ముత్తమము, పావనము, ధర్మయుక్తమిద్ది,
అవ్యయ మ్మనుభవసిద్ధమైనదవని,
ఆచరించుటకు సులభమైన విధము.

తా॥ ఇది అతిరహస్యమైన రాజవిద్య. ఉత్తమమైనది, పవిత్రమైనది, ధర్మయుక్తమైనదియును. ఇది శాశ్వతమైనది. ప్రత్యక్షముగ తెలియదగినదియై, ఆచరణయందు కడు సులభమైనది కూడను.

3. అశ్రద్ధధానాః పురుషా ధర్మస్యాస్య పరన్తప ।
అప్రాప్యమాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని ॥

అర్జునా ! యిట్టి ధర్మమునందు శ్రద్ధ
లేని పురుషులు, ననుపొందలేక, జనన
మరణయుతమగు సంసారమార్గమందె
స్థిరముగా సంతతమ్మును తిరుగుచుంద్రు.

తా॥ అర్జునా! ఆత్మజ్ఞానమగు నీ ధర్మమునందు శ్రద్ధలేని మనుజులు, నన్ను పొందలేక, జనన మరణసంయుతమగు సంసారమార్గమందే స్థిరముగా తిరుగాడు చున్నారు.

4. మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా ।
మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః ॥

పార్థ ! అవ్యక్తమైన రూపమ్ముతోడ
నేనె వ్యాపించియుంటి నీ నిఖిలజగతి,
అఖిలభూతజాలమ్ము నాయందె కలదు;
నేను మాత్రము లేనిక వానియందు.

తా॥ అర్జునా! దృగ్గోచరము కాని రూపముతో సమస్త జగతియందు నేనే వ్యాపించి యుంటిని. అన్ని భూతసముదాయములును నాయందున్నవి. కాని, నాకు అవి ఆధారములు కావు. వానియందు నేను లేను.

5. న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగ మైశ్వరమ్ ।
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః ॥

అరయు మీశ్వరసంబంధ మైన నాదు
యోగమహిమను నీవు; నాయొక్క ఆత్మ
ప్రాణికోటుల ధరియించి వానివృద్ధి
నందఁజేయుచున్నను వానియందు లేదు—
అఖిలభూతకోటులును నాయందు లేవు,

తా॥ ప్రాణికోటులు, నాయందు లేవు. నా ఈశ్వర సంబంధమైన మహిమను చూడుము. ప్రాణులను పుట్టించుచు, భరించుచు ఉన్నను నేను వానియందు లేను. పరిపూర్ణాద్వైతమగు పరమాత్మస్వరూపమునే భగవానుడిచట చెప్పుచున్నాడు. పరమాత్మ దృష్టిలో అంతయు ఏకైకరూపము.

6. యథాఽఽకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో మహాన్ ।
తథా సర్వాణి భూతాని మత్ స్థానీత్యుపధారయ ॥

ఎల్లచోటులలో సంచరించుచున్న
ఈ మహావాయు వేరీతి యెల్లపుడును
ఆకసమ్మున నుండునో, అఖిల ప్రాణు
లట్లె నాయందు గలవని తెలిసికొనుము.

తా॥ అర్జునా! అంతటను సంచరించునదియు, గొప్పదియు నగు వాయువు ఏ విధమున ఆకాశమందెప్పుడును ఉండునో అట్లే సర్వభూతములు నాయందున్నవని తెలిసికొనుము.

7. సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం యాన్తి మామికామ్ ।
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్ ॥

అర్జునా! భూతజాలమ్ము లన్ని కూడ
బ్రహ్మకల్పాంత మందు నాప్రకృతియందె
లయము చెందుచునుండు; కల్పాదియందు
వానినెల్ల సృజించుచున్నాను నేను.

తా॥ అర్జునా! ప్రాణికోట్లన్నియు ప్రళయకాలమగుసరికి నా ప్రకృతియందు లయమగుచున్నవి. మరల సృష్టికాల ప్రారంభమందు వానిని నేను సృష్టించుచున్నాను.

8. ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునఃపునః ।
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతేర్వశాత్ ॥

ప్రకృతిబద్ధమ్ము లస్వతంత్రములు నైన
సకల ప్రాణిసంఘముల నీ జగతియందు,
నాప్రకృతిని స్వాధీన మొనర్చుకొనుచు
నేనె మరల మరల సృజియించు చుంటి.

తా॥ ప్రకృతి వశమయి అస్వతంత్రములుగనున్న సకల జీవులను, నాకు స్వాధీనములోనున్న ప్రకృతిచే, వాని వాని కర్మానుసారము మరల మరల నేనే సృజించుచున్నాను.

9. న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనంజయ।
ఉదాసీనవదాసీన మసక్తం తేషు కర్మసు ॥

సృష్టికార్యమ్మ నిటుల చేసిననుగూడ
వానియందున నాసక్తి లేనివాఁడ
నగుచు, సాక్షిగామాత్ర మున్నట్టి నేను
బద్ధుఁడనుగాను కర్మవిపాకములను.

తా॥ ఈ విధముగా సర్వభూత సృష్టిని నిర్వహించుచున్నను ఆ సృష్టియందేవిధమగు నాసక్తియులేని తటస్థుఁడను. ఆ కారణముచే నీ కర్మలేమియు నన్ను బంధింపవు.

10. మయాఽధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్।
హేతునానేన కౌన్తేయ! జగద్విపరివర్తతే ॥

ఏను మాత్ర మధ్యక్షుఁడ నింతె పార్థ!
ఈ చరాచరమగు విశ్వసృష్టి కెల్ల
కర్త మాయాప్రకృతియె; ఈకారణమున
జగ మవిచ్ఛిన్న గతితోడ సాగుచుండె.

తా॥ ఈ సృష్టికార్యక్రమమునకు నేను కేవలము అధ్యక్షుఁడను. ప్రకృతియే చరాచరమగు జగత్తును సృష్టించుచున్నది. ఈ కారణముచే జగత్తు నిర్విరామముగా సాగుచున్నది.

11. అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్।
పరం భావమజానన్తో మమ భూతమహేశ్వరమ్ ॥

మనుజదేహాన నున్న కారణముచేత
అఖిల భూతమహేశుఁడ నైన నన్ను
గాని, నానిజతత్త్వమ్ము గాని మూఢు
లెఱుఁగలేక నన్ను పరిభవించు చుండ్రి.

తా॥ అఖిల భూతకోటికిని మహాప్రభువునైన నేను మానవరూపములో నుంటిని. నా తత్త్వమెఱుఁగలేని మూఢజనులు నన్ను సామాన్య మానవునిగా తలంచి అవమానించుచున్నారు.

12. మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః।
రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః॥

నిష్ప్రయోజన జ్ఞానమ్ము, నిష్ఫలమ్ము
లైన కర్మముల్ వ్యర్థమ్ములైన కోరి
కలను కల్గి, వారలు వివేకమ్ము లేక
ఆశ్రయించుచు నుండిరి అసురగుణము.

తా॥ అట్టి మూఢులు, వ్యర్థములైన జ్ఞానము, వ్యర్థములైన పనులు, వ్యర్థములైన ఆశలతోకూడి, వివేకములేక యెల్లపుడును రాక్షసస్వభావమునే పొంది యుందురు.

13. మహాత్మా నస్తు మాం పార్థ దైవీం ప్రకృతి మాశ్రితాః।
భజ న్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్॥

అర్జునా! పుణ్యులు మహాత్ము లైనవారు
దైవగుణులయి అన్యచింతలను వదలి
అవ్యయుఁడు భూతములకెల్ల నాద్యుఁడనుచు
నన్నెఱిఁగి భజియింత్రు మనమ్ములందు.

తా॥ అర్జునా! మహాత్ములైనవారట్లు కాదు. శమదమాది దైవగుణములు కలిగి, శాశ్వతుఁడను అఖిల భూతకోటికి ఆదికారణుఁడనంచు నన్ను తెలిసికొని ఇతర చింతలేమియులేక నన్నే పూజింతురు.

14. సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః।
నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే॥

యత్నపరులయి దృఢనిశ్చయమున వారు
కీర్తనము సేయుచును నమస్కృతు లొనర్చి,
అచలభక్తిని మనసు నాయందె నిల్పి,
ఎల్లవేళల నన్నుపాసించుచుంద్రు.

తా॥ ఆ మహాత్ములు, గట్టి పట్టుదలతో యెల్లపుడు నాయందె భక్తితో మనస్సునుంచి నాకు నమస్కరించుచు నా గుణములు కీర్తించుచు నన్ను పూజించు చుందురు.

15. జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజన్తో మాముపాసతే ।
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్ ॥

అన్యు లికకొందఱు మహాత్ము లైనవారు
బహువిధముల ద్వైతాద్వైతభావములను
విశ్వ మెల్లయెడలను వ్యాపించి యున్న
నన్నుపాసించు చుంద్రు జ్ఞానాత్ములగుచు.

తా॥ మఱికొందఱు మహాత్ములు జ్ఞానసముపార్జన చేయుచు, జీవబ్రహ్మము లొకటేయను నద్వైతభావమున గాని, బ్రహ్మము వివిధ దేవతారూపముగ వేఱుగ నున్నదను ద్వైతభావమున గాని అనేక విధముల సర్వవ్యాపిగు నన్ను పూజించు చున్నారు.

16. అహం క్రతు రహం యజ్ఞః స్వధాహ మహమౌషధమ్ ।
మన్త్రోఽహ మహమేవాజ్య మహమగ్ని రహం హుతమ్ ॥

నేనె క్రతువును, యజ్ఞమ్ము నేనెయగుదు,
నేనె, యన్నమ్ము, ఓషధులేనెయగుదు,
నేనె మంత్రమ్ము, ఆజ్యమ్ము నేనె యగుదు,
నేనె, అగ్నియు, హోమమ్ము నేనె యగుదు.

తా॥ యజ్ఞమును, క్రతువును, మంత్రము, నేయి, హోమము, హోమద్రవ్యములును దేవతలకిడు అన్నము, అగ్నియును నేనే. యజ్ఞము ఉదాహరణముగ జగతియందు సర్వము తా నేయని భగవానుడు నుడువుచున్నాడు.

17. పితాఽహమస్య జగతో మాతా ధాతా పితామహః ।
వేద్యం పవిత్రమోంకార ఋక్సామయజురేవ చ ॥

నేనె జగతికి తల్లి, తండ్రియును, తాత,
నెల్లరకు రక్షకుఁడను, లోనెఱుఁగఁదగిన
పావనమ్మైన ఓంకారపదము నేనె,
ఋగ్యజుస్సామవేదమ్ములెల్ల నేనె.

తా॥ ఈ జగత్తునకు తల్లి, తండ్రి, తాత, అందఱకు రక్షకుఁడను, మనస్సులో తెలిసికొనదగిన పవిత్రమగు ఓంకారస్వరూపుఁడను, ఋగ్యజుస్సామవేదములు మూడును నేనే.

18. గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాసశ్శరణం సుహృత్ ।
ప్రభవః ప్రలయః స్థానం నిధానం బీజమవ్యయమ్ ॥

సర్వసాక్షియు, ప్రభుఁడ, పోషకుఁడ నేనె,
సృష్టి సంస్థితి లయ మేనె, ఏనె యునికి,
హితుఁడ, శరణుండ, నిధియును, గతియు నేనె,
అవ్యయమ్మగు బీజమ్ము నగుదు నేనె.

తా॥ సర్వమునకు సాక్షిభూతుఁడను, ఉనికియు, పోషకుడను, ప్రభువును, సృష్టి స్థితిలయములకు మూలమును, లోకహితుఁడను, శరణు పొందదగినవాఁడను, ఆనందనిక్షేపమును. ప్రజలకు పరమగతియు, నాశనములేని మూలకారణమును నేనే.

19. తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ ।
అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున ॥

తాపమును, మరణ మమరత్వమును నేనె
వాన గురిపించి నిలిపెడు వాఁడనేనె
అవ్యయమ్మగు 'సత్' వస్తు వగుదు నేనె
వ్యయమగు 'అసత్తు' వస్తువు నగుదు నేనె.

తా॥ అర్జునా! సూర్యుని రూపమున తపింపజేయువాడను నేనే. వర్షమును కురిపించి, నిలిపెడువాడను నేనే. మరణమును మరణరాహిత్యమగు మోక్షమును నేనే. శాశ్వతమగు సత్తు, అశాశ్వతమగు అసత్తును కూడ నేనే.

20. త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా యజ్ఞైరిష్ట్వాస్వర్గతిం ప్రార్థయన్తే।
తే పుణ్యమాసాద్య సురేన్ద్రలోక మశ్నన్తి దివ్యాన్దివి దేవభోగాన్॥

వేదముల్ మూఁడెఱిఁగి యజ్ఞవిధులచేత
నన్ను పూజించి సోమపాన మ్మొనర్చి
పాపరహితులై, స్వర్గసంప్రాప్తి కొఱకు
ప్రార్థనలు సేయు వార లా స్వర్గమంది
దివ్యభోగభాగ్యముల పొందెదరు తుదకు.

తా॥ మూడు వేదముల నధ్యయనముచేసి, యజ్ఞములలో నన్ను పూజించి, సోమరసమును స్వీకరించి, పాపములను పోగొట్టుకొని స్వర్గము కావలెనని ప్రార్థించు వారలు ఆ స్వర్గమును పొంది, అందు దివ్యభోగముల ననుభవించెదరు.

21. తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి।
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా గతాగతం కామకామా లభన్తే॥

స్వర్గసుఖమంది పుణ్యమ్ము క్షయముగాగ
వచ్చెదరు వారు భూలోకవాసమునకు
ఇట్లు వేదకర్మములనుష్ఠించు నట్టి
భోగచిత్తులు చచ్చుచు పుట్టుచుంద్రు.

తా॥ విశాలమగు స్వర్గలోక సౌఖ్యములను వారనుభవించి, వారొనర్చిన పుణ్యము క్షీణించిపోగానే మరల భూలోకవాసమునకే వారు వత్తురు. వేదకర్మములను చేయు వారీవిధముగనే జనన మరణములు పొందుచుందురు.

22. అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥

అన్యచింతల విడనాడి ఆత్మయందు
నన్ను నిరతమ్ము పూజించుచున్న ధ్యాన
పరుల సకల యోగక్షేమ భారమెల్ల
నేనె చూచి వహించుచున్నాను పార్థ!

తా॥ ఇతరములగు ఆలోచనలులేక నన్ను నిరంతరము ధ్యానించుచు పూజించు వారి యోగక్షేమములను నేనే చూచి నిర్వహించుచుందును.

23. యేఽప్యన్య దేవతా భక్తా యజన్తే శ్రద్ధయాన్వితాః।
తేఽపి మామేవ కౌన్తేయ! యజన్త్యవిధిపూర్వకమ్॥

పార్థ! నాకంటె నన్యదేవతల శ్రద్ధ
మీఱ నెవరు పూజించుచున్నారొ వారు
నన్ను గూడ పూజించుచున్నట్లె యగును,
కాని, అది విధియుక్తమార్గమ్ము గాదు.

తా॥ నాకంటె అన్యదేవతలను భక్తిశ్రద్ధలతో పూజించువారు కూడ నన్ను పూజించుచున్నట్లే. కాని వారి పూజ సక్రమమైనదియు శాస్త్రయుక్తమును కాదు.

24. అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ।
న తు మామభిజానన్తి తత్త్వేనాతశ్చ్యవన్తి తే॥

సర్వయజ్ఞకర్మముల కీశ్వరుఁడ నేనె,
యజ్ఞహోమ హవిర్భోక్త నగుదు నేనె,
కాని, యీ నిజము నెఱుంగలేని జనులు
పతితు లగుచుండి రో మోక్షపథమునుండి.

తా॥ సకల యజ్ఞములకు భోక్తను, ప్రభువును నేనే. అన్యదేవతారాధకులీ సత్యమును గ్రహింపఁజాలక మోక్షమార్గమునుండి అధఃపతితు లగుచున్నారు.

25. యాన్తి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాన్తి పితృవ్రతాః।
భూతాని యాన్తి భూతేజ్యా యాన్తిమద్యాజినోఽపి మామ్॥

దేవతాభక్తులగువారు దేవతలను,
పితరులను గొల్చువారలు పితృవరులను,
భూతముల గొల్చు మనుజులు భూతములను,
ననుగొలుచువారు నన్నె పొందంగ గలరు.

తా॥ ఎట్టి రూపములను భావించి పూజించువారు వానినే పొందుదురు. దేవతలను, పితృదేవతలను, భూతప్రేతాదులను కొలుచువారు వానినే పొందుచున్నారు. ఇక శాశ్వత పరమాత్మనగు నన్ను ధ్యానించువారు నన్నే పొందుచున్నారు.

26. పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి।
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః॥

నిర్మలాంతఃకరణతోడ నెగడువాడు
భక్తిపూర్వకముగ సమర్పణము జేయు
పత్రమైనను, పూలైన, పండునైన
తుదకు జలమైన సంప్రీతితో గ్రహింతు.

తా॥ నిర్మలమైన మనస్సుతో భక్తిపూర్వకముగ నాకు సమర్పించు ఆకునైనను, పూలైనను, ఫలమునైనను తుదకు జలమునైనను నేను పరమప్రీతితో గ్రహింపగలను.

27. యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్।
యత్తపస్యసి కౌన్తేయ! తత్కురుష్వ మదర్పణమ్॥

ఏమిచేయుచుండినను, నీవేమి తినిన
ఏమి హోమ మొనర్చిన. ఎట్టి తపము
చేసినను, ఎట్టి దానమిచ్చినను గూడ.
పార్థ! దానినే చేయు మర్పణము నాకు.

తా॥ అర్జునా! నీవేకార్య మొనర్చుచున్నను, తపము, దానము, హోమము నీవేమి చేయుచున్నను, ఏమి తినుచున్నను దానినే నాకు సమర్పణము చేయుము,

28. శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబంధనైః।
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి॥

అతుల సన్న్యాసయోగము నందు నెడల
పుణ్యపాపములే ఫలమ్ములుగ నున్న
సకల విధములౌ కర్మపాశముల నుండి
ముక్తిగని అర్జునా! నన్ను పొందగలవు.

తా॥ అర్జునా! ఈ విధముగా సర్వకర్మములు నాకర్పణ చేయు సన్న్యాస యోగము కలవాడవు అయిన యెడల శుభాశుభములు, పుణ్యపాపములు ఫలములు గాగల కర్మబంధములనుండి విడివడి నాసాయుజ్యమును పొందగలవు.

29. సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః।
యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్॥

సముఁడనై యుందు సర్వభూతముల యందు
ప్రియుఁడొకండు వేఱొక్కఁ డప్రియుఁడులేడు;
భక్తితో నన్ను పూజించువారు నన్నె
పొందుదురు, వారియందు నేనుందు నెపుడు.

తా॥ సర్వభూతములును నా దృష్టియందు సమములే. అందఱియందు సముఁడనై యుందును. ఒకఁడు ద్వేషింపఁదగినవాఁడు ఒకఁడు ప్రియమైనవాఁడనియును లేదు. భక్తి గలిగి నన్ను పూజించువారందఱును నన్ను పొందుదురు. నేనును వారి యందుందును.

30. అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్।
సాధురేవ స మన్తవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః॥

అధికపాపాత్ముఁడైనను, అన్యచింత
మాని భక్తితో పూజించునేని నన్నె,
అతఁడు సత్పురుషుఁడనియె యరయఁదగును
వానిసంకల్ప మతిశుభప్రదము గాన.

తా॥ ఎట్టి మహాపాపియైనను, అన్యచింతలను వదలి ఏకాగ్రభక్తితో నన్ను పూజించుచున్న యెడల అతనిని సాధుపురుషునిగనే యెంచఁదగును. అతఁడు మంచి సంకల్పము కలవాడగుటయే అందులకు కారణము.

31. క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి।
కౌన్తేయ! ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి॥

అతఁ డతిశీఘ్రముగనె ధర్మాత్ముఁడగును,
పడయఁగలఁడును శాశ్వతపరమశాంతి;
నాదుభక్తుండు పార్థ! యెన్నటికిఁగూడ
చెడడు, చెడడని, శపథమ్ముచేసి చెప్పు.

తా॥ అట్టి మహాపాపియు నాయందు ఏకాగ్రభక్తి కలిగియున్నచో, అతిశీఘ్రకాలములోనే ధర్మబుద్ధికలవాడయి, శాశ్వతము, ఉత్తమము అయిన శాంతిని పొందును. నాభక్తుఁడైనవాడెవఁడును ఎన్నటికిని చెడడని ప్రతిజ్ఞచేసి చెప్పుము.

32. మాం హి పార్థ! వ్యపాశ్రిత్య యేపిస్యుః పాపయోనయః।
స్త్రియో వైశ్యా స్తథా శూద్రాస్తేఽపి యాన్తి పరాంగతిమ్॥

అర్జునా! కారణ మ్మెట్టిదైన గూడ
పాపులై జన్మమందిన వారు, మఱియు
శూద్రజనులును, స్త్రీలు, వైశ్యులును గూడ
పరమముక్తినందుదురు నాశరణుపొంది.

తా॥ అర్జునా! పాపజన్మము నందినవారును, మఱియు శూద్రులు, వైశ్యులు, స్త్రీలు, యెవరైననుసరే నన్నాశ్రయించిన యెడల ముక్తిని పొందెదరు.

33. కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా।
అనిత్యమసుఖం లోకమిమం ప్రాప్య భజస్వ మామ్॥

ఇట్టియెడ పుణ్యులగు రాజఋషులు, విప్ర
వరులను గురించి వేఱె చెప్పంగనేల?
నీకు ఈలోక మసుఖ మనిత్య మగుట
భక్తితోడ సేవింపుము పార్థ! నన్నె.

తా॥ పుణ్యపురుషులైన బ్రాహ్మణులు రాజఋషులను గూర్చి వేఱుగా చెప్ప నక్కరలేదు. వారికి మోక్షము కరతలామలకమే. సుఖము లేనట్టిదియు, అశాశ్వతమును అయిన ఈ లోకమునందుండుటచే అర్జునా! నీవు నన్ను భక్తితో సేవించుము.

34. మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః ॥

నాపయిని మానసమ్ము లగ్నమ్మొనర్చి,
భక్తి గలవాడవై నాకు ప్రణతు లిమ్ము;
పార్థ! నన్నాశ్రయించి నాపయిని యిట్లె
చిత్తమును నిల్పుచో నన్నె చేరగలవు.

తా॥ అర్జునా! నాయందే నీ మనస్సు చేర్చి నాకు నమస్కరించుచు, నాభక్తుఁడవై యుండుము. ఈ విధముగా నాయందే చిత్తమును నిల్పి, నన్నాశ్రయించి యున్నచో నన్ను నిశ్చయముగ నీవు చేరగలవు.

ఇది ఉపనిషదర్థప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును,
శ్రీకృష్ణార్జునసంవాదమునగు శ్రీమద్భగవద్గీతయందలి
రాజవిద్యా రాజగుహ్యయోగము అను
తొమ్మిదవ అధ్యాయము
స మా ప్త ము

# గీతామృతము

## శ్రీమద్భగవద్గీత

## విభూతి యోగము

## పదియవ అధ్యాయము : సారాంశము

**ప్రధాన విషయము :—**

విభూతి యనగా మహిమాతిశయము. ఈశ్వరశక్తియు, ఈశ్వర మహిమాతిశయమును ఇందు వర్ణింపబడినవి.

**ఇందలి ముఖ్యాంశములు :—**

భగవన్మహిమ యొక్క ఫలితము. భగవానుఁడు తన మహిమలను విభూతులను వర్ణించుట.

## సారాంశము

తన ప్రబోధమును అర్జునుఁ డతిశ్రద్ధగ, ప్రీతితో వినుట గ్రహించి శ్రీకృష్ణభగవానుఁడు మరల నిట్లుపదేశించెను.

అర్జునా ! నేను పురాణపురుషుఁడను. నా పుట్టుక దేవతలకు ఋషులకు గూడ తెలియదు. ఈ జగత్సృష్టికి నేను హేతువును. సప్తఋషులు, మనువులు నా సంకల్పబలము వలననే యుద్భవించిరి. వారి వలన ప్రజోత్పత్తి కలిగినది. బుద్ధి, జ్ఞానము, కష్టసుఖములు, కీర్త్యపకీర్తులు ఇట్టివన్నియు ప్రజలకు వారి కర్మానుసారము నావలననే కలుగుచున్నవి. ఈ సృష్టి రహస్యము నెఱిఁగి నన్ను పుట్టుకలేనివానిగ, సకల లోకేశ్వరునిగ భావించు వాఁడు పాప విముక్తుఁడగును. మనస్సును ప్రాణములను నాయందు లగ్నము చేసి నన్ను సేవించువారికి జ్ఞానమును కలుగఁజేయుచున్నాను. వారి ఆత్మల

యందే నేనుండి నా అనుగ్రహముచే వారి అజ్ఞానమును నశింపజేయు చున్నాను.

శ్రీకృష్ణభగవానుని గొప్పతన మీ విధముగ వినిన అర్జునునకు పరమ సంతోషము కలిగినది. వెనుక మహాఋషులు చెప్పినదియు శ్రీకృష్ణుని వలన తానిపుడు వినుచున్నదియు నొక్కవిధముగనే యున్నది. అంతయు సత్యమని తోచి శ్రీకృష్ణునితో పార్థు డిట్లనెను. "ఓ కృష్ణా నీ విభూతులను నేనెట్లూహింపగలను ? నిన్ను ధ్యానించుట యెట్లు ? ఎంత వినినను తనివి తీరుట లేదు. నీ లీలావిభూతులను మరల వినగోరెదను చెప్పు" మని ప్రార్థించెను.

శ్రీకృష్ణుఁడిట్లు చెప్పెను. "అర్జునా ! నా మహత్త్వ మనంతమైనది. కొన్ని ముఖ్యమైన విషయములను మాత్రము చెప్పెదను. సర్వప్రాణికోటు లందును అంతరాత్మగా నేనున్నాను. సృష్టి స్థితిలయములు నేనే. సృష్టిలో యెచ్చటెచ్చట సంపద, ఉత్సాహము, శక్తి, కాంతి, సద్గుణములున్నవో అవి యన్నియు నేనే. నా అంశవలననే నేను సర్వలోకము నిండియున్నాను. విష్ణువు (ఆదిత్యులలో నొకడు), సూర్యుఁడు, మరీచి, చంద్రుఁడు, ఇంద్రుఁడు, సామవేదము, బృహస్పతి, స్కందుఁడు, నారదుఁడు, ప్రహ్లాదుఁడు, అశ్వత్థ వృక్షము, వ్యాసుడు, వసంతఋతువు. సముద్రము, అర్జునుఁడు, వజ్రాయుధము, హిమాద్రి ఇట్టివన్నియు నేనే.

అనంతుఁడు నిరాకారుఁడు అయిన పరమేశ్వరుని పూర్తిగ తెలిసికొనుట మానవులకే గాదు. దేవతలకు కూడ కష్టమే. భగవద్విభూతులకు మహిమలకు అంతమే లేదు. సత్యము, జ్ఞానము, కరుణ, తేజస్సు, తపము మొదలైన సద్గుణములన్నియు ఈశ్వరాంశలే.

ఇంకను విస్తరించుట యేల. అర్జునా ! జగత్తంతయు నాలో ఒక అంశమాత్రమే అని యెఱుగుము అని శ్రీకృష్ణుఁడు ముగించెను.

ఈ అధ్యాయమందలి ముఖ్య శ్లోకములు

2, 5, 10, 11, 20, 41, 42

# శ్రీ మ ద్భ గ వ ద్గీ త

## పదియవ అధ్యాయము

## వి భూ తి యో గ ము

శ్రీ భగవానువాచ :- శ్రీ భగవానుఁడు చెప్పెను.

1. భూయ యేవ మహాబాహో శ్రుణు మే పరమం వచః।
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా ॥

అర్జునా! నేను చెప్పు వాక్యముల నీవు
కడుప్రియమ్మతో వినుచున్న కారణమున,
నీ హితమ్మె కోరి, మరల నేవచింపఁ
బోవు శ్రేష్ఠమయిన వాక్యములను వినుము.

తా॥ అర్జునా! నేను చెప్పునదంతయు నీవు చాల ప్రియముతో వినుచున్నావు. నీ శ్రేయమునే కోరి నేను మరల చెప్పబోవుచున్న ఈ ఉత్తమ వచనముల గూడ వినుము.

2. న మే విదుః సురగణాః ప్రభవం న మహర్షయః।
అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః ॥

సర్వవిధముల దేవతాసంతతులకు
నఖిలఋషులకు గూడ నేనాద్యుఁడైన
హడ, నీకారణమున దేవతలుగాని
ఋషులు గాని నాపుట్టుకనెఱుఁగలేరు.

తా॥ సకల దేవతలకు సకల ఋషులకు కూడ అన్ని విధముల నే నాద్యుఁడను. కారణభూతుఁడను. నా పుట్టుక గాని ప్రభావము గాని వారెవ్వరు నెఱుఁగరు.

3. యో మా మజ మనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్ ।
అసమ్మూఢస్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే ॥

అజుఁడ ననుచును, ఆదిలేనట్టి వాఁడ
ననుచు, సకలలోకేశ్వరుఁ డనుచు నన్ను
నెఱుఁగ శక్తిగల్గిన మర్త్యుఁ డెవ్వఁడేని
మోహరహితుఁడై పాపవిముక్తుఁడగును.

తా॥ జననమేలేని అనాదిరూపుఁడను, సకల లోకములకు ప్రభువును నేను. ఈ విధముగ నన్ను తెలిసికొనఁగలిగిన మనుజుఁడు అజ్ఞానములేనివాఁడై అన్ని పాపముల నుండియు విముక్తి పొందుచున్నాడు.

4. బుద్ధిర్జ్ఞాన మసమ్మోహః క్షమాసత్యం దమశ్శమః ।
సుఖం దుఃఖం భవోఽభావో భయం చాభయమేవచ ॥

5. అహింసా సమతా తుష్టిస్తపో దానం యశోఽయశః ।
భవన్తి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః ॥

బుద్ధిగరిమయు జ్ఞానమ్ము మోహరహిత
సత్యశీలత, క్షమయును, శమము, దమము,
పుట్టుకయు చావు, సుఖదుఃఖములును, భయము
భయములేకుండుటయును, తప స్సహింస
తృప్తియును దానమును సమదృష్టి యశము
అయశ మాదిగా వివిధమ్ములైన గుణము
లీ జగతినున్న ప్రాణుల కెల్లరకును
కలుగుచున్నవి, పార్థ! నావలన వినుమిది.

తా॥ బుద్ధి, జ్ఞానము, మోహము లేకపోవుట, అరిషడ్వర్గ బాహ్యేంద్రియ నిగ్రహము, సత్యము, ఓర్పు, సుఖదుఃఖములు, జనన మరణములు, భయము, నిర్భయము, సంతృప్తి, దానగుణము, కీర్తి, అపకీర్తి, సమదృష్టి, తపము, అహింస మున్నగు గుణాగుణములన్నియు ప్రాణులకు నావలననే వారి కర్మానుసారము కలుగుచున్నవి.

6. మహర్షయస్సప్త పూర్వే చత్వారో మనవస్తథా।
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః ॥

సప్తఋషులును, సనకాదిసంయములును,
మనువులు పదునాల్గురును, నామనసులోని
భావబలశక్తినుండియే ప్రభవమైరి;
వారివలననె కలిగిరీ ప్రజలు భువిని.

తా॥ పూర్వీకులైన సప్తఋషులు, సనకసనందనాదిమునులు, మనువులు పదునాల్గురును నా సంకల్పబలమువలననే కలిగిరి. వారి సంతతివారే లోకమునందున్న ప్రజలెల్లరును.

7. ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః।
సోఽవికమ్పేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః ॥

ఈవిధమ్మగు నాయొక్క సృష్టిమహిమ
యోగతత్త్వమును తెలిసియుండు నరుఁడు
నిశ్చలధ్యానయుత యోగనిష్ఠుఁడగును;
సందియము దీనియందు లేశమును లేదు.

తా॥ ఈ విధమగు నా యోగశక్తిని సృష్టిమహాత్త్వమును తెలిసికొనినవాడు నిస్సందేహముగ స్థిరమైన యోగనిష్ఠ కలిగిన వాఁడగుచున్నాడు.

8. అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే।
ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః ॥

నేనె యుత్పత్తిహేతుపీ నిఖిలమునకు,
ఎల్ల జగతి నావలన వర్తించుచుండె
ననుచు నెఱిగి, సద్భక్తిసమన్వితు లయి
నన్ను తలఁచి పూజించు చున్నారు బుధులు.

తా॥ వివేకవంతులందఱును నేనే ఈ నిఖిలజగతికి ఉత్పత్తిహేతువుననియు, ఈ జగత్తంతయు నావలననే వర్తించుచున్నదనియు గ్రహించి, భక్తిపూర్వకముగ నన్నే పూజించుచున్నారు.

9. మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్।
కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తిచ రమన్తిచ॥

ప్రాణమును మానసమ్ము నాపయిని నిల్పి
ప్రజలు, ముదితులై యుంద్రు—పరస్పరమ్ము
నన్నుగూర్చి ప్రబోధ మొనర్చుకొనుచు,
నన్నుగూర్చి ప్రసంగ మొనర్చుకొనుచు.

తా॥ అట్టి భక్తులు, ప్రాణమానసములను నాయందే లగ్నముచేసి, ఒకరికొకరు నన్ను గూర్చియే బోధ చేసికొనుచు, నన్ను గూర్చియే మాటలాడుకొనుచు, ఆనందముతో గడపుచుందురు.

10. తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి తే॥

నాపయిని చిత్త మిట్లె లగ్నమ్ముజేసి
ప్రీతిపూర్వకముగ నెల్లవేళలందు
కొలుచువారికి నను( జేర(గలుగు నట్టి
జ్ఞానసంపద నిచ్చుచున్నాను నేను.

తా॥ ఈ విధముగ నాయందు మనస్సును లగ్నముచేసి నన్ను ప్రీతితో కొలుచువారికి నా సాయుజ్యము పొందగలుగు జ్ఞానసంపద నిచ్చుచున్నాను.

11. తేషా మేవాను కంపార్థ మహమజ్ఞానజం తమః।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా॥

ఎల్లపుడు భక్తుల ననుగ్రహించుకొఱకె
వారి యాత్మయందుండి, భాస్వంతమైన
జ్ఞానదీపమ్ముచేత నాశనమొనర్తు
వారియొక్క యజ్ఞానాంధకారములను.

తా॥ నా భక్తులను అనుగ్రహించుట కొఱకే యెల్లపుడును నేను వారి ఆత్మ లందుండి జ్ఞానమను కాంతిచే వారి అజ్ఞానమను చీఁకటిని తొలగించుచున్నాను.

అర్జున ఉవాచ : అర్జునుఁడు చెప్పెను.

12 పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్ ।
పురుషం శాశ్వతం దివ్యమాదిదేవమజం విభుమ్ ॥

13. ఆహుస్త్వాం ఋషయస్సర్వే దేవర్షి ర్నారద స్తథా ।
అసితో దేవలో వ్యాస స్స్వయం చైవ బ్రవీషి మే ॥

పరమపావనుఁడవు, పరబ్రహ్మవీవె,
పరమపదమవు, దివ్య శాశ్వతుఁడ వీవె,
పుట్టుకయెలేని, ఆదిదేవుఁడవు నీవె
నిఖిలజగతికి ప్రభుఁడవు నీవె యనుచు.
దేవలాసిత నారద దేవఋషులు,
వ్యాసుఁడాదిగ సకల మహర్షివరులు,
వినుతు లొనరించు చుండి రా విధముగానె
నీవు స్వయముగ చెప్పుచున్నావు నాకు.

తా॥ ఓ కృష్ణా ! నీవే పరబ్రహ్మమవు, పావనుఁడవు, పరమపద స్థానమైన వాఁడవు, దివ్యుఁడవు, నిత్యుఁడవు, ఆదిదేవుఁడవు, నీకు పుట్టుకయె లేదు, నిఖిలజగతికి ప్రభుఁడవు, ఈ విధముగ వ్యాసుఁడు మున్నగు మహాఋషులు, దేవలుఁడు, అసితుఁడు, నారదుఁడు మున్నగు దేవఋషులు ఎప్పుడును నిన్ను కీర్తించుచుండిరి. నీవును ఆ విధముగనే, స్వయముగా నాకు చెప్పుచున్నావు.

14. సర్వమేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ ।
న హి తే భగవన్ వ్యక్తిం విదుర్దేవా న దానవాః ॥

నాకు నీవిప్పు చెప్పుచున్నట్టి దెల్ల
కృష్ణ ! సత్యమ్ముగా విశ్వసించు చుంటి,
అఖిలలోకేశ నీ నిజమైన రూపు
దేవ దానవు లైనను తెలియలేరు.

తా॥ కృష్ణా ! నీవిపుడు చెప్పుచున్నదంతయు యదార్థమని పూర్తిగా నమ్ముచున్నాను. దేవదానవులెవరికిని గూడ నీ వాస్తవమైన స్వరూపము తెలియదు గదా.

15. స్వయమేవాత్మ నాత్మానాం వేత్థ త్వం పురుషోత్తమ।
భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే॥

భూతములకెల్ల కారణభూతుఁడవును,
సకల ప్రాణికోటులకు నీశ్వరుఁడ వీవు,
దేవదేవ! జగన్నాథ! దివ్యపురుష!
నిన్నుగూర్చి స్వయమ్ముగ నీకె యెఱుక.

తా॥ సకల భూతముల సృష్టికారకుడవు, వానిని శాసించు ప్రభుఁడవును నీవే. దేవదేవుఁడవు, జగత్పతివి, ఉత్తమోత్తమ పురుషుఁడవు. నిన్ను నీవే యెఱుఁగుదువు. ఇతరుల కిది యూహాతీతము.

16. వక్తుమర్హా స్యశేషేణ దివ్యాహ్యాత్మ విభూతయః।
యాభిర్విభూతిభిర్లోకాన్ ఇమాం స్త్వం వ్యాప్యతిష్ఠసి॥

ఏ మహిమచేత జగమునం దెల్లయెడల
నిండియుంటివో సర్వమ్ము నీవె యగుచు,
ఆ మహిమలెల్ల దివ్యమ్ములైన కతన
నీవె తగుదువు వానినన్నిటి వచింప.

తా॥ ఏ మహాత్త్వము వలన నీవీ సర్వలోకములను నిండియున్నావో అవి యన్నియు దివ్యములైన మహిమలు. వాని నన్నిటిని వర్ణించుటకు నీవే తగుదువు.

17. కథం విద్యా మహం యోగింస్త్వాం సదా పరిచిన్తయన్।
కేషు కేషు చ భావేషు చిన్త్యోఽసి భగవన్మయా॥

ఓయి భగవానుఁడా! యెట్టులూహసేయ
గలను నిత్యమ్ము నీ విభూతులను నేను?
ఓయి యోగీశ్వరా! భవదీయరూప
మెట్లెఱింగి నిత్యమును ధ్యానింపఁగలను.

తా॥ ఓ యోగీశ్వరా! కృష్ణా! నిన్ను ఏ విధముగ తెలిసికొని నిత్యమును ధ్యానింపఁగలను. ఓ భగవానుఁడా నిన్నే యేరూపములలో ఊహించి తెలిసికొ గలను. వానిని సెలవీయవలసినది.

18. వి స్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన !
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్ ॥

ఓ జనార్దన ! నీయొక్క యోగమహిమ
వివిధలీలావిభూతులు విపులరీతి
మరల వచియింపు, మమృతసమానములయి
తనివితీరుట లేదెంతవినిన గాని.

తా॥ ఓ జనార్దనా ! నీయొక్క యోగమహిమను గూర్చియు, అనేకములైన నీలీలావిభూతులను గూర్చియు మరల విపులముగ చెప్పుము. అమృతసమములైన నీ వాక్యముల నెంతవినినను తనివితీరుటలేదు.

శ్రీభగవానువాచ :— శ్రీభగవానుఁడు చెప్పెను.

19. హన్త తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః ।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యన్తో విస్తరస్య మే ॥

అర్జునా ! చాల విస్తారమైన నామ
హత్త్వముల కంతమే యుండ దయిన గాని
అనేకముఖ్య మైనవియు దివ్యములు నైన
స్వీయలీలల కొన్ని చెప్పెదను నీకు.

తా॥ అర్జునా ! నా విభూతులు చాల విస్తారమైనవి. వాని కంతమే లేదు. అయినను ముఖ్యమయిన వానిని కొన్నిటిని చెప్పెదను.

20. అహమాత్మా గుడాకేశ ! సర్వభూతాశయస్థితః ।
అహమాదిశ్చ మధ్యం చ భూతానామన్త ఏవచ ॥

అర్జునా! సర్వభూతమ్ములందు గూడ
అంతరానువర్తియగు జీవాత్మ నేను;
జగతినున్న అఖిలభూతజాలములకు
నాదిమధ్యావసానము లగుదు నేనె

తా॥ అర్జునా! సర్వభూతములయందున్న జీవాత్మను నేను. సర్వ భూతముల యొక్క సృష్టి స్థితిలయములును నేనే.

21. ఆదిత్యానామహం విష్ణుర్జ్యోతిషాం రవిరంశుమాన్ ।
మరీచి ర్మరుతామస్మి నక్షత్రాణా మహం శశీ ॥

అగుదు విష్ణువు నాదిత్యులందు నేను,
కాంతి నిడువారియందు భాస్కరుఁడ నేను,
అనిలములయందు మరీచి నగుదు నేను,
ఉడుగణమ్ములలోన చంద్రుఁడను నేను.

తా॥ అదితికుమారులగు పండ్రెండుగురు ఆదిత్యులలో విష్ణువనువాడను నేనే. కాంతిమంతులలో సూర్యుఁడను, సప్తమరుత్తులలో మరీచిని, నక్షత్రములలో చంద్రుఁడను నేనే.

22. వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః ।
ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతనామస్మి చేతనా ॥

వేదములలోన నే సామవేద మగుదు,
అగుదు నింద్రుఁడ దేవతలందు నేను,
నేనె మానసమ్మగుదు నింద్రియములందు,
సకలభూతకోటికి ప్రాణశక్తి నేనె.

తా॥ చతుర్వేదములలో సామవేదమును, దేవతలందు ఇంద్రుఁడను, ఇంద్రియము లన్నిటిలో మనస్సును, సకల ప్రాణికోటులయందు చైతన్యశక్తిని నేనే.

23. రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్ ।
వసూనాం పావకశ్చాస్మి మేరుశ్శిఖరిణామహమ్ ॥

రుద్రులందఱిలో శంకరుఁడను నేను,
యక్షరాక్షసుల కుబేరుఁడనెడు వాడ,
వసువులందున నేను పావకుఁడ నగుదు,
పర్వతములందు మేరుపర్వతము నేను.

తా॥ పదునొకండుగురు రుద్రులలో శంకరుఁడను, యక్షులు రాక్షసులందు కుబేరుఁడను, అష్టవసువులందు పావకుఁడను పర్వతములలో మేరుపర్వతమును నేనే.

24. పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ! బృహస్పతిమ్ ।
సేనానీనామహం స్కన్దః స్సరసామస్మి సాగరః ॥

ఎఱుఁగుమో అర్జునా! పురోహితుల యందు
ప్రముఖుఁడైనట్టి యా బృహస్పతిని నేను,
సర్వసేనాపతుల యందు స్కందుఁడేను,
సరసులన్నిటి యందు సాగరము నేను.

తా॥ పురోహితులందఱిలో ముఖ్యుఁడైన బృహస్పతిని, సేనానాయకులందఱిలోను కుమారస్వామిని, సరస్సులందు సముద్రమును నేనే.

25. మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేకమక్షరమ్ ।
యజ్ఞానాం జపయజ్ఞోస్మి స్థావరాణాం హిమాలయః ॥

అగుదు భృగువును సకల మహర్షులందు,
'ఓం' అనెడు ప్రణవమును వేదోక్తులందు,
యజ్ఞములయందు జపయజ్ఞ మగుదు నేనె,
అచలవస్తువు లందు హిమాద్రి నేను.

తా॥ మహాఋషులందఱిలోను భృగుఋషిని, వేదాక్షరములలో ప్రణవమగు 'ఓం' మంత్రమును, యజ్ఞములందు జపయజ్ఞమును, స్థిరముగ నున్నవానియందు హిమాచలమును నేనే.

26. అశ్వత్థః సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః ।
గన్ధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః

సర్వవృక్షము లందు నశ్వత్థమేను,
అమరఋషులందు నారదుఁ డనెడువాఁడ,
సిద్ధులందున కపిలుఁడ, చిత్రరథుఁడ
నేనె గంధర్వులందఱిలోన పార్థ

తా॥ అన్ని చెట్లలో రావిచెట్టును, దేవఋషులలో నారదుఁడను, సిద్ధులలో కపిలమునిని, గంధర్వులలో చిత్రరథుఁడను నేనే.

27. ఉచ్చైఃశ్రవస మశ్వానాం విద్ధి మామమృతోద్భవమ్ ।
ఐరావతమ్ గజేన్ద్రాణాం నరాణాంచ నరాధిపమ్ ॥

దుగ్ధజలధి యం దమృతముతోడ గలసి
జననమందిన యశ్వ ముచ్చైఃశ్రవమును,
ఏన్గులందు నైరావత మ్మెనె యగుదు,
మనుజులందున నేనిక మనుజపతిని.

తా॥ దేవదానవులు క్షీరసాగరమును మథించినపుడు అమృతముతో కలసి పుట్టిన ఉచ్చైశ్శ్రవమను గుఱ్ఱమును, అట్లే పుట్టిన ఐరావతమను ఏనుగును నేనే. మనుష్యులలో రాజును నేనే.

28. ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్ ।
ప్రజనశ్చాస్మి కందర్పః సర్పాణామస్మి వాసుకిః ॥

ఆయుధములందు నేను వజ్రాయుధమును,
కామధేనువు నేను గోగణమునందు,
మానవోత్పత్తియందు మన్మథుఁడ నేను,
వాసుకిని నేను సకల సర్పములలోన.

తా॥ ఆయుధములలో వజ్రాయుధమును, గోవులయందు కామధేనువును, ప్రజల యుత్పత్తికి కారణుఁడైన మన్మథుఁడను, సర్పములందు వాసుకియను పామును నేనే.

29. అనన్తశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్ ।
పితౄణామర్యమా చాస్మి యమ స్సంయమతామహమ్ ॥

నాగుబాములలోన ననంతుఁడేను,
వరుణుఁడగుదు నేనె జలదేవతలయందు,
అర్యముఁడ పితృదేవతలందు నేను,
అఖిల జనశాసకుల యందు యముఁడ నేను.

తా॥ నాగుబాములలో అనంతుఁడను, జలదేవతలందు వరుణుఁడను, పితృదేవతలందు అర్యమయు, ప్రజలను శాసించు వారిలో యముఁడను నేనే.

30. ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్ ।
మృగాణాం చ మృగేన్ద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్ ॥

అసురగణములలోన ప్రహ్లాదుఁడేను,
గణిత మొనరించువానిలో కాలమేను,
అఖిల మృగములరాజు సింహమును నేను,
వైనతేయుఁడౌ గరుడుఁడ పక్షులందు.

తా॥ రాక్షస కులమందు ప్రహ్లాదుఁడను, లెక్క పెట్టువారిలో కాలమును, జంతువులందు మృగరాజైన సింహమును, పక్షులలో వినతాసుతుఁడగు గరుత్మంతుఁడను నేనే.

31. పవనః పవతామస్మి రామశ్శస్త్రభృతామహమ్ ।
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ ॥

పవనుఁడను వేగమును గలవారిలోన,
శస్త్రధరులందు శ్రీరామచంద్రుఁడేను
జలచరములందు మకరమత్స్యమును నేను,
విదిత గంగానదిని నేను నదులయందు.

తా॥ వేగవంతులలో వాయువును, ఆయుధధారులలో శ్రీరాముఁడను, చేపలలో మకరమును చేపను, నదులయందు గంగానదిని నేనే,

32. సర్గాణామాదిరన్తశ్చ మధ్యం చైవాహమర్జున।
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్ ॥

ఆదిమధ్యాంతములు సృష్టులందు నేనె.
విద్యలందు నాత్మజ్ఞానవిద్య నేను
వాదమును వాదజల్పాదిభేదమందు.

తా॥ సృష్టులందు, సృష్టి స్థితిలయములును, విద్యలలో ఆత్మజ్ఞాన విద్యయు, వాద జల్ప వితండములను వాదములలో సౌమ్యమగు వాద పద్ధతిని నేనే.

33. అక్షరాణా మకారోస్మి ద్వన్ద్వః సామాసికస్యచ।
అహమేవాక్షయః కాలో ధాతాహం విశ్వతోముఖః ॥

అక్షరములందున 'అ' కార మగుదు నేనె,
పదసమాసము లందు ద్వంద్వమును నేనె,
అక్షయమ్మైన కాలమ్మ నగుదు నేను,
అంతటను మోములున్న బ్రహ్మయును నేను.

తా॥ అక్షరము లన్నిటిలో 'అ' కారమును, మాటలను కలుపువానియందు ద్వంద్వసమాసమును, అంతములేనట్టి కాలమును, సర్వత్ర ముఖములున్న బ్రహ్మ దేవుడను నేనే.

34. మృత్యుస్సర్వహరశ్చాహ ముద్భవశ్చ భవిష్యతామ్।
కీర్తిశ్శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా ॥

సర్వసంహారక మైన చావు నేనె,
భావియందు కాబోవు నుత్పత్తి నేనె,
స్త్రీల యందున్న సంపద, స్మృతియు, వాక్కు
ధృతియు, క్షమయు, మేధ కీర్తియును నేనె.

తా॥ సర్వమును సంహరించునట్టి మృత్యువు, ముందు కాలమందు కలుగబోవు ఉత్పత్తియు, స్త్రీల యందున్న సంపద, జ్ఞాపకశక్తి, మృదువాక్కు, ధైర్యము, ఓర్పు, బుద్ధిబలము, కీర్తియు నేనే.

35. బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసా మహమ్ ।
మాసానాం మార్గశీర్షోఽహం ఋతూనాం కుసుమాకరః ॥

సామగానమ్ములో బృహత్సామ మేను
అన్ని ఛందస్సు లందు గాయత్రి నేను,
మాసములయందు నేనౌదు మార్గశిరము,
ఋతువులందున వాసంతఋతువు నేను.

తా॥ సామవేదగానములలో బృహత్సామమును, ఛందస్సులలో గాయత్రియు, నెలలందు మార్గశిరమాసము, ఋతువులందు వసంతఋతువును నేనే.

36. ద్యూతం ఛలయతామస్మి తేజస్తేజస్వినామహమ్ ।
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతామహమ్ ॥

ఏనెజూదము వంచకవృత్తు లందు,
తేజమును కలవారియందు తేజమును నేనె,
సత్ప్రయత్నమ్ము, విజయమ్ము సత్త్వగుణుల
వర్తనమ్మున సాత్త్వికభావ మేనె.

తా॥ వంచక వ్యాపారములలో నేను జూదమును, తేజస్సులందుగల తేజము, సత్ప్రయత్నము, విజయము, సత్త్వగుణుల సాత్త్విక స్వభావమును నేనే.

37. వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః ।
మునీనామప్యహం వ్యాసః కవీనాముశనాకవిః ॥

వాసుదేవుడ యాదవవంశమందు
అర్జునుడ నిక పాండవులందు నేను,
మునివరేణ్యులలో వ్యాసమునిని నేను,
సూక్ష్మబుద్ధిమంతుల యందు శుక్రుడేను.

తా॥ యాదవవంశమున వాసుదేవుడను, పాండవులలో అర్జునుడను, మునులందు వ్యాసమునిని, సూక్ష్మబుద్ధి గలవారిలో శుక్రుడను నేనే,

38. దణ్డో దమయతామస్మి నీతిరస్మి జిగీషతామ్ ।
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్ ॥

ధరణి శాసించు వారల దండనీతి,
విజయవాంఛాపరుల యొక్క విజయనీతి,
గోప్యవిషయమ్ములను మౌనగుణము నేను,
జ్ఞానులందున్న జ్ఞానమ్ము నేనె పార్థ.

తా॥ దండించువారియందున్న దండనీతి, విజయవంతులయందున్న విజయనీతి, రహస్య విషయములందు మౌనగుణము, జ్ఞానవంతుల యందున్న జ్ఞానమును నేనే.

39. యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున ।
న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరమ్ ॥

ప్రాణికోటి కుత్పత్తికారణము నేనె,
ఈ చరాచరజగమునం దెల్లయెడల
నేను కానిది వేఱొండు లేనెలేదు.

తా॥ ప్రాణికోట్లకు మూలకారణమును నేనె. ఈ చరాచర జగమునందు నేను కానివస్తువేదియును లేదు.

40. నాన్తోఽస్మి మమ దివ్యానాం విభూతీనాం పరన్తప ।
ఏషతూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరోమయా ॥

అర్జునా ! నా విభూతిమహత్త్వములకు
నంత మనునదిలేదు, దివ్యమ్ములైన
వీనిని గురించి యిపుడు చెప్పినది యెల్ల
పలికినాడను మిగుల క్లుప్తమ్ముగానె.

తా॥ అర్జునా! ఇట్టి నా దివ్యవిభూతులకు అంతములేదు. నేను చెప్పినవి కూడ మిగుల సంక్షేపించియే చెప్పితిని.

41. యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా।
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్॥

సృష్టిలోఁ గల వానియం దెచ్చటెచట
సత్త్వ, మైశ్వర్య, ముత్సాహశక్తి, కాంతి
కలవొ, అర్జునా! వానిని తెలిసికొనుము
కలిగె నని నాదు తేజోఽంశ వలనభువిని.

తా॥ అర్జునా! సృష్టిలో యెచ్చటెచ్చట, ఐశ్వర్యము, శక్తి, ఉత్సాహము, కాంతి యున్నవో అవి యెల్ల నా తేజము యొక్క అంశమువలననే కలిగెనని తెలిసికొనుము.

42. అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున।
విష్టభ్యాహమిదం కృత్స్న మేకాంశేన స్థితోజగత్॥

అర్జునా! దీనికంటె యనంతమైన
నా మహత్త్వెల్ల తెలిసికొన్నందువలన
కలదె లాభమ్ము నీకు? లోకములెల్ల
నిండియుంటి నేకాంశచే నేనె వినుము.

తా॥ అర్జునా! అనంతమైన నా మహత్త్వమంతయు తెలిసికొనినందున నీకేమి ప్రయోజనము. ఒక్క మాటను మాత్రము వినుము. సర్వజగమునందును ఒక్క అంశ చేతనే నేను నిండియుంటిని.

ఇది ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదమునగు శ్రీమద్భగవద్గీతయందలి విభూతియోగమను పదియవ అధ్యాయము

* సమాప్తము *

# గీతామృతము

## శ్రీమద్భగవద్గీత

## విశ్వరూప సందర్శన యోగము

## పదునొకండవ అధ్యాయము - సారాంశము

ప్రధాన విషయము :—

భగవానుని విశ్వరూప సాక్షాత్కారము అర్జునునికి కలుగుట. ఆ విశ్వ రూపము యొక్క వర్ణనము ప్రశస్తి యిందు గలవు.

ఇందలి ముఖ్యాంశములు —

అర్జునుఁడు విశ్వరూపమును చూడగోరుట — శ్రీకృష్ణభగవానుఁడు తన విశ్వరూపమును చూపుట — విశ్వరూపాకృతి — అర్జునుఁడు విశ్వరూపమును స్తుతించుట — విశ్వరూపము యొక్క ఉపసంహారము — విశ్వరూప సందర్శన మహిమ.

## సారాంశము

విభూతియోగము వరకు శ్రీకృష్ణుఁడు చెప్పినదంతయు అర్జునుఁడు శ్రద్ధగా వినెను. అది యంతయు సత్యమని తోచినది. భగవానుని మహిమయు విభూతులును అర్జునున కవగతములైనవి. అతని భ్రాంతి యంతయు నశించిపోయినది. "ఓ కృష్ణా! నీ విశ్వరూపము చూడవలెనని యున్నది. నే నందుల కర్హుఁడనైనచో దయయుంచి చూపుము" అని ప్రార్థించెను. శ్రీకృష్ణుఁడంగీకరించి, అర్జునునకు ఆ విశ్వరూపము చూడగల దివ్యదృష్టి నొసఁగి యిట్లనెను. "అర్జునా! విలోకింపుము. అనేక వర్ణములు, ఆకారములు, ఆదిత్యులు, రుద్రులు మొదలగు వారందఱు ఉన్న నా విశ్వ

రూపమును చూడుము. ప్రపంచములో నీవు దేనిని చూడదలచినను అవి యన్నియు ఇచ్చట ఒకచో నున్నవి. చూడుము.

అర్జునుడు వీక్షించుచున్న ఆ విశ్వరూప మిట్లున్నది. ఆకాశ ప్రమాణమున దివ్యపుష్పమాలలు, దివ్యవస్త్రభూషణములు, దివ్యాయుధ ములు అనేక నేత్రములు, వదనములు, అనేక దృశ్యములు కలిగి సర్వతో ముఖమై యున్నది. ఋషులు, దేవతలు, అశ్వినులు, పితరులు, సిద్ధులు, గంధర్వులు అందఱు అచటనే ఉన్నారు ప్రపంచమంతయు ఏకస్థమై అచటనే యున్నది. సూర్యాగ్ని ప్రకాశమానమై ఒప్పుచున్న ఆయాకృతికి ఆదిమధ్యాంతములు కన్పించుటలేదు. సిద్ధులు స్తోత్రములు చేయుచున్నారు. రాక్షసులు భయపడి పారిపోవుచున్నారు. భీష్ముడు, ద్రోణుడు, తక్కిన కురువీరులందఱును, పాండవులవైపు వీరులలో కొందఱును, మండుచున్న ఆ విశ్వరూపము యొక్క నోటియందుఁబడి నశించుచున్నారు.

వాడికోరలు గలిగిన నోరు తెఱచుకొని, ఆకాశము నంటుచు, వేయి సూర్యు లొక్కమారు వెలుఁగుచున్నట్లుగానున్న ఆ రూపము ప్రళయవహ్ని వలె మహాతేజోవంతమై యున్నది. ఆ భీకరరూపమును చూచినంతనే అర్జునునకు దేహము గగుర్పొడిచినది. ముచ్చెమటలు పోసినవి భయ కంపితుఁడయ్యెను. కృష్ణా! నీ యీ యాకారమును చూడజాలక ప్రజలు భయపడుచున్నారు. అట్లే నాకును నీ ఆకృతి మహాభయంకరముగా నున్నది. అన్ని వైపులనుండి ప్రజలను పట్టి తినుచున్నావు. ఇంత ఉగ్రరూపుఁడవు నీ వెవరవో చెప్పుమని వేడెను.

శ్రీకృష్ణభగవానుఁడిట్లు చెప్పెను.

అర్జునా! నేను కాలరూపుఁడను. ప్రజా సంహారమునకే నే నిచటకు వచ్చితిని. ఇచటనున్న వీరులందఱు నిరఃపూర్వమే నాచే చంపఁబడిరి. లెమ్ము. భయపడకుము. యుద్ధమున వీరిని చంపుము. విజయము నీదే. నీవు కేవలము నిమిత్తమాత్రుఁడవే. ఈ శత్రువుల నెల్లరను చంపి రాజ్య సంపద చేపట్టుము. కీర్తిమంతుడవు కమ్ము.

అర్జునునకు మఱింత భీతి కలిగి, వడవడ వణుకుచు శ్రీకృష్ణునకు మరల మరల నమస్కరించుచు డగ్గుత్తికతో నిట్లనెను. "కృష్ణా! నీవే జగత్ప్రభుఁడవు, అనంతుఁడవు, సర్వవ్యాపివి. నీ మహత్త్వ మెఱుఁగక మనకు గల పరిచయము కొలఁది పదిమంది యెదుట గూడ నిన్నెన్నియో మార్లు హేళనగ పిలిచితిని, హేళనగ మాట్లాడితిని. నన్ను క్షమింపుము. నీకు నీవే సాటి. ఇదివరకెన్నడును చూడని నీ విశ్వరూపము చూచి సంతోషపడితిని. కాని, నా చిత్తము భయముచే వికలమైనది. ఈ మహా భయంకర రూపమును చూడజాలను. నా శాంతియు ధైర్యము గూడ నశించినవి. శంఖ చక్ర గదాహస్తుఁడవు, కిరీటధారివి అయిన నీ పూర్వ రూపమునే తిరిగి చూపుము." అని వేడుకొనెను. శ్రీకృష్ణుడంతట తన విశ్వరూపము నుపసంహరించి, పూర్వరూపము దాల్చి యిట్లనెను.

"అర్జునా! నా యోగబలముచే నా విశ్వరూపమును నీకు చూపితిని. ఇంతకు పూర్వమెవరును దీనిని చూడలేదు. ఈ రూపమును చూచుటకు దేవతలెంతయో ప్రయత్నించుచుందురు. ఈ విశ్వరూప దర్శనము లభించుట చాల కష్టము. దాన తపోయజ్ఞములు, వేదాధ్యయనము వలనను కూడ లభింపదు. నాకు ప్రీతికరములైన పనులొనర్చుచు నన్నే పరమగతిగా నెంచి, అన్యచింతలులేని ఏకాగ్రభక్తితో నన్ను సేవించుటయే ఈ విధమైన రూపమును వీక్షించుటకును, నన్ను పొందుటకును మార్గము.

మాయావృతమైన హృదయము, మనస్సు కల వానికి పరమాత్మ తత్త్వమును గ్రహించు శక్తియు అతని దివ్యరూప దర్శనమును లభింపవు. భగవానునియందు అచంచల భక్తిప్రపత్తులు గలవారికే భగవత్కృప వలన దివ్యదృష్టియు, దివ్యరూప దర్శనము లభ్యమగునని ఈ యధ్యాయము వలన తెలియుచున్నది.

ఈ అధ్యాయమునందలి ముఖ్య శ్లోకములు

5, 6, 7, 8, 32, 33, 54, 55

# శ్రీ మ ద్భ గ వ ద్గీ త

## పదునొకండవ అధ్యాయము

## వి శ్వ రూ ప సం ద ర్శ న యో గ ము

అర్జున ఉవాచ :– అర్జునుఁడు చెప్పెను.

1. మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మ సంజ్ఞితమ్ ।
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ ॥

కృష్ణ ! నీ యనుగ్రహము చూపించుకొఱకె
పరమగుహ్య మధ్యాత్మసంబంధ మైన
విషయములనెల్ల నిపుడు చెప్పితివి నాకు,
దానివలన నా మోహమంతయు నశించె.

తా॥ ఓ కృష్ణా ! నీవు నన్ను దయతో అనుగ్రహించుట కొఱకే, అతిరహస్యము, ఆత్మజ్ఞానసంబంధమైన విషయముల నన్నిటిని నాకు బోధించితివి. వీని వలన నా అవివేకము, భ్రాంతియు తొలఁగిపోయినవి.

2. భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా ।
త్వత్తః కమలపత్రాక్ష ! మాహాత్మ్యమపి చావ్యయమ్ ॥

పుండరీకాక్ష ! ఈ సర్వభూతకోటి
జనన నాశ సంబంధమౌ సంగతులను,
అవ్యయమ్మగు నీదు మాహాత్మ్యములను
విపులముగ నీవు చెప్పగ వింటి నేను.

తా॥ ఓ కృష్ణా ! సర్వ భూతముల యొక్క ఉత్పత్తి నాశమును గురించిన విషయములగు శాశ్వత ధర్మములను, నీ అవ్యయ మహాత్మ్యమును నీవు సవిస్తరముగ చెప్పితివి. వీని నన్నిటిని నేను శ్రద్ధగా వింటిని,

3. ఏవమేతద్యథాఽఽత్థ త్వమాత్మానం పరమేశ్వర।
ద్రష్టుమిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ॥

నీవు పరమేశ్వరా! నేఁడు నిన్నుగూర్చి
యేది చెప్పితివో యది యెల్ల నిజము,
ఓయి పురుషోత్తమా! భవదీయమైన
ఈశ్వరాకృతి నింక వీక్షింపనెంతు,

తా॥ ఓ కృష్ణా! నీవు పురుషోత్తముఁడవు, పరమేశ్వరుఁడవు. నిన్ను గూర్చి నాకిపుడు చెప్పినదెల్ల నిజము. ఇంక నీయొక్క పరమేశ్వరాకారమును చూడఁగోరుచున్నాను.

4. మన్య సే యది తచ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో।
యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్॥

కృష్ణ! నీ విశ్వరూపమ్ము నేను చూడఁ
గల సమర్థుఁడ నంచును తలఁతు వేని
తావకావ్యయరూప సందర్శనమ్ము
కలుగఁజేయుము, యోగీశ! కాంక్షదీర.

తా॥ ఓ కృష్ణా, యోగీశ్వరా, నీ విశ్వరూపమును చూడగల శక్తి నాకు కలదని నీవు తలఁచెదవేని, నాశరహితమైన నీ యాకృతిని నా కోరిక తీరునట్లుగ చూపింపుము.

శ్రీ భ గ వా ను వా చ :— శ్రీ భగవానుఁడు చెప్పెను.

5. పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః।
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ॥

అర్జునా! వేనవే లసంఖ్యాకములయి,
బహువిధమ్ములు బహువర్ణ భాసితములు
బహువిధాకృతు లలరి దివ్యమ్ములైన
వివియె నా రూపములు విలోకింపుమీవు.

తా॥ అర్జునా! చూడుము, వేలకొలది అసంఖ్యాకములైన నా రూపములు, అనేక ఆకృతులతో అనేక వర్ణాలంకారములతో దివ్యములైన ఆకారము లివే.

6. పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రానశ్వినౌ మరుత స్తథా।
బహూన్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత ! ॥

అర్జునా ! చూడు మాదిత్యు లశ్వినులను
రుద్రులను మఱి స_ప్తమగుత్తు లష్ట
వసువులను నీవు, పూర్వమెవ్వరును గూడ
చూడనట్టివి ఆశ్చర్యశోధితములు.

తా॥ అర్జునా ! చూడు మిచ్చట. ఆదిత్యులను (12), అశ్వినీదేవతలను (2) రుద్రులను (11), మరుత్తులను (7), వసువులను (8), పూర్వ మెవ్వరును చూడనట్టివి, అనేకములు ఆశ్చర్యకరములైన దృశ్యములను చూడుము.

7. ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్ ।
మమదేహే గుడాకేశ ! యచ్చాన్యద్ద్రష్టు మిచ్ఛసి ॥

అర్జునా ! సకల చరాచరాత్మకమగు
నఖిలవిశ్వము, మఱి దేని నైనగాని
చూడఁదలఁచిన దానిని చూడుమిచట
ఒక్కచో నాశరీరమం దున్నవిపుడు.

తా॥ అర్జునా ! సకల చరాచరాత్మకమగు విశ్వగోళమును, మఱి యితరమైన దేనిని నీవు చూడఁదలఁచితివో వాని నన్నిటిని చూడుము. అన్నియు ఒక్కచో నా శరీరమందున్నవి.

8. న తు మాం శక్యసే ద్రష్టుమనేనైవ స్వచక్షుషా।
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ ॥

చూడఁజాలవు నీదుచక్షువులతోడ,
ఇదియె దివ్యదృష్టిని ప్రసాదించుచుంటి,
ఉత్తమమ్మైన నాయొక్క యోగమహిమ
నీశ్వరత్వము నిట విలోకింపు పార్థ !

తా॥ అర్జునా ! నీ సామాన్య మానవ చక్షువులతో ఈ విశ్వరూపము చూడఁజాలవు. నీ కిదియే దివ్యదృష్టి నిచ్చుచున్నాను. నా యోగమహిమను పరమేశ్వరాకారమును చూడుము.

సంజయ ఉవాచ :— సంజయుఁడు చెప్పెను.

9. ఏవముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః।
దర్శయా మాస పార్థాయ పరమం రూపమైశ్వరం ॥

ఓ మహారాజ! ఉత్తమయోగి యైన
కృష్ణపరమాత్మ, పార్థుతో నిట్లు పలికి
శ్రేష్ఠమును పరమేశ్వరాకృతియు నైన
తనదు విశ్వరూపమ్ము పార్థునకు చూపె.

తా॥ ఓ మహారాజా! మహాయోగీశ్వరుఁడైన శ్రీకృష్ణుఁడు అర్జునునితో నిట్లు పలికి, పరమేశ్వరాకృతియైన తన విశ్వరూపమును చూపెను.

10. అనేక వక్త్రనయనమ్ అనేకాద్భుత దర్శనమ్।
అనేక దివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్ ॥

11. దివ్యమాల్యామ్బరధరం దివ్యగంధానులేపనమ్।
సర్వాశ్చర్యమయం దేవమనన్తం విశ్వతోముఖమ్ ॥

నేత్రములును వదనము లనేకములుగ
బహువిధాద్భుతదృశ్య విభాసితమయి,
దివ్యభూషణరాసితో తేజరిల్లి,
పయికినెత్తిన ఆయుధపంక్తి గలిగి,

దివ్యసుమమాలికలతోడ, దివ్యవస్త్ర
చయముతో, దివ్యచందన చర్చతోడ,
కాంతిమంత, మాశ్చర్య, మనంత మైన
విశ్వతోముఖరూపము విశదమయ్యె.

తా॥ ఆ విశ్వరూప మిట్లున్నది. అనేక నేత్రములు, అనేక ముఖములు, నానావిధములైన అద్భుత దృశ్యములు, దివ్యాభరణములు కలిగి దివ్యాయుధము లెన్నియో పయికి యెత్తబడి యున్నవి. ఆ యాకారము దివ్య పుష్పమాలలతోను, దివ్యాంబరములతోను, సుగంధచర్చతోడను ఆశ్చర్యకరముగ, అనంతమై, విశ్వతోముఖమై అత్యధిక ప్రకాశమానమై తేజరిల్లి పోవుచున్నది.

12. దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా ।
యది భాస్సదృశీ సా స్యాద్భాసస్తస్య మహాత్మనః ॥

వేయిభాస్కరు లాకాశవీధియందు
ఏకమై యొక్కమారుదయించినపుడు
ప్రభవమైన కాంతి, మహానుభావుఁడైన
అతని కాంతికిని సమానమగును కొంత.

తా॥ ఆకాశమందు వేయిమంది సూర్యులొక్కసారి ఉదయించినచో పుట్టిన కాంతి యంతయు మహాత్ముఁడైన శ్రీకృష్ణుని విశ్వరూపకాంతికి కొంతవఱకు సమాన మగునేమో అన్నట్లున్నది.

13. తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా ।
అపశ్యద్దేవదేవస్య శరీరే పాండవస్తదా ॥

బహువిధమ్ముల విభజింపఁబడిన యట్టి
అఖిల జగమెల్ల ఏకస్థమగుచు నొక్క
చోట నున్నదానినిగ నర్జునుఁడు చూచె
దేవదేవుఁడౌ కృష్ణుని దేహమందు.

తా॥ అనేక విధములుగ విభజింపఁబడిన అఖిల జగమును దేవదేవుఁడైన శ్రీకృష్ణుని దేహమందు ఒక్కచోటనున్న దానినిగ అర్జునుఁడు చూచెను.

14. తతః స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః ।
ప్రణమ్య శిరసా దేవం కృతాంజలీ రభాషత ॥

విశ్వరూపము గనినంత విస్మయమున
పులకితాంగుఁడై శ్రీకృష్ణమూర్తి యెదుట
శిరము నరవాల్చి తగ నమస్కృతు లొనర్చి
పలికెనిట్లుల పార్థుఁ డంజలిఘటించి.

తా॥ ఆ విశ్వరూపమును చూచినతోడనే ఆశ్చర్యమున పులకించిన దేహముకల వాడై అర్జునుఁడు శ్రీకృష్ణునికి శిరము వాల్చి నమస్కరించి అంజలిబద్ధుఁడై యిట్లనెను.

అర్జున ఉవాచ :— అర్జునుఁడు చెప్పెను.

15. పశ్యామి దేవాం స్తవ దేవ! దేహే
సర్వాం స్తథా భూతవిశేష సంఘాన్
బ్రహ్మాణమీశం కమలాసనస్థం
ఋషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్ ॥

దేవ! చూచుచున్నాను నీ దేహమందు,
సర్వఋషులను, దివ్యమౌ సర్పములను,
పద్మపీఠుఁ డీశుఁడు నైన బ్రహ్మనిచట,
ప్రాణికోట్లను సర్వదేవతల గూడ.

తా॥ ఓ కృష్ణా! నీ దేహమందు, సర్వఋషులను, దివ్యసర్పములను, కమలాసనమునను్న బ్రహ్మను, సర్వభూతములను, దేవతలను కూడ చూచుచున్నాను.

16. అనేక బాహూదర వక్త్ర నేత్రం
పశ్యామి త్వాం సర్వతోఽనన్తరూపమ్।
నాన్తం నమధ్యం నపునస్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర! విశ్వరూప!॥

బహుముఖమ్ము లుదరములు బాహువులును
నేత్రములతోడ సర్వత్రనిండు నీయ
నంతరూపము కృష్ణ! సర్వాధిదేవ!
చూచుచుంటిని గాని, నేచూడఁజాల
దాని కాద్యంతములును మధ్యమ్ముగానీ.

తా॥ ఓ కృష్ణా! విశ్వేశ్వరా! అనేక ముఖములు, ఉదరములు, చేతులు, నేత్రములు కలిగి సర్వము నిండియున్న నీ అనంతమైన ఆకారమును చూచుచున్నాను, కాని ఆ యాకారమునకు మొదలు కాని, మధ్యకాని తుదికాని నాకెక్కడను కన్పించుటలేదు,

17. కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతో దీప్తిమన్తమ్ ।
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమన్తా
ద్దీప్తానలార్క ద్యుతి మప్రమేయమ్ ॥

గదయు చక్రమ్ము మకుటమ్ము గలిగి, మహిత
దీప్తిరాశివై సూర్యాగ్ని తీక్ష్ణ మైన
కాంతులను గల్గి చూడశక్యమ్ము గాక
అప్రమేయ స్వరూపుఁడవై వ కృష్ణ!
చూచుచుంటిని నిన్నన్నిచోటులందు.

తా॥ గద, చక్రము, కిరీటము కలిగిన నీ రూపము గొప్ప తేజోపుంజము వలె నున్నది. సూర్యాగ్నివలె అతి తీక్ష్ణముగా నున్నది. కృష్ణా! అపరిమితమైన నీ స్వరూపము అన్నిచోటులను వ్యాపించియున్న దానిని చూచుచున్నాను.

18. త్వమక్షరం పరమం వేదితవ్యం
త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్ ।
త్వ మవ్యయ శ్శాశ్వత ధర్మగోప్తా
సనాతనస్త్వం పురుషో మతో మే ॥

అరయఁగాఁ దగినట్టి బ్రహ్మమవు, కృష్ణ!
నాశరహితుఁడ వీవు, సనాతనుఁడవు,
శాశ్వతమ్మగు ధర్మ రక్షకుఁడ వీవె
అఖిల జగతికి నాధారమనుచుఁ దలతు.

తా॥ కృష్ణా! నీవు తెలుసుకోదగిన పరమాత్మవు. నాశము లేనివాడవు. సనాతనుఁడవు. శాశ్వతమైన ధర్మమునకు రక్షకుడవు. ఈ జగత్తుంతకు నీవే ఆధార పురుషుఁడవని తలఁచుచున్నాను.

19. అనాదిమధ్యాన్త మనన్తవీర్య
మనన్త బాహుం శశిసూర్య నేత్రమ్ ।
పశ్యామి త్వాం దీప్తహుతాశ వక్త్రం
స్వతేజసా విశ్వమిదం తపన్తమ్ ॥

ఆదిమధ్యాంతరహితుఁడ, వమితవీర్య
వంతుఁడవు, బహుభుజుఁడవు, వదనమందు
సూర్యచంద్రులె రెండు చక్షులుగనుండి
అగ్నివలె మండుచున్న ఆస్యమ్ముతోడ
జగము తపియింపఁజేయు తేజమున వెలుగు
చున్న విశ్వేశ్వరా! చూచుచుంటి నిన్ను.

తా॥ ఓ కృష్ణా! ఆదిమధ్యాంతములు లేనివాడవు, అమితశక్తిశాలివి, అనేక బాహువులు గలవాడవు, సూర్యచంద్రులే నేత్రములుగ గలిగి, అగ్నివలె ప్రజ్వలించుచున్న ముఖముతో, ఈ జగత్తంతయు తపింపఁజేయుచు, మహాతేజముతో ప్రకాశించుచున్న నిన్ను చూచుచున్నాను.

20. ద్యావాపృథివ్యోరిదమన్తరం హి
వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః ।
దృష్ట్వాద్భుతం రూపముగ్రం తవేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్ ॥

దశదిశలు నిండి భూనభోంతరము లెల్ల
వ్యాప్తమయ్యెను నీస్వరూపమె మహాత్మ!
భీకరాద్భుత మైన నీ యాకృతికిని
అడలుచుండెను లోకత్రయమ్ము గూడ.

తా॥ కృష్ణా! నీ యాకారము ఒక్కటియే దిక్కులన్నిటను భూమ్యాకాశము లంతటను వ్యాప్తమైనది. భయంకరము, అద్భుతమునైన నీ స్వరూపమునకు ముల్లోకము లును అడలిపోవుచున్నవి.

21. అమీ హి త్వాం సురసంఘా విశన్తి
కేచిద్భీతాః ప్రాంజలయో గృణన్తి
స్వస్తీత్యుక్త్వా మహర్షి సిద్ధసంఘాః
స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః ॥

నిను ప్రవేశించుచున్నారు నిఖిలసురలు,
వారిలో కొందఱిదె భయభ్రాంతు లగుచు,
ప్రార్ధనల సల్పుచుండిరి ప్రాంజలులయి;
సిద్ధులును మహాఋషులెల్ల చేరి, నీకు
పలువిధమ్ములుగా స్తోత్రపాఠములను
చదువుచున్నారు స్వస్తివాచకముతోడ.

తా॥ దేవతలందఱు నీలో ప్రవేశించుచున్నారు. కొందఱు భయముతో నీకు కరములు మోడ్చి ప్రార్థించుచున్నారు. సిద్ధులు, ఋషులు నీవద్దచేరి నిన్ను కీర్తించుచు అందఱకును మేలగుగాక యని స్వస్తివాచకములు చదువుచున్నారు.

22. రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా
విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ
గన్ధర్వ యక్షాసుర సిద్ధ సంఘా
వీక్షన్తే త్వాం విస్మితాశ్చైవ సర్వే ॥

రుద్రు, లమరు, లసురులు, సూర్యులు మరుత్తు
లశ్వినులును, విశ్వేదేవ, యక్ష, సిద్ధ
సాధ్య గంధర్వ వసువు లాశ్చర్యభరిత
చిత్తులై కృష్ణ! నిన్ను వీక్షించుచుండ్రి.

తా॥ ఓ కృష్ణా! రుద్రులు, ఆదిత్యులు, వసువులు, సిద్ధులు, సాధ్యులు, అశ్వినులు, విశ్వేదేవతలు, దేవతలు, పితరులు, గంధర్వులు, వీరందఱును అత్యాశ్చర్య చకితులై నిన్ను వీక్షించుచున్నారు.

23\. రూపం మహత్తే బహువక్త్రనేత్రం
మహాబాహో బహుబాహూరుపాదం।
బహూదరమ్ బహుదంష్ట్రాకరాలం
దృష్ట్వా లోకాః ప్రవ్యథితా స్తథాఽహమ్॥

బహుముఖమ్ము లక్షు లనేకబాహువులును
బహుపదము లూరు లుదరముల్ పరఁగుచుండి
నిశితదంష్ట్రలు గలిగిన నిన్నుఁగాంచి
భయపడుచు నుంటిమో కృష్ణ! ప్రజలు, నేను.

తా॥ ఓ కృష్ణా, అనేక ముఖములు, నయనములు, బాహువులు, కాళ్ళు, తొడలు, ఉదరములు కలిగి వాడియగు కోరలతో అతి భీకరముగ నున్న నీ రూపమును చూచి ప్రజలెల్లరు భయకంపితులగుచుండిరి. నాకు గూడ అట్లే భయమగుచున్నది.

24\. నభఃస్పృశమ్ దీప్త మనేకవర్ణం
వ్యాత్తాననం దీప్త విశాలనేత్రం।
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా
ధృతిం న విన్దామి శమం చ విష్ణో॥

గగనమంటుచు, జ్వలితాక్షియుగము వెలుఁగ,
కాంతియుతమును బహువర్ణ కలితమగుచు,
వివృతవక్త్రమౌ నీరూపు వెఱపుఁగొలిపె,
కృష్ణ! నశియించుచుండె నా ధృతియు శమము.

తా॥ కృష్ణా! కాంతిమంతమై అనేక వర్ణములు కలిగి మండుచున్న విశాల నేత్రములతో తెరచియున్న నోటితో ఆకాశమంటుచున్న నీ యాకారము చూచి నా మనస్సెల్ల వ్యాకులపడుచున్నది. శాంతిని, ధైర్యమును కూడ పొందఁజాలకున్నాను.

25. దంష్ట్రాకరాలాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానల సన్నిభాని
దిశో న జానే న లభే చ శర్మ
ప్రసీద దేవేశ జగన్నివాస ॥

ప్రకట దంష్ట్రాకరాళమై ప్రళయవహ్ని
పోలియున్నట్టి నీ ముఖమ్ములను జూచి
దిగ్భ్రమనుబొంది దుఃఖ దుస్థితిని బడితి,
నన్ను దయఁజూడు మింక జగన్నివాస!

తా॥ ఓ జగన్నివాసా! కృష్ణా, వాడిదంతములతో అతిభయంకరమై ప్రళయాగ్నిని దలపించు నీ ముఖములను చూచినంతనే దిగ్భ్రమయు, అమితవ్యథయు కలుగుచున్నవి. నన్నిక దయజూడుము.

26. అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః
సర్వే సహైవావనిపాల సంఘైః।
భీష్మో ద్రోణః సూతపుత్రస్తథాఽసౌ
సహాస్మదీయైరపి యోధముఖ్యైః ॥

27. వక్త్రాణి తే త్వరమాణా విశన్తి
దంష్ట్రాకరాలాని భయానకాని।
కేచిద్విలగ్నా దశనాన్తరేషు
సందృశ్యన్తే చూర్ణితై రుత్తమాంగైః ॥

చూచుచుంటిని, దేవ! భీష్ముండు గురుఁడు
కర్ణుఁడును తక్కు రాజులు కలసియున్న
ధార్తరాష్ట్రులందఱు నతిత్వరితగతిని
వీరయోధులు నావైపువారు గూడ

భయదదంష్ట్రిలు గలుగు నీవదనమందు
చొచ్చుచున్నారు; వారిలో శూరవరులు
కొందఱదె నీదు దంతములందు చిక్కి
నలుగుచున్నారు తలలు చూర్ణములు గాగ.

తా॥ కృష్ణా! నేను చూచుచుండగనే అదిగో భయదదంష్ట్రిలతోనున్న నీ ముఖమందు భీష్ముఁడు, ద్రోణుఁడు, కర్ణుఁడు తక్కిన రాజులందఱు, మిగిలిన దుర్యోధనాధులు ప్రవేశించుచున్నారు. నావైపున ఉన్న వీరులు గూడ అట్లే అగుచున్నారు. వారిలో కొందఱు నీదు దంతముల మధ్య చిక్కికొనిపోయి తలలు చూర్ణములుగా నలిగిపోవుచున్నారు గూడ.

28. యథా నదీనాం బహవోఽమ్బు వేగాః
సముద్రమేవాభిముఖా ద్రవన్తి।
తథా తవామీ నరలోకవీరా
విశన్తి వక్త్రాణ్యభివిజ్వలన్తి॥

అఖిల వాహినీ జలప్రవాహమ్ము లెట్లు
త్వరగ ప్రవహించునో సముద్రమును జేర,
చేరుచున్నార లీ నరవీరు లట్లె
ప్రజ్వలించుచు నున్న నీ వదనములను.

తా॥ సముద్రము వైపునకే నదులన్నియు వేగముగా ప్రవహించుచున్నట్లు, పెద్ద మంటలతో కన్పడుచున్న నీ ముఖములందు ఈ మనుష్యలోక వీరులందఱు ప్రవేశించుచున్నారు.

29. యథా ప్రదీప్తం జ్వలనం పతంగా
విశన్తి నాశాయ సమృద్ధ వేగాః।
తథైవ నాశాయ విశన్తి లోకాః
తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః॥

అమితవేగమ్ముతో, నాశమగుట కొఱకె
మిడుత లగ్నికీలలయందు పడెడు రీతి,
వారి నాశమ్ముకొఱకె ఈవీరు లెల్ల
చేరుచుండిరి నీముఖద్వారమందు.

తా॥ కృష్ణా, తాము నాశనమగుటకే మిడుతలు, పురుగులు, నిప్పుమంటల లోనికి వేగముగా ఎగిరి పడుచున్నట్లు ఈ వీరులందఱు వారి నాశము కొఱకే నీ ముఖములందు ప్రవేశించుచున్నారు.

30. లేలిహ్యసే గ్రసమాన స్సమన్తా
ల్లోకాన్ సమగ్రాన్ వదనై ర్జ్వలద్భిః।
తేజోభిరాపూర్య జగత్సమగ్రం
భాస స్తవోగ్రాః ప్రతప న్తి విష్ణో ! ॥

ప్రజలనెల్లర నీ జ్వలద్వదనమందు
పట్టి తినుచుంటి వీ వన్నివైపులందు
తీక్ష్ణమగు నీదు తేజఃప్రదీప్తి, కృష్ణ!
యెల్లజగతి వ్యాపించి మండించుచుండె.

తా॥ ఓ కృష్ణా! మండుచున్న నీ ముఖమండలమందు అన్నివైపులనుండి ఈ ప్రజలనందఱను పట్టి తినుచున్నావు. మహాతీక్ష్ణము, కాంతిమంతమునైన నీ తేజః ప్రసారముచే ఈ జగత్తునంతయు తపింపఁజేయుచున్నావు.

31. అఖ్యాహి మే కో భవానుగ్రరూపో
నమోఽస్తు తే దేవవర ! ప్రసీద ।
విజ్ఞాతుమిచ్ఛామి భవ న్త మాద్యం
న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్ ॥

ఎఱుఁగకున్నాను నీదుప్రవృత్తి, కృష్ణ!
ఉగ్రమూర్తి వీ వెవ్వఁడవో వచింపు,
మెఱుఁగఁ దలఁతును నిన్నాదిపురుష, నన్ను
కరుణ నేలుము— నానమస్కారమిదియె.

తా॥ కృష్ణా ! నీ ప్రవర్తనము నాకేమియు నవగతమగుటలేదు. ఇంత భయంకరాకారమును దాల్చిన నీవెవరవో చెప్పుము. నిన్ను గూర్చి తెలిసికొనవలెనని యున్నది. నా నమస్కారము లివే. నన్ను దయజూడుము.

శ్రీ భ గ వా ను వా చ :— శ్రీ భగవానుఁడు చెప్పెను.

32. కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః।
ఋతేఽపి త్వా న భవిష్యన్తి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః ॥

పృథ్వి సంహర్తనై ప్రవర్తించుచుంటి,
ప్రబలరీతి వచ్చితి ప్రజాధ్వంసమునకై;
కాలుఁడను నేను, ప్రతిపక్షగణములెవరు
నిటబ్రతుక రీవు లేకపోయినను గూడ.

తా॥ నేను కాలస్వరూపుఁడను. ఈ జగత్సంహారమునకొఱకే విజృంభించి ప్రవర్తించుచున్నాను. ఇప్పుడు ఈ ప్రజల సంహరించుటయే నా పని. శత్రుసైన్యమందెవ్వరును, నీవున్నను లేకపోయినను గూడ, ఇక బ్రతికి యుండరు.

33. తస్మాత్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్।
మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ ॥

కాన, లెమ్మింక పార్థ! ప్రఖ్యాతిఁగొనుము,
రాజ్యసంపద గొనుము శాత్రవుల జంపి;
చంపఁబడిరి నాచేత నీ జనులు పూర్వ
మే, నిమిత్తమాత్రుఁడవు నీ విచట నిపుడు.

తా॥ కావున అర్జునా! యిక లేచి యుద్ధమున కుపక్రమించి, శత్రువుల పరిమార్చి, రాజ్యసంపదను చేపట్టి కీర్తిని పొందుము. ఈ ప్రజలందరు పూర్వమే నాచేత చంపబడిరి. నీవు నిమిత్తమాత్రుడవే. కావున యుద్ధమునకు లెమ్ము.

34. ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాఽన్యానపి యోధవీరాన్ ।
మయా హతాం స్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్ ॥

ఇదివరకె చంపఁబడినట్టి ఈ జయద్ర
థుండు కర్ణుండు భీష్ముండు ద్రోణుఁడాది
సకల యోధులఁ జంపుము సమరమందు,
భయమువీడుము రిపులగెల్వంగఁగలవు.

తా॥ అర్జునా! ఈ సైంధవుఁడు, భీష్ముఁడు, ద్రోణుఁడు, కర్ణుఁడు మొదలైన యోధులందరు ఇదివరకే చంపబడిరి. యుద్ధమున నీవు మరల చంపుము. నిర్భయుఁడవై యుద్ధమునకు లెమ్ము. శత్రువులను నీవు జయింపఁగలవు.

స ం జ య ఉ వా చ :— సంజయుఁడు చెప్పుచున్నాడు.

35. ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాంజలి ర్వేపమానః కిరీటీ ।
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం
సగద్గదం భీతభీతః ప్రణమ్య ॥

అచ్యుతుని మాటలాలించి అర్జునుండు
వడవడవణంకి కడు భయభ్రాంతుఁడగుచు
అంజలిఘటించి ప్రణతుల నాచరించి,
పలికెనిట్టుల గద్గదస్వరము తోడ.

తా॥ శ్రీకృష్ణుఁడాడిన ఈ మాటలను వినిన అర్జునుఁడు అమిత భయమున వడవడ వణంకుచు, చేతులు మోడ్చి కృష్ణునకు నమస్కరించుచు డగ్గుత్తి కపడిన కంఠస్వరముతో నీ రీతిగ పలికెను.

అర్జున ఉవాచ :— అర్జునుఁడు చెప్పెను.

36. స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా
జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ ।
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి
సర్వే నమస్యన్తి చ సిద్ధసంఘాః ॥

అచ్యుతా ! నీకు దగినట్లె అవనియెల్ల
నుతులొనర్చుచు, ప్రీతిసంతోషములను
పొందుచుండె; దైత్యులు పారిపోవు చుండి,
చేయుచున్నారు, ప్రణతులు సిద్ధులెల్ల.

తా॥ అచ్యుతా ! నీ మహిమను కీర్తించుచు లోకమంతయు సుఖసంతోషములను పొందుచున్నది. రాక్షసులు భయపడి పారిపోవుచున్నారు. సిద్ధులందఱును నీకు నమస్కారములు చేయుచున్నారు. ఇది యంతయు నీ గొప్పతనమునకు తగినట్లే యున్నది.

37. కస్మాచ్చ తే న నమేరన్మహాత్మన్
గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే ।
అనన్త ! దేవేశ ! జగన్నివాస
త్వమక్షరం సదసత్తత్పరం యత్ ॥

ఓ జగన్నివాస ! అనంత ! ఓ మహాత్మ !
దేవ ! సదసత్తులకును అతీతుఁడైన
అవ్యయుఁడవు, బ్రహ్మకు గూడ నాదివీవు,
ఏలచేయకుందురు నమస్కృతులు నీకు.

తా॥ కృష్ణా మహాత్మా ! నీవు జగదాధారుఁడవు, అనంతుఁడవు, దేవదేవుఁడవు, 'సత్తు' 'అసత్తు' వస్తువుల కతీతుఁడవు, శాశ్వతుఁడవు. ఆ బ్రహ్మకు కూడ నీవాదికారణుఁడువు. నీకు వారందఱు నమస్కారములు చేయకుందురా ?

38. త్వమాదిదేవః పురుషః పురాణ
స్త్వమస్య విశ్వస్య పరం నిధానమ్।
వేత్తాసి వేద్యం చ పరం చ ధామ
త్వయా తతం విశ్వమనన్త రూప ॥

నీవనంతరూపుఁడ, వాదిదేవుఁడవును,
పృథ్వి కాధారుఁడవు, సర్వవేత్త వీవు,
ఉత్తమస్థాన మఖిలవేద్యుఁడవు నీవు
నిండియుంటి వీ విశ్వమ్ము నీవె కృష్ణ.

తా॥ కృష్ణా ! నీవు పురాణపురుషుఁడవైన ఆదిదేవుఁడవు. నీరూప మనంతమైనది. జగత్తునకంతకు ఆధారుఁడవు. అన్నిటిని తెలిసినవాడవు. అందఱిచే తెలియఁదగిన వాడవు. పరమపదమగు ఈ విశ్వమంతయును నీవే వ్యాపించి యుంటివి.

39. వాయుర్యమోఽగ్ని ర్వరుణ శ్శశాంకః
ప్రజాపతి స్త్వం ప్రపితా మహశ్చ।
నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః
పునశ్చ భూయోఽపి నమో నమస్తే ॥

వాయు, వగ్నియు, యముడును, వరుణు, డాశ
శాంకుఁడును, బ్రహ్మదేవుఁడు, నతని తండ్రి
సర్వమీవె, నమస్సహస్రములు నీకు,
మరల మరల నీకివె నానమస్సు లీశ!

తా॥ కృష్ణా! వాయువు, అగ్ని, యముఁడు, వరుణుఁడు, చంద్రుఁడు, బ్రహ్మ, బ్రహ్మయొక్క తండ్రి, సర్వమును నీవె. నీకనేక వేల నమస్కారములు. మరల మరల నీకివే నా నమస్కారము లొనర్చుచున్నాను.

40. నమః పురస్తాదథ పృష్ఠతస్తే
నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ! ।
అనన్త వీర్యామిత విక్రమస్త్వం
సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః ॥

నిఖిల జగతిని నీవయి నిండియున్న
అమిత విక్రమ వీర్య సమన్వితుఁడవు,
ప్రణతులివె నీకు, కృష్ణ! సర్వస్వరూప;
ముందు వెనుకల నన్నివైపులను గూడ.

తా॥ కృష్ణా, ఈ జగత్తంతయు నీవు నిండియున్నావు. నీ బలవిక్రమములు అత్యధికములైనవి. నీవు సర్వస్వరూపుడవు. నీకు ముందు వెనుక అన్నివైపులను నా నమస్కారము లివియే.

41. సఖేతిమత్వా ప్రసభం యదుక్తం
హే కృష్ణ! హే యాదవ! హే సఖేతి।
అజానతా మహిమానం తవేదం
మయా ప్రమాదాత్ప్రణయేన వాపి ॥

42. యచ్చావహాసార్థ మసత్కృతోఽసి
విహార శయ్యాసన భోజనేషు।
ఏకోఽథవాప్యచ్యుత! తత్సమక్షం
తత్క్షామయే త్వామహమప్రమేయం ॥

ఎఱుఁగకయె నీ మహత్త్వ మేనెన్నిమార్లొ
పరిచయము చేతనో, ప్రమాద వశమువలనో,
ఓయి గొల్లకృష్ణా! మిత్రమా, యటంచు
పలికియుంటిని తొందరపాటు వలన.

ఆస నాహార శయ్యా విహారములను
అందఱి యెదుట గాని నీముందు గాని
హాస్యమున కిట్టిమాటల నాడియుంటి
కృష్ణ! క్షమియింపు నాతప్పులెల్ల మఱచి.

తా॥ కృష్ణా, నీ మహత్త్వము నెఱుఁగక, ఎన్నిమారులో నిన్ను సామాన్యునిగ నెంచి, గొల్లవాడా, కృష్ణా, మిత్రమా అనుచు పరిచయముచేతనో ప్రమాదవశముననో పలికియుంటిని. ఆసనము, శయ్య, భోజనము, విహారము ఇట్టి విషయములందు నీవొక్కఁడవు ఉన్నపుడు గాని, పదుగురి యెదుట గాని చాలమార్లు నిన్ను హేళన చేసితిని. తొందరపాటు వలన గలిగిన ఈ నాతప్పులన్నిటిని క్షమింపుము.

43. పితాఽసి లోకస్య చరాచరస్య
త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్।
న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో
లోకత్రయేఽప్యప్రతిమప్రభావ॥

ఈ చరాచర జగమున కీవె కృష్ణ!
శ్రేష్ఠుఁడవు, పూజ్యుఁడవును, తండ్రివిని, గురువు;
నిరుపమానము, నీశక్తి నిఖిలజగతి
సములెలేరన్నచో త్రిలోకముల నీకు,
అగునె నీకంటె నెవఁడైన యధికుఁడింక?

తా॥ కృష్ణా! ఈ చరాచర జగత్తునకు నీవే పూజ్యుఁడవు, తండ్రివి, శ్రేష్ఠుఁడవు, గురుఁడవు. నీశక్తి నిరుపమానమైనది. నీకు సమానమైనవారే లేరు, ఇంక నీకంటె అధికులెక్కడుందురు.

44. తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వామహమీశ మీడ్యమ్।
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ! సోఢుమ్॥

తండ్రి తనయుని, భర్తయు తనదు సతిని,
ప్రియసఖుఁడు మిత్రుని, క్షమించు రీతిగానె
నీవె తగుదువు నన్ను మన్నింప కృష్ణ!
మ్రొక్కులిడె, స్వామి! సాష్టాంగపూర్వకముగ.

తా॥ కృష్ణా, తప్పు లొనరించినపుడు, తండ్రి కుమారుని, భర్త భార్యను, స్నేహితుఁడు తన మిత్రుని క్షమించునట్లు నన్ను క్షమించుటకు నీవే తగినవాడవు. నీవు సర్వ ప్రభుఁడవు. నీకు సాష్టాంగపూర్వకముగ నమస్కరించుచున్నాను. నన్ను క్షమింపుము.

45. అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే।
తదేవ మే దర్శయ దేవ! రూపం
ప్రసీద దేవేశ! జగన్నివాస॥

పూర్వమెఱుఁగని నీరూపు ముదమొసంగె,
కాని, భయముతో చిత్తమ్ము కలతనొందె,
కరుణతో చూపుమింక జగన్నివాస!
స్వామి! నీపూర్వరూపు ప్రసన్నుఁడవయి.

తా॥ కృష్ణా! ఇదివరకెన్నడును చూడనట్టి నీ రూపము నాకిపుడు చాల సంతోషము నిచ్చినది. కాని మనస్సంతయు భయముతో వ్యాకులమగుచున్నది. ఓ జగన్నివాస! నాయందు దయయుంచి నీ పూర్వరూపమే మరల చూపుము.

46. కిరీటినం గదినం చక్రహస్త
మిచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ।
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో భవ విశ్వమూర్తే!॥

వేయిబాహువులున్న ఓ విశ్వమూర్తి!
శిరమున కిరీటమును నాల్గుచేతులందు
శంఖ చక్ర గదాయుధ సరసిజములు
కల్గు నీపూర్వరూపమ్ము గాంచనెంతు.

తా॥ సహస్రబాహుండవైన ఓ విశ్వమూర్తీ! కృష్ణా! శిరమున కిరీటము, నాల్గు చేతులు శంఖ, చక్ర, గదా, పద్మములు గల నీ పూర్వరూపమునే చూడఁగోరు చున్నాను.

శ్రీ భ గ వా ను వా చ :— శ్రీభగవానుఁడు చెప్పెను.

47. మయా ప్రసన్నేన తవార్జునేదం
రూపం పరం దర్శిత మాత్మ యోగాత్ ।
తేజోమయం విశ్వమనన్త మాద్యం
యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్ ॥

పార్థ! నీకిప్పు నాయోగబలము వలన
కడుప్రసన్నత దర్శనమిడిన నాదు
రూపు తేజోమయమ్ము సర్వోత్తమమ్ము,
విశ్వ, మాద్య, మనంతమై వెలయు! దీని
నితరు లెవ రింతవరకు వీక్షింపలేదు.

తా॥ అర్జునా! నీకు దయతో నా యోగబలముచే ఇపుడు చూపించిన విశ్వరూపము, తేజోమయము సర్వశ్రేష్ఠము, సనాతనము, అనంతము అయినది. నీవు తప్ప నితరులెవ్వరును దీని నింతవఱకు చూడలేదు.

48. న వేద యజ్ఞాధ్యయనైర్న దానై
ర్న చ క్రియాభిర్న తపోభిరుగ్రైః ।
ఏవం రూపశ్శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర ॥

ఇట్టి నారూపమును విలోకింప పార్థ!
మనుజలోకాన నీకు నొక్కనికి తక్క
అన్యులెవ్వరికేని శక్యమ్ముగాదు.
దాన తపములుచేసి వేదములు చదివి
యజ్ఞకర్మము లొనరించినప్పటికిని.

తా॥ అర్జునా! ఇప్పుడు నీవు చూచిన విశ్వరూపమును, నీకు తక్క మానవులలో నెవరికి గూడ, దానములు, ఉగ్రతపములు, వేదపఠనము, యజ్ఞకర్మములు చేసి నప్పటికిని, చూడశక్యము గాదు.

49. మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోరమీదృఙ్మమేదమ్।
వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం
తదేవ మే రూపమిదం ప్రపశ్య॥

పార్థ! యింక నా విశ్వరూపమును గాంచి
భయము దిగ్భ్రమయును పొందవలదు నీవు;
భీతివిడనాడి కనుము సంప్రీతితోడ
ఇదియె పూర్వరూపము ధరియించుచుంటి.

తా॥ అర్జునా, ఈ విశ్వరూపమును గూర్చి నీకింకభయము, దిగ్భ్రాంతియు వలదు, నా పూర్వరూపమును మరల ధరించుచున్నాను. నిర్భయముగ, సంప్రీతితో చూడుము.

స ం జ య ఉ వా చ :— సంజయుఁడు చెప్పెను.

50. ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః।
ఆశ్వాసయామాస చ భీత మేనం
భూత్వా పునస్సౌమ్యవపుర్మహాత్మా॥

అర్జునునితోడ శ్రీకృష్ణుఁడట్లు నుడివి
తనదు పూర్వరూపమ్మును దాల్చి చూపె;
అట్టి లామహాత్ముఁడు భయస్వాంతుఁడైన
పార్థు నోదార్చె, సౌమ్యరూపమున మరల.

తా॥ శ్రీకృష్ణుఁ డారీతిగ నర్జునునితో నుడివి సౌమ్యమగు తన పూర్వరూపమును దాల్చి అర్జునుని భయము పోఁగొట్టెను.

అ ర్జు న ఉ వా చ :— అర్జునుఁడు చెప్పెను.

51. దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన ।
ఇదానీమస్మి సంవృత్తః సచేతాః ప్రకృతిం గతః ॥

ఓ జనార్దన ! యిపుడు నీయొక్క సౌమ్య
మానవాకృతి గాంచి నామానసమ్ము
స్వస్థతను బొందె, యెప్పటివగిది మరల,

తా॥ ఓ జనార్దనా ! శాంతమైన నీ పూర్వరూపము నిపుడు చూచి నామానసము కుదుటబడి స్వస్థత చెందినది.

శ్రీ భ గ వా ను వా చ :— శ్రీభగవానుఁడు చెప్పెను.

52. సుదుర్దర్శ మిదం రూపం దృష్టవానసి యన్మమ ।
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శన కాంక్షిణః ॥

అర్జునా ! నీవు దర్శించినట్టి రూప
మిద్ది బహుదుర్లభమ్మైన దెల్ల దేవ
తలును వీక్షింపనెంత్రు నిత్యమును దీని.

తా॥ అర్జునా! నీవిపుడు చూచిన నా విశ్వరూపము చాల దుర్లభమైనది. దేవతలందఱును ఆ రూపమును చూచుటకై నిత్యమును కాంక్షించుచుందురు.

53. నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా।
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా॥

ఎట్టి రూపము నీవు వీక్షించినావొ
అట్టి రూపము చూడ శక్యమ్ముగాదు,
దానములొనర్చి సర్వవేదములు చదివి
బహుతపమ్ములు చేసినప్పటికి గూడ.

తా॥ అర్జునా! నీవెట్టి రూపమును వీక్షింపగలిగితివో ఆ రూపమును చూచుట దానములు, యజ్ఞములు, వేదాధ్యయనము చేసినప్పటికిని ఎవరికిని సాధ్యము గాదు.

54. భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరన్తప॥

ఈ విధమ్ముగ నన్ను వీక్షించుటకును
నాయధార్థతత్త్వ మెఱిఁగి నన్నుపొంద
గల్గుటకు గూడ నన్యచింతలకుపోని
పరమభక్తియె మార్గమో పార్థ! వినుము.

తా॥ ఓ అర్జునా! ఈ రీతిగా నా విశ్వరూపమును చూచుటకు, నా నిజతత్త్వ మెఱుఁగుటకును, నన్ను పొందుటకును మార్గమొక్కటియే ఉన్నది. అది అన్యచింతలకు పోవని ఏకాగ్రమైన భక్తి నాయందు కలిగి యుండుటయే.

55. మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగవర్జితః।
నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతిపాణ్డవ॥

పార్థ! మత్ప్రీతికరములౌ పను లొనర్చి,
భక్తుఁడై నన్నె తలఁచుచు పరమగతిగ,
సంగరహితుఁడై, ప్రాణిసంచయము నెడల
వైరమెఱుఁగని వాడె నన్బడయుచుండు.

తా॥ ఓ అర్జునా! నాకు ప్రీతికరములైన కార్యములనే చేయుచు, నన్నే పరమశరణ్యముగా తలంచుచు, దేనియందును ఆసక్తిలేక, ప్రాణికోటుల యందెట్టి వైరభావమును లేనివాడై, నాకు భక్తుఁడై యున్నవాఁడె నన్ను పొందుచున్నాఁడు.

ఇది ఉపనిషదర్థప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును,
శ్రీకృష్ణార్జున సంవాదమునగు శ్రీమద్భగవద్గీత యందలి
విశ్వరూప సందర్శనయోగమను
పదునొకండవ అధ్యాయము
* సమాప్తము *

# గీతామృతము

# శ్రీమద్భగవద్గీత

## భక్తియోగము

## పన్నెండవ అధ్యాయము - సారాంశము

ప్రధాన విషయము :—

పరమాత్మయందుండవలసిన భక్తిని గూర్చి చెప్పునది భక్తియోగము. భక్తిభావము, భక్తుని లక్షణము లిందు విపులముగ వర్ణింపఁబడినవి.

ఇందలి ముఖ్యాంశములు :—

సగుణ నిర్గుణోపాసనల యందలి తారతమ్యము — భక్తిసాధన — భక్తుని లక్షణములు.

## సారాంశము

వెనుకటి పదునొకండధ్యాయములలో శ్రీకృష్ణభగవానుఁడు చాల చోట్ల ఆత్మజ్ఞానమును గూర్చి బోధించుచు, తుదకు తన విశ్వరూపమును చూపి ముముక్షువునకు తనయందు అచంచల భక్తి ముఖ్యావసరమని నుడివెను.

అర్జునున కొక సందేహము కలిగినది "కృష్ణా! కొందఱు నీ రూప లక్షణములందు మనస్సును లగ్నముచేసి నిన్నుపాసింతురు. కొందఱు అవ్యయుఁడు అగోచరుఁడైన బ్రహ్మముగా నిన్ను ధ్యానింతురు. వీరిలో ఎవరు ఉత్తమయోగు" లని ప్రశ్నించెను.

శ్రీకృష్ణభగవానుఁడిట్లు చెప్పెను.

"నాయందు చిత్తము చేర్చి నన్నుపాసించువాడే ఉత్తముఁడు. నిర్గుణ బ్రహ్మము నందాత్మ నిలుచుట కష్టము. ఇంద్రియనిగ్రహులై, అన్నిటను

సమబుద్ధితోనుండి పరమాత్మను ధ్యానించు వారందరు నన్ను పొందుచున్నారు. ఏకాగ్రభక్తి కలిగి సర్వకర్మములను నాయందు సమర్పించువారిని జనన మరణ బంధములనుండి విముక్తుల జేయుచున్నాను. కావున అర్జునా! నీ మనోబుద్ధులను నాయందు లగ్నముచేసి నీవును అట్లు చేయుము.

మనస్సును స్థిరముగా నాయందు నిలుపలేకపోయిన యెడల క్రమముగా దాని నభ్యాసము చేయుము. అది కాకపోయిన భగవానునికి ప్రియకరములైన కార్యములను చేయుము. అదియు అసాధ్యమైనచో నన్ను గూర్చిన యోగమవలంబించుచు నీ నిత్యకర్మములను నాకు సమర్పింపుము. సరిగా తెలియని సాధనముకంటె జ్ఞానసంపాదన మేలు. జ్ఞానముకంటె భగవద్ధ్యానము, అంతకంటె కర్మఫలత్యాగమును చేయుట మేలు. దీని వలన చిత్తశాంతి లభించును.

భక్తునకు కావలసిన ముఖ్య లక్షణములను కూడ వినుము. ఏ ప్రాణి యందును ద్వేషము లేకపోవుట, కరుణ స్నేహభావమును కలిగియుండుట — ఇంద్రియ నిగ్రహము — ఓర్పు — చెడ్డతనము లేకపోవుట — నిర్భయము — శరీరమున మనస్సున శుచిత్వము — కార్యదక్షత — కోరికలు లేకపోవుట — శత్రు మిత్రులు సుఖదుఃఖములు ఇట్టివానియందు సమదృష్టి — తటస్థముగా నుండుట — మనసున వ్యాకులతలేక సంతోషముగా నుండుట — కల్గినదానితో తృప్తి — తానే చేయుచున్నానను కర్తృత్వభావము లేకపోవుట — నేను నాది అను అహంకార మమకారములు లేకపోవుట — ఒక నివాసమనునది ప్రత్యేకముగా లేకపోవుట.

ఈ సద్గుణములు కలిగి దృఢనిశ్చయుడై మనోబుద్ధులను నా కర్పించి, నేనే గతియను సంపూర్ణ విశ్వాసముతో మోక్షసాధకములగు ఈ ధర్మములనెల్ల యథావిధిగ నాచరించువారు నాకు పరమభక్తులు. నాకు అత్యంత ప్రియులు.''

ఈ అధ్యాయమునందలి ముఖ్య శ్లోకములు

# శ్రీ మ ద్భ గ వ ద్గీ త

## పన్నెండవ అధ్యాయము

## భ క్తి యో గ ము

**అ ర్జు న ఉ వా చ :—** అర్జునుఁడు ప్రశ్నించెను.

1. **ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే।
యే చాప్యక్షరమవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః॥**

అచ్యుతా! ఇట్లు మనసు నీయందు నిలిపి
యెల్లపుడు భక్తితోడ పూజించువారు,
అక్షరాగోచారునిగ నిన్నరయు వారు,
వీర లిరువురిలో యోగవేత్త లెవరు?

తా॥ అచ్యుతా! నీవు చెప్పినట్లుగా నీయందు మనసు లగ్నముచేసి యెల్లపుడు నిన్నుపాసించు భక్తులును — ఇంద్రియములకు గోచరము గాని అవ్యయ పరబ్రహ్మముగా నిన్ను ధ్యానించువారు — ఇరుతెగలున్నారు. వీరిలో యోగమును పూర్తిగ తెలిసిన వారెవరు?

**శ్రీ భ గ వా ను వా చ :—** శ్రీ భగవానుఁడు చెప్పెను.

2. **మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే।
శ్రద్ధయా పరయోపేతాస్తే మే యుక్తతమా మతాః॥**

నాపయిని మానసమ్ము లగ్నమ్ము జేసి
నిత్య మేకాగ్రమౌ భక్తినిష్ఠ గలిగి
శ్రద్ధతో నన్నుపాసించు జనులె, యోగు
లందు శ్రేష్ఠులనుచును నాయభిమతమ్ము.

తా॥ నిత్యము నాయందే చిత్తమును చేర్చి, ఏకాగ్రమైన భక్తిభావముతో శ్రద్ధగా నన్నుపాసించువారే ఉత్తము యోగులని నా యభిమతము.

3. యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే ।
సర్వత్ర గమచిన్త్యం చ కూటస్థ మచలం ధ్రువమ్ ॥

4. సం నియమ్యేన్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః ।
తే ప్రాప్నువన్తి మామేవ సర్వభూతహితే రతాః ॥

ఇంద్రియముల నెల్లను నిగ్రహించి యుంచి,
సర్వభూతహితులు, సర్వసములు నగుచు,
వర్ణనాతీతరూపుఁ డవ్యయుఁ డతండు,
భావమున కతీతుఁడు జగద్వ్యాపకుండు,
కన్నులకగోచరుండు నిర్వికారమూర్తి,
అచలుఁడును స్థిరమైనవాడనుచు నెఱిఁగి,
హృదయమందు, బ్రహ్మమును ధ్యానించుచున్న
వారనెల్లరు పొందుచున్నారు నన్ను.

తా॥ ఇంద్రియముల నన్నిటిని నిగ్రహించి, సర్వభూతముల శ్రేయమును కోరువారై, సర్వమున సమబుద్ధి గలిగి ఆ పరబ్రహ్మము వర్ణనాతీతుఁడు, నాశరహితుఁడు, ఊహింపనలవికానివాఁడు, జగమంతయు నిండియున్నవాఁడు, అగోచరుఁడు మనో వికారములు లేనివాఁడు, చలనము లేనివాఁడు, సుస్థిరుఁడు అని యెఱిఁగి ధ్యానించు వారందఱును నన్ను పొందుచున్నారు.

5. క్లేశోఽధికతరస్తేషాం అవ్యక్తాసక్తచేతసామ్ ।
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే ॥

నిర్గుణబ్రహ్మమం దాత్మ నిలుపగల్గు
టత్యధిక కష్టతరము; దేహాభిమాన
వాంఛ విడువని వారి కవ్యక్తబ్రహ్మ
మందు నిష్ఠయె కష్టసాధ్యమ్ము గాన.

తా॥ నిర్గుణ నిరాకారపరబ్రహ్మమునందు ఆత్మను లగ్నము చేయుట, సగుణో పాసనకంటె కష్టతరమైనది. ఏలయన దేహాభిమానమున్నంత వరకు మనుజులకు అవ్యక్తబ్రహ్మమునందు నిష్ఠకుదురుట శ్రమతో గూడిన పని.

6. యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః।
అనన్యే నైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే॥

7. తేషామహం సముద్ధర్తా మృత్యుసంసార సాగరాత్।
భవామి న చిరాత్పార్థ! మయ్యావేశిత చేతసామ్॥

తలపులందున నితరచింతలను వీడి
నాపయిని భక్తిపరులయి, నాకె సర్వ
కర్మములు సమర్పించి ఏకాగ్రమైన
ధ్యానమున నన్నుపాసించు నట్టి యోగి
వరుల నుద్ధరించుచునుందు పార్థ! త్వరగ
మరణరూప సంసార సాగరము నుండి.

తా॥ అర్జునా! మనస్సునందితర చింతలను రానీయక నాయందే భక్తితత్పరులయి, సర్వకర్మములు పరమేశ్వరార్పణముగా చేయుచు, ఏకాగ్రమైన నిష్ఠతో నన్ను ధ్యానించువారిని శీఘ్రముగ మరణముతో గూడిన ఈ సంసారసాగరమునుండి ఉద్ధరించుచున్నాను.

8. మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ।
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః॥

కాన, అర్జున! బుద్ధియు మానసమును
నాపయినె నీవు లగ్న మొనర్పుమింక;
అటుపయి వసింపగలవు నాయందె నీవు
లేదు సందేహ మిందున లేశమైన.

తా॥ కావున, ఓ అర్జునా, నీ మనస్సును బుద్ధిని నాయందే లగ్నము చేయుము. అటుపైని నాయందే నీవు వసింపగలవు. ఈ విషయములో సందేహమేమియు లేదు.

9. అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయిస్థిరమ్।
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ ! ॥

అర్జునా ! ఇట్లు మనసు నాయందు నిలుప
గల్గుటది నీకు శక్యంబు కాదయేని,
యత్నమొనరింపు మింక నభ్యాసయోగ
బలము వలననె ననుపొందగలుగుటకును.

తా॥ అర్జునా! ఒకవేళ నాయందు స్థిరముగ మనసు నిల్పుట నీకు శక్యము కానియెడల, అభ్యాసముచే క్రమముగ దానిని సాధించుటకు ప్రయత్నింపుము.

10. అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ।
మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధిమవాప్స్యసి.

అటుల నభ్యాస మీవు చేయుటకు గూడ
శక్తిలేదేని, చేయు మాసక్తితోడ
మత్ప్రియకరము లైన కర్మములనైన
పొందగల వా కతమ్మున మోక్షసిద్ధి.

తా॥ అ విధముగా నభ్యాసము చేయుటకు గూడ నీవసమర్థుఁడవైనచో నాకు ప్రియకరములైన సత్కర్మముల శ్రద్ధతో నాచరింపుము. దీనివలనఁ గూడ నీకు మోక్షసిద్ధి లభింపగలదు.

11. అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః।
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్.

అట్లు కాదేని, నా యోగమాశ్రయుంపు,
మదియుగూడను నీకసాధ్యమ్మె యేని
నియతచిత్తుఁడ వగుచును నీదు నిత్య
కృత్యఫలములు సర్వమర్పింపు నాకు.

తా॥ అదియు కానియెడల, నన్ను గూర్చిన యోగమవలంబింపుము. అదియు నసాధ్యమైనచో, నిగ్రహము కల్గిన మనస్సుతో నీవు చేయు సర్వ కర్మఫలములు ఈశ్వరార్పణముగా భావించుచు కర్మములు చేయుము.

12\. శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే।
ధ్యానా త్కర్మఫలత్యాగ స్త్యాగాచ్ఛాన్తిరనన్తరమ్ ॥

సాధనలకంటె శ్రేష్ఠము జ్ఞానమార్గ,
మంతకంటెను ధ్యానమ్ము, ధ్యాననియతి
కంటె కర్మఫలములత్యాగమ్మె మేలు,
దానివలన లభించు చిత్తమున శాంతి.

తా॥ భగవత్తత్త్వ మెఱుఁగని యభ్యాసముకంటె జ్ఞానము శ్రేష్ఠమైనది. దానికంటె ధ్యాననిష్ఠ, ఆ ధ్యాననిష్ఠకన్న కర్మఫల పరిత్యాగము మేలు. దానివలన మనశ్శాంతియు లభించును.

13\. అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ।
నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ ॥

14\. సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః।
మయ్యర్పిత మనోబుద్ధి ర్యో మద్భక్త స్స మే ప్రియః ॥

సకల భూతమ్ములందు ద్వేషమ్ములేక
కరుణయును మిత్రభావము పరఁగియుండి,
మదీని 'నాది' 'నేను' అనెడు మమత వదలి,
కష్టసుఖముల సమబుద్ధి కలిగియుండి,
నిత్యసంతోషియయి, మనోనిగ్రహుఁడయి,
క్షమయు నిశ్చయజ్ఞానము అమరుచుండ,
మనసు బుద్ధియు నాకు సమర్పణమ్మొ
నర్చు యోగి నాభక్తుండు, నాకు ప్రియుఁడు.

తా॥ ప్రాణికోటులందెట్టి ద్వేషములేక, జాలియు, స్నేహభావమును కలిగి, మనసులో 'నాది' అను మమకారము గాని, 'నేను' అను అహంకారము గాని లేక కష్టసుఖముల సమముగా జూచుచు, నిత్యసంతోషియై, మనోనిగ్రహుఁడై ఓర్పు నిశ్చయ జ్ఞానములను కల్గి మనోబుద్ధులను నా కర్పించు యోగియే నాకు భక్తుఁడు, నాకత్యంత ప్రియమైనవాఁడును.

15. యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః ।
హర్షామర్ష భయోద్వేగై ర్ముక్తోయస్స చ మే ప్రియః ॥

భయము జగతికి నెవ్వనివలన లేదొ,
ఎవఁడు లోకమ్మునకును భీతిల్లబోడొ,
ప్రమధకోపభయోద్వేగ వశత నెవఁడు
విహ్వలుఁడు కాడొ, అతఁడె ప్రియుఁడు నాకు.

తా॥ ఎవని వలన లోకమున కెట్టి భయమునులేదో, ఎవఁడు లోకమున నిర్భయుఁడుగా నుండునో, ఎవడు సంతోషము, కోపము, ఆవేశమునకు వశము గాక వానివలన గలుగు మనోవ్యాకులత్వము పొందడో, అతఁడే నాకు ప్రియుఁడు.

16. అనపేక్షశ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః ।
సర్వారమ్భ పరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః ॥

కోరికలను వదలి, శౌచగుణము, కార్య
దక్షత తటస్థభావము తనరుచుండి,
కర్త నను చింతలేక, దుఃఖములు లేని
వాఁడె, నాకు ప్రియుఁడును నా భక్తవరుఁడు.

తా॥ కోరికలను విడచి, మనోదేహములను నిర్మలినముగను శుచిగా నుంచి, జీవితలక్ష్యములను నేర్పుతో సాధించుచు, తన సర్వ కర్మములకు తాను కర్తనన్న భావమును వీడి, నిశ్చింతగా నుండువాఁడు నాకు భక్తుఁడును, ప్రియుఁడును.

17. యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి।
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః॥

ప్రమదకోపముల కెవండు వశుఁడుకాడొ,
దుఃఖమును వాంఛ నెవఁడు పోద్రోలఁగలఁడొ,
ఎవఁడు మేలుకీడులను త్యజింపఁగలఁడొ
అట్టి భక్తుఁడె నాకిష్టుఁడైనవాడు.

తా॥ ఎవనికి దేనియందును సంతోషము గాని, ద్వేషము గాని లేదో, ఎవఁడు దుఃఖమును పొందడో, ఎవఁడు వాంఛలను వదలుకొని శుభాశుభములను గూడ విడనాడగలఁడో అట్టి భక్తుడే నాకు ప్రియమైనవాడు.

18. సమశ్శత్రౌచ మిత్రే చ తథా మానావమానయోః।
శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగవివర్జితః॥

19. తుల్యనిన్దా స్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్।
అనికేతః స్థిరమతిర్భక్తి మాన్మే ప్రియోనరః॥

శత్రు మిత్రులయందు, కష్టసుఖములను,
యశము నం దయశమున, శీతాతపముల,
నొక్కగతి సమబుద్ధితో నున్నవాడు,
విషయసుఖముల నాసక్తి విడచువాడు,
సముఁడగుచు నిందలందు స్తోత్రములయందు,
మౌనియయి, తృప్తిపడి కల్గుదానితోడ,
స్థిరగృహములేక సుస్థిర చిత్తుఁడగుచు,
భక్తిగల మానవుఁడె నాకు పరమప్రియుడు.

తా॥ శత్రు మిత్రులు, కష్ట సుఖములు, కీర్త్యపకీర్తులు, శీతోష్ణములు, నిందాస్తోత్రములు ఇట్టి యన్నిటియందును సమబుద్ధి కలిగి, లభించిన దానితోనే తృప్తిపడి, ఇంద్రియ సుఖములందాసక్తి లేక, నిర్దిష్టమగు నివాసమునువదిలేక, స్థిరమనస్సుతో నాయందు భక్తిగల మానవుఁడె నాకు పరమప్రియుఁడు.

20. యే తు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే।
శ్రద్ధధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః॥

పరమగతిగ నాయందె విశ్వాసముంచి,
మోక్షసాధక మీ ధర్మమును దలంచి,
శ్రద్ధతో యథావిధిగ నాచరణ చేయు
భక్తజను లెల్లరును నాకు పరమప్రియులు.

తా॥ అర్జునా! నేను చెప్పినదంతయు అమృతరూపమును మోక్షసాధకమైన ధర్మమార్గము. నన్నే విశ్వాసముతో పరమలక్ష్యముగ నెంచి, శ్రద్ధతో యథావిధిగ దీని నాచరించు భక్తజనులందఱును నాకు మిక్కిలి ప్రియులు.

ఇది ఉపనిషదర్థప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును,
శ్రీకృష్ణార్జున సంవాదమునగు శ్రీమద్భగవద్గీత
యందలి భక్తియోగమను
పన్నెండవ అధ్యాయము
* సమాప్తము *

# గీతామృతము

## శ్రీమద్భగవద్గీత

## క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము

## పదుమూడవ అధ్యాయము - సారాంశము

ప్రధాన విషయము :—

క్షేత్రమనగా శరీరము. అందున్న జీవుఁడే క్షేత్రజ్ఞుఁడు. క్షేత్రము నాశవంతమైనది; అనిత్యము. క్షేత్రజ్ఞుఁడు అవినాశి, పరమాత్మస్వరూపము. ఈ రెంటి యొక్క లక్షణముల గూర్చి, విభజనమును గూర్చి పరమాత్మ నెఱుఁగు జ్ఞానమును గూర్చియు నీ యధ్యాయమున తెలుపఁబడినది.

ఇందలి ముఖ్యాంశములు :—

క్షేత్రక్షేత్రజ్ఞుల స్వభావనిర్వచనము — జ్ఞానము, జ్ఞేయము, ప్రకృతి, పురుషుల లక్షములు — పరమాత్మ దర్శనము.

## సారాంశము

క్రిందటి అధ్యాయమున సగుణోపాసన, భక్తిని గూర్చి వినిన అర్జునుఁడు పరమాత్మ నెఱుఁగు జ్ఞానమను తెలిసికొనగోరి, క్షేత్రము క్షేత్రజ్ఞుఁడు, జ్ఞానము జ్ఞేయము, ప్రకృతి పురుషుఁడు వీనిని గురించి చెప్పుమని వేడగా శ్రీకృష్ణుఁడిట్లు చెప్పెను.

శరీరమే క్షేత్రము. క్షేత్రజ్ఞానము కలవాడు క్షేత్రజ్ఞుఁడు. నేనే క్షేత్రజ్ఞుడనగు పరమాత్మను. వీనిని గూర్చి తెలియజేయునదియే జ్ఞానము, పంచభూతములు, ప్రకృతిమాయ, మనస్సు, బుద్ధి, సుఖదుఃఖాదిభావములు.

రాగద్వేషములు, అహంకారము కలిగియున్నదే క్షేత్రము. క్షేత్రక్షేత్రజ్ఞుల గూర్చిన విషయము బ్రహ్మసూత్రములందును, వేదములందును కలదు. అనేక ఋషులు గూడ వీనిని గూర్చి చెప్పిరి.

అహింస, సౌమ్యవర్తన, ఆత్మనిగ్రహము, భూతదయ, శుచిత్వము, గురుసేవ, వైరాగ్యము, నిస్సంగత్వము, రాగద్వేషరాహిత్యము, భగవద్భక్తి మున్నగు సద్గుణములు జ్ఞానసాధనములు. వానికి విరుద్ధమైన గుణములే అజ్ఞానము.

అత్యుత్తమమైనది, తెలిసికొనదగినది అయిన వస్తువే పరమాత్మ. జ్ఞేయము. ఆ పరమాత్మ ఆద్యంతములులేనిది, సర్వవ్యాపి, సర్వరక్షకుఁడు, సర్వభూతములందును వేఱ్వేఱుగనున్నట్లు కనుపట్టినను అవిభక్తమైనది, సదసత్తులకు అతీతమైనది. సకల శరీరములను ప్రపంచమునంతయు చైతన్య తేజోవంతముగ చేయునది గూడ అదియే.

భగవంతుని శక్తికే ప్రకృతి (మాయ) అని పేరు. ప్రకృతి సర్వసమర్థమైనది. పురుషుఁడు (జీవుఁడు) ప్రకృతి నెఱిఁగిన పరమాత్మ. ఇవి రెండును ఆదిలేనివి. సత్త్వము, రజము, తమము అను త్రిగుణ భావములు ప్రకృతి వలననే కలుగుచున్నవి. అందుగల ఆసక్తియే సంస్కార ఫలములై జీవునకు ఉత్తమ, నీచజన్మములు కలుగఁజేయును. ఈ పురుషుఁడే సకల జగత్సాక్షి. జగత్ప్రభువు అయిన పరమాత్మరూపము. దేహముందున్నప్పటికి నిర్వికారి, నిర్గుణుఁడు అగుటచే, దేనికిని తాను కర్తగాదు. కర్మఫలములు హాని నంటవు.

ఇట్టి పరమాత్మ దర్శనమును కొందఱు ధ్యాననిష్ఠవలనను, కొందఱు నిష్కామ కర్మయోగముచేతను, కొందఱు జ్ఞానయోగముచేతను పొందుచున్నారు. ఈ యోగానుష్ఠానమెఱుగనివారు పండితులైన వారివలన విని పరమాత్మనుపాసించి ముక్తులగుచున్నారు.

జగత్తున గల స్థావర జంగమ పదార్థములన్నియు ప్రకృతి పురుష సంయోగము వలన పుట్టుచున్నవి. సర్వ భూతములందును సమముగా నుండి, భూతములన్నియు నశించినను నాశరహితుఁడుగానున్న ఈశ్వరు నెఱుఁగుటయే ఆత్మదర్శనము.

ప్రకృతియే అన్ని కార్యములకు కర్త. దేహములందున్నను పరమాత్మ కర్త కాడు. ఆతనిని కర్మఫలములంటవు. ఈ భూతకోటు లన్నియు పరమాత్మ యందుండి, పరమాత్మ వలననే విస్తరించు చున్నవి.

అర్జునా! ఈ పై జెప్పిన విధముగా జ్ఞానదృష్టితో క్షేత్ర క్షేత్రజ్ఞుల గూర్చియు, ప్రకృతి పురుషులను గూర్చియు, జ్ఞానము జ్ఞేయములను గూర్చియు తెలిసికొనినవారు నాకు భక్తులై మోక్షార్హులై నన్నే పొందుచున్నారు.

ఈ అధ్యాయమందలి ముఖ్య శ్లోకములు

2, 7-12, 20, 25, 26, 27, 29, 32, 35

# శ్రీ మ ద్భ గ వ ద్గీ త

# క్షే త్ర క్షే త్ర జ్ఞ వి భా గ యో గ ము

## పదుమూడవ అధ్యాయము

అ ర్జు న ఉ వా చ :— అర్జునుఁడు అడిగెను.

1. ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞమేవ చ।
ఏత ద్వేదితు మిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ॥

ప్రకృతి యననేమి? పురుషుఁ డెవండు? జ్ఞాన
మనఁగ నెయ్యది? మఱి జ్ఞేయమనఁగ నెద్ది?
ఏది క్షేత్రము, క్షేత్రజ్ఞుఁ డెవరు? చెపుమ
యెఱుఁగఁగోరెద వీనిని కృష్ణ! నేను.

తా॥ కృష్ణా! ప్రకృతి పురుషులు, జ్ఞానము జ్ఞేయము, క్షేత్రము క్షేత్రజ్ఞుఁడు వీనిని గూర్చి తెలిసికొనగోరుచున్నాను.

శ్రీ భ గ వా ను వా చ :— శ్రీభగవానుఁడు చెప్పెను.

2. ఇదం శరీరం కౌంతేయ! క్షేత్రమిత్యభిధీయతే।
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥

ఈ శరీరమ్మె క్షేత్రమై యెసఁగు ననుచు,
దాని నెఱిఁగిన వాఁడె క్షేత్రజ్ఞుఁ డనుచు,
పల్కుదురు వాని నెఱిఁగిన వారు పార్థ!

తా॥ అర్జునా! ఈ శరీరమే క్షేత్రమనఁబడు చున్నది. ఈ క్షేత్రము నెఱింగిన వాఁడె క్షేత్రజ్ఞుఁడు. ఈవిధముగా వీనిని గూర్చి, తెలిసిన పండితులు చెప్పుచున్నారు.

3. క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత ।
క్షేత్రక్షేత్రజ్ఞయోర్జ్ఞానం యత్తద్ జ్ఞానం మతం మమ ॥

అర్జునా! అన్ని దేహమ్ము లందు జీవుఁ
డయి వసించెడు క్షేత్రజ్ఞుఁ డరయ నేనె,
ఇట్టి క్షేత్రమ్ము క్షేత్రజ్ఞు నెఱుఁగఁజేయు
జ్ఞానమే, నిక్కువమ్మైన జ్ఞానమగును.

తా॥ అర్జునా, అన్ని దేహములందు గూడ జీవాత్మగా పరగుచున్న క్షేత్రజ్ఞుఁడే నేను. ఈ క్షేత్రము క్షేత్రజ్ఞులను గూర్చి తెలియజేయు జ్ఞానమే సరియైన జ్ఞానమని నా అభిప్రాయము.

4. తత్క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్ ।
స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు ॥

ఎయ్యదాక్షేత్ర మాక్షేత్ర మెట్టులుండు?
తద్వికారము లెవ్వి? ఉత్పత్తి యెటులు?
ఎవఁడు క్షేత్రజ్ఞుఁ డాతని దెట్టి మహిమ?
అర్జునా! చెప్పెదను సంగ్రహముగ వినుము.

తా॥ అర్జునా! ఆ క్షేత్రమేదియో, అది యెట్లుండునో, దాని చేష్టలెట్టివో, దేనినుండి అది ఉత్పన్నమైనదో, క్షేత్రజ్ఞుఁడనగ నెవరో ఆతని మహిమ యెట్టిదో ఈ విషయములు సంగ్రహముగ చెప్పెదను వినుము.

5. ఋషిభిర్బహుధా గీతం ఛన్దోభిర్వివిధైః పృథక్ ।
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః ॥

బహుళరీతులుగా ఋషివరులచేత,
వివిధవేదమ్ములందు వేర్వేఱ, నిశ్చ
యమ్ముగా బ్రహ్మసూత్ర వాక్యములయందు
హేతుయుతముగ, నివ్వికీర్తింపఁబడియె.

తా॥ ఋషులచే ననేకరీతులుగను, వేదములందు వేర్వేఱుగను, నిశ్చయముగా హేతుబద్ధ విధమున బ్రహ్మ సూత్రములందును ఇవి వర్ణింపఁబడి యున్నవి.

6. మహాభూతాన్యహంకారో బుద్ధిరవ్యక్తమేవ చ ।
ఇంద్రియాణి దశైకం చ పంచచేంద్రియగోచరాః ॥

7. ఇచ్ఛాద్వేష స్సుఖందుఃఖం సంఘాతశ్చేతనా ధృతిః ।
ఏతత్క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్ ॥

అయిదుభూతము, లవ్యక్తమైన ప్రకృతి,
బుద్ధి, జ్ఞాన కర్మేంద్రియములు పదియును,
ఇంద్రియ విషయము లయిదు, ఏకమనసు,

ఇచ్ఛ, ద్వేషము, దుఃఖము, ధృతియు, తెలివి,
సుఖ, మహంకార, మివి ఒక్కచోటఁ గూడి
ఇంద్రియవికార సహితమౌ ఈ శరీర
మే వినుము క్షేత్రమనుచు వచింపఁబడియె.

తా॥ పంచమహాభూతములు (భూమి, నీరు మొ॥), మూలప్రకృతి (త్రిగుణాత్మకమైన మాయ), బుద్ధి, ఇంద్రియములు పది. ఇంద్రియ విషయములు అయిదు (శబ్దము, స్పర్శ మొ॥), మనస్సు, ఇష్టము అయిష్టము, సుఖము దుఃఖము, ధైర్యము, తెలివి అహంకారము ఇవి అన్నియు ఒకచో కలిసియుండి వీని సంబంధమైన వికారములు కలిగియున్నదే క్షేత్రము.

8. అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాన్తి రార్జవమ్ ।
ఆచార్యోపాసనమ్ శౌచం స్థైర్య మాత్మ వినిగ్రహః ॥

ఎంతమాత్రము హింసాప్రవృత్తి లేక,
దురభిమాన దంభములకు దూరుఁడగుచు,
సహనబుద్ధియు, శౌచ మాచార్యసేవ
ఆత్మనియతి, స్థైర్యమ్ము సౌమ్యమును గలిగి-

9. ఇన్ద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవ చ।
జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోషాను దర్శనమ్ ॥

విషయసుఖముల వైరాగ్యవృత్తిఁ బూని,
చిత్తమం దహంకారము చేరనీక,
జనన మరణ జరార్తి దోషము లెఱింగి—

10. అసక్తి రనభిష్వంగః పుత్రదారగృహాదిషు।
నిత్యం చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు ॥

జగతి నేవస్తువందు నాసక్తిలేక,
ఆలుబిడ్డలందును స్వగృహాదులైన
సర్వవిషయమ్ములందు నిస్సంగుఁ డగుచు
ప్రియమునందును మఱియు నప్రియము నందు
ఎడదలో నెల్లపుడు సమదృష్టి కలిగి—

11. మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ।
వివిక్తదేశ సేవిత్వమరతిర్జనసంసది ॥

జనులు గుమిగూడి యున్న గుంపును త్యజించి,
పరులు లేనట్టి యేకాంతవాస మమర,
అన్యచింతలు లేని ఏకాగ్రనియతి
అచలమగు స్థిరభక్తి నాయందు కలిగి—

12. అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనమ్।
ఏతత్ జ్ఞానమితి ప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా ॥

స్వాంత మెప్పు డాత్మధ్యాన మందె నిలిపి,
తత్త్వసంబంధ మైన యథార్థ విషయ
మెఱిఁగి యుంట జ్ఞానమని వచింపఁబడియె;
దీనికి విరుద్ధ మైన దజ్ఞాన మగును.

8, 9, 10, 11, 12 తాత్పర్యములు.

ఆత్మస్తోత్రము లేకుండుట, డంబము లేకుండుట, మనోవాక్కాయములచే ఇతరులకు బాధ కలిగింపకుండుట, ఓర్పు. సత్స్వభావము, గురువులు పెద్దలయందు సేవ, శుచిత్వము, మంచియందు స్థిరత్వము, మనోనిగ్రహము, అహంకారము లేకపోవుట ఇంద్రియ విషయములందు విరక్తి, జనన మరణములు, ముసలితనము, రోగము, దుఃఖము లందుగల దోషముల పరామర్శించుకొనుట, దేనియందు ఆసక్తి లేకపోవుట, ఆలుబిడ్డలు స్వగృహము మున్నగు వానియందు సంబంధము పెట్టుకొనకుండుట, ప్రియాప్రియము లందు సమబుద్ధి, అన్యచింతలులేని ఏకాగ్రమైన భక్తి నాయందుండుట, జన సమూహములేని ఏకాంతప్రదేశమందు నిత్యమును ఆత్మజ్ఞానచింత కలిగి తత్త్వజ్ఞానము యొక్క యథార్థవిషయము నెఱుఁగగోరు సాధన—ఇదియంతయు జ్ఞానమని చెప్పఁ బడును. దీనికి వ్యతిరేకమైనది అజ్ఞానము.

13. జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యత్ జ్ఞాత్వాఽమృత మశ్నుతే।
అనాదిమత్పరం బ్రహ్మ నసత్తన్నాసదుచ్యతే ॥

ఎఱుఁగదగినది, యెద్దాని నెఱిఁగియున్న
ముక్తి నంద వీలగునొ, చెప్పుదును దాని;
ఆదిలేని పరబ్రహ్మ మదియె, పార్థ!
'సత్తు' కాదది మఱియు 'నసత్తు' కాదు

తా॥ ఏది తెలియదగినదో, దేనిని తెలిసికొనిన యెడల అమృతరూపమైన ముక్తిని పొంద సాధ్యమగునో దానిని గూర్చి అర్జునా నీకు చెప్పెదను. అదియే ఆదిలేని పరబ్రహ్మము. అది ఉన్నదని గాని లేదని గాని చెప్పఁబడదు. అనగా అది అగోచరము, అదృశ్యము అనియే భావము,

14. సర్వతః పాణిపాదం తత్ సర్వతోఽక్షి శిరోముఖం।
సర్వత శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥

అంతటను నయనమ్ము, లాస్యములు, చెవులు,
కాలు సేతులు శిరములు కలదియైన
ఆ పరబ్రహ్మమే సర్వమావరించి
నిఖిల విశ్వము నందును నిండియుండె.

తా॥ ఆ పరబ్రహ్మము అంతటను చేతులు, కాళ్ళు, కనులు, శిరములు, ముఖములు, చెవులు కలదియై నిఖిల జగతిని ఆవరించి నిండి యున్నది.

అనగా, భగవానుఁడు సర్వవ్యాపి. సర్వ కార్యకలాపములను గమనించుచునే ఉండును.

15. సర్వేంద్రియ గుణాభాసం సర్వేన్ద్రియ వివర్జితమ్।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ ॥

ఇంద్రియరహితమయ్యు సర్వేంద్రియముల
వృత్తు లన్నింటి నది ప్రకాశింపఁజేయు;
జగము భరియించునది యనాసక్త మయ్యు,
గుణరహిత మయ్యు, గుణముల ననుభవించు.

తా॥ ఆ పరబ్రహ్మము ఇంద్రియగుణములను ప్రకాశింపఁజేయునది అయ్యును, ఇంద్రియములులేక ఉన్నది. దేనియందును ఆసక్తిలేనిదయ్యును, నిఖిల విశ్వమును భరించుచున్నది. అది సత్త్వరజస్తమోగుణములు లేనిదయ్యును, ఆ గుణప్రవర్తనల పాలించుచున్నది.

16. బహిరంతశ్చ భూతానా మచరం చరమేవ చ।
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాన్తికే చ తత్ ॥

అఖిల భూతమ్ములను బహిరంతరముల
కలదు; అది చరాచరమయి క్రాలుచుండు;
ఎఱుఁగబడదది కడుసూక్ష్మతరము గాన,
పరఁగునది దూరమందు దగ్గఱను కూడ.

తా॥ ఆ పరబ్రహ్మము సర్వభూతములకు వెలుపల లోపల కూడ నున్నది. స్థావర జంగమములు నదియే. అయినను మిక్కిలి సూక్ష్మతరమై యుండుటచే గుర్తించుటకు సాధ్యముకాదు. జ్ఞానులకు సమీపముగను అజ్ఞానులకు దూరముగను ఉండును.

17. అవిభక్తం చ భూతేషు విభక్త మివ చ స్థితమ్।
భూతభర్తృ చ తత్ జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ ॥

18. జ్యోతిషామపి తజ్జ్యోతి స్తమసః పరముచ్యతే।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితం ॥

అట్టి పరమాత్మ అవిభక్తమైన దయ్యు,
వివిధ భూతమ్ములందు వేర్వేఱు రూప
ముల వలెనె కాననగు; సర్వభూతతతుల
సృష్టి చేసి భరించి గ్రసించు నదియె
చంద్ర సూర్యాదులకు వెల్గొసంగు నదియె,
అంధకారమ్మునకు నది యవలనుండు,
అదియె జ్ఞానమ్ము, జ్ఞేయమ్ము, అఖిల ప్రాణు
లందుఁ గల, దది జ్ఞానవేద్యమయి యలరు.

తా॥ ఆ పరమాత్మ విభజింపబడని ఏకరూపుడే అయ్యును సకల ప్రాణులందు వేర్వేఱుగ విభజింపబడినట్లుండును. ఆ పరమాత్మయే అందఱును ఎఱుఁగదగినదియు, సర్వభూతముల సృష్టి స్థితిలయములకు కారణభూతమైనదియు, ప్రకాశవంతములగు చంద్ర సూర్యాదులకు కూడ వెలుగు నిచ్చునదియు, అంధకారమునకు వెలుపలనుండు నదియు, జ్ఞానరూపమును, తెలియదగినదియు, సర్వహృదయములందుండునదియు, జ్ఞానముచేతనే తెలియదగినదియు, చేరదగినదియునై యున్నది.

19. ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః।
మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావా యోపపద్యతే ॥

క్షేత్రమనఁగ జ్ఞానమనంగ జ్ఞేయమనఁగ
నిటుల సంగ్రహరీతి వచింపఁబడియె;
విపులముగ నాదుభక్తులు వీని నెఱిఁగి
అర్హులగుదురు మద్భావ మందుటకును.

తా॥ ఈ ప్రకారముగ క్షేత్రము, జ్ఞానము, జ్ఞేయము అను విషయములు సంగ్రహముగ చెప్పఁబడినవి. వీనిని తెలిసికొనగలిగిన నా భక్తులు నన్ను పొందుట కర్హులగుచున్నారు.

20. ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి।
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్ ॥

ప్రకృతియు పురుషుఁ డీరెండు వస్తువులకు
ఆదియనునది లేదని అరయు మీవు;
కలుగుచుండును చిత్తవికారములు, త్రి
గుణములును గూడ ప్రకృతికారణము వలన.

తా॥ అర్జునా! ప్రకృతి పురుషులు రెండును ఆదిలేనివని యెఱుఁగుము. మనస్సునందు, బుద్ధియందు కలుగు వికారములును, సత్త్వరజస్తమోగుణ భావములును ప్రకృతి వలననే కలుగుచున్నవి.

21. కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే।
పురుషస్సుఖ దుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే ॥

ప్రకృతిమాయయె ఇంద్రియోపాధులైన
కార్యకారణముల కెల్ల కర్తయనియు,
వానియందున్న సుఖదుఃఖ భావఫలము
ననుభవించు వాఁడు పురుషుఁ డని వచింత్రు.

తా॥ కార్యమునకు కారణమునకు ప్రకృతిమాయయే హేతువనియు, వానివలన కలుగు సుఖ దుఃఖముల ననుభవించునది పురుషుఁ (జీవాత్మ) డనియు చెప్పఁబడినది.

22. పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్।
కారణం గుణసంగోస్య సదసద్యోని జన్మసు ॥

ప్రకృతి యందుండి తద్గుణఫలము లెల్ల
పురుషుఁ డనుభవించుచు నుండు, పురుషునకును
తద్గుణాసక్తి చేత ప్రాప్తమ్ములగుచు
నుండు, జన్మముత్తమ నీచయోను లందు.

తా॥ ప్రకృతి యందున్నవాడగుటచే పురుషుఁడందున్న సుఖదుఃఖాదుల ననుభవించుచున్నాడు. ఆ గుణములందున్న ఆసక్తియే కారణముగా పురుషునకు ఉత్తమ నీచజన్మములు కలుగుచున్నవి.

23. ఉపద్రష్టానుమన్తా చ భర్తా భోక్తా మహేశ్వరః।
పరమాత్మేతి చాప్యుక్తో దేహేస్మిన్ పురుషః పరః ॥

దేహమందుండియును, తా నతీతుఁ డగుచు,
పురుషుఁ డఖిలజగత్సాక్షి, భోక్త ప్రభువు,
పోషకుండును, మఱి అనుమోదకుఁడయి
పరగు, పరమాత్మ యనియె చెప్పఁబడుచుండు.

తా॥ ఈ దేహమందున్నప్పటికిని పురుషుఁడు ప్రకృతి కతీతుఁడై, అఖిలమునకు ప్రభువు, సాక్షి, భోక్త, పోషకుడు, అంగీకరించువాడు నగు ఆ పరమాత్మరూపమనియే చెప్పఁబడెను.

24. య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైః సహ।
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే ॥

త్రిగుణసహితమై యున్న ప్రకృతిని గూర్చి,
పురుషుని గురించి, యిట్లెవ్వఁ డెఱుఁగగలఁడో
ఆతఁ డీ లోకవృత్తుల నాచరించి
నప్పటికిని, పునర్జన్మ మందబోడు.

తా॥ ఎవ్వఁడీ విధముగ గుణసహితమైన ప్రకృతిని గూర్చియు, పురుషుఁడైన జీవాత్మను గూర్చియు యెఱిఁగి యుండునో అతఁడీ లోకప్రవర్తనము నందున్నప్పటికిని మరల పునర్జన్మమును పొందడు.

25. ధ్యానేనాత్మని పశ్యన్తి కేచిదాత్మానమాత్మనా ।
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥

నిర్మలమనస్సుతో ధ్యాననిష్ఠు లగుచు
అరయుదురు కొందఱాత్మను స్వాంతమందె;
కర్మయోగసాధనలచే గాని, జ్ఞాన
యోగమున గాని, చూతు రన్యులును దాని.

తా॥ అట్టి పరమాత్మను పలువురు పలు విధముల దర్శించుచున్నారు. నిర్మలమగు మనస్సున ధ్యాననిష్ఠను పెంపొందించుకొని కొందఱును, కర్మయోగముచే కొందఱును, జ్ఞానయోగమున కొందఱును, ఆ ఆత్మదర్శనము పొందుచున్నారు. ఇవి యన్నియు భగవత్ప్రాప్తికి సాధనములే.

26. అన్యే త్వేవ మజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే ।
తేఽపి చాతితర న్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః ॥

ఈ యనుష్ఠాన యోగము లెఱుఁగలేని
జనులు పరులచే విని ఉపాసన లొనర్తు్రి;
శ్రవణతత్పరు లైన ఆ జనులు గూడ
పొందుదురు. మృత్యువును దాటి ముక్తిపదము.

తా॥ ఈ ధ్యాన కర్మ జ్ఞానయోగముల నెఱుఁగనివారు కొందఱు తెలిసిన వారి నుండి విని పరమాత్మ నుపాసించుచున్నారు. జ్ఞానుల వలన విని యోగాచరణయందు శ్రద్ధాళువులుగల వారు కూడ మృత్యువును జయించి ముక్తి పొందుచున్నారు.

27. యావత్సంజాయతే కించిత్సత్త్వం స్థావరజంగమమ్ ।
క్షేత్రక్షేత్రజ్ఞ సంయోగా త్తద్విద్ధి భరతర్షభ ॥

అర్జునా ! చరాచరజగ మందు నెట్టి
అల్పమగు పదార్థము పుట్టి నప్పటికిని,
ప్రకృతి పురుష సంయోగకారణము చేత
కలుగుచుండు నయ్యది యంచు తెలిసికొనుము.

తా॥ అర్జునా, ఈ విశాల ప్రపంచమునందు చరాచరవస్తువులలో ఏ చిన్న పదార్థముద్భవించినప్పటికిని అది ప్రకృతి పురుషుల కూడికవలననే కల్గుచున్నదని తెలిసికొనుము.

28. సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్ ।
వినశ్య త్స్వవినశ్యంతం యః పశ్యతి స పస్యతి ॥

సముడుగా నుండి సర్వభూతముల యందు,
అఖిల భూతముల్ నశియించి నప్పటికిని
నాశమందని ఈశ్వరు నరయఁ గల్గు
వాఁడె, నిజమైన దృష్టితో పరఁగువాఁడు.

తా॥ ఈశ్వరుఁడు సర్వసముఁడై అఖిల భూతములందును ఉన్నప్పటికిని, ఆ భూతములన్నియు నశించినను తాను నశింపడు. అట్టి ఈశ్వరుని చూడఁగల్గినవాడే సరిగా చూచువాడు.

29. సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్ ।
న హినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాం గతిమ్ ॥

అవనిపై నన్ని ప్రాణుల యందు గూడ
సముఁడుగా నున్న యటుల నీశ్వరుని గాంచు
నతఁడు చంపుకొనడు తనయాత్మ తాను,
పొందఁగలఁ డాతఁ డావెన్క ముక్తిపదము.

తా॥ తనతోబాటు అన్ని ప్రాణులయందు ఈశ్వరుడు సమముగా నుండునన్న యదార్థమును తెలిసికొన్నినవాడు తన ఆత్మను తాను హింసించుకొనడు. అటుపయి ముక్తిని గూడ పొందుచున్నాడు.

30. ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః ।
యః పశ్యతి తథాఽఽత్మానమకర్తారం స పశ్యతి ॥

సర్వవిధముల కర్మసంచయ మిదెల్ల
ప్రకృతిచేతనె చేయంగఁబడుచు నుండె,
అట్లె తానెట్టి కర్త కాదని యెఱుంగు
వాడె సత్యమ్ము చూచినవాడు భువిని.

తా॥ జరుగుచున్న కార్యములన్నియు ప్రకృతిచేతనే చేయఁబడుచున్నవనియు, అట్లే తన ఆత్మ యేకార్యమునకు కూడ కర్త కాదనియు, తెలిసికొనినవాడే నిజమును గ్రహింపఁ గల్గినవాడు.

31. యదా భూతపృథగ్భావ మేకస్థ మనుపశ్యతి।
తత ఏవ చ విస్తారం బ్రహ్మసంపద్యతే తదా॥

వేఱువేరైన ఈ భూతవితతి యెల్ల
ఒక్క పరమాత్మ యందునే యుండి, దాని
నుండియే విస్తరించుచు నున్న దనుచు
నరయునపుడె బ్రహ్మపదము నందు నరుఁడు.

తా॥ వేఱువేఱుగనున్న ఈ భూతములన్నియు ఒక్క పరమాత్మయందే ఉండి, ఆ పరమాత్మనుండియే జగమున విస్తరించుచున్నవని తెలిసికొనిన యపుడే మనుజుఁడు బ్రహ్మపదమును పొందఁగలుగును.

32. అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మాయ మవ్యయః।
శరీరస్థోఽపి కౌంతేయ! న కరోతి న లిప్యతే॥

అర్జునా! పరమాత్మ ఆద్యంతములను
లేని అవినాశి నిర్గుణుండైన కతన,
తనువు నం దుండియును కర్త తాను కాడు;
వాని కంటబోవిక కర్మఫలము లెవియు.

తా॥ అర్జునా, పరమాత్మ ఆద్యంతములులేని అవ్యయుఁడు, నిర్గుణుఁడు, ఆకారణముచే నతఁడు దేహమునందున్నను దేనికిని కర్త కాకయు, ఏ కర్మఫలము చేతను అంటబడకయు నున్నాడు.

33. యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే।
సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మానోపలిప్యతే॥

అంతటను వ్యాప్తిగాంచిన ఆకసమ్ము
సూక్ష్మమైయుండి యెట్లు వస్తువులచేత
నంటబడదొ, అటులె పరమాత్మ కూడ
అన్ని తనువులందుండియు నంటఁబడడు.

తా॥ సర్వమున వ్యాపించియున్న ఆకాశము కడు సూక్ష్మముగానుండి ధూళి మొదలగు వస్తువులచే ఎట్లు అంటబడదో అట్లే పరమాత్మ సకల శరీరములందుండియు ఆ గుణకర్మదోషములచే నంటఁబడదు.

34. యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోక మిమం రవిః।
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత ! ॥

పార్థ ! సూర్యుఁ డొక్కఁడె ఈ ప్రపంచమెల్ల
వెలుఁగు నట్లుగఁ జేసెడి విధము గానె,
అన్ని దేహము లందున్న ఆత్మ యొకఁడె
క్షేత్రముల నన్నిటిని ప్రకాశింపఁజేయు.

తా॥ అర్జునా ! సూర్యుఁ డొక్కఁడే ఈ జగత్తునంతయు ప్రకాశింపఁజేయు విధముగనే, పరమాత్మ ఒక్కఁడే అన్ని దేహములందుండి వానిని ప్రకాశింపఁ జేయు చున్నాడు.

35. క్షేత్రక్షేత్రజ్ఞ యోరేవ మన్తరం జ్ఞానచక్షుషా।
భూతప్రకృతి మోక్షం చ యే విదుర్యాన్తితే పరమ్ ॥

ఇట్లు జ్ఞానదృష్టిని గల్గి, యెవరు క్షేత్ర
మునకు క్షేత్రజ్ఞునకు భేదమును గ్రహించి,
ప్రకృతినుండి ప్రాణులు ముక్తిపడయు విధము
నరయుదురొ, వారలే మోక్ష మందగలరు.

తా॥ ఈ విధముగా క్షేత్రము క్షేత్రజ్ఞులకు గల భేదమును తెలిసికొని, ప్రకృతి గుణముల (మాయ) నుండి ప్రాణులు ముక్తినిపొందు విధానమును, ఎవరు తెలిసికొన గల్గుదురో వారే పరమపదమును పొందజాలుదురు.

ఇది ఉపనిషదర్థప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును,
శ్రీకృష్ణార్జున సంవాదమునగు శ్రీమద్భగవద్గీత
యందలి క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము అను
పదుమూడవ అధ్యాయము

* సమాప్తము *

# గీతామృతము

# శ్రీమద్భగవద్గీత

## గుణత్రయవిభాగయోగము

## పదునాల్గవ అధ్యాయము - సారాంశము

ప్రధాన విషయము :—

సత్త్వరజస్తమములను త్రిగుణములు, వాని స్వభావము, జీవుని ఎట్లివి లోబఱచుకొనునదియు, ఈ త్రిగుణప్రభావము వలన గలుగు ఫలితలును, ఈ త్రిగుణములను జయించినవాని లక్షణములును, ఇందు చర్చింపబడినవి.

ఇందలి ముఖ్యాంశములు —

జగదుత్పత్తి, త్రిగుణముల స్వభావ నిర్ణయము, వాని వలన కలుగు ఫలితములు, త్రిగుణాతీతుని లక్షణములు.

## సారాంశము

సకల మునీంద్రులును ఏ జ్ఞానము నెఱిగి పునర్జన్మములేని మోక్షము పొందిరో అట్టి ఉత్తమ జ్ఞానమును గూర్చి శ్రీకృష్ణుఁడర్జునునకిట్లు చెప్పెను.

అర్జునా ఈ ప్రకృతి నాయొక్క మహత్తత్త్వము. భూతకోటికి మూలమైన ఉత్పత్తిస్థానము, తల్లియు ఇదియే. భూతకోటి ఉత్పత్తికి కారణుఁడైన తండ్రిని నేనే.

ప్రకృతి వలననే సత్త్వరజస్తమోగుణములు సంభవములై ఆ గుణముల ప్రభావముచే దేహమునందు జీవుని బంధించుచున్నవి. ఈ మూడింటిలో

సత్త్వగుణము నిర్మలమైనది. దేహికి జ్ఞానమును సుఖమును కలుగఁ జేయును. రజము వలన కర్మాసక్తి, లోభము కలుగుచున్నవి. తమోగుణము జ్ఞానమును కప్పివైచి, బుద్ధిమాంద్యము, అవివేకము, సోమరితనము, నిద్ర, ప్రమాదములు మున్నగునవి కలుగఁజేయుచున్నది. ఈ మూడింటిలో ఒక గుణము ప్రబలమై వృద్ధియందుండగా తక్కిన రెండును అణఁగి యుండును.

మరణ సమయమున సత్త్వగుణము బలమైయున్నచో పుణ్యలోకములును, రజము బలమైయున్నచో తిరిగి మానవ జన్మమును, తమము బలమైయున్న యెడల అధోగతులు కలిగి నీచజన్మములు ప్రాప్తి యగును. ఈ మూడు గుణములను జయించి వీని కతీతుఁడైన మనుజుఁడు జనన మరణ సంయుతమగు సంసారమునుండి తరించి ముక్తుడగుచున్నాడు.

ఈ విషయము వినిన అర్జునునికి మోక్షమును పొందఁగోరిన మానవుఁడీ త్రిగుణముల నెట్లతిక్రమించగలుగునో, అతని స్వభావవర్తనము లెట్లుండునోయని తెలిసికొనుటకు కోరిక కలిగినది. శ్రీకృష్ణభగవానుఁ డిట్లు చెప్పెను.

త్రిగుణాతీతుని స్వభావ మీ విధముగా నుండును.

అతడు తనకు సంప్రాప్తమైన సత్త్వగుణ సంబంధమగు సౌఖ్యమును గాని, రజోగుణభూతమైన కర్మాసక్తిని గాని, తమోగుణ సంభూతమైన అజ్ఞానమును గాని, ద్వేషింపడు. అవి లేనప్పుడు వానిని కాంక్షింపడు. సుఖ దుఃఖములు, ప్రియాప్రియములు, శత్రు మిత్రులు, మట్టి, బంగారము వీని అన్నిటియందును అతనికి సమదృష్టి ఉండును. చాంచల్యములేని స్థిర చిత్తముతో, భక్తినిష్ఠుఁడయి నన్ను సేవించుచు పరమాత్మ సాయుజ్యము పొందును. శాశ్వతమైన ధర్మమునకు, అవ్యయమైన మోక్షస్థితికి, అత్యుత్తమమైన ఆనందనిధికి నేనే ఆశ్రయస్థానము. పై జెప్పిన లక్షణములు గలిగి, త్రిగుణాతీతుడైన భక్తుఁడు నా సాయుజ్యమును నిశ్చయముగ పొందుచున్నాడు.

ఈ అధ్యాయమందలి ముఖ్య శ్లోకములు

3, 5, 14, 15, 22-25, 26

# శ్రీమద్భగవద్గీత

# గుణత్రయ విభాగయోగము

## పదునాల్గువ అధ్యాయము

శ్రీ భగవానువాచ :— శ్రీ భగవానుఁడు చెప్పెను.

1. పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞాన ముత్తమం।
యత్ జ్ఞాత్వా మునయః సర్వే పరాం సిద్ధిమితో గతాః ॥

సకలమునివరు లెట్టిదౌ జ్ఞాన మెఱిఁగి
పొందఁగల్గిరొ ఉత్తమ మోక్షపదము,
జ్ఞానములలోన నుత్తమ జ్ఞానమద్ది
దానినే పార్థ! చెప్పుచున్నాను మరల.

తా॥ అర్జునా! ఎట్టి జ్ఞానమును తెలిసికొని మునులందఱును మోక్షపద సిద్ధిని పొందగలిగిరో అది జ్ఞానములలోకెల్ల ఉత్తమమైన జ్ఞానము. దానిని మరల చెప్పుచున్నాను వినుము.

2. ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః।
సర్గేఽపి నోపజాయన్తే ప్రలయే న వ్యథన్తి చ ॥

ఇట్టి జ్ఞానమార్గము నాశ్రయించి యున్న
వారు, నాస్థితి పొందిన వార లగుచు
సృష్టికాలాన తిరిగి జన్మింపఁ బోరు,
వారు, దుఃఖమ్ము పొందరు ప్రళయమునను.

తా॥ ఈ ఉత్తమ జ్ఞానమును నాశ్రయించినవారు నాతో ఐక్యము పొందినవారై, సృష్టి సమయమునందు తిరిగి జననమును పొందరు, ప్రళయ సమయమున గూడ దుఃఖమును పొందరు. నశింపరు. అనగా జనన మరణములులేని ఉత్తమ మోక్షపదమునే వారు పొందుచున్నారు.

3. మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్।
సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత ॥

అర్జునా! నామహత్తత్త్వ మైన ప్రకృతి
యోనిలో, బీజ ముంచుచున్నాను నేను,
సకల విధములౌ భూతసంచయమునకును
కలుగుచున్న దుత్పత్తి ఆ కారణమున.

తా॥ అర్జునా! చాల గొప్పదైన ప్రకృతి మాయయే ఉత్పత్తి స్థానము. అందు నేను బీజముంచుచున్నాను. ఆ కారణముచే సకల భూతములును జగత్తునం దుద్భవించుచున్నవి.

4. సర్వయోనిషు కౌంతేయ! మూర్తయ స్సంభవన్తి యాః।
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా ॥

అర్జునా! సర్వ విధ జాతులందు నవని
పుట్టుచున్నట్టి భూతసమూహమునకు
తల్లియై మూల ప్రకృతియె తనరుచుండు,
నేను బీజమ్ము నుంచు తండ్రినయి యుంటి.

తా॥ అర్జునా! జగతిలో సర్వవిధ జాతులందును పుట్టుచున్న ప్రాణికోటు లన్నిటికిని ఉత్పత్తి స్థానము మూలప్రకృతి. తల్లి. నేను బీజమునుంచు తండ్రిని.

5. సత్త్వం రజస్తమ ఇతిగుణాః ప్రకృతిసంభవాః।
నిబధ్నన్తి మహాబాహో! దేహే దేహినమవ్యయం ॥

పార్థ! ప్రకృతి వలన ప్రభవమ్ములైన
సత్త్వగుణమును మఱియు రజస్తమములు,
అవ్యయుఁడును దేహస్థుఁడౌ ఆత్మ నెపుడు
దేహమందున నుంచి బంధించు చుండు.

తా॥ పార్థా! ప్రకృతివలన జనించుచున్న సత్త్వరజస్తమో గుణములు మూడును, అవ్యయుఁడును, దేహమునందున్న వాడునగు ఆత్మను దేహమునందు బంధించి ఉంచుచున్నవి.

6. తత్ర సత్త్వం నిర్మలత్వాత్ ప్రకాశక మనామయం।
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ ॥

అనఘ! అర్జున! త్రిగుణమ్ము లందు సత్త్వ
గుణమె నిర్మలమైన కారణము చేత
కాంతిదాయక మారోగ్య కరము నగుచు
జ్ఞానసౌఖ్యమ్ములందు నాసక్తి పెంచి,
దేహి నా సత్త్వగుణము బంధించుచుండు.

తా॥ అర్జునా! ఆ మూడురకముల గుణములలో సత్త్వగుణము నిర్మలమైనది. ఆ కారణముచే నది దేహమునకు కాంతి నిచ్చునదియు, ఆరోగ్యకరమునై జ్ఞానము నందును సౌఖ్యమునందును ఆసక్తి కలుగఁజేసి ఆత్మను దేహమునందు బంధించుచున్నది.

7. రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగ సముద్భవం।
తన్నిబధ్నాతి కౌంతేయ! కర్మసంగేన దేహినమ్ ॥

అర్జునా! రజోగుణము రాగాత్మకమ్ము,
గాన, ఆసక్తి నాసయుఁ గలుగఁజేయు;
వీనికై కర్మసంగ ప్రవృత్తి యందు
దేహి నా రజోగుణము బంధించుచుండు.

తా॥ అర్జునా! రజోగుణము అన్నిటియందు ప్రీతిని పుట్టించునది గావున, కర్మ ఫలములందు ఆసక్తిని, ఆశలను కలుగఁజేసి దేహిని దేహమునందు బంధించు చున్నది.

8. తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినాం।
ప్రమాదాలస్య నిద్రాభి స్తన్నిబధ్నాతి భారత! ॥

పుట్టు నజ్ఞానమందు తమోగుణమ్ము,
అదియె జీవులనెల్ల మోహమున ముంచి
భ్రమయు సోమరితనము నిద్రయును కలుగఁ
జేసి బంధించుచున్న దీ జీవి నెపుడు.

తా॥ అర్జునా! అజ్ఞానము, అవివేకమే కారణమై తమోగుణము పుట్టుచున్నది. ప్రాణులకు మోహమును కలుగజేయునది అదియే. భ్రమ ప్రమాదములు, సోమరితనము, మొద్దునిద్రలకు లోనుచేసి జీవిని ఈ తమోగుణము బంధించు చున్నది.

9. సత్త్వం సుఖే సంజయతి, రజః కర్మణి భారత।
జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సంజయత్యుత॥

సౌఖ్యము నొసంగు నర్జునా! సత్త్వగుణము;
కారణమ్మగును రజమే కర్మములకు;
ఇక తమోగుణమ్మున జ్ఞాన మెల్ల కూడ
మరుగువడి, ప్రమాదములు సంభవము లగును.

తా॥ అర్జునా! జీవికి సత్త్వగుణము సుఖము నొసగుచుండగా, రజోగుణము కర్మాసక్తి కలుగఁజేయుచున్నది. తమోగుణము జ్ఞానమును కప్పివేసి ప్రమాదములు సంభవించునట్లు చేయుచున్నది.

10. రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత।
రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా॥

సత్త్వగుణ మది ప్రబలమౌ సమయమందు
అణగియుండు రజస్తమోగుణము, లట్లె
సత్త్వతమము లణగు రజశ్శక్తి వలన,
సత్త్వరాజసమ్ములు తమశ్శక్తి నణఁగు.

తా॥ సత్త్వగుణము ప్రభలమైయున్నపుడు రజస్తమోగుణము లణగియుండును. అట్లే రజము అభివృద్ధినందుచో సత్త్వతమోగుణములును, తమోగుణబలముచే సత్త్వ రజోగుణములును అణగి యుండును.

11. సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే।
జ్ఞానం యదా తదా విద్యాద్వివృద్ధం సత్త్వమిత్యుత॥

తనువునందు శ్రోత్రాదిక ద్వారములను
కాంతిరూపమౌ జ్ఞానము కలుగునెడల
తెలిసికొను మోయి పార్థ! ఈ దేహి కపుడె
సత్త్వగుణ మభివృద్ధియై సాగె ననుచు.

తా॥ అర్జునా! ఈ దేహమునందున్న శ్రోత్రాది సర్వద్వారములందు కాంతి రూపమౌ జ్ఞానము ఉద్భవిల్లినపుడు జీవునకు సత్త్వగుణ మభివృద్ధి నందినదని తెలిసికొనుము,

12. లోభః ప్రవృత్తి రారంభః కర్మణామశమః స్పృహా ।
రజస్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ ॥

పార్థ! ఇక రజోగుణ మతి ప్రబలమైన
యెడల, లోభమ్ము కామప్రవృత్తి పెరిగి,
ఆశయును కర్మలోలత్వ మతిశయించి,
మనసులో నశాంతియు గూడ జననమందు.

తా॥ అర్జునా! దేహధారికి రజోగుణము ప్రబలముగా నున్నచో లోభత్వము, ఆశ, కామలోలుపమైన కర్మ సంకల్పములు కలిగి మనసునందు అశాంతియు పుట్టును.

13. అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ ।
తమస్యేతాని జాయన్తే వివృద్ధే కురునందన ॥

అర్జున! తమోగుణము బలమైన యపుడు
బుద్ధిమాంద్య మజ్ఞానము వృద్ధియగును,
తనువునందున సోమరితనము పెరుగు,
కార్యములలో ప్రమాదముల్ కలుగుచుండు.

తా॥ అర్జునా, తమోగుణము ప్రబలమై ఉన్నచో బుద్ధిమాంద్యము, అజ్ఞానము, సోమరితనము, ప్రమాదములు కలుగుచుండును.

14. యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రళయం యాతి దేహభృత్ ।
తదోత్తమవిదాం లోకా నమలాన్ ప్రతిపద్యతే ॥

సత్త్వగుణ మభివృద్ధియౌ సమయమందు
మృత్యువును పొందు దేహధారికి లభించు
ఉత్తమజ్ఞానులగు జను లుండునవియు
అమలములు నైన పుణ్యలోకములు పార్థ!

తా॥ పార్థా! సత్త్వగుణము అభివృద్ధిగానున్న కాలమున మరణించిన దేహధారికి ఉత్తములైన జనులు పోవునట్టియు, పాపరహితములునైన పుణ్యలోకములు లభించును.

15. రజసి ప్రళయం గత్వా కర్మసంగిషు జాయతే।
తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే॥

రజము వృద్ధిఁబొందగ శరీరమును వీడు
నరుఁడు కర్మసంగియయి జన్మమ్ముగాంచు,
ఇక తమోగుణియయి మరణించువాఁడు
మూఢయోనుల యందునఁ బుట్టుచుండు.

తా॥ రజోగుణము అభివృద్ధియైనపుడు మరణించుచో నరుఁడు కర్మఫలాభిలాషియై జన్మించును. తమోగుణము కల్గి మరణించువాఁడు అజ్ఞానిగా గాని పశుపక్ష్యాది నీచజన్మములు గాని పొందుచున్నాఁడు.

16. కర్మణస్సుకృత స్యాహుః సాత్త్వికం నిర్మలం ఫలం।
రజసస్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్॥

సాత్త్వికములగు సత్కార్యచయఫలముగ
నిర్మలమ్మైన సుఖములు నెగడుచుండు;
వ్యథలె కలుగు రజోగుణఫలము లగుచు,
కలుగు నజ్ఞానమే తమః కారణమున.

తా॥ సత్త్వగుణ సంబంధమయిన సత్కార్యముల వలన నిర్మలమైన సుఖము లును, రజోగుణము వలన దుఃఖములును, తమోగుణము వలన అజ్ఞానమును కలుగును.

17. సత్త్వాత్ సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ।
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞాన మేవ చ॥

సత్త్వగుణముచే జ్ఞానమ్ము జననమందు,
రాజసమువల్ల లోభమే ప్రభవమగును,
తామసగుణమ్ము వలన నుద్భవము లగును
భ్రమయు నజ్ఞానమును పొరపాట్లు గూడ.

తా॥ సత్త్వగుణముచే జ్ఞానము కలుగును. రజోగుణము వలన లోభము ప్రాప్తించును, తమోగుణము వలన భ్రమ ప్రమాదములు అవివేకము జనించును.

18. ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా మధ్యే తిష్ఠన్తి రాజసాః ।
జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛన్తి తామసాః ॥

చనుదు రూర్ధ్వలోకములకు సత్త్వగుణులు,
మనుజలోకమునే రజోగుణులు పొంద
గల్గుదురు; తమోగుణు లధోగతికి పోయి
పొందుదురు నీచవృత్తుల పుట్టుకలను.

తా॥ సత్త్వగుణులైనవారు ఉత్తమమైన ఊర్ధ్వలోకములకు పోదురు. రజోగుణులు మధ్యనున్న మర్త్యలోకమున జన్మింతురు. తమోగుణులకు అధోగతియే ప్రాప్తించి నీచజన్మములు పొందుచుందురు.

19. నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టానుపశ్యతి ।
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి ॥

ప్రకృతిగుణముల కంటె కర్తయగు వాడు
అన్యుఁడెవ్వఁడు గూడ లేడని యెఱింగి,
అట్టి గుణములకు నతీతుఁడైన పరము
నరయువాడె నా సాయుజ్య మందఁగలఁడు.

తా॥ అన్ని కార్యములకును ప్రకృతి సంభవములగు గుణములే కర్త, అన్యుఁడెవ్వఁడును కాదు అను నిజము నెఱిఁగి, అట్టి గుణములకు అతీతుఁడైన పరమాత్మను తెలిసికొనినవాఁడే నా సాయుజ్యమందును.

20. గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।
జన్మమృత్యుజరాదుఃఖైర్విముక్తోఽమృతమశ్నుతే ॥

ఈ తనూత్పత్తికిని బీజభూత మైన
త్రిగుణములకు నతీతుఁడౌ దేహి, జనన
మరణ వార్ధక్య దుఃఖ సంభరిత మైన
సంసృతిని విడనాడి మోక్షమును పొందు.

తా॥ దేహోత్పత్తి కారణములైన త్రిగుణములను (సత్త్వరజస్తమములు) జయించిన జీవుఁడు, జనన మరణములతోడను దుఃఖములతోడను కూడియున్న సంసారమునుండి విముక్తుఁడై, మోక్షమును పొందును.

అర్జున ఉవాచ :— అర్జునుఁడు అడిగెను

21\. కైర్లింగైస్త్రీ స్గుణానేతా నతీతో భవతి ప్రభో ।
కిమాచారః కథం చైతాంస్త్రీన్గుణానతి వర్తతే ॥

కృష్ణ ! ఈ త్రిగుణముల జయించువాడు
కలిగియుండెడు ముఖ్యలక్షణము లెవ్వి ?
అతనివర్తన మెట్లుండు, నాతడెట్టు
లీ త్రిగుణశక్తుల నతిక్రమించుచుండు ?

తా॥ కృష్ణా ! ఈ త్రిగుణములకు అతీతుఁడైన వాని స్వభావమెట్టిది ? అతని ప్రవర్తన మెట్టిది ? ఏ విధముగా నాతడీ గుణములను జయింపఁగలుగుచున్నాడు ?

శ్రీ భగవానువాచ :— శ్రీభగవానుఁడు చెప్పెను.

22\. ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ ।
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి ॥

23\. ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే ।
గుణా వర్తన్త ఇత్యేవ యోఽవతిష్ఠతి నేంగతే ॥

24\. సమదుఃఖ సుఖః స్వస్థ స్సమలోష్టాశ్మ కాంచనః ।
తుల్యప్రియాప్రియో ధీరస్తుల్యనిందాత్మసంస్తుతిః ॥

25\. మానావమానయోస్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః ।
సర్వారంభపరిత్యాగీ గుణాతీతస్స ఉచ్యతే ॥

22\. పార్థ ! ఎవ్వఁ డాతనికి సంప్రాప్తమైన
సౌఖ్యమునకును, కర్మపాశమ్మునకును
మోహమునకును ద్వేషింపఁ బోడో, ఇవ్వి
లేని యపుడు కాంక్షింపడో వీనికొఱకు –

23. ప్రకృతిగుణములు తమ స్వభావమ్ముచేత
నే ప్రవర్తించుచున్నవం చెఱిఁగియుండి,
ఎవఁడు స్థిరుఁడయి మనసు చలింపనీక
ఊరకయె ఉదాసీనుఁడై యుండగలడో —

24. వేదనాసౌఖ్యముల ప్రియాప్రియము లందు
రాతియందును మఱి సువర్ణమ్మునందు
నిందలందును స్తోత్రమ్ములందు నెవఁడు
ధీరుఁడై యుండునో సమదృష్టితోడ —

25. కలుగు మానావమాన సంఘటనలందు
శత్రు మిత్రుల యందును సముఁడునగుచు,
ఎవఁడు సంకల్పములను త్యజింపఁగలడో,
అతఁడే త్రిగుణముల కతీతుఁడగును.

తా॥ అర్జునా, త్రిగుణములకు అతీతుడైన వాని స్వభావమును, లక్షణములను వినుము.

ఎవడు తనకు ప్రాప్తించిన సాత్త్వికగుణ సంబంధమైన సౌఖ్యమునకు గాని, రజోగుణ సంబంధమైన కర్మబంధములకు గాని, తమోగుణ సంబంధమైన మోహమునకు గాని ద్వేషభావము పొందడో, ఇవి తనను విడచినపుడు వానికై కాంక్షింపడో — ఎవఁడు సర్వకార్యములయందును ప్రకృతి గుణములే స్వాభావికముగా వర్తించు చున్నవని గ్రహించి తటస్థుఁడై యుండునో — ఎవఁడు సుఖదుఃఖములయందు, ప్రియాప్రియములందు, నిందాస్తోత్రములందు, రాతియందు, బంగారమునందు, మానావమానములందు, శత్రు మిత్రులయందు సమదృష్టిఁ గలిగి, మనసు చలింపనిధీరుఁడై సర్వ సంకల్పములను విడచిపెట్టగలఁడో అతఁడే త్రిగుణాతీతుఁడు.

26. మాం చ యోఽవ్యభిచారేణ భక్తి యోగేన సేవతే।
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే॥

భక్తియోగనిష్ఠుడయి యెవ్వండు నన్ను
చిత్తచలనము లేక భజింపఁగలడో,
అతఁడే త్రిగుణముల కతీతుఁడగుచు
స్వర్ణుఁడగు బ్రహ్మసాయుజ్య మందుటకగును.

తా॥ ఎవడు చిత్తచాంచల్యములేని ఏకాగ్రభక్తితత్పరుఁడై నన్ను సేవించునో, అతఁడు త్రిగుణములను అతిక్రమించి పరమాత్మ సాయుజ్యమును పొందును.

27 బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహ మమృతస్యావ్యయస్య చ।
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాన్తికస్య చ ॥

పార్థ ! అవ్యయమ్మగు మోక్షపదమునకును,
ధరణియందు సనాతన ధర్మమునకు,
ఉత్తమోత్తమానందసౌఖ్యోన్నతికిని,
ఆ పరబ్రహ్మమున కాశ్రయమ్ము నేనె.

తా॥ అర్జునా ! అవ్యయమైన కైవల్యపదమునకు, సనాతన ధర్మమునకు, సర్వోత్తమమైన ఆనందానుభూతికి, ఆ పరబ్రహ్మమునకును, నేనే స్థానమును. ఆ కారణమున నన్ను సేవించువారు త్రిగుణాతీతులై బ్రహ్మసాయుజ్యము పొందుదురు.

ఇది ఉపనిషదర్థప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును,
శ్రీకృష్ణార్జున సంవాదమునగు శ్రీమద్భగవద్గీత
యందలి గుణత్రయ విభాగయోగము అను
పదునాల్గవ అధ్యాయము
* సమాప్తము *

# గీతామృతము

## శ్రీమద్భగవద్గీత

## పురుషోత్తమప్రాప్తియోగము

## పదునైదవ అధ్యాయము - సారాంశము

ప్రధాన విషయము :—

పురుషోత్తముఁడనగా పరమాత్మ. పురుషోత్తముని స్వభావము, అతని అంశలు — పురుషోత్తమప్రాప్తికి మార్గములు ఇందు చెప్పబడినవి.

ఇందలి ముఖ్యాంశములు :—

సంసారవృక్షము, జీవాత్మ, భగవన్మహిమ, క్షరాక్షరపురుషులు.

## సారాంశము

పరమాత్మయైన పురుషోత్తముని పొందు మార్గమును గూర్చి శ్రీకృష్ణ భగవానుఁడు అర్జునునకిట్లు తెలిపెను.

వేళ్ళుపైకి కొమ్మలు క్రిందికిని వ్యాపించిన అశ్వత్థవృక్షము వంటిది ఈ సంసారము. త్రిగుణముల వలనను ఇంద్రియ విషయముల వలనను ఈ సంసారవృక్షము ప్రబలమై యున్నది. ఇది మర్త్యలోకమున బలముగా వేళ్ళు తన్నియున్నది. దీని రూపస్వభావముల యథార్థతత్త్వము ప్రజలకు తెలియదు. పరమాత్మను ధ్యానించుచు, నిస్సంగులును, రాగద్వేషాది ద్వంద్వరహితులునై, నిశ్చలవైరాగ్యమున ఈ సంసారవృక్షమును నిర్మూలించి ముక్తిమార్గము వెదకుటయే మానవులకు తరణోపాయము. అదియే అవ్యయమైనదియు పునర్జన్మములేని స్థానము.

అదియే నాయొక్క పరంధామపదము. దాని మహాప్రభావము ఊహింపశక్యము గాదు. సూర్య చంద్రాగ్నుల తేజమైనను దానిని ప్రకాశించు నటుల చేయలేదు. నా అంశయే ప్రాణికోటులలో జీవుఁడై దేహములందుండి ఇంద్రియముల నాకర్షించి అవి యొనర్చు మంచిచెడ్డల ననుభవించుచుండును. జీవుఁడు శిథిలమైన దేహమును విడచి మఱియొక దేహమున ప్రవేశించు నపుడు ఈ మంచిచెడ్డలే వానితో పోవును. ఇట్టి జీవాత్మను యత్నపరులైన జ్ఞానులు, యోగులే కాని, అజ్ఞానులైన మూఢులు యెంత యత్నించియు తెలిసికొనలేరు.

అర్జునా! సూర్య చంద్రులందును అగ్ని యందునుగల తేజము నాదే. నేనే భూమియందుండి ప్రాణికోటుల ధరించుచున్నాను; చంద్ర రూపమున సకల సస్యములను ఓషదులను పోషించుచున్నాను; ప్రాణికోటుల దేహము లలో జఠరాగ్నినై వారు తిను ఆహారమును జీర్ణము చేయుచున్నాను; సకల ప్రాణికోటుల హృదయములందును జ్ఞానదాయకుఁడనై ఉన్నాను. నన్ను జ్ఞానము వలననే తెలిసికొనగల్గుదురు. నేను వేదవేద్యుఁడను.

ఈ లోకమున క్షరుఁడు అక్షరుఁడని ఇరువురు పురుషులు కలరు. ప్రాణుల దేహమే క్షరుఁడు. దేహమందున్న జీవుఁడే అక్షరుఁడు. వీరికన్న వేఱై ఉత్తముఁడై సర్వ వ్యాపియు సర్వేశ్వరుఁడైన పురుషోత్తముఁడు కలఁడు. అతఁడే పరమాత్మ. నేనే ఆ పరమాత్మను. నన్ను ఇట్లు పురుషోత్త మునిగా తెలిసికొనగలిగిన నరుఁడే సర్వజ్ఞుఁడై సర్వవిధముల నన్ను ఉపాసించుచుండును అతి రహస్యమైన ఈ శాస్త్రమును గ్రహింపఁగల్గినవాడే చరితార్థుఁడు.

అర్జునా! నీవును ఆ పురుషోత్తము నెఱుఁగ గలిగిన జ్ఞానివై ధన్యుఁడవుకమ్ము.

ఈ అధ్యాయమందలి ముఖ్య శ్లోకములు

3, 4, 6, 10, 16, 18, 19

# శ్రీ మ ద్భ గ వ ద్గీ త

# పు రు షో త్త మ ప్రా ప్తి యో గ ము

## పదునైదవ అధ్యాయము

శ్రీ భ గ వా ను వా చ :— శ్రీ భగవానుఁడు చెప్పెను.

1. ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయమ్।
ఛన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్॥

పైకి వేళ్ళను క్రిందికి శాఖలన్ని
కలిగి వేదమ్ము లాకులై వెలయుచున్న
అవ్యయమ్మగు నశ్వత్థ మనుచు బుధులు
పొల్చి చెప్పిరి సంసారమును గురించి;
దాని నెఱిఁగినవాఁడె వేదవిదుఁడరయ.

తా॥ వేదములే ఆకులుగానున్న నాశనములేని ఒక అశ్వత్థవృక్షము వంటి దీ సంసారమని పెద్దలు చెప్పిరి. ఈ వృక్షమునకు వేళ్ళు పైకి, కొమ్మలు క్రిందికిని వ్యాపించినవి. దీనియొక్క యదార్థతత్త్వ మెఱిఁగినవాఁడే వేదార్థ మెఱిఁగిన వాఁడగును.

2. అధశ్చోర్ధ్వం ప్రసృతాస్తస్య శాఖా
గుణప్రవృద్ధా విషయప్రవాలాః।
అధశ్చ మూలాన్యనుసంతతాని
కర్మాను బన్ధీని మనుష్యలోకే॥

ప్రకృతిగుణముల వలననె ప్రబలమగుచు,
విషయసుఖములె చిగురులై వెలయునట్టి
దాని శాఖలు పైకి క్రిందకును ప్రాకె;
మనుజలోకాన కర్మసంబంధములయి
దీని వేళ్ళు వ్యాపించె క్రిందికిని గూఢ.

తా॥ ఈ సంసారవృక్షము యొక్క కొమ్మలు సత్త్వరజస్తమోగుణములచే వృద్ధి పొందింపఁబడినవి. విషయసుఖములే చిగుళ్ళుగా కలిగియుండి ఆ కొమ్మలు పైకి క్రిందికి బాగుగా వ్యాపించి యున్నవి. ఆ చెట్టుయొక్క వేళ్ళు కర్మములను కలుగ జేయునవియై మనుష్యలోకములో క్రిందివరకు నాటుకొని యున్నవి.

3. న రూపమస్యేహ తథోపలభ్యతే
నాన్తో న చాదిర్న చ సంప్రతిష్ఠా ।
అశ్వత్థమేనం సువిరూఢమూల
మసంగశస్త్రేణ దృఢేన ఛిత్త్వా ॥

4. తతః పదం తత్పరిమార్గితవ్యం
యస్మిన్ గతా న నివర్తన్తి భూయః ।
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ ॥

దీనిరూపమి ట్లిహమున తెలియఁబడదు.
దీనిమధ్యయు తుది మొదల్ కానరావు.
బలమయిన వ్రేళ్ళు గలుగు నీ పాదపమును
దృఢవిరక్తి ఖడ్గాన ఛేదించివైచి—

ఏ పదమునందె తిరిగి జన్మింపఁబోరొ,
అట్టి ముక్తిమార్గవిధాన మరయవలయు;
ఎవనినుండి సంసృతి విస్తరించె నట్టి
యాద్యుఁడగు వానిని భజింతు ననుచుఁ దలఁచి.

తా॥ ఈ వృక్షము యొక్క రూపము పైన వర్ణింపఁబడినట్లుగా ఈ లోకమున తెలియఁబడుటలేదు. దీనియొక్క మొదలు మధ్య తుద కూడ కానరాకున్నవి. గట్టిగా వేళ్ళుతన్నియున్న ఈ సంసారవృక్షమును నిశ్చలచిత్తముతో దృఢమైన వైరాగ్యఖడ్గముచే ఖండించివైచి, ఏ పరమపదమును పొందిన తిరిగి మర్త్యలోకమున జన్మింపరో, అనాదిగా యెవనినుండి ఈ సంసారవృక్షము విస్తరించుచున్నదో, ఆదిపురుషుడైన ఆ పరమాత్మనే శరణు పొందుచున్నాను అను భావముతో ఆ పరమపదమార్గమును అన్వేషింపవలయును.

5. నిర్మాన మోహాజితసంగదోషా,
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః ।
ద్వన్ద్వైర్విముక్తాః సుఖదుఃఖ సంజ్ఞై
ర్గచ్ఛన్త్యమూఢాః పదమవ్యయం తత్ ॥

దురభిమాన మోహములకు దూరులగుచు
సంగరహితులై సకల వాంఛలనువీడి
మోదశోకాదులగు ద్వంద్వములను వదలు
జ్ఞాను లా అవ్యయపదమ్ము గాంచగలరు.

తా॥ దురభిమానము మోహమును వీడి, నిస్సంగులు కోరికలు లేనివారునై సుఖ దుఃఖాదులగు ద్వంద్వముల కతీతులై అజ్ఞానమును పాఱఁద్రోలినవారే పైజెప్పిన అవ్యయపరమపదమును పొందగలరు.

6. న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః ।
యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ ॥

దేనిపొందిన జన్మమ్ము తిరిగిరాదొ,
అదియె నాదు పరంధామపదము పార్థ;
అగ్నియైనను చంద్రార్కులైన గూడ
చేయలేరు దానిని ప్రకాశించు నటుల.

తా॥ దేనిని పొందఁగల్గిన యెడల మరల జన్మించుటకు తిరిగి రారో, అదియే నాయొక్క పరంధామపదము. ఆ పరమపదమును అగ్ని గాని సూర్యచంద్రులు గాని ప్రకాశింపఁజేయఁజాలరు.

7. మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః ।
మనఃషష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి ॥

అతి సనాతనమైన నా యంశ భువిని
జీవకోటుల యందున జీవుఁడగుచు,
ఈ ప్రకృతియందు నున్న ఆరింద్రియముల
తనవశయిపున కాకర్షించు కొనుచునుండు

తా॥ నిత్యమైనదగు నా అంశయే జీవకోటులలోనున్న జీవుఁడై ప్రకృతి సంబంధములగు మనసు, చర్మము, కన్ను, చెవి, నాలుక, ముక్కు అను ఆరింద్రియముల నాకర్షించుచున్నది. జీవుని కోరికవైపు లాగుచున్నవీ యింద్రియములు.

8. శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః।
గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధా నివాశయాత్ ॥

జీవుఁడీ దేహమును ప్రవేశించునపుడు.
ఈ శరీరము విడనాడి యేగునపుడు,
తీసికొనుపోవుచుండు నింద్రియచయమును,
పరిమళము తీసికొనిపోవు వాయువువలె.

తా॥ జీవుఁడు నిత్యుఁడు. ఒక దేహము శిథిలము కాగానే మరియొక దేహమును ప్రవేశించును. పుష్పపరిమళమును తీసికొనిపోవు వాయువువలె దేహమును వీడి చనునప్పుడు ఈ ఆరింద్రియములను గూడ, జీవుడు తనతో తీసికొని పోవును, అనగా ఇంద్రియముల వలన సంచితములైన మంచిచెడ్డలే జీవునితో పోవును.

9. శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణ మేవ చ।
అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే ॥

చెవులు, కన్నులు, చిత్తమ్ము, జిహ్వ, ముక్కు
చర్మములయందు జీవు డాశ్రయము పొంది
అనుభవించును తద్విషయార్థములను.

తా॥ అజ్ఞానవశమున జీవుఁడు, మనస్సు, చెవులు, కన్నులు, ముక్కు, నాలుక, చర్మము అను ఇంద్రియోపాధుల నాశ్రయించి వానివలన కలుగు శబ్దాది విషయాముల ననుభవించుచున్నాడు.

10. ఉత్క్రామన్తం స్థితం వాపి భుంజానం వా గుణాన్వితమ్।
విమూఢా నానుపశ్యన్తి పశ్యన్తి జ్ఞాన చక్షుషః ॥

తనువునందున్న వాడును, తనువు వీడి
పోవువాడును. అనుభూతి పొందువాడు
గుణయుతుఁడు నైన జీవుని కనగలేరు
మూఢమనుజులు; జ్ఞానులే చూడగలరు.

తా. ఈ దేహమునందున్నవాడును, శిథిలదేహము వీడి మఱియొక దేహమునకు పోవువాడును విషయానుభూతి పొందుచున్నవాడును, సత్త్వాది త్రిగుణములుకలవాడు నగు జీవాత్మను మూఢులు చూడఁజాలరు. జ్ఞానదృష్టి కలవారికే జీవాత్మను తెలిసికొనగల్గు శక్తి అలవడుచున్నది.

11. యతంతో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్ ।
యతంతోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః ॥

యత్నమున యోగులును తమ యాత్మయందె
సుస్థితుఁడగు జీవాత్మను చూడఁగలరు;
ఎంత యత్నించియును జీవు నెఱుఁగలేరు
ఆత్మసంస్కృతి లేనట్టి అల్పమతులు.

తా॥ యత్నపరులయి యోగిజనులు తమ హృదయమునందే సుస్థితుఁడయియున్న జీవుని తెలిసికొనగల్గుచున్నారు. ఎంత తీవ్రప్రయత్నము చేసినను చిత్తశుద్ధి సంస్కారములేని అల్పజ్ఞులు జీవుని తెలిసికొనలేరు.

12. యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలం ।
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ॥

అర్కునందున్న యేతేజ మఖిలభువికి
వెలుఁగునిచ్చునొ, ఎట్టిదొ వెలుగు కలదొ,
అగ్నియందును చంద్రునియందు కూడ,
ఆ ప్రకాశమంతయు నాదె యని యెఱుంగు.

తా॥ సూర్యునియందున్న ఏ తేజస్సు ప్రపంచమునంతకు చైతన్యప్రకాశము నిచ్చుచున్నదో, అగ్నియందు, చంద్రునియందు ఎట్టి తేజము కలదో అది యంతయు నాయొక్క తేజమే అని తెలిసికొనుము.

13. గామావిశ్య చ భూతాని ధారయామ్యహ మోజసా ।
పుష్ణామి చౌషధీస్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః ॥

భూమియందు ప్రవేశించి భూతములను
నా బలముచే ధరించుచున్నాను నేనే,
రసమయుండయి యమలరు చంద్రముఁడ నగుచు
పోషణమొనర్చు చుంటి సర్వౌషధులను.

తా॥ నేనే భూమియందు ప్రవేశించి సకల ప్రాణికోట్లను బలముచే ధరించు చున్నాను. రసస్వరూపుడగు చంద్రుఁడనయి సకల ఓషధులను (సస్యములను) పోషించి వృద్ధి చేయుచున్నాను.

14. అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః।
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥

అఖిల ప్రాణుల దేహమ్ము లాశ్రయించి
నేనె జఠరాగ్ని నగుచు జీర్ణింపఁజేయు
చుండునచట ప్రాణాదివాయువుల గూడి
వారు తినెడు చతుర్విధాహారములను.

తా॥ ప్రాణుల దేహములను వైశ్వానరుడను జఠరాగ్ని రూపమున ఆశ్రయించి యుండి, దేహమునందున్న ప్రాణాపాన వాయువులతో కూడుకొని ప్రాణులు తిను నాలుగు రకముల ఆహారములను జీర్ణమగునట్లు చేయుచున్నాను—

ఆహారములు :— 1. భక్ష్యము : కొరికి తినబడు గట్టిపదార్థములు. 2. భోజ్యము: చప్పరించి తినబడు మెత్తనిపదార్థములు. 3. లేహ్యము : నాలుకతో నాకబడి రుచి చూడబడునవి. 4. చోష్యము : నోటితో త్రాగబడునవి.

15. సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తః స్మృతిర్జ్ఞానమపోహనం చ।
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో
వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్ ॥

ఉందు నందఱి హృదయమ్ములందు నేను,
నావలన కల్గు స్మృతియు, జ్ఞానమ్ము, మఱపు,
నేనె, వేదాంతకర్తను, నేనె సర్వ
వేదవిదుఁడ, సకల వేదవేద్యుఁడేనె.

తా॥ అన్ని ప్రాణుల హృదయమ్ములందున్నవాడను నేనే. జ్ఞానము, జ్ఞాపకశక్తి, మరచిపోవుట నావలననే కల్గుచున్నవి. వేదాంతమునకు కర్తను, వేదముల నెఱిఁగినవాడను వేదములచే తెలియబడువాడను నేనే.

16. ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ।
క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే॥

క్షరుఁడు, అక్షరుఁడను పేర్లు కలిగియున్న
పురుషు లీలోకమందున ఇరువురుండ్రి;
సకల భూతదేహమ్ములు క్షరుఁడనబడు,
అందు కూటస్థుఁడగు జీవుఁ డక్షరుఁడగు.

తా॥ ఈ ప్రపంచమ్మున క్షరుఁడు, అక్షరుఁడను ఇరువ్వురు పురుషులు కలరు. సమస్త ప్రాణిదేహములు క్షరుఁడనియు అందుండునట్టి జీవుడు అక్షరుఁడని చెప్పబడిరి. ముక్తిపదమందు వరకును జీవుడు నశింపనివాడే.

17. ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః।
యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః॥

వేఱె, ఈ త్రిలోకముల వ్యాపించియుండి
వాని భరియించుచున్నట్టివాఁడు కలడు;
అవ్యయుడు, పూరుషోత్తము, డఖిలమునకు
ప్రభువు, పరమాత్మయనియు, చెప్పబడువాడు.

తా॥ క్షరాక్షరులకు వేఱుగానున్న వాడొకడు, ఈ మూడు లోకములందు నిండి వానిని భరించువాడు కలడు. అతఁడే అవ్యయుఁడు పూరుషోత్తముఁడు పరమాత్మ యనియు చెప్పబడుచున్నాడు.

18. యస్మాత్క్షర మతీతోఽహ మక్షరాదపి చోత్తమః।
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః॥

క్షరుని మీఁచిన వాఁడనై పరగుకతన,
అక్షరునికంటె శ్రేష్ఠుఁడ నగుటచేత,
నేనె, పురుషోత్తమునిగ పొందితిని ఖ్యాతి
అఖిల జగతిని వేదములందు గూడ.

తా॥ క్షరునికి అతీతుఁడను, అక్షరునికంటె శ్రేష్ఠుఁడను అగుటచే సకల జగము నందును, వేదములందును గూడ పురుషోత్తముఁడని ప్రసిద్ధిని నేనే పొందియున్నాను.

19. యో మామేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్ ।
స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత ॥

పార్థ! ఎవ్వఁడు మూఢుడౌవాడు గాక
ఇట్లు పురుషోత్తమునిగ నన్నెఱుఁగగలడో,
అతఁడె సర్వజ్ఞుఁడై భువి నలరుచుండి
సర్వవిధముల నన్నుపాసన మొనర్చు

తా॥ ఓ అర్జునా! ఎవఁడు మూఢుఁడు గాక, పై జెప్పిన విధమున నన్ను పురుషోత్తమునిగా తెలిసికొనుచున్నాడో అతఁడె సర్వమును తెలిసికొనినవాడై సర్వవిధముల నన్నే పూజించుచున్నాడు.

20. ఇతి గుహ్యతమం శాస్త్రమిదముక్తం మయాఽనఘ ।
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్కృతకృత్యశ్చ భారత ॥

అనఘ! అర్జున ఇట్టులీ అతిరహస్య
మైన శాస్త్రమంతయు చెప్పినాను నీకు,
చక్కగా దీనిని గ్రహింపఁజాలువాడు
జ్ఞానియును కృతకృత్యుఁడు కాగలండు.

తా॥ ఓ అర్జునా! ఈ అతిరహస్యమైన శాస్త్రమును నీకు చెప్పినాను. దీని నంతయు చక్కగా తెలిసికొనగల్గినవాడు జ్ఞానియు, కృతార్థుఁడును అగును.

ఇది ఉపనిషదర్థప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును,
శ్రీకృష్ణార్జున సంవాదమునగు శ్రీమద్భగవద్గీత
యందలి పురుషోత్తమ ప్రాప్తియోగమను
పదునైదవ అధ్యాయము
* సమాప్తము *

# గీతామృతము

## శ్రీమద్భగవద్గీత

## దైవాసుర సంపద్విభాగయోగము

## పదునారవ అధ్యాయము - సారాంశము

ప్రధాన విషయము :—

దైవసంబంధమైన గుణసంపదను, అసుర (రాక్షస) సంబంధమైన గుణసంపదను విభజించి తెలుపు అధ్యాయమిది. దైవగుణసంపద సాధకుని భగవంతుని సమీపమునకు చేర్చుచుండగా, అసురగుణసంపద శాశ్వత సంసారబంధ కారణమై జీవుని నరకము పాలుజేసి అంతకంతకు అధోగతికి తీసికొని పోవుచున్నది. అసురగుణములైన కామక్రోధ లోభములను త్యజించిననే గాని జీవునికి ముక్తి లేదు.

ఇందలి ముఖ్యాంశములు :—

దైవగుణములు — అసురగుణములు — వాని యొక్క ఫలితములు నరకహేతువులు. శాస్త్రవిధ్యుక్త కర్మాచరణము.

## సారాంశము

శ్రీకృష్ణభగవానుం డర్జునునకిట్లు చెప్పెను.

నిర్భయము — ఇంద్రియనిగ్రహము — సత్యాహింసలు — చిత్తశుద్ధి — వేదశాస్త్రాధ్యయనము — త్యాగము — శాంతి — నిశ్చలమనస్సు — వైరాగ్యము గర్వరాహిత్యము — సత్ప్రవర్తన మున్నగు సద్గుణములు దైవసంపదయందు పుట్టువానికి కలుగుచున్నవి. దంభము — గర్వము — అహంకారము — కామ క్రోధములు — లోభము — విషయలోలత్వము — అన్యాయార్జన — దురాశ —

అంతులేని కోరికలు - ఎంత ఉన్నను తృప్తినందక ఇంకను సంపాదించి కూడబెట్టవలెను, నేనే గొప్పవాడను - అనుకొనుట మున్నగునవి అసుర గుణములు.

ప్రాణికోట్లన్నియు దైవగుణులు అసురగుణులు అని రెండు సృష్టులుగ నున్నవి. దైవగుణసంపద ముక్తికి దారిచూపును. అసురగుణములు సంసారమునందే నరులను బంధించి యుంచును. అసురగుణులకు కార్యాకార్యవిచక్షణ తెలియదు. జగత్తునకు ధర్మప్రమాణములు లేవనియు, ఈశ్వరుడు లేడనియు, స్త్రీ పురుష సంయోగమే సృష్టికాధారమనియు వారు వాదింతురు. అసురగుణస్వభావులు స్వాతిశయులై, కామక్రోధలోభములకు బానిసలై భోగోపజీవనమే లక్ష్యముగానెంచి నీచవృత్తులు కలవారిగానుండి తుదకు ప్రజాకంటకులై లోకనాశనము కలుగజేయు ఉగ్రకర్మములను వారు ఆచరింతురు. వారు సర్వవ్యాపియగు పరమాత్మనే ద్వేషించుచు నరకము పాలై, శాశ్వతముగా సంసారమోహమున చిక్కుపడి అంతకంతకు అధోగతి పాలగుదురు. వారెన్ని జన్మములెత్తినను ఏ జన్మమందును భగవత్సాయుజ్యమును పొందలేరు.

అసురగుణములైన కామక్రోధ లోభములు మూడును నరకమునకు ద్వారముల వంటివి. ఈ మూడు దుర్గుణములు ముమ్మాటికి త్యజింపదగినవి. ఈ మూడు దుర్గుణములకు వశముకాని జీవియే పరమపదమును పొందుచున్నాడు.

ఎవడును శాస్త్రోక్త కర్మములను వదలి కామలోలుడై ఇచ్ఛవచ్చినట్లు ప్రవర్తింపరాదు. కోరికలను పెంచుకొనుచు విషయలోలుడయిన వానికెట్టి సౌఖ్యము గాని, సిద్ధి గాని లభింపదు.

కావున అర్జునా! నీవు శాస్త్రోక్త ధర్మము ననుసరించి నిష్కామముగా కర్మము నాచరింపుము. నీవు దైవగుణ సంపదయందు జనించినవాడవు. దుఃఖింపకుము. శాస్త్రవిహిత కర్మానుష్ఠానము నీకు శ్రేయస్సును, సద్గతులను కలుగజేయును.

ఈ అధ్యాయమందలి ముఖ్య శ్లోకములు

1-4, 17, 18, 23, 24

# శ్రీమద్భగవద్గీత

# దైవాసురసంపద్విభాగ యోగము

## పదునారవ అధ్యాయము

శ్రీ భగవానువాచ :— శ్రీభగవానుఁడు చెప్పెను.

1. అభయం సత్త్వసంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః ।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్ ॥

2. అహింసా సత్యమక్రోధః త్యాగ శ్శాన్తి రపైశునమ్ ।
దయా భూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీరచాపలం ॥

3. తేజః క్షమా ధృతిశ్శౌచమద్రోహో నాతిమానితా ।
భవన్తి సంపదం దైవీమభిజాతస్య భారత ॥

నిర్భయమ్ము, సర్వేంద్రియ నిగ్రహమ్ము
చిత్తశుద్ధియు, జ్ఞానసంస్థితియు, తపము
జ్ఞానయజ్ఞ, మధ్యయనము, దానగుణము
సౌమ్య, శీల, మహింసయు, సత్యనిరతి

ఆత్మశాంతి, అక్రోధము త్యాగగుణము
భూతదయయును, వైరాగ్యబుద్ధి, మ్రదిమ
ఒరులదోషములను చెప్పకుండుటయును
చంచలము గాని మనసు, తేజస్సు, ఓర్పు

దురభిమానరాహిత్య మద్రోహగుణము
పారిశుద్ధ్యము, ధైర్యమ్ము, పార్థ! యివియె
దైవసంపదయందున ధరణిమీద
జన్మమందిన వాని లక్షణము లగును.

తా॥ అర్జునా! నిర్భయము, ఇంద్రియనిగ్రహము, చిత్తశుద్ధి, జ్ఞానస్థితి, తపస్సు, యజ్ఞము, వేదపఠనము, దానము, సౌమ్యవర్తన, అహింస, సత్యము, శాంతి, క్రోధము

లేకుండుట, త్యాగము, భూతదయ, విషయవిరక్తి, మార్దవము, ఇతరుల దోషములను చెప్పక పోవుట, నిశ్చలమనస్సు, ఓర్పు, తేజస్సు, స్వాతిశయము లేకపోవుట, ద్రోహచింత లేకపోవుట, శుచిత్వము, ధైర్యము — ఇవి దైవసంపదయందు పుట్టిన వానియొక్క గుణ లక్షణములు.

4. దంభో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ ।
అజ్ఞానం చాభిజాతస్య పార్థ! సంపదమాసురీమ్ ॥

దురభిమానము కోపము పరుషవాక్కు
గర్వ మజ్ఞానమును డాంబికమ్ము నివియె
పార్థ! అసురసంబంధ సంపత్తి యందు
జననమందు వానికి గల్గు గుణగణమ్ము.

తా॥ అర్జునా! అసురసంపదయందు పుట్టిన వానికి కలుగు గుణములు: స్వాతిశయము, కోపము, పరుషవచనము. గర్వము, అజ్ఞానము, డంబము.

5. దైవీసంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా ।
మాశుచ స్సంపదం దైవీమభిజాతోఽసి పాండవ! ॥

దైవగుణములు భవముక్తిదమ్ము, లసుర
గుణము లవి భవబంధకారణము లగును:
పార్థ! నీవు దైవగుణసంపదల యందె
పుట్టినాడవు దుఃఖమ్ము పొందవలదు.

తా॥ పార్థా! దైవగుణములు మోక్షమునకు దారిచూపును. అసురగుణములు సంసారమందే బంధించి యుంచును. నీవు దైవగుణ సంపదయందే జన్మించితివి. దుఃఖింపవలదు.

6. ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ ।
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ! మే శృణు ॥

అవనియందు దైవ మనియు, నసురమని
రెండువిధములై ప్రాణుల సృష్టి యుండు,
దైవగుణముల గురించి విస్తారరీతి
తెలిపితిని పార్థ! విను మసురులను గూర్చి.

తా॥ ఈ లోకమందు దైవగుణసంబంధమైనవి, అసురగుణసంబంధమైనవి అని రెండు విధములుగా ప్రాణికోట్లు సృష్టింపఁబడుచున్నవి. దైవగుణులను గూర్చి నీకు విపులముగా చెప్పితిని. ఇక అసురగుణులను గూర్చి వినుము.

7. ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః।
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే॥

వృత్తియందు కార్యాకార్య విభజనమ్ము
అసుర గుణమున పుట్టు వా రరయలేరు.
కనబడవు గూడ నాసురగుణుల యందు
సత్ప్రవర్తన, శౌచమ్ము, సత్యవాక్కు.

తా॥ అసురసంపదయందు జనించిన వారికి ఇది చేయదగిన పని, ఇది చేయరాని పని యనియు తెలియదు. వారియందు పారిశుద్ధ్యము, సదాచారములు, సత్యనిరతియును ఉండవు.

8 అసత్యమప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరమ్ ।
అపరస్పరసంభూతం కిమన్యత్కామహైతుకమ్ ॥

జగ మసత్య మప్రతిష్ఠ మీశ్వరుఁడులేడు,
లేదు జగతి కాధారమై యేదికూడ;
స్త్రీ పురుష సంగమమె తప్ప సృష్టి కింక
హేతు వేమున్నదనుచు వాదింత్రు వారు.

తా॥ జగత్పరివర్తనకు వేదాదిప్రమాణములు గాని. ధర్మాధర్మవ్యవస్థ గాని లేవనియు, ఈశ్వరుఁడును లేడనియు, జగత్సృష్టికి కామపూరితమన స్త్రీ పురుష సంబంధమే కాని వేఱుకారణ మేమున్నది అనియు అసురగుణులు వాదింతురు.

9. ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః।
ప్రభవన్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః॥

ఈ విధమ్మగు భావమ్ము లెడద గలిగి
అల్పబుద్ధులు నష్టాత్ము లగుచు వారు
జగతి కహితులై లోకనాశనము కొఱకె
ఉగ్రకర్ములుగా పుట్టుచుందు రవని.

తా॥ ఈ విధమగు భావముల నవలంబించి అసురగుణు లందఱును అల్పబుద్ధులు, ఆత్మను కోల్పోయినవారు, ప్రపంచమునకు శత్రువులునై, లోకవిధ్వంసము కొఱకే ఉగ్రకర్మలు కలవారుగా పుట్టుచుందురు.

10. కామమాశ్రిత్య దుష్పూరం దమ్భమానమదాన్వితాః ।
మోహాద్గృహీత్వాఽసద్గ్రాహాన్ ప్రవర్తన్తేఽశుచివ్రతాః ॥

వాంఛ లంతులేకుండగ పెంచుకొనుచు,
దంభమును గర్వమును దుర్మదమ్ము లెసగి,
మోహవశులయి దుర్మార్గ బుద్ధితోడ
కలిగియుందురు నీచవృత్తులను వారు.

తా॥ ఆ అసురగుణులు ఎంతకును తనివితీరని కోరికలతో దంభము స్వాతిశయము గర్వము కలిగి, అజ్ఞానమున చెడుతలపులనే మనసునందుంచుకొనుచు, నీచవృత్తులలో ప్రవర్తించుచుందురు.

11. చిన్తామపరిమేయాం చ ప్రళయాన్తా ముపాశ్రితాః ।
కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః ॥

12. ఆశాపాశ శతైర్బద్ధాః కామక్రోధపరాయణాః ।
ఈహన్తే కామభోగార్థ మన్యాయే నార్థసంచయాన్ ॥

కామభోగమ్ములందె లక్ష్యమ్ము నుంచి,
అంతకంటెను మేలు లేదన్న నిశ్చ
యమున వారలు జన్మాంతమైన వరకు
అమిత విషయచింతలకు లోనగుచు నుంద్రు.

బహుళమైన ఆశాపాశబద్ధు లగుచు
కామకోపులై విషయభోగముల కొఱకె
ద్రవ్యమును వార లార్జింపఁ దలచుచుంద్రు
గర్హ్యమగు అవినీతిమార్గమ్ములందు.

తా॥ ఆ అసురగుణులు కేవలము కామభోగములందే దృష్టినుంచి వానికంటె మేలైన పద్ధతి లేదను నిశ్చయముతో ఆజన్మాంతము అపరిమితములైన విషయ చింతలతో కాలము గడపుచుందురు. అనేకములైన ఆశలందు చిక్కువడి ఎల్లపుడు కామక్రోధవర్తనులై విషయసుఖము లనుభవించుటకు అన్యాయముగా ద్రవ్యము నార్జించు చుందురు.

13. ఇదమద్య మయా లబ్ధ మిదం ప్రాప్స్యే మనోరథమ్।
ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనం ॥

14. అసౌ మయా హతశ్శత్రు ర్హనిష్యే చాపరానపి।
ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్ సుఖీ ॥

15. ఆఢ్యో ఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా।
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః ॥

16. అనేకచిత్తవిభ్రాన్తా మోహజాల సమావృతాః।
ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ ॥

ఇప్పు డీ యభీష్టమ్ము ఫలించియుండె,
ఈ మనోరథ మిదియు ఈడేరగలదు;
ఇపుడు నావద్ద కూడిన దింత ఆస్తి,
ఇంతధనమును మరల నార్జింపఁగలను—

చంపఁబడెను నాచేత ఈ శత్రువిపుడు,
తక్కుఁగలవారి గూడ హతమ్ము నర్తు;
తలచిన పనిని నెఱవేర్పఁగలను, నేనె,
బలయుతుఁడ భోగపురుషుఁడ ప్రభుఁడ నేనె—

జనన మందితి గొప్పవంశమ్ము నందు,
ధనముగలవాఁడ, చేయుదు దానములను,
యజ్ఞములొనర్తు సుఖముల ననుభవింతు,
కుహని లేరు నాతోఁడ సమానులెవరు—

అని తలంచు చజ్ఞాన మోహమునఁ జిక్కి-
బహువిధములగు చిత్తవిభ్రాంతి చేత
కామభోగమనస్కులై కఠినమైన
నరకమందునఁ గూలుచున్నారు వారు.

తా॥ అసురగుణు లెప్పుడును ఈ విధముగా ప్రవర్తించుచుందురు. ఇప్పుడు నాకీ కోరిక నెఱవేరినది, ఈ కోరికయు కూడ ఫలించును. ఇప్పుడింత ఆస్తి కలదు, మఱింత ఆస్తిని సంపాదింపగలను. ఈ శత్రువును చంపితిని, మిగిలిన వారిని గూడ చంపుదును. నేననుకొనిన పని తప్పక జరుగును. నేనే బలముగలవాడను, సుఖవంతుఁడను, ప్రభువును, గొప్ప వంశములో పుట్టినాను, నావద్ద ధనమున్నది. దానములు చేయుదును, యాగములు చేయుదును, సుఖముల ననుభవించెదను, నాతో సమాను లెవరున్నారు? అజ్ఞానవశమున ఆ అసురగుణులు ఇట్లే అనేక విధములుగా తలంచుచు, భ్రమకులోనై ఎల్లప్పుడు కామభోగములందే చిక్కుకొని చివరకు వారందఱు ఘోర నరకకూపమునందే కూలుచున్నారు.

17. ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః ।
యజన్తే నామయజ్ఞైస్తే దంభేనావిధిపూర్వకమ్ ॥

18. అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః ।
మామాత్మ పరదేహేషు ప్రద్విషన్తోఽభ్యసూయకాః ॥

ఇట్లె ఆత్మసంస్తుతుల కావించుకొనుచు,
స్తబ్ధులయి ధనగర్వమధాంధు లగుచు,
శాస్త్రములు చెప్పు విధులను సరకుగొనక,
నామకార్థమె వారు యజ్ఞములొనర్తు రి.

వారియందున్న రీతిగా పరులలో వ
సించు నన్నీర్ష్యతోడ ద్వేషింత్రువారు,
కామకోపములకు నహంకారమునకు
ప్రబల బలదర్పములకున్ను వశులు నగుచు,

తా॥ ఈ విధముగా వారిని వారే పొగడుకొనుచు, వినయమర్యాదలులేక, ధన దురభిమానగర్వపూరితులై, శాస్త్రములను లెక్కచేయక వారి కిష్టమువచ్చినట్లు నామకార్థము యజ్ఞపూజలు వారు చేయుదురు. నేను వారి హృదయములందెట్టు లుంటినో అట్లే ఇతరులయందును నేనుంటినను సమదృష్టిలేక నన్ను వారు ద్వేషించుచు ఎల్లప్పుడు బలము, దర్పము, కామము, క్రోధము, అహంకారము మున్నగు దుర్గుణములకు లొనిసలై ఉందురు.

19. తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ ।
క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు ॥

ఈ విధమ్ముగ నన్ను ద్వేషించుచున్న
క్రూరవర్తనులును దురాచారులైన
అధమ జనులను సంసారమందె త్రోసి
అసురయోనుల జన్మించు నట్లొనర్తు.

తా॥ ఈ ప్రకారముగా నన్ను ద్వేషించుచు క్రూరవర్తనులు దురాచారులుగా కాలము గడపుచున్న నరాధములను శాశ్వతముగ సంసారమందె త్రోసివైచి నీచజన్మలందే పుట్టునట్లుగ చేయుచున్నాను.

20. ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని ।
మామప్రాప్యైవ కౌన్తేయ తతో యాన్త్యధమామ్ గతిమ్ ॥

అసురయోనులందున జన్మమందు మూఢు
లర్జునా! నన్ను ఏ జన్మమందు కూడ
పొందఁజాలక పతితులై పోవుచుందు
రంతకంతకు నీచమౌ అధమగతికి.

తా॥ అర్జునా, ఈ విధముగా అసురగుణులు మూఢులై నీచజన్మముల పుట్టి వారు ఎన్ని జన్మములెత్తినను ఏ జన్మమందునను నా సాయుజ్యము పొందలేరు సరికదా, అంతకంతకు అధోగతికే పోవుచుందురు.

21. త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః।
కామక్రోధస్తథా లోభ స్తస్మా దేత త్త్రియం త్యజేత్ ॥

క్రోధ కామ లోభము లను గుణములివ్వి
మూడు ద్వారములు నరకమునకు పార్థ!
ఇవియె ఆత్మనాశన మొనరించునవియు
గాన, వర్జింపవలయును వీని విధిగ.

తా॥ అర్జునా! కామము, క్రోధము, లోభము ఇవి మూడును నరకమునకు మూడు ద్వారములు. ఈ దుర్గుణములు ఆత్మను నశింపఁజేయును. కాన ఈ మూడింటిని విధిగ త్యజింపవలెను.

22. ఏతై ర్విముక్తః కౌన్తేయ తమోద్వారై స్త్రిభిర్నరః।
ఆచరత్యాత్మనః శ్రేయ స్తతో యాతి పరాం గతిమ్ ॥

నరకమార్గమ్ము లీ దుర్గుణత్రయమ్ము
నకును వశముకానట్టి మానవుఁడు తనకు
శ్రేయ మొసఁగు సత్కృతు లాచరించుకొనుచు
పొందుచుండె సర్వోత్తమ మోక్షపదము.

తా॥ నరకమునకే తీసికొనిపోవు ఈ మూడు దుర్గుణములనుండి ముక్తుఁడైన మనుజుఁడు తనకు శ్రేయస్సు నొసఁగు సత్కార్యములే ఆచరించుచు మోక్షపదమును పొందగల్గుచున్నాడు.

23. యశ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః।
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాంగతిం ॥

ఎవఁడు శాస్త్రోక్తవిధి విసర్జించి తనకు
ఇచ్చవచ్చిన రీతి వర్తించుచుండు,
నతఁడు పొందగలేడు సౌఖ్యమును గాని
జ్ఞానసిద్ధిని గాని మోక్షమును గాని.

తా॥ శాస్త్రవిధులను వర్జించి, కామలోలుఁడై తన యిష్టమువచ్చినట్లుగా ప్రవర్తించువాడు సౌఖ్యమును గాని జ్ఞానమును గాని మోక్షమును గాని పొందలేడు.

24. తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ।
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి ॥

కాన, శాస్త్రోక్తవిధులె ప్రమాణ మింక
నీకు పార్థ! కార్యాకార్య నిర్ణయమున,
ఇట్టి శాస్త్రవిధానము లెఱిఁగి కర్మ
మాచరించుటయే పాడియగును నీకు.

తా॥ ఓ అర్జునా, ఈ కారణములచే శాస్త్రోక్తములైన విధానములే నీకు ప్రమాణములు. కార్యాకార్య నిర్ణయములో ఈ శాస్త్రవిధానములనే అనుసరించి ఈ ప్రపంచమున కర్మముల నిర్వహించుటయే అర్హమైన పని.

ఇది ఉపనిషదర్థప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును,
శ్రీకృష్ణార్జున సంవాదమునగు శ్రీమద్భగవద్గీతయందు
దైవాసుర సంపద్విభాగయోగమను
పదునారవ అధ్యాయము
* సమాప్తము *

# గీతామృతము

## శ్రీమద్భగవద్గీత

## శ్రద్ధాత్రయ విభాగయోగము

## పదునేడవ అధ్యాయము - సారాంశము

ప్రధాన విషయము :—

శ్రద్ధ అనగా ఏదైన ఒక విషయమునందు దృఢమైన ఆసక్తి. శ్రద్ధ మూడు విధములు. సాత్త్వికము, రాజసము, తామసము అని. పూర్వ జన్మ సంస్కారఫలమై పురుషుని కేదో విధమైన శ్రద్ధ యుండును. కర్మములందు, ఆహారాది విషయములందు ఎట్టి శ్రద్ధగల వానికెట్టి ఫలము లభించునో ఈ అధ్యాయమందు చెప్పఁబడినది.

ఇందలి ముఖ్యాంశములు —

త్రివిధ శ్రద్ధలు వాని లక్షణములు. ఆహారము, యజ్ఞము, దానము, తపస్సులయందుగల మూడు తెఱగుల భేదములు. 'ఓం తత్ సత్' పదముల మహత్త్వము.

## సారాంశము

శ్రీకృష్ణభగవానుఁడు క్రిందటి అధ్యాయాంతమున శాస్త్రప్రమాణముల ననుసరించియే కార్యాకార్య విచక్షణతో కర్మము లొనర్పవలెనని బోధించెను. అర్జునున కొక సందేహము కలిగినది. శాస్త్రోక్త విధి కాకపోయినను శ్రద్ధతో గూడిన కార్యాచరణ మెట్టిది అని పార్థుఁడు ప్రశ్నింపగా శ్రీకృష్ణుఁ డిట్లు చెప్పెను.

అర్జునా పూర్వజన్మ సంస్కారముచే అంతఃకరణాను రూపమైన శ్రద్ధ, సాత్త్వికము, రాజసము, తామసము అని మూడు విధములు. ఎవని కే విధమగు శ్రద్ధ గలదో ఆతఁడట్టి వాడగును.

సత్త్వగుణులు దేవతలను, రజోగుణులు యక్షరాక్షసులను, తామస గుణులు భూతప్రేతముల నర్చింతురు. అసురస్వభావులెప్పుడును దంభా హంకారములతో ఉగ్రతపములను జేయుచు దేహమును కష్టపెట్టి అందున్న పరమాత్మనగు నన్నును కృశింపఁజేయుదురు.

ప్రజలు తిను ఆహారము, ఆచరించు యజ్ఞము, తపము, దానము గూడ మూడు విధములై ఉన్నవి.

ఆయురారోగ్యదాయకమై, బలప్రదమై, ప్రియముగానుండి సారము గల్గిగిన భోజనపదార్థములు సత్త్వగుణుల కిష్టమైన ఆహారము, ఉప్పు, కారము, పులుపు, ఎక్కువగానుండి దేహమునందు దాహము, రోగము కలుగజేయు ఆహారము రాజసులకు ప్రియము. ఎంగిలైనది, పాసిపోయినది అపవిత్రమైన తిండి తామసుల కిష్టము.

అర్హమైనది, శాస్త్ర సమ్మతమైనది, ఫలాపేక్షలేని యజ్ఞము సాత్త్వికము, ఫలాపేక్ష గలిగి చేసిన యజ్ఞము రాజసము. మంత్రము, శాస్త్ర విధానము, అన్నదానము, వదలి చేసినది తామసయజ్ఞము.

సత్యాహింసలు, గురుపూజ, సద్వర్తనము శారీరకమైన తపము. ప్రియము, సత్యము అయిన వాక్కు వాచికతపస్సు. మౌనము, ఆత్మ నిగ్రహము, సద్భావము మానసిక తపస్సు. ఇట్లు మూడు విధములుగానున్న తపము మరల మూడు తెఱఁగులు—ఫలవాంఛలేక చేసినది సాత్త్వికము. పరులు తనను మెచ్చుకొనవలెనని దాంభికముగ చేయునది రాజసము. పరులకు విపత్తు కల్గించు కొఱకు మూర్ఖముగా చేయునది తామసిక తపము.

దానము మూడు విధములు. ప్రత్యుపకారము కోరక దేశ కాల పాత్రములు అర్హములని గమనించి చేసిన దానము సాత్త్వికము. ప్రత్యుప కారము ఆశించి, మనసులో బాధపడి చేయు దానము రాజసము, దేశకాల పాత్రముల అర్హత చూడక తీసుకొనువారియందు గౌరవములేక, అవమాన పూర్వకముగ చేయు దానము తామసికము.

పరమాత్మ "ఓం తత్ సత్" అను పదములచే నిర్దేశింపబడెను. అవియే పరమాత్మరూపములు. జ్ఞానులు, యజ్ఞములు, వేదములు వాని నుండియే వచ్చినవి. వేదవేత్తలు "ఓం తత్ సత్" అను పదములను భక్తిపూర్వకముగ ముందుగా ఉచ్చరించిన తర్వాతనే యజ్ఞాది సర్వకర్మముల నాచరించుచుందురు. 'ఉన్నది' 'మంచిది' 'శ్రేష్ఠమైనది' అను నర్థము వచ్చుటకు లోకమున 'సత్' అను పదమును వాడుదురు. ఉదా॥ సత్తు, సద్గుణము, సన్మార్గము. అట్లే యజ్ఞాదులందు స్థిరమైన నిష్ఠను సత్ అనియు, శ్రద్ధాభక్తులులేని యజ్ఞాదికర్మములను అసత్కార్యములనియు అందురు. అట్టి అసత్కార్యముల వలన ఇహమునందును, పరమునందును ప్రయోజనము లేమియు లేవు.

ఈ అధ్యాయమందలి ముఖ్య శ్లోకములు

2, 3, 4, 7, 23, 27, 28

# శ్రీమద్భగవద్గీత

# శ్రద్ధాత్రయవిభాగయోగము

# పదునేడవ అధ్యాయము

అర్జున ఉవాచ :— అర్జునుఁడు అడిగెను.

1. యే శాస్త్రవిధిముత్సృజ్య యజన్తే శ్రద్ధయాన్వితాః ।
తేషాం నిష్ఠా తు కా కృష్ణ ! సత్త్వమాహో రజస్తమః ॥

కృష్ణ ! శాస్త్రవిధి నవలంబింపకుండ
హృదయమం దతిశ్రద్ధతో నెవ్వరైన
చేయు పూజాదులవి యెట్టివై యెసంగు,
సాత్త్వికమొ, రాజసమొ, తామసమ్మొ, చెపుమ.

తా॥ ఓ కృష్ణా, శాస్త్రములందు చెప్పఁబడిన విధానమనుసరింపక యెవ్వరైనను శ్రద్ధతో చేయు పూజాదులు ఎట్టివి. సాత్త్వికములా, రాజసములా, తామసములా చెప్పుము.

శ్రీ భగవానువాచ :— శ్రీభగవానుఁడు చెప్పుచున్నాడు.

2 త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా ।
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు ॥

ప్రాణికోటుల యందు స్వాభావికముగ
సాత్త్వికము రాజసము తామస మ్మనంగ
కలుగుచుండును మూఁడురీతులుగ శ్రద్ధ,
వినుము వానిని గూర్చి సవిస్తరముగ.

తా॥ ప్రాణికోటుల యొక్క పూర్వసంస్కారానుసారముగ వారికి స్వాభావికముగ మూఁడు విధములగు శ్రద్ధ కలుగుచున్నది. వానిని గూర్చి వినుము.

3. సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత ।
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధ స ఏవసః ॥

వారి వారి స్వభావానుసారముగనె
కలుగుచుండును శ్రద్ధ ప్రాణులకు పార్థ!
ప్రాణి శ్రద్ధాన్వితుడుగాన వసుధ నెవని
కెట్టి శ్రద్ధ కలదో అతఁ డట్టులుండు

తా॥ పార్థా! ప్రాణులకు వారి వారి అంతఃకరణానుసారముగనే శ్రద్ధ కలుగుచుండును. పురుషుఁడు స్వాభావికముగ శ్రద్ధాన్వితుఁడు. ఎవని కెట్టి శ్రద్ధకలదో ఆతఁడట్టి వాడగును.

4. యజన్తే సాత్త్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసాః ।
ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజన్తే తామసాః జనాః ॥

సత్త్వగుణులు దేవతల కర్చన లొనర్తు9,
రాజసులు భజంతురు యక్షరాక్షసులను.
ఇంక తామసగుణులైన యితర జనులు
ప్రేతభూతగణముల నర్చించుచుంద్రు.

తా॥ సత్త్వగుణులు వివిధ దేవతలను, రజోగుణులు యక్షరాక్షసులను పూజింతురు. తామసగుణులైన ఇతరులు ప్రేతభూతములను పూజింతురు.

5. అశాస్త్రవిహితం ఘోరం తప్యన్తే యే తపోజనాః ।
దంభాహంకారసంయుక్తాః కామరాగ బలాన్వితాః ॥

6. కర్శయంతశ్శరీరస్థం భూతగ్రామ మచేతసః ।
మాం చైవాన్తశ్శరీరస్థం తాన్విద్ధ్యాసుర నిశ్చయాన్ ॥

దాంభికాహంకృతులకును దాసులగుచు,
కామరాగ బలమ్ములు గడలుకొనగ
శాస్త్రవిధికి విరుద్ధమౌ సరణి తపము
లతిభయంకరమ్ముగ చేయునట్టివారు—

తనువు నం దంతరాత్మ్మయై తనరు నన్ను,
తనువునందున్న పంచభూతముల, నెవరు
చేయుదురొ బుద్ధిమాలి శుష్కించునటుల
వారల నెఱుఁగు మసురస్వభావులనుచు.

తా॥ దంభము అహంకారము కలిగి, కామరాగగుణములు ప్రబలమైయుండగా శాస్త్రవిధానమునకు విరుద్ధమగు రీతిగా అతిఘోరముగా తపములు చేయువారును, శరీరమందున్న పంచభూతములను, అంతరాత్మగా ఉన్న నన్నును, అవివేకులై కష్టపెట్టి ఉపవాసాదులచే కృశింపఁజేయువారును రాక్షసస్వభావము కల్గినవారని యెఱుఁగుము.

7. ఆహారస్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః।
యజ్ఞస్తప స్తథా దానం తేషాం భేదమిమం శృణు॥

మూడుతెఱఁగుల యిష్టముం బూని యుందు
రందఱును వారి యాహారమందు; నట్లె
యజ్ఞమున, తపమ్మున, దానమందు గూడ
కలవు త్రివిధము లా భేదములను వినుము.

తా॥ జనులందఱును వారి ఆహారమందు మూడు విధములైన ఇష్టములను కలిగి యుందురు. అట్లే యజ్ఞ, దాన, తపస్సులందు మూడు విధములు గలవు. ఆ భేదములను గూర్చి వినుము.

8. ఆయుస్సత్త్వ బలారోగ్య సుఖప్రీతివివర్ధనాః।
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాః సాత్త్వికప్రియాః॥

ఆయు రారోగ్య సౌఖ్యదాయకము లగుచు
ప్రీతికరములై, బలసత్త్వ వృద్ధినొసగు
స్థిరములును హృద్యములు రసస్నిగ్ధములును
ప్రియతరాహారము లగు సాత్త్వికులకెందు.

తా॥ ఆయువు, ఆరోగ్యము, సుఖము నిచ్చునవియు, ప్రియముగా నుండునవి, బలశక్తుల వృద్ధి నొందించునవియు, స్థిరమైన గుణములు కలవియు, మధురములైనవియు, చమురు గలవియు అగు ఆహారములు సత్త్వగుణులకు ప్రియములై ఉండును.

9. కట్వమ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణ రూక్ష విదాహినః।
అహారా రాజస స్యేష్టా దుఃఖశోకామయప్రదాః ॥

ఉప్పు కారము పులుపు అత్యుష్ణము నయి
చేదులయి విదాహము కల్గఁజేయునవియు
కష్ట శోక బాధలను రోగమును పెంచు
భోజనమ్ములు ప్రియములు రాజసులకు.

తా॥ ఎక్కువగా ఉప్పు, కారము, పులుపు, చేదు, వేడి కలిగి, అమితదాహ మును పుట్టించునవియు, శరీరమునకు కష్టమును, దుఃఖమును, రోగమును కలుగఁజేయు నవియు నగు ఆహారములు రజోగుణులకు మిగుల ఇష్టము.

10. యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్।
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియం ॥

ఎంగిలివి, చల్లివిని, రుచిహీనములును
పాసిపోయి వాసనవచ్చు వస్తువులును,
నిలవబడిపోయి అపవిత్రములుగ నున్న
భోజనమ్ములు ప్రియము తమోగుణులకు.

తా॥ ఎంగిలివి, చల్లబడినవి, సారములేనివి, పాసిపోయినవియు, వాసన వచ్చు నవి, నిలవగా నున్నవి, అపవిత్రమైనవి అగు భోజనములు తామసగుణులకు ప్రియములై ఉండును.

## యజ్ఞము

11. అఫలాకాంక్షిభిర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే।
యష్టవ్యమేవేతి మనస్సమాధాయ స సాత్త్వికః ॥

చేయదగినదే యని తోచి చిత్తమునకు
ఫలమునం దాశ లేనట్టివారిచేత
శాస్త్రసమ్మతరీతిగా జరుపఁబడెడు
యజ్ఞకర్మమె సాత్త్వికయజ్ఞమగును.

తా॥ ఇది చేయదగినదే అని మనస్సునకు అంగీకారమై, ఫలాకాంక్షలేని జనులచే శాస్త్రోక్తముగా జరుపఁబడు యజ్ఞము సాత్త్వికయజ్ఞ మగుచున్నది.

12. అభిసంధాయ తు ఫలం దంభార్థమపి చైవ యత్।
ఇజ్యతే భరతశ్రేష్ఠ! తం యజ్ఞం విద్ధి రాజసమ్ ॥

అర్జునా! కేవలమ్ము ఫలాభిరతిని,
స్వాతిశయమున, దాంభికభావ మలర,
సలుపు యజ్ఞకర్మమ్ము రాజసము వినుము.

తా॥ అర్జునా, కేవలము ఫలమునే కాంక్షించుచు, స్వాతిశయమగు దాంభిక భావముతో చేయఁబడు యజ్ఞము రాజసయజ్ఞమని తెలిసికొనుము.

13. విధిహీనమసృష్టాన్నం మంత్రహీన మదక్షిణమ్।
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే ॥

మంత్రహీనమై, శాస్త్రసమ్మతముగాక,
దానదక్షిణాదులును శ్రద్ధయునులేక,
అన్నదానశూన్యముగ చేయఁబడుచున్న
యజ్ఞకర్మము తామసయజ్ఞ మంద్రు.

తా॥ శాస్త్రసమ్మతముకానిది, మంత్రములేనిది, దానము, దక్షిణ, శ్రద్ధలేనిది, అన్నదానము జరుగనిది అగు యజ్ఞమును తామస యజ్ఞమని చెప్పుదురు.

## త ప స్సు

14. దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవం।
బ్రహ్మచర్యమహింసా చ శారీరం తప ఉచ్యతే ॥

బ్రాహ్మణులను, జ్ఞానులను, దేవతల గురుల
పూజసేయుట, శౌచమ్ము బూనియుంట,
బ్రహ్మచర్య, మహింస. సద్వర్తనమ్ము,
పలుకఁబడు దైహికమగు తపస్సటంచు.

తా॥ బ్రాహ్మణులను, జ్ఞానులను, గురువులను, దేవతలను పూజించుట, శుచిగా నుండుట, బ్రహ్మచర్యము, అహింస పాటించుట, సద్వర్తనము కలిగియుండుట, ఇవి శారీరక మైన తపస్సుగా చెప్పఁబడుచున్నవి.

15. అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే ॥

అన్యులకు బాధ కల్గింపనట్టిదియును
హితము ప్రియమును సత్యమై యెసగువాక్కు,
ధర్మశాస్త్రాది పుస్తకాధ్యయన నిరతి,
వాచికతపస్సుగా చెప్పఁబడెను పార్థ!

తా॥ అర్జునా. ఎవరికి బాధ కల్గించనదియు, హితము, ప్రియకరము, సత్యము అయిన వాక్కు, ధర్మశాస్త్ర పఠనమును వాచిక మైన తపస్సుగా చెప్పబడినవి.

16. మనః ప్రసాదస్సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః ।
భావసంశుద్ధిరిత్యేతత్తపో మానస ముచ్యతే ॥

మౌనవృత్తియును, ప్రసన్నమైన మనసు,
సౌమ్యగుణ, మాత్మనిగ్రహశక్తి తనరి
భావమున నిర్మలత్వము వఱలుటయును
ప్రాజ్ఞు లనిరి మానసికతపమ్మటంచు.

తా॥ మౌనము, ప్రసన్నమగు మనసు, సత్స్వభావము, ఆత్మనిగ్రహము, మంచి తలపులు, కలిగియుండుట మానసిక మైన తపస్సుగా చెప్పబడినవి.

17. శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్త్రివిధం నరైః ।
అఫలాకాంక్షిభిర్యుక్తైః స్సాత్త్వికం పరిచక్షతే ॥

ఇట్లు త్రివిధమై యలరు నీతపమును
ఫలమునం దాశ లేనట్టివారు మిగుల
శ్రద్ధతోగూడి నియమితస్వాంతులగుచు
నాచరించిన సాత్త్వికమండ్రు దాని.

తా॥ ఇట్లు శారీరకము, వాచికము, మానసికము అనబడెడు త్రివిధమగు తపమును ఫలాభిలాషలేని చిత్తనిగ్రహులు శ్రద్ధతో నాచరించినయెడల ఆ తపమును సాత్త్వికతపము అందురు.

18. సత్కారమాన పూజార్థం తపో దంభేన చైవ యత్।
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువం ॥

ఇతర మనుజులు తనను పూజించి సత్క
రింపవలె నను డాంబికవృత్తి తోడ
చేయు తపము రాజసమని చెప్పఁబడును,
అట్టి తప మస్థిరము వ్యర్థమగును గూడ.

తా॥ ఇతరులు తనను గౌరవింపవలయునను అభిలాషతో డాంబికముగ చేయఁబడిన తపస్సు రాజసతపమని చెప్పబడెను. ఆ విధమైన తపస్సు వ్యర్థమైనది, అస్థిరఫలము గలది అగుచున్నది.

19. మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః।
పరస్యోత్సాదనార్థం వా తత్తామస ముదాహృతం ॥

పరులకు విపత్తు కల్గించు కొఱకు గాని,
తన శరీరము బాధించుకొనుచు గాని,
మూర్ఖమైన పట్టుదలను పూని కాని,
చేయు తపము తామసమని చెప్పఁబడును.

తా॥ ఇతరులకు ఆపదలను కల్గించుటకు, శరీరమును బాధ పెట్టుచును, మూర్ఖమైన పట్టుదలతోడను చేయబడుచున్న తపము తామసిక తపమని చెప్పఁబడును.

## దానము

20. దాతవ్యమితి యద్దానం దీయతేఽనుపకారిణే।
దేశే కాలే చ పాత్రే చ తద్దానమ్ సాత్త్వికం స్మృతమ్ ॥

తనకు నుపకృతి లేకపోయినను కూడ
దేశ కాల పాత్రమ్ముల స్థితినిఁబట్టి
తగిన దని తోచి చేసిన దానమెల్ల
తలఁపఁబడుచుండు సాత్త్వికదాన మనుచు,

తా॥ తనకు తిరిగి ప్రత్యుపకారము లేకపోయినను, దేశకాల పరిస్థితులు తగినవిగా చూచి, దానము తీసికొనువాడు దాన మిచ్చుటకు యోగ్యుడు అని తోచి, చేసిన దానము సాత్త్వికదానమని యెంచబడుచున్నది.

21. యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః।
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతం ॥

ప్రత్యుపకృతిని పొందు భావమున గాని,
తన కిది తిరిగి లాభించు ననుచు గాని,
చిత్తమున బాధపడిగాని, చేసినట్టి
దాన మెల్ల రాజసమని తలపఁబడును.

తా॥ దానము చేసినందువలన ప్రత్యుపకారమును ఆశించి గాని, దీనివలన మనకు మరల లాభము రాగలదని గాని, అయ్యో! ఈ దానము చేయకతప్పదు గదా అని బాధపడి గాని, చేసిన దానము రాజసదానము.

22. అదేశకాలే యద్దానమపాత్రేభ్యశ్చ దీయతే।
అసత్కృత మవజ్ఞాతం తత్తామస ముదాహృతం ॥

తగని వగు దేశకాలపాత్రముల యందు,
చూపదగు గౌరవమ్మును చూపకుండ,
ఇతరుల నవమాన పఱచి ఇచ్చునట్టి
దానము వచింత్రు తామసదాన మనుచు.

తా॥ దేశ కాలములు, తీసికొనువాడును దానమునకు అర్హములుకాక, ఏమాత్రము గౌరవము చూపక, అవమానము కూడ చేయుచు ఇచ్చునట్టి దానము తామసదానమని చెప్పుదురు.

## ఓమ్ తత్ సత్

23 ఓం తత్సదితి నిర్దేశో బ్రాహ్మణస్త్రివిధః స్మృతః ।
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా ॥

బ్రహ్మ "మోం" "తత్తు" "సత్తని" పలుకబడెడు
త్రివిధపదములచే నిర్ధరింపబడియె;
యజ్ఞములు, వేదములును బ్రాహ్మణులు గూడ
వానినుండియె సృష్టింపఁబడెను మొదట.

తా॥ ఆ పరబ్రహ్మమునకు 'ఓం తత్ సత్' అను మూడు నామము లీయబడినవి. సృష్ట్యాదియందు ఈ నామత్రయము వలననే బ్రాహ్మణులు, వేదములు, యజ్ఞములు సృష్టింపఁబడెను.

24. తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః ।
ప్రవర్తన్తే విధానోక్తాస్సతతం బ్రహ్మవాదినాం ॥

కాన, వేదవేత్తలు విధిక్రమము లైన
యజ్ఞ దాన తపఃక్రియ లనవరతము
'ఓం' అనెడు ప్రణవమును ముందుచ్చరించి
యే అనుష్ఠించుచుందు రీ ఋషులను పార్థ!

తా॥ కావున వేదవేత్తలు 'ఓం' అను పదమును ప్రథమమున ఉచ్చరించి, ఆ పిమ్మటనే యజ్ఞ దాన తపములగు క్రియలను అనుష్ఠించుచుండిరి.

25. తదిత్యనభిసంధాయ ఫలం యజ్ఞ తపఃక్రియాః ।
దానక్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాంక్షిభిః ॥

అట్లె మోక్షమ్ము కాంక్షించునట్టి జనులు
ఫలమునందే విధమ్మగు వాంఛలేక
వివిధ యజ్ఞ తపో దాన విధుల చేయు
చుందు రెపుడు 'తత్' అను నామముచ్చరించి.

తా॥ ఆ విధముగనే మోక్షకాములు ఫలాభిలాష లేక, ప్రథమమున 'తత్' అను పదము నుచ్చరించి ఆ తరువాతనే వివిధములగు యజ్ఞ దాన తపములను, ఇతర కర్మములను ఆచరించుచుందురు.

26. సద్భావే సాధుభావే చ సదిత్యే తత్ప్రయుజ్యతే।
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే॥

'ఉన్న' దని 'మంచి' దని అర్థమొసఁగు కొఱకు
వాడుచుందురు 'సత్' అను పదము నెపుడు;
అట్లె శ్రేష్ఠమౌ కర్మమ్ము లందుగూడ
వాడుచుందురు 'సత్' అను పదము నెపుడు.

తా॥ 'ఉన్నది' 'మంచిది' అను అర్థము వచ్చు కొఱకును, ఏ కార్యమైనను శ్రేష్ఠమైనది అని చెప్పుటకును 'సత్' అను పదమును వాడుదురు.

27. యజ్ఞే తపసి దానే చ స్థితిః సదితి చోచ్యతే।
కర్మ చైవ తదర్థీయం సదిత్యే వాభిధీయతే॥

యజ్ఞ దాన తపమ్ములయందు కల్గు
స్థిరమయిన నిష్ఠ 'సత్' అని చెప్పబడును;
ఈశ్వరప్రీతి కొఱ కాచరింపఁబడెడు
కర్మములు చెప్పబడును సత్కర్మములని.

తా॥ యజ్ఞమునందు, దానమునందు, తపమునందు, స్థిరమయిన నిష్ఠ యున్నపుడు దానిని కూడ సత్ అను పదముతో చెప్పుదురు. ఈశ్వర ప్రీత్యర్థము చేయు కర్మములను కూడ సత్కర్మములని చెప్పుదురు.

28. అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్ ।
అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ ॥

అర్జునా! శ్రద్ధలేక చేయఁబడునట్టి
యజ్ఞతపములు దానాదులైన క్రియలు
తెలుపుచుందు రసత్కార్యములని, ఇట్టి
వానిచే గల్గబో విహపరఫలము లెవియు.

తా॥ అర్జునా! శ్రద్ధలేక చేయఁబడుచున్న యజ్ఞ దాన తపమ్ములను "అసత్" అను పదము వాడి అసత్కార్యములని చెప్పుచుందురు. అట్టి అసత్కార్యము లొనర్చినందువలన, ఇహమున గాని పరలోకమున గాని యేమియు ప్రయోజనము లభింపదు.

ఇది ఉపనిషదర్థప్రతిపాదకమును, బ్రహ్మవిద్యయు, యోగశాస్త్రమును,
శ్రీకృష్ణార్జున సంవాదమునగు శ్రీమద్భగవద్గీత
యందలి శ్రద్ధాత్రయ విభాగయోగమను
పదునేడవ అధ్యాయము
* సమాప్తము *

# గీతామృతము

## శ్రీమద్భగవద్గీత

## మోక్షసన్న్యాసయోగము

## పదునెన్మిదవ అధ్యాయము - సారాంశము

ప్రధాన విషయము :—

మోక్షమనగా విడుదల, ప్రాపంచిక కర్మ బాధలనుండియు — జనన మరణములనుండియు విముక్తి గలిగి పరమాత్మ సాయుజ్యమును పొందుట. వేనిని త్యజించగలిగిన ఈ మోక్షము లభించునో ఆ విషయమును ఇందు తెలుపబడినది.

ఇది గీతయందు తుది అధ్యాయము. మొదటి పదునేడధ్యాయములలో చెప్పఁబడిన కర్మ, జ్ఞాన, భక్తియోగ సంబంధమైన ముఖ్యాంశములను శ్రీకృష్ణభగవానుఁడు ఈ అధ్యాయమున అర్జునునకు మరల నొక్కి చెప్పి అతని భ్రమనంతయు నశింపఁజేసెను. ఒక విధముగా ఈ అధ్యాయము గీతా సారము అని చెప్పవచ్చును.

ఇందలి ముఖ్యాంశములు —

త్యాగము, సన్న్యాసములను గూర్చిన వివరణము — కర్మాచరణమునకు కారణములు, ఆధారములు — జ్ఞానము, కర్మము, బుద్ధి, ధైర్యము, సుఖము వీని త్రివిధ రూపములు — చతుర్వర్ణముల జనులు — వారి వారి సహజ కర్మములు — బ్రహ్మసాయుజ్యము పొందుట కర్తవ్యతలు — తుది మాటగా అర్జునునకు ఉద్బోధము — గీత యొక్క మహిమ — సంజయుని ప్రశంస.

## సారాంశము

స్వామీ! సన్యాసమననేమి. త్యాగమనగా నెట్టిది వీనిని గూర్చి వినగోరుచున్నాను అని అర్జునుఁడడుగగా శ్రీకృష్ణభగవానుఁడిట్లు చెప్పెను.

అర్జునా, ఫలాపేక్షతో జేయు కామ్యకర్మములను త్యజించుట సన్యాసము. సర్వకర్మఫలములను వదలి ప్రవర్తించుట త్యాగము. అయినను కర్మములందు యజ్ఞ, దాన, తపములు శ్రేష్ఠములైనవి గమక వీనిని వదల రాదు. కర్మఫలము నాశింపక వీని నాచరించుచుండవలెను.

ప్రకృతిగుణములే మనుజులను కర్మములకు ప్రేరేచును. కర్మములను విడచుట ప్రాణులకు శక్యముఁగాని పని. కర్మఫలమును మనసా పరిత్యజించిన వాడే త్యాగి. త్యాగఫలసిద్ధి అతనికి లభించును.

వేదాంతశాస్త్రమగు సాంఖ్యమున కర్మాచరణమునకు కారణము లయిదు చెప్పబడినవి అవి శరీరములు, ఇంద్రియములు, వృత్తులు, కర్త, దైవము అని. కర్మాచరణమునకు ముఖ్యహేతువులు, ఆధారములు ఏవనగా 1. కర్మసంబంధమైన వస్తువును గూర్చిన జ్ఞానము, 2. తెలియదగిన వస్తువు, 3. తెలిసికొనువాఁడును. ఈ విషయ మెఱుఁగఁజాలని మనుజుఁడు అజ్ఞానముచే తానే కర్మములకు కర్త ననుకొనుచున్నాడు.

క్రిందటి అధ్యాయమున త్రివిధములగు యజ్ఞము, దానము, తపములను గూర్చి చెప్పబడినది. అట్లే జ్ఞానము, కర్మము, కర్త, బుద్ధి, ధైర్యము, సుఖము అనునవి గూడ గుణభేదముచే మూఁడు విధములుగా నున్నవి — సాత్త్వికము, రాజసము, తామసము అని. భగవంతుని సర్వవ్యాపిగను, సర్వభూతములందున్న ఆత్మ ఒక్కటేయనియు, అదియే పరమాత్మ యనియు, నెఱిఁగి — మనఃప్రాణేంద్రియములను ధైర్యముగ నిగ్రహింప గలిగి — చేయదగిన విధ్యుక్త కార్యము, చేయదగని అకార్యము విచక్షణతో గ్రహించి — రాగద్వేషములు, ఫలాపేక్షలు, ఆసక్తిలేక కర్మాచరణ మొనర్చుట — వాని ద్వారా దుఃఖమును నశింపజేయు శాశ్వత సుఖము

నంపుటయు సాత్త్వికమార్గము. మానవు లీ మార్గమున చరించుటకుగల సంకల్పము కలుగఁజేయునదియే సాత్త్వికజ్ఞానము. సాత్త్విక కర్మము, సాత్త్విక కర్తృత్వము, సాత్త్వికబుద్ధి, సాత్త్విక సుఖము. ఇవి ప్రశస్తములు, అనుసరణీయములు. రాజసగుణములు మనుజుని కర్మఫలబంధములందు త్రోయగా, తామసగుణములు మనుజుని అజ్ఞానమున ముంచి మూర్ఖుని జేయు చున్నవి. ఈ త్రిగుణములచేతను బంధింపఁబడని వస్తువేదియు లేదు

మనుజులలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులగు నాలుగు వర్ణములవారికిని వారి జన్మాంతరసంస్కారము ననుసరించియున్న స్వభావము వలన పుట్టిన గుణములను బట్టి వారి వారి కర్మములు విభజింపబడి యున్నవి. బ్రాహ్మణులకు శమదమములు, జ్ఞాన విజ్ఞానములు — క్షత్రియులకు శౌర్య ధైర్యములు, దానము, న్యాయపాలనము — వైశ్యులకు కృషి, గోరక్షణ, వర్తకము — శూద్రులకు లోకోపకారములగు వృత్తి సేవయు, ముఖ్య సహజధర్మములు. ఎవరి కర్మమును వారు విధ్యుక్తముగ నాచరించుట వలన జ్ఞానసిద్ధి కలుగుచున్నది. స్వధర్మ నిర్వహణమే భగవదారాధన. పరధర్మమున కంటె స్వధర్మమే సర్వవిధముల శ్రేయోదాయకము.

మనోనిగ్రహుఁడు, సంగరహితుఁడు, కర్మఫల పరిత్యాగముతో కూడిన నిష్కామ కర్మాచరణముచే సిద్ధిని పొందుచున్నాడు. నిర్మలమైన బుద్ధి, రాగద్వేషాది ద్వంద్వములు లేకపోవుట, ఇంద్రియ నిగ్రహము, వైరాగ్యము, ధ్యాననిష్ఠ సర్వమునందు సమదృష్టి, మున్నగునవి మనుజునకు జ్ఞానసిద్ధిని గలుగఁజేసి బ్రహ్మసాయుజ్యము పొందుటకు అర్హత నిచ్చు చున్నవి.

అర్జునా ! నాయందు భక్తితత్పరుఁడై నన్నాశ్రయించియున్న మనుజుఁడే నా వాస్తవతత్త్వమును తెలిసికొనగలిగి అంతమున నాయందు లీనమగుచున్నాడు. అందువలన నీవును ధ్యానయోగివై సర్వ కర్మములను నా కర్పించి నిత్యమును నాయందు నీ చిత్తమును లగ్నము చేసియుంచుము.

అన్ని కష్టములనుండియు దాటగలవు. సర్వ హృదయములందున్న ఈశ్వరుని నమ్మియుండుము. నీకు శాశ్వత పరమపదము లభింపగలదు.

సర్వ భూతకోటుల హృదయములందుండి ఈశ్వరుడు మాయా బలముచే వారిని వారి వారి సంస్కారానుసారముగ కర్మములందు యంత్రపు బొమ్మలవలె త్రిప్పుచుండును. అర్జునా! ఈ విధముగ ప్రకృతి నెవరును అతిక్రమించలేరు. అహంకారముచే నీవు యుద్ధము మానఁదలచినను అది వ్యర్థప్రయత్నమే. నీ ప్రకృతియే నీ సహజకర్మయగు యుద్ధమునకు నిన్ను నియోగించును. నీవు నీ ప్రకృతి కధీనుడవై యుద్ధము చేయకతప్పదు. ఇది అతిరహస్యమైన జ్ఞానము. నీకు ప్రత్యేకముగ చెప్పితిని. నా మాట వినక పోదువా చెడుదువు. కావున ఈ చెప్పినదంతయు నీవు మనసులో చక్కగా విమర్శించుకొనుము. ఆ తర్వాతనే నీ యిష్టమెట్లో అట్లే యొనర్పుము.

శ్రీకృష్ణుడంతతో ఆగలేదు. మఱియొకమారు అర్జునుని గట్టిగా హెచ్చరించదలచి ఇట్లు నొక్కి చెప్పెను.

అర్జునా! నీవు నాకు పరమాప్తుఁడవు. నీ మేలు కోరి ఈ పరమ రహస్యమగు ధర్మమును మరల చెప్పుచున్నాను. ఇది అంతయు సత్యమని శపథము చేసి చెప్పుచున్నాను. వినుము. అన్ని ధర్మములను వదలి నన్నొక్కనినే శరణు పొందుము. నాకు భక్తుఁడవు కమ్ము. నన్నే పూజింపుము. నాకే నమస్కారము లర్పింపుము. నిన్ను నిశ్చయముగా పాపవిముక్తుని జేసెదను. మోక్షార్హుని చేసెదను.

నీకు బోధింపఁబడిన ఈ గీతాశాస్త్రమును దైవభక్తి, తపోనిరతి, గురుసేవ లేనివారి కెన్నడును చెప్పరాదు. ఈ గీతాశాస్త్రమును నా భక్తుల కుపదేశించు మనుజుఁడు నాయందు గల భక్తిచే నన్నే పొందుచున్నాడు. గీతా ప్రచారకుని కంటె నాకు ప్రియ మొనర్చువాడు వేఱొకఁడెవ్వడును లేడు. గీతాధ్యయనము జ్ఞానయజ్ఞరూపముగ నన్నారధించుటయే. గీతను శ్రద్ధగా వినువారును పుణ్యలోకముల కేగుదురు.

అర్జునా ! నా యీ మాటలను శ్రద్ధగా వింటివా ? ఇప్పుడైనను నీభ్రమ నశించినదా లేదా ? చెప్పుము అని శ్రీకృష్ణుడు ప్రశ్నింపగా అర్జునుఁడు, "హే కృష్ణా ! హే ప్రభూ ! నీ ప్రబోధము వలన నీ అనుగ్రహము వలన నా భ్రమయంతయు నశించినది. జ్ఞానము కలిగినది, సందేహములన్నియు పటాపంచలై పోయినవి. ఇంక నీ యాజ్ఞ ప్రకారమే చేయుదును" అని యుద్ధ సన్నద్ధుడయ్యెను.

* * * * *

వ్యాసమునీంద్రుని వరముచే సంజయునికి దివ్యదృష్టియు, ఎవరికిని కనబడకుండయే యుద్ధభూమి యందు సంచరించి అందలి విశేషములను చూడగలుగు శక్తియు లభించెను. అట్లు గ్రహించిన శక్తిచే సంజయుఁడు యుద్ధ సమాచారములను అంధుఁడగు ధృతరాష్ట్రునకు ఎప్పటికప్పుడు చెప్పుచుండెను. శ్రీకృష్ణార్జునుల మధ్య నడచిన ఈ అద్భుత సంభాషణము వినిన సంజయునకు దేహమంతయు పులకించినది. ఆ సంభాషణమును శ్రీకృష్ణుని విశ్వరూపమును మరల మరల తలఁచుకొనుచు తాను పొందిన మహదాశ్చర్యమును, ఆనందమును ధృతరాష్ట్రున కెఱిగించెను.

శ్రీకృష్ణార్జునుల మధ్య జరిగిన ధర్మసంయుత సంభాషణ రూపమైన ఈ గీతాశాస్త్ర మతి పవిత్రమైనది. పుణ్యదాయకమైనది. ఎచ్చట యోగీశ్వరుడగు శ్రీకృష్ణుఁడును, ధనుర్ధారియైన అర్జునుడును ఉందురో అచ్చట సంపద, విజయము, ఐశ్వర్యము, నీతియు స్థిరముగా నుండును.

ఈ అధ్యాయమందలి ముఖ్య శ్లోకములు

2, 11, 19, 29, 41, 47, 51—53, 62, 66,

67, 72, 73, 78

# శ్రీ మ ద్భ గ వ ద్గీ త

## మో క్ష స న్న్యా స యో గ ము

## ప దు నె ని మి ద వ అ ధ్యా య ము

అ ర్జు న ఉ వా చ :— అర్జునుఁడు అడిగెను.

1. సన్న్యాసస్య మహాబాహో ! తత్త్వమిచ్ఛామి వేదితుమ్ ।
త్యాగస్య చ హృషీకేశ ! పృథక్కేశి నిషూదన ! ॥

కేశివిధ్వంసకా ! హృషీకేశ ! కృష్ణ !
త్యాగసన్యాసముల యొక్క తత్త్వములను
తెలిసికొనవలె నని కోర్కె కలదు నాకు,
వేఱువేఱుగ జెప్పుము వీని గూర్చి.

తా॥ ఓ హృషీకేశా, కేశివిధ్వంసకా, కృష్ణా! త్యాగము యొక్కయు, సన్యాసము యొక్కయు వాస్తవతత్త్వములను గురించి వినవలెనని నాకు కోర్కె కలదు. వీనిని గూర్చి వేఱువేఱుగ చెప్పుము.

శ్రీ భ గ వా ను వా చ :— శ్రీభగవానుఁడు చెప్పెను.

2. కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః ।
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః ॥

ఫలము నొసఁగున వగు కర్మములను వదలి
పెట్టియున, అది సన్యాస మనిరి బుధులు!
వివిధ కర్మఫలమ్ముల విడచి నపుడు
పండితులు త్యాగమనుచును పలికి నారు.

తా॥ కామ్యకర్మములను, అనగా ఏదోయొక ఫలము నిచ్చుచుండు కార్యములను వదలిపెట్టుటయే సన్యాసమని చెప్పిరి. నానావిధములయిన కర్మఫలములను విడచి పెట్టునపుడు గూడ అతడు త్యాగము నొనర్చినవాడే అని పండితులనిరి.

3. త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః।
యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యమితి చాపరే ॥

కర్మము లవెల్ల దోషయుక్తములు గాన
త్యాజ్యమని కొందఱు విబుధులనిరి పార్థ!
కాని, యజ్ఞ తపో దాన కర్మములను
విడువరాదని కొందఱు నుడువు చుంద్రు.

తా॥ ప్రతి కర్మమునందు నేదో యొక్క దోషముండును. ఆ కారణముచే కర్మములన్నియు విడువదగినవే అని కొందఱనిరి. కాని, యజ్ఞ దాన తపములను మాత్రము విడువరాదని మఱి కొందఱనిరి.

4. నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ।
త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధః సంప్రకీర్తితః ॥

భరతవంశోత్తమా, పార్థ, భవ్యపురుష!
త్యాగమును గూర్చి నా నిశ్చయమును వినుము,
త్యాగ మది మూడు విధములై తనరు ననుచు
బాగుగా పూర్వమే చెప్పఁబడినది కద.

తా॥ ఓ పార్థా! త్యాగమును గూర్చి నా నిశ్చయము నిక వినుము. కర్మ త్యాగము మూడువిధములు. సాత్త్విక రాజస తామసమ్ములని వెనుకనే చెప్పితిని కదా.

5. యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్యం కార్యమేవ తత్।
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ ॥

ధరణియందు తపోయజ్ఞదానములను
విధిగ చేసి తీరవలయు, విడువరాదు;
నిఖిల సద్గుణవంతులై నెగడుచున్న
మనుజులను గూడ నవ్వి పావనము జేయు.

తా॥ ఏ కర్మములను వదలినను తపము, యజ్ఞము, దానము అను వానిని విడువ రాదు. తప్పక ఆచరింపవలసినదే. గుణవంతులైన మనుజులను గూడ అవి పావనము జేయును.

6. ఏతాన్యపి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ।
కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మతముత్తమం॥

ఇట్టి విధ్యుక్తకర్మమ్ములెల్ల పార్థ!
ప్రతిఫలమ్మును సంగభావమును వదలి
చేయవలెనని నాయభిప్రాయ మిద్ది
శ్రేష్ఠమైనదియును, సునిశ్చితము గూడ.

తా॥ పార్థ! యజ్ఞ దాన, తపోదాన రూపమైన కర్మములును ఇతర విధ్యుక్త కర్మములును ఫలాపేక్షయు, ఆసక్తియు, లేక చేయదగినవే. బాగుగ నిర్ణయింపబడి నదియు, శ్రేష్ఠమైనదియునగు నా అభిప్రాయ మిదియే.

7. నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే।
మోహాత్తస్య పరిత్యాగస్తామసః పరికీర్తితః॥

వేదశాస్త్రాదు లందలి విధులయందు
చెప్పఁబడిన కర్మముల త్యజింపఁదగదు;
భ్రమకు లోనయి అట్టి కర్మముల విడచి
నట్లయిన నది తామసత్యాగమగును.

తా॥ శాస్త్రవిహితమైనవియు, స్వధర్మమయినవియు నగు కర్మములను మానవుఁడు విడువరాదు. తెలియనితనముచే భ్రమకు లోనయి వానిని త్యజించినచో నది తామసత్యాగమగును.

8. దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశ భయాత్త్యజేత్।
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్॥

కాయకష్టము దుఃఖము కల్గుననుచు
భయముజెంది కర్మమ్ముల వదలునెడల
రాజసత్యాగ మందురు ప్రాజ్ఞులట్టి
త్యాగి పొందనేపొందడు త్యాగఫలము.

తా॥ శరీరమునకు కష్టము కలుగుననుచు, దుఃఖమును కలుగజేయుననుచు తలంచి విధ్యుక్త కర్మములను విడచువాని త్యాగము రాజసత్యాగము. అట్టి త్యాగికి త్యాగఫలమేమియు లభింపదు.

9. కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున
సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగ స్సాత్త్వికోమతః ॥

అర్జునా, శాస్త్రవిధ్యుక్త మైన కర్మ
మెట్టి యాసక్తియును ఫలాపేక్ష లేక
ఆచరించిన కర్తవ్యమనుచు నెఱిఁగి,
సాత్త్వికత్యాగ మన నిశ్చయముగ నదియె.

తా॥ ఈ పని చేయదగినదియే యని గ్రహించి, శాస్త్రవిధ్యుక్తమైన కర్మమును ఆసక్తి గాని ఫలాపేక్ష గాని లేక ఆచరించుచున్నట్లయిన అది నిశ్చయముగ సాత్త్వికత్యాగమే.

10. న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే।
త్యాగీ సత్త్వ సమావిష్టో మేధావీ ఛిన్నసంశయః ॥

సత్త్వగుణుఁడైన త్యాగి సంశయము లేని
బుద్ధిశాలియై మనసున పొందఁబోడు
కష్టమగు కర్మమం దీర్ష్యగాని, సులభ
సాధ్య కర్మమ్ములందు నాసక్తి గాని.

తా॥ సత్త్వగుణములు కలిగిన త్యాగి సంశయము లేమియులేని బుద్ధిశాలియు, మేధావియు అయి, కష్టప్రదములు, కామ్యములు అయిన కర్మములయందు ద్వేషభావము గాని, సులభసాధ్యములు, శుభప్రదములు అయిన కర్మములందు అభిమానము గాని కలిగి ఉండడు. వానికన్నియు సమానమే.

11. న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః।
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే ॥

కర్మములనెల్ల సంపూర్తిగా త్యజింప
మానవునికిని శక్యమ్ముగాదు, కాన,
ఎవఁడు కర్మఫలమును త్యజింపఁగలడో
ఆతఁడే చెప్పఁబడుచుండు త్యాగియనుచు

తా॥ కర్మములను నిశ్శేషముగా త్యజించుట దేహధారికి శక్యము కాదు. కర్మ ఫలమును మనసా త్యజింపఁగల్గినవాడే త్యాగి యని పిలువబడుచున్నాడు.

12. అనిష్ట మిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్।
భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్యాసినాం క్వచిత్ ॥

ఆచరించు కర్మమ్ముల ననుసరించి
అందుదురు ఫలము ప్రియాప్రియములు మిశ్ర
మనగ మూడువిధములు జన్మాంతరమున;
త్యాగవంతుల కెట్టిబాధయును లేదు.

తా॥ మానవులు తామాచరించు కార్యాకార్యముల ననుసరించి, మూడు విధములైన ఫలము శుభము గాని, అశుభము గాని, శుభాశుభ మిశ్రముగాని మరణానంతర జన్మమున అనుభవింతురు. కర్మఫలమును త్యజించిన త్యాగికి అట్టి బాధ లేవియు లేవు.

13. పంచైతాని మహాబాహో కారణాని నిబోధ మే।
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వ కర్మణామ్ ॥

కర్మకాండ కంతమగు సాంఖ్యమ్మునందు
వివిధ కర్మకాండలును నెఱవేఱు కొఱకు
కారణము లైదు వచియించినారు మున్ను.
విశదముగ వాని చెప్పెద వినుము పార్థ!

తా॥ అర్జునా, కర్మకాండను గూర్చి చెప్పిన తర్వాత వేదాంతమను సాంఖ్య శాస్త్రమునందు నానావిధ కర్మములు నెఱవేరి సిద్ధి నిచ్చుటకు దోహదమైన కారణములు అయిదున్నవని చెప్పిరి. వానిని వినుము.

14. అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్।
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్ ॥

అట్టి కర్మాచరణ విషయమ్మునందు
దేహమును, చేయు కర్త, ఇంద్రియచయమ్ము
పలువిధములై యున్న చేష్టలును మఱియు
దైవ మయిదవహేతువై తనరుచుండు.

తా॥ ఆ కర్మాచరణ విషయమున 1 శరీరము, 2 కర్త, 3 ఇంద్రియములు, 4 పలువిధములై వేఱువేఱగు కార్యములు. 5 దైవము అని అయిదు కారణములున్నవి.

15. శరీరవాఙ్మనోభిర్యత్కర్మ ప్రారభతే నరః ।
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః ॥

న్యాయమార్గమె యయిన నన్యాయమైన
నరుఁడు దేహము, వాక్కు, మనస్సుచేత
మొదలుపెట్టెడు నేకార్యమునకు గాని
అర్జునా ! కారణమ్ములా అయిదె వినుము.

తా॥ మనుజుడు మంచిపని చేసినను, చెడ్డపని చేసినను, వానిని మనోవాక్శరీరములతో ప్రారంభించుటకు గల కారణములా అయిదే.

16. తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు యః ।
పశ్య త్యకృత బుద్ధిత్వాన్న స పశ్యతి దుర్మతిః ॥

కారణము లిటులుండగా కర్మములకు,
తనదు నాత్మనె కర్తగాఁ దలఁచుచున్న
మానవుఁ డసంస్కృతాత్ముఁడు మలినబుద్ధి
యగుటచే కర్మరూపము నరయలేడు.

తా॥ కర్మమును చేయించు కారణము లిట్లుండగా, తానే కర్తను అని తలచుచున్నవాడు కేవలము మలినబుద్ధియు, సంస్కారము లేనివాడును. ఆ కారణముచే వానికి కర్మయొక్క నిజరూపము కానరాకున్నది.

17. యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే ।
హత్వాఽపి స ఇమాన్ లోకాన్నహన్తి న నిబధ్యతే ॥

ఎవ్వనికి కర్తనను నహంకృతియె లేదో,
ఎవని బుద్ధి పోవదో విషయేచ్ఛనంటి,
ఆతఁ డీ మనుజుల చంపినప్పటికిని
చంపనట్టిడె, కర్మపాశముల బడడు

తా॥ తన కర్మములకు తానే కర్తనను అహంకారభావము లేనివాడు, విషయ సుఖములందు తగుల్కొనని బుద్ధిగలవాడును ఈ యెదుటనున్న మనుజులను చంపినను చంపనట్టివాడే. అట్టి వానిని ఏ కర్మపాశములును బంధింపవు.

18. జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా ।
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః ॥

తెలివి, తెలియదగినదియు, తెలియువాడు
కర్మమున మూడు ప్రేరక కారణములు;
కర్త కర్మము మఱి యుపకరణములును
కర్మవృత్తి కాధారమై క్రాలుచుండు.

తా॥ కర్మప్రేరణకు కారణములు ముఖ్యముగా మూడు. వస్తువును నిశ్చయించుకొనువాడు జ్ఞాత (తెలిసికొనువాడు), ఏ వస్తువును నిశ్చయించుకొనునో అది జ్ఞేయము (తెలియదగినది). నిశ్చయించుకొను శక్తి జ్ఞానము (తెలివి). ఇట్లే ప్రతి కర్మమునకు ఆధారములు మూడు విధములు. 1 కర్త, 2 చేయబడు పని, 3 ఆచరణకగు సాధనములు.

19. జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః ।
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి ॥

జ్ఞానమును కర్మమును దాని కర్త గూడ
మూడు విధములు గుణభేదములను బట్టి
అనుచు చెప్పిరి సాంఖ్యమ్మునందు; వాని
నిట యథోక్తముగా వచియింతు వినుము.

తా॥ జ్ఞానము, కర్త, కర్మము అనునవి వానికి గల గుణభేదములను బట్టి ఒక్కొక్కటియు మూడు విధములుగా నున్నవని సాంఖ్యశాస్త్రమునందు నుడివిరి. అవి చెప్పబడిన విధముగానే నేను నీకు చెప్పుచున్నాను వినుము.

జ్ఞానము

20. సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే ।
అవిభక్తం విభక్తేషు తత్ జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ ॥

వేఱువేఱగు నీ భూతవితతియందు
అవ్యయుండయి అలరెడు నాత్మ ఒక్క-
డనుచు నెట్టి జ్ఞానమ్ముచే నరయనగునొ,
దాని నెఱుఁగుము సాత్త్వికజ్ఞానమనుచు.

తా॥ ఈ భూతములన్నియు వేఱువేఱుగ విభజింపబడి యున్నప్పటికి, అవ్యయుఁడుగా ఆ భూతము లన్నిటియందునున్న ఆత్మ ఒక్క-డే అని ఎట్టి జ్ఞానముచే తెలిసికొనగల్గుదువో అదియే సాత్త్వికజ్ఞానము.

21. పృథక్త్వేన తు య జ్జ్ఞానం నానాభావాన్ పృథగ్విథాన్ ।
వేత్తి సర్వేషు భూతేషు తత్ జ్ఞానం విద్ధి రాజసమ్ ॥

వివిధ భూతమ్ములందున వేఱువేఱు
విధములుగనున్న జీవులు పృథ్వియందు
వేఱువేఱైన వనుచు భావింపఁజేయు
జ్ఞాన మనబడు రాజసజ్ఞాన మనుచు.

తా॥ పృథ్వియందు వివిధ భూతములందున్న జీవాత్మలు ఒకటికాక, వేఱు వేఱైనవే అని భావింపఁజేయు జ్ఞానమును రాజసమైన జ్ఞానమందురు.

22. యత్తు కృత్స్నవదేకస్మిన్కార్యే సక్త మహైతుకమ్ ।
అతత్త్వార్థవదల్పం చ తత్తామస ముదాహృతమ్ ॥

ఎట్టి జ్ఞానమ్ము వలన నిర్హేతుకముగ
అఖిల మిదియంచు నొక్క-కార్యమ్మునందె మనసు
తగిలియున్నట్టి జ్ఞానమ్ముతత్త్వమరయ
లేని అల్పమౌ తామసజ్ఞానమండ్రు.

తా॥ ఏదో ఒక్క- కార్యమందే మనస్సు ఆసక్తితో లగ్నమై సమస్తము అదియే యని కారణములేకయే ఏ జ్ఞానము వలన మనుజుడు భావించునో ఆ జ్ఞానము తత్త్వమును తెలిసికోలేనిదియు అల్పము అయిన తామస జ్ఞానముగా బుధులు చెప్పిరి.

## కర్మము

23\. నియతం సంగరహిత మరాగద్వేషతః కృతమ్।
అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్వికముచ్యతే ॥

ద్వేషరాగాదిభావముల్ విడువఁబడుచు
ఫలము నందిచ్ఛయును త్యజింపబడి, సంగ
రహితముగ జేయబడిన శాస్త్రనియత మగు
కర్మ మనబడు సాత్త్వికకర్మమనుచు.

తా॥ అనురాగము గాని ద్వేషము గాని లేక, ఫలము నందభిలాషయు లేక, సంగరహితముగ చేయబడిన కర్మము ఏది ఉన్నదో అది సాత్త్వికమైన కర్మమని చెప్పబడుచున్నది.

24\. యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః।
క్రియతే బహులాయాసం తద్రాజస ముదాహృతమ్ ॥

ఫలమునం దిచ్ఛ గలిగిన వానిచేత,
స్వాంతమం దహంకృతి కలవానిచేత,
అధిక కష్టమ్ముతోడ చేయఁబడునట్టి
కర్మమనఁబడు రాజసకర్మమనుచు.

తా॥ మనసునందహంకారము కలవానిచే గాని, కేవలము ఫలమునం దాసక్తి గలవానిచేత గాని, అతికష్టము మీద గాని చేయఁబడు కర్మము రాజసకర్మము.

25\. అనుబన్ధం క్షయం హింసామనపేక్ష్య చ పౌరుషం।
మోహాదారభ్యతే కర్మ యత్తత్తామసముచ్యతే ॥

తనదుశక్తిని, తన కార్యమున జనించు
హింసయును కష్టనష్టమ్ము లెంచకుండ
చిత్తవిభ్రాంతివశుఁడయి చేసినట్టి
కర్మమనఁబడు తామసకర్మ మనుచు.

తా॥ ఎవడు తన శక్తిసామర్థ్యములను గమనించక, తన కార్యము వలన తనకు ఇతరులకు గలుగు కష్టనష్టములను, బాధను కూడ తలఁపబోక అవివేకముతో కర్మమును ప్రారంభించునో అట్టివాని కర్మము తామసకర్మమని చెప్పుదురు.

## కర్త

26. ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః ।
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే ॥

ముక్తసంగు డహంభావమును త్యజించి
భావమందు ధైర్యోత్సాహపరుఁడు నగుచు
కలిగెడు జయాపజయములవలన నిర్వి
కారుఁడగువాడు సాత్త్వికకర్త యగును,

తా॥ సంగరహితుడు, అహంభావము (తాను చేయుచున్నాననను స్వాతిశయము) లేనివాడు, ధైర్యము, ఉత్సాహము కలవాడు, కార్యము నెఱవేరినను, నెఱవేరక పోయినను నిర్వికారుడు అయిన కర్త సాత్త్వికకర్త.

27. రాగీ కర్మఫలప్రేప్సుర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః ।
హర్షశోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః ॥

కర్మఫలకాంక్షి, హర్షశోకాన్వితుండు,
రాగలోలుఁడు, కలుషాంతరంగయుతుఁడు,
పరుల హింసించువాడు, లోభాత్ముఁడు నగు
కర్త నందురు రాజసకర్త యనుచు.

తా॥ తాను చేయు కర్మఫలము నాసించువాడు, ఆ కార్యమునందే మిక్కుటమైన ఆసక్తికలవాడు, మలినచిత్తుడు, కర్మఫలాఫలములందు సుఖదుఃఖాదులగు వికారములు పొందువాడు, తన కర్మమువలన ఇతరులకు బాధ కలిగించువాడును రాజసకర్త.

28. అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైష్కృతికోఽలసః ।
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే ॥

చంచలాత్ముఁ డజ్ఞాని, విషాదమూర్తి,
పొగరుబోతు సోమరియును, మోసగాడు
బద్ధకస్థుడు నలసుఁడు పాపియు నగు,
కర్త ననెదరు తామసకర్త యనుచు,

తా॥ ఇంద్రియనిగ్రహములేనివాడు, అజ్ఞాని, విచారగ్రస్తుఁడు, పొగరుబోతు, సోమరి, మోసగాడు, బద్ధకస్తుడు, పాపచిత్తుఁడు అయిన వానిని తామసకర్తగా చెప్పుదురు.

29. బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణత స్త్రివిధం శ్రుణు।
ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనంజయ॥

ధైర్యమును బుద్ధియు గుణభేదమును బట్టి
మూడువిధములై యుండు; సంపూర్ణముగను
వేఱువేఱగురీతి తద్విషయములను
విపులముగ చెప్పుచుంటిని వినుము పార్థ!

తా॥ వానియొక్క గుణభేదమును బట్టి ధైర్యము, బుద్ధియు కూడ మూడు విధములై యున్నవి. వేఱువేఱుగ, నిశ్శేషముగా వానిని గూర్చి చెప్పెదను వినుము.

బుద్ధి

30. ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే।
బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధిస్సా పార్థ సాత్త్వికీ॥

ధర్మవృత్తియు మఱియు నధర్మవృత్తి
అర్హమగుకార్యము ననర్హమైనదియును,
బంధమోక్షములును భయాభయము లరయఁ
గలుగు బుద్ధి సాత్త్వికమని తెలిసికొనుము.

తా॥ ఏ బుద్ధి, ధర్మమార్గమై చేయదగు వృత్తిని, అధర్మమై మానదగు వృత్తిని, మంచి కార్యమును, చెడ్డకార్యమును, సంసారబంధమున త్రోయు మార్గమును మోక్షమునకు దారిచూపు విధమును భయాభయములను, తెలుపునో అది సాత్త్వికమైన బుద్ధి.

31. యయా ధర్మమధర్మం చ కార్యం చాకార్యమేవ చ।
అయథావత్ప్రజానాతి బుద్ధి స్సా పార్థ రాజసీ॥

ధర్మపద్ధతి యెదియొ అధర్మ మెదియొ,
చేయదగు కార్యమేదియో చేయరాని
దేదియో, యథార్థముగ గ్రహింపలేని
బుద్ధి ననెదరు రాజసబుద్ధి యనుచు.

తా॥ ధర్మాధర్మములను, కార్యాకార్యములను విభజనగ ఉన్నదున్నట్లు వాస్తవమును గ్రహింపలేని బుద్ధి రాజసము.

32. అధర్మం ధర్మమితి యా మన్యతే తమసాఽఽవృతా।
సర్వార్థాన్ విపరీతాంశ్చ బుద్ధిస్సా పార్థ! తామసీ॥

అర్జునా! అవివేకసమావృతమయి
ధర్మమనుచు నధర్మమున్ దలఁచుచుండి,
అన్ని విషయములను వ్యత్యయముగ నెంచు
బుద్ధి ననెదరు తామసబుద్ధి యనుచు.

తా॥ అర్జునా! అజ్ఞానముచే ఆవరింపబడినదియు, అధర్మమెల్ల ధర్మమనుచు తలఁచుచు, ప్రతి విషయమును విరుద్ధముగను. విపరీతముగను భావించు బుద్ధిని తామసబుద్ధి యనెదరు.

## ధైర్యము

33. ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేంద్రియక్రియాః।
యోగేనావ్యభిచారిణ్యా ధృతి స్సా పార్థ సాత్త్వికీ॥

అచలమై యున్న యెట్టి ధైర్యమ్ముచేత
పార్థ! ఇంద్రియమ్ములు మనఃప్రాణములును
చేయు క్రియల ధర్మము నెడబాయకుండ
యోగబలమున నియమించుచున్న వాని
ధైర్యగుణమును సాత్త్వికధైర్య మంద్రు.

తా॥ అర్జునా! మనుజుఁడే ధైర్యముచేత విషయముల వైపునకు చలింపనట్టి మనస్సు, ప్రాణము, ఇంద్రియముల యొక్క చేష్టలను, యోగబలముచే ధర్మమార్గము నుండి తొలగకుండ చేయునో అట్టివాని ధైర్యశక్తి సాత్త్వికధైర్యమని చెప్పబడును.

34. యయా తు ధర్మకామార్థాన్ ధృత్యా ధారయతేఽర్జున ।
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతిస్సా పార్థ! రాజసీ ॥

అర్జునా! విను మెట్టి ధైర్యమున నరుఁడు
విషయసంగాత్ముఁడై ఫలాపేక్షతోడ
ధర్మకామార్థములు చేయఁదలఁచు, నట్టి
ధైర్యగుణమును రాజసధైర్య మంద్రు.

తా॥ అర్జునా! ఏ విధమగు ధైర్యముచే నరుఁడు ఫలాపేక్షను గలిగియున్న ఆసక్తితో ధర్మకామార్థములను చేయుచుండునో ఆ ధైర్యమును రాజసధైర్యమనెదరు.

35. యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ ।
న విముంచతి దుర్మేధా ధృతిస్సా పార్థ! తామసీ ॥

అర్జునా! ఏ విధమగు ధైర్యమ్ము వలన
దుష్టబుద్ధియై మనుజుఁడు దుఃఖమును, మ
దమ్ము, శోకమ్ము, భయము, నిద్రయును, వీడ
దలఁపడో అది తామసధైర్య మగును.

తా॥ అర్జునా! మనుజుఁడెట్టి ధైర్యముచేత దుష్టబుద్ధియై ప్రవర్తించుచు గర్వము, దుఃఖము, భయము, నిద్ర, విషాదభావము, వీడకయుండునో అయ్యది తామసధైర్యము.

## సు ఖ ము

36. సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ ।
అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాంతం చ నిగచ్ఛతి ॥

దేని నభ్యాస మొనరించి మానవుండు
వ్యథల పోఁద్రోలి ఆనందమందగలడో
మువ్విధములగు నా సుఖమును గురించి
విపులముగ నిప్డు చెప్పెద వినుము పార్థ!

తా॥ అర్జునా! అభ్యాసము వలన దుఃఖములను పోఁగొట్టుకొని మనుజుఁ డానందమును పొందగలుగునట్టి సుఖము మూడు విధములుఁగా నున్నది. దానిని గూర్చి వినుము.

37. యత్తదగ్రే విషమివ పరిణామే ఽమృతోపమమ్ ।
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధిప్రసాదజమ్ ॥

ప్రథమమం దేసుఖము విషప్రాయ మగుచు
అంతమందున అమృతతుల్యమ్మె యగునొ,
పుట్టునెయ్యది యాత్మజ్ఞాన బుద్ధి వలన
అట్టి సుఖమె సాత్త్వికసుఖ మ్మనగఁబడెను.

తా॥ ఏ సుఖము ప్రారంభ దశయందు విషమువలె గన్పడి తుదకు అమృత సమానమై యుండునో, ఎయ్యది నిర్మలమగు ఆత్మజ్ఞానము వలన కలుగుచున్నదో ఆ సుఖము సాత్త్వికము.

38. విషయేంద్రియ సంయోగాద్యత్తదగ్రేఽమృతోపమమ్ ।
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥

విషయసంగమ్ము వలన సర్వేంద్రియముల
కెట్టిసుఖ మాదియందు నమృతసమాన
మగుచు చివర కది విషతుల్యమ్మె యగునొ,
అట్టి సుఖమును రాజసమ్మని వచింత్రు.

తా॥ విషయ సంయోగమునందే యుండు ఇంద్రియచర్యల వలన గలుగు ఏసుఖము ప్రప్రథమమున అమృతసమానముగ తోఁచి చివరకు విషతుల్యముగ పరిణమించునో అది రాజసమని తలపఁబడు చున్నది.

39. యదగ్రే చానుబంధే చ సుఖం మోహనమాత్మనః ।
నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్ ॥

అలసతయు ప్రమత్తత నిద్రవలన బుట్టి
ఆదినుండియు తుదిదాక ఆత్మయందు
ఏ సుఖ మ్మిల భ్రమను పుట్టించుచుండు
ఆ సుఖమ్మె తామససుఖ మ్మనివచింత్రు.

తా॥ సోమరితనము, మొద్దునిద్ర, ప్రమాదముల వలన జనించుచు, ప్రారంభము నుండి అంతము వరకు ఏ సుఖము ఆత్మకు భ్రమను కలుగఁజేసి అజ్ఞానమున త్రోయునో ఆ సుఖము తామసము.

40. న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః।
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిస్స్యాత్త్రిభిర్గుణైః॥

ప్రకృతిజనితమ్ము లగుచును పరగునట్టి
ఈ త్రిగుణములచేత బంధింపఁబడని
వస్తు వీ భూమియందును స్వర్గసీమ
యందు కూడను లేదు, వేదమరు లందు.

తా॥ ప్రకృతిమాయచే పుట్టుచున్న సత్త్వము రజము తమము అను ఈ మూడు గుణములయందు కట్టుబడని వస్తువేదియు భూమియందు గాని, స్వర్గమందు గాని తుదకు దేవతలయందు గాని లేదు.

## బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు

41. బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చ పరన్తప।
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః॥

పార్థ! బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర
జనుల కెల్లను వారి సంస్కారబలము
వలన బుట్టు గుణస్వభావమును బట్టి
వారి కర్మముల్ గూడ విభక్తమయ్యె.

తా॥ అర్జునా! బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర జనులకు వారి వారి జన్మాంతర సంస్కారఫలితముగ పుట్టిన స్వాభావికగుణములనుబట్టియే వారి కర్మములు వేరు వేరుగ నున్నవి.

బ్రా హ్మ ణు లు

42. శమోదమః తపః శౌచం క్షాంతి రార్జవమే ఏవ చ।
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజం ॥

శమదమమ్ములు తపమును శౌచ మోర్పు
సౌమ్యవర్తన జ్ఞాన విజ్ఞాన గరిమ
దైవ గురు శాస్త్రముల భక్తితత్పరతయు
బ్రాహ్మణులకును సహజకర్మములు పార్థ!

తా॥ అర్జునా, బాహ్యేంద్రియ నిగ్రహముతోబాటు, మనోనిగ్రహము, శుచిత్వము, ఓర్పు, ఋజువర్తన, ఆత్మజ్ఞానము, అనుభవజ్ఞానము, దైవగురు ధర్మశాస్త్రములందు భక్తివిశ్వాసములు బ్రాహ్మణులకు స్వాభావిక కర్మములు.

క్ష త్రి యు లు

43. శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధేచాప్యపలాయనమ్।
దాన మీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్ ॥

ధైర్యగుణము శౌర్యమ్ము యుద్ధమ్మునుండి
వెనుదిరుగమియు న్యాయపాలనము కీర్తి
దానశీలతయును కార్యదక్షతయును
క్షత్రియునకు స్వాభావికకర్మము లగు.

తా॥ శౌర్యము, ధైర్యము, కార్యదక్షత, యుద్ధమునుండి వెనుకకు పారిపోయి రాకుండుట, న్యాయపాలనము, కీర్తి, దానము ఇవి క్షత్రియుని సహజ ధర్మములు.

వై శ్య, శూ ద్రు లు

44. కృషి గోరక్ష వాణిజ్యం వైశ్య కర్మ స్వభావజమ్।
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్ ॥

పశుల రక్షణ సేద్యమ్ము వర్తకమ్ము
వైశ్యకర్మము లగును స్వాభావికముగ;
ప్రజలకును మేలుగూర్చు సేవయే ధరిత్రి
శూద్రుల సహజకర్మమ్ము సుమ్ము పార్థ!

తా॥ అర్జునా! పశు సంరక్షణ, వ్యవసాయము, వ్యాపారము వైశ్యుల స్వభావ కర్మము. ప్రజాసమూహమునకు మేలొనగూర్చు వృత్తిసేవలు శూద్రజనులకు స్వభావ సిద్ధమైన కర్మములు.

45. స్వే స్వే కర్మణ్యభిరతస్సంసిద్ధిం లభతే నరః।
స్వకర్మనిరతస్సిద్ధిః యథా విన్దతి తచ్ఛృణు ॥

మానవుఁడు తనకు సహజమైన కర్మ
మందె శ్రద్ధాళువై సిద్ధినందగలఁడు;
అవని స్వీయకర్మనిరతుఁ డగుచు మనుజుఁ
డెట్లు సిద్ధినందునొ వచియింతు వినుము.

తా॥ తనకు స్వాభావికమైన కర్మమందాసక్తికల మనుజుఁడు భగవత్ప్రాప్తి రూపకమగు సిద్ధిని పడయుచున్నాడు. అదెట్లు సాధ్యమగుచున్నదో చెప్పుచున్నాను వినుము.

46. యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః ॥

భూతకోటు లెవ్వనినుండి పుట్టిపెరుగు,
ఎవ్వఁడీ సర్వజగతి వ్యాపించి యుండు,
అట్టి ఈశుని నైజకర్మాచరణము
చేత నర్చించి మనుజుఁడు సిద్ధినందు.

తా॥ మానవుల కందఱకు తమ స్వాభావిక కర్మములను విధ్యుక్తముగ ధర్మమార్గమున ప్రజోపయోగముగ చేయుటయే సర్వవ్యాపియు, సర్వప్రాణుల పుట్టుకకు వృద్ధికి కారణుఁడైన ఈశ్వరు నర్చించుట. అట్టి పూజవలననే మనుజునకు సిద్ధి లభ్యమగుచున్నది.

## స్వధర్మాచరణము

47. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్।
స్వభావ నియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషం ॥

బాగుగ ఆచరింపఁగఁబడుచు నున్న
అన్యధర్మముకంటె నీయవని యందు
స్వీయధర్మమె మేలగు విగుణమయ్యు,
అఘము పొందఁడు స్వీయధర్మాభిరతుఁడు

తా॥ తన స్వధర్మము గుణమునందు తక్కువైనదిగ కన్పించినను, బాగుగా ఆచరణయందున్న అన్యధర్మముకంటె మేలైనది. తన సహజధర్మమును నిర్వర్తించు వానికి పాపము కలుగదు.

48. సహజం కర్మ కౌన్తేయ! సదోషమపి న త్యజేత్।
సర్వారమ్భా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః ॥

అగ్ని నావరించెడు పొగయట్లు సర్వ
కర్మముల, నేదొ దోషమ్ము కలుగుచుండు,
కాన, దోషసమన్విత మైన కూడ
ఎవరికర్మము వారు త్యజింపరాదు.

తా॥ అగ్నిని పొగ యెట్లావరించుకొనియుండునో అట్లే అన్ని కర్మములందును ఏదో విధమైన దోషము ఉండకపోదు. కావున, స్వధర్మమునందేదైన దోషమున్నను ఎవరి స్వధర్మము వారు విడువరాదు.

49. అసక్తబుద్ధి స్సర్వత్ర జితాత్మా విగతస్పృహః।
నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి ॥

సకల విషయమ్ములందు నిస్సంగుఁ డగుచు,
ఆశవీడి మనోనిగ్రహమ్ము కలిగి,
కర్మఫలముల త్యజియింపఁగలుగు నరుఁడు
పొందుచున్నాఁడు నైష్కర్మ్యపుణ్యసిద్ధి.

తా॥ మనోనిగ్రహము కల్గి, ఆశలను త్యజించి, ఏ విషయమందును ఆసక్తి చూపక కర్మఫలమును వీడు మనుజుఁడు, ఏ కర్మమును చేయని నిష్క్రియాత్మకమైన సిద్ధిని పొందుచున్నాఁడు.

50. సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాఽఽప్నోతి నిబోధ మే।
సమాసేనైవ కౌన్తేయ! నిష్ఠా జ్ఞానస్య యా పరా ॥

పార్థ! నైష్కర్మ్యసిద్ధిని బడయువాఁడు
జ్ఞాననిష్ఠకు పర్యవసాన మైన
ఆ పరబ్రహ్మ నేరీతి నందఁగలఁడొ
దాని వచియింతు నిపుడు సంక్షిప్తముగ వినుము.

తా॥ అర్జునా! ఆనైష్కర్మ్యసిద్ధిని పొందిన మనుజుఁడు జ్ఞాననిష్ఠకు పర్యవసానమనదగిన ఆ పరబ్రహ్మసాయుజ్యమును ఏ విధముగా పొందుచున్నాడో దానిని చెప్పుచున్నాను వినుము.

## పరబ్రహ్మస్థితి — జ్ఞాననిష్ఠ

51. బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాఽఽత్మానం నియమ్య చ।
శబ్దాదీన్విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ॥

52. వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః।
ధ్యానయోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః॥

53. అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్।
విముచ్య నిర్మమశ్శాంతో బ్రహ్మభూయాయకల్పతే॥

నిర్మలమగు బుద్ధితో నెగడుచుండి,
దృఢమయిన ఆత్మనిగ్రహ దీక్ష గలిగి,
విషయసుఖముల నెల్లను విడచిపెట్టి,
రాగకోపాది ద్వంద్వ విరహితుఁ డగుచు —

స్వల్పముగతిని, ఏకాంతవాసి యగుచు,
వాఙ్మనఃకాయ నియత భావమునఁ దనరి,
ధ్యానయోగమ్మునందె తత్పరుఁడు నగుచు
అనవరతమును వైరాగ్య మాశ్రయించి —

కామ కోప గర్వము లణగంగఁ ద్రొక్కి,
శాంతుఁడయి అహంకృతిలేక స్వాంతమందు,
బలము చూపక మమకారభావ మెడలి,
పరుల ధన వస్తువుల కాసపడని వాఁడు
బ్రహ్మమందైక్య మగుట కర్హతను పొందు.

తా॥ అర్జునా! పరబ్రహ్మమందైక్యము పొందగల జ్ఞాననిష్ఠునకు ఉండవలసిన గుణములను వినుము. నిర్మలమగు బుద్ధి, చాంచల్యములేక దృఢమగు ఆత్మనిగ్రహము,

విషయములందనాసక్తి, రాగకోపాది ద్వంద్వములు లేకుండుట, మితభోజనము, ఏకాంతవాసము, వాక్కు మనసు దేహములందు నియతమైన వృత్తి, నిత్యము భగవద్ధ్యానము, వైరాగ్యము. కామ కోప గర్వ అహంకారములు లేకుండుట, మమకారము బలము చూపకుండుట, పరుల ధన వస్తువులు తీసికొనకుండుట, ప్రశాంత భావము కలిగియుండుట ఈ సద్గుణములు కల మనుజుఁడు బ్రహ్మసాయుజ్యము పొందుట కర్హుఁడు.

54. బ్రహ్మభూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి ।
సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్ ॥

అట్టి బ్రహ్మైక్యసంస్థితి నందువాడు
వ్యథయు వాంఛయు లేక సర్వమ్మునందు
కడుప్రసన్నుఁడై సమదృష్టిఁ గలిగియుండి,
పడయఁగలుగును నాయందు పరమభక్తి.

తా॥ పైఁ జెప్పిన విధముగా బ్రహ్మమందైక్యము నందినవాడు దేనికిని దుఃఖించడు, దేనిని వాంఛింపడు, ప్రసన్నమగు మనస్సుతో సర్వమునందు సమదృష్టిని గలిగి నాయందు ఉత్తమమైన భక్తిని పొందుచున్నాడు.

55. భక్త్యా మామభిజానాతి యావాన్యశ్చాస్మి తత్త్వతః ।
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్ ॥

ఏనెవ్వఁడ, నెట్టివాడనో ఈ యథార్థ
మెల్ల ఆ భక్తివలననే యెఱుఁగునతఁడు,
నాదుతత్త్వమెఱిఁగి అనంతర మతండు
కలసిపోవును నాయందె కడకు పార్థ!

తా॥ అర్జునా, నాయందు ఉత్తమభక్తిగల మనుజుఁడు ఆ భక్తివలననే నేనెవరినో, ఎట్టివాడనో ఈ తత్త్వమెల్ల యథార్థముగ తెలిసికొనినవాడై తదనంతరము నాయందె లీనమగును.

56. సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః ।
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్ ॥

ఎల్లవేళల నన్నాశ్రయించు వాడు
అఖిల కర్మముల్ సలుపుచున్నప్పటికిని
నా దయావిశేషమున పొందగల డతఁడు
శాశ్వతము నవ్యయమగు మోక్షపదసిద్ధి.

తా॥ నిత్యము నా ఆశ్రయమునే పొంది ఉన్నవాడు, సర్వ కర్మములను చేయుచున్నను నా అనుగ్రహావిశేషముచే శాశ్వతము, అవ్యయము అయిన మోక్షపదమును పొందుచున్నాడు.

57. చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః।
బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తస్సతతం భవ ॥

చిత్తశుద్ధిగా నాకె నీచేయు పనుల
నర్పణముచేసి. పరమలక్ష్యముగ నన్నె
తలఁచుకొనుచు, నాయందె చిత్తమును జేర్చి
ధ్యానయోగివి కమ్ము సంతతము పార్థ!

తా॥ అర్జునా! నిర్మలమగు మనసుతో నీవు చేయు సర్వకర్మములను నాకు సమర్పించుచు, నాయందు చిత్తము లగ్నముచేసి నన్నే పరమగమ్యముగా నెంచుచు, ఏకాగ్రబుద్ధి గలిగిన ధ్యానయోగివి కమ్ము.

58. మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి।
అథ చేత్త్వ మహంకారాన్న శ్రోష్యసి వినంక్ష్యసి ॥

చిత్తమును పార్థ! నాయందె చేర్చునెడల
కష్టములనెల్ల నా యనుగ్రహము వలన
దాటఁగల వట్లుగాక నామాట వినక
పోతివేని అహంకారబుద్ధితోడ,
అన్నివిధముల భ్రష్టుఁడ వగుదు వీవు.

తా॥ అర్జునా, సరిగా వినుము. నాయందే చిత్తము చేర్చియుండినచో సర్వ కష్టములును దాటగల్గుదువు. అట్లుగాక అహంకారముతో నామాట వినకపోయెదవా అన్నివిధముల భ్రష్టుఁడవైపోదువు.

59. యద్యహంకార మా(శిత్య న యోత్స్య ఇతి మన్యసే।
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతి స్త్వాం ని యోక్ష్యతి ॥

పార్థ! నీ వహంకారభావమ్ముతోడ
యుద్ధ మొనరింప నని యెంచుచున్న యెడల
అట్టి యత్నమ్ము వ్యర్థమే యగును, నీ ప్ర
కృతియె పోరికి నిను నియోగించు గాన.

తా॥ అర్జునా, ఒకవేళ ఇంకను అహంకారము వదలక ఈ యుద్ధమును చేయను అని నీవు తలచుచున్న యెడల అట్టి ఆలోచనలన్నియు వ్యర్థమే అగును. కారణ మేమనగా నీ సహజగుణమే నిన్ను యుద్ధమునకు నియోగించును.

60. స్వభావజేన కౌంతేయ! నిబద్ధ స్స్వేన కర్మణా।
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్ ॥

అర్జునా! నీ సహజకర్మమందె నీవు
బద్ధుడవు; భ్రమవలన నీ యుద్ధము నిక
మానఁదలఁచిన కూడను దీని చేసి
తీరుదువు, కర్మమున కధీనుడ వయి.

తా॥ అర్జునా, నీ సహజకర్మమందు నీవు సదా బంధితుడవై యుందువు. అది యెఱుఁగక అవివేకమున నీవు యుద్ధము మానదలచినను సాగదు. నీవు పరాధీనుడవై నీ సహజకర్మమగు యుద్ధమును చేసి తీరుదువు.

61. ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి।
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ॥

అఖిల భూతకోటుల హృదయమ్ములందు
ఈశ్వరుం డర్జునా! వసియించుచుండి,
యంత్రముల మీది బొమ్మల యట్లు వాని
నెల్ల మాయచేత పరిభ్రమింపఁజేయు.

తా॥ అర్జునా, సర్వప్రాణుల హృదయములందును ఈశ్వరుడుండి, ఆ ప్రాణు లను యంత్రముల మీద కెక్కించిన బొమ్మలవలె మాయచేత వారివారి కర్మానుసారము తిరుగునట్లు చేయుచున్నాడు.

62. తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత ।
తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥

సర్వవిధముల నట్టి ఈశ్వరునె పార్థ!
శరణుపొందు మీవాతని కరుణవలన
పడయఁగలవు చిత్తమ్మున పరమశాంతి,
శాశ్వతమ్మైన మోక్షసంస్థానపదము.

తా॥ అర్జునా, అన్నివిధములచేతను ఆ ఈశ్వరునే శరణు పొందియుండుము. ఆతని కరుణచే పరమశాంతిని, శాశ్వతమైన మోక్షపదమును పొందగలవు.

63. ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా ।
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథాకురు ॥

అర్జున! రహస్యములలో రహస్యమైన
జ్ఞానమును నీకొఱకు చెప్పినాను, దీని
నెల్ల సంపూర్ణముగ విమర్శించి చూచి
యెట్లు నీకిష్టమో చేయు మట్లె నీవు.

తా॥ అర్జునా, నేను నీకిపుడు చెప్పినది రహస్యములలోకెల్ల పరమరహస్యమైన జ్ఞానము. నేను చెప్పినదంతయు మఱియొకసారి విమర్శించి చూచి ఆ తరువాతనే, నీకేవిధముగ ఇష్టమున్నదో అట్లే చేయుము.

64. సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః ।
ఇష్టోఽసి మే దృఢ మితి తతో వక్ష్యామి తే హితమ్ ॥

పరమగోప్యము శ్రేష్ఠమై పరగు నాదు
వచనమును మఱియొకసారి పార్థ! వినుము.
నాకు పరమాప్తుడవు గాన నీకు నిప్పు
డీ హితోపదేశము వచియింౘుచుంటి.

తా॥ అర్జునా! నీవు నాకు ఆప్తుడవు. ఆ కారణముచేత అతిరహస్యమైనదీ, శ్రేష్ఠమైనదియునగు నా ఉపదేశమును మరల చెప్పుచున్నాను, మరియొకసారి వినుము.

65 మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే ॥

నిలుపు మతిభక్తి నాపైనె నీ మనస్సు,
నన్నెకొలువుము, నాకె ప్రణామ మిడుము,
హితుఁడవో పార్థ! సత్యము ప్రతిన జేసి
పలుకుచుంటిని నను చేరగలవు నీవు.

తా॥ ఓ అర్జునా, నీవు నాకు హితుఁడవు. అందుచే సత్యమని ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నాను. నీ మనస్సు నాయందే లగ్నము చేయుము, నాకే భక్తుఁడవు కమ్ము, నన్ను పూజింపుము, నాకు నమస్కరింపుము. నన్ను తప్పక చేరగలవు.

66. సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః॥

అన్ని కర్తవ్యముల వీడి, నన్నుమాత్ర
మే శరణుపొందు మింక దుఃఖింపబోకు;
సకల విధములో పాపసంచయమునుండి
నిను విముక్తుని జేయుదు నేను పార్థ!

తా॥ అర్జునా, సర్వవిధములైన ధర్మాధర్మ విమర్శనమును సకల కర్తవ్య కర్మములను నాయందు వదలి, నన్ను మాత్రమే శరణు పొందుము. ఇది చాలును. ఇంక దుఃఖింపకుము. సర్వపాపములనుండి నిన్ను విముక్తుని చేయుదును.

67. ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన।
న చాశుశ్రూషవే వాచ్యం న చ మాం యోఽభ్యసూయతి॥

నీకోఁటకే వచించితిని దీని నికమీద
దైవభక్తియు గురుసేవ తపము లేని
వారికిని, నన్ను ద్వేషించు వారలకును
నుడువ వలదీవు పార్థ! యెన్నడును గూడ.

తా॥ నీవు చెప్పిన ఈ గీతాశాస్త్రమును, దైవభక్తి, తపము, గురుసేవ లేని వానికిని, నన్ను ద్వేషించువానికిని ఎప్పుడును చెప్పవలదు.

68. య ఇమం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి।
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః॥

ఈ రహస్య గీతాశాస్త్ర మెవఁడు నాదు
భక్తులకు చెప్పునో అట్టివాడు సంశ
యమ్ములు నశించి తనకు నాయందు గలుగు
భక్తిచేత నా సాయుజ్యపదము నందు.

తా॥ అర్జునా, రహస్యమగు ఈ గీతాశాస్త్రమును ఎవఁడు నా భక్తులకు బోధించుచున్నాడో అట్టి మనుజుఁడు నాయందు భక్తి గలిగి నా సాయుజ్యమును పొందుచున్నాడు.

69. న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః।
భవితా న చ మే తస్మాదన్యః ప్రియతరో భువి॥

నాకు లేదిక సర్వమానవులయందు
వానికంటె ప్రియమొనర్చు వాడొకండు,
అతనికంటెను ప్రియతరమైనవాడు
భువిని గలఁగడు నాకికముందు గూడ.

తా॥ నా భక్తులకు గీతాశాస్త్రము బోధించువానికంటె నాకు ప్రియమొనర్చు వాఁడెవ్వఁడును లేడు. అతనికంటె ఎక్కువ ప్రియమైనవాడు ఇకముందును నాకెవ్వఁడు నుండడు.

70. అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాదమావయోః।
జ్ఞానయజ్ఞేన తేనాహమిష్టః స్యామితి మే మతిః॥

మనకు జరిగిన ధర్మసంభాషణమగు
గీత నెవఁడు పఠించునో అతఁడె సుమ్మీ,
సతతము పార్థ! జ్ఞానయజ్ఞమ్ముచేత
నన్ను పూజించువాఁడని నామతమ్ము.

తా॥ అర్జునా, ఇపుడు మన యిరువురికి మధ్య జరిగిన ధర్మయుక్తమగు సంభాషణమగు గీతను ఎవడు అధ్యయనము చేయుచుండునో అతఁడు జ్ఞాన యజ్ఞ రూపమున నన్ను పూజించుచున్నాడని నా అభిప్రాయము.

71. శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యో నరః।
సోఽపి ముక్తశ్శుభాన్ లోకాన్ ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్ ॥

శ్రద్ధతోగూడి యెట్టి ద్వేషమ్ము లేక
భక్తితో గీతలను వినువాడు గూడ
పుణ్యవర్తను లేగెడు పుణ్యలోక
ములకె పోవును భవబంధముక్తుఁడగుచు.

తా॥ ఎట్టి ద్వేషభావమును లేక శ్రద్ధాభక్తులు కలిగి గీతాశాస్త్రమును వినువాడు గూడ సర్వపాపవిముక్తుడై, పుణ్యకార్యములు చేసినవారు పోయెడి పుణ్యలోకములకు పోవును.

72. కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ! త్వయైకాగ్రేణ చేతసా।
కచ్చిదజ్ఞానసమ్మోహః ప్రనష్టస్తే ధనంజయ! ॥

దీని నేకాగ్రచిత్తమౌ దీక్షతోడ
వింటివికద గీతాశాస్త్ర విషయ మెల్ల,
చెప్పు మిప్పు డజ్ఞానమ్ముచేత నీకు
కలిగియుండిన భ్రమ పార్థ! తొలగలేదె?

తా॥ అర్జునా, ఈ గీతాశాస్త్రమును ఏకాగ్రచిత్తుడవై అతిశ్రద్ధతో వింటివి కదా. అజ్ఞానముచే నీకు గలిగిన భ్రమ అంతయు ఇప్పుడైనను తొలగిపోయినదా లేదా?

అర్జున ఉవాచ :— అర్జునుఁడు చెప్పెను.

73. నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత!।
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ ॥

అచ్యుతా! నీదగు నను గ్రహమ్మువలన
నాకు గల్గిన భ్రాంతియంతయు నశించె,
తెలిసె నా నిజస్థితియు, సందియము బాసి
స్థిరుఁడ నయితిని, నీయాజ్ఞ చేయఁగలను.

తా॥ అచ్యుతా, నీవు నాయందనుగ్రహముతో చేసిన ఈ గీతోపదేశము వలన నాకు కలిగిన అవివేకము, భ్రమ పూర్తిగా నశించినవి. సందేహములు విడిపోయినవి. నా నిజస్థితి నా కవగతమై స్థిరచిత్తుఁడనైతిని. ఇటుపై నీ యాజ్ఞ ప్రకారమే చేయగలను.

సంజయ ఉవాచ :— సంజయుడు చెప్పెను.

74. ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః।
సంవాద మిమ మశ్రౌష మద్భుతం రోమహర్షణమ్॥

ఇట్టు లా మహాత్ముఁడగు శ్రీకృష్ణునకును
అర్జునునకును మధ్య నత్యద్భుతమయి
దేహమెల్లను పులకలెత్తించు రీతి
నడచియుండిన సంభాషణమును వింటి.

తా॥ ఈ ప్రకారముగా మహాత్ముఁడగు శ్రీకృష్ణునకును అర్జునునకును మధ్య జరిగిన అత్యద్భుతమును శరీరమును పులకరింపఁజేయునదియునగు సంభాషణమును వింటిని.

75. వ్యాసప్రసాదాచ్ఛ్రుతవా నేతద్గుహ్యతమం పరమ్।
యోగం యోగేశ్వరాత్కృష్ణాత్సాక్షాత్కథయత స్స్వయమ్॥

ఉత్తమ మ్మతిగోప్యమౌ యోగశాస్త్ర
మిద్ది యోగేశ్వరుఁడు కృష్ణుఁడే స్వయముగ
చెప్పుచుండగ వినగ నోచితిని నేను
వ్యాసముని నా కొసంగిన వరముచేత.

